Telugu Classics - Popular Edition Series

తిక్కన భారతము :

# కర్ణపర్వము

సంపాదయిత :

మరుపూరు కోదండరామ రెడ్డి



ఆంధ్రప్రదేశ్

సాహిత్య అకాడమీ

హైదరాబాద్

ఉస్మానియా యూనివర్సిటీవారి

సంశోధిత ప్రతినిబిడి.

కిమస్థి మాలాం కిము కౌస్తుభం వా పరిష్క్రియాయాం బహుమన్యసేత్వం।
కిం కాలకూటః కిమువా యశోదాస్తన్యం తవస్వాదు వదప్రభో మే।



భైరవ కోన యందలి హరిహరనాథ

అంజలి —

చిన్ననాటినుండి, కర్ణుని మూర్తిపూజను
ఉగ్గుపాలతోబోసి గరపిన

మా అమ్మ కామమ్మకు

తిక్కన శిల్పోపాసనను గరపి, ఆయన
కవిత్వపుటనలతేనియను అలుసులు రాకుండ
త్రావించిన,
బందరు ఆంధ్రజాతీయ కళాశాల ఒజ్జలు
(1920-1924)

శ్రీమాన్ వేదాల రంగాచార్యులు

భారత విమర్శనాగంధమును మేనెల్ల మెత్తిన

బ్ర. శ్రీ. పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

గారలకు గురుదక్షిణగా!

## నెనరు—

కర్ణపర్వమును, నా ఎరిగినరీతిని, నాకు చొప్పడిన శైలితీరున ఆంధ్రావళికి సమర్పించను అవకాశమిచ్చిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారికి కృతజ్ఞతాపూర్వక వందనములు. కర్ణపర్వ సంపాదక కృషిమాట ఎత్తుకొనగానే, నన్నే సూచించిన పెద్దల విశ్వాసమునకు అర్హుడను కాగలననియే నా నిండునమ్మకము. దీనికిగా అధ్యక్షులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారిని ప్రత్యేకముగ పేర్కొనవలసి యున్నది. భారతముపై నాకుగల లుబ్ధత్వమును చిన్నప్పటినుండి వారెరిగినదే! కాబట్టే స్వర్గీయులు - ఆంధ్రవాఙ్మయ విమర్శక బ్రహ్మ - డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు భారత విమర్శన మును చెప్పగా, నేను గురునాథునివలె వ్రాయుటకు గోపాలరెడ్డిగారు ఒక ఒప్పందమును కుదిర్చినారు. కాని ఆంధ్రభారతి అట్టినోము నోచుకొననందున అది జరుగకముందే కట్టమంచివారు కడతేరి పోయినారు. గోపాలయ్యా, నా కర్ణచరితకు పరిచయ వాక్యములను వ్రాసియున్నారు. ఇట్టిది వారి ఆదరణము!

ఇక, అకాడమీ కార్యదర్శి శ్రీయుతులు దేవులపల్లి రామానుజ రావుగారు, మనసిచ్చిన నెయ్యముతో నన్ను ప్రోత్సహించి, ఈ కార్యసరణి తీరమునుండి పారము చేర్చినారు. దీనికిగా వందన సమర్పణము చెప్పి ఆ మాటకు వెలతగ్గించ దలచుకొనలేదు.

పిలచినంతనే ముమ్మారువచ్చి, ఓపికతోవిని తోచిన నెరసుల ఎత్తిచూపి, అభినందించిన నేస్తకాండ్రు :- శ్రీయుతులు ఇ. వరదా రెడ్డి (ఎం. ఎ., బి. ఎల్., డిస్ట్రిక్టు మునిసిఫ్ మేజస్ట్రేటు, కోవూరు) కె. నారాయణరావు (బి. ఎ., బి. ఎల్., రిటైర్డు డెప్యూటీ కలెక్టర్) ఆ బాల్యసఖుడు యట్టారెడ్డి బాలకృష్ణారెడ్డి (కొత్తూరు) బండి గోపాల రెడ్డి (జమీన్‌రైతు సహాయ సంపాదకుడు) సహాధ్యాయి-పౌరాణికుడు ఆకిలి మల్లికార్జునయ్య; - స్థానిక రాజాగారి కళాశాల అధ్యాపకులు-

శ్రీయుతులు జీలపాటూరు చెంచు వెంకటరమణరావు (ఎం. ఎ.) వేదం వెంకటరామన్ (ఎం. ఎ.) మాధవరవు రామయ్య (ఎం. ఎ.) మెట్టు రామచంద్రప్రసాద్ (ఎం. ఎ.) కాపుటూరు రామచంద్రరావు (ఎం. ఎ.) కొండా వెంకటస్వామిరెడ్డి (ఎం. ఎ.) భాషాప్రవీణ సురభి నరసింహం, విద్వాన్ బడి గురవారెడ్డి (సాహిత్య అకాడమీ సభ్యుడు) కాళహస్తి రామనాథం (ఎం. ఎ., బి. ఇడి - రిటైర్డు.)

ఇందలి చరిత్రాంశముల నందజేసి చేయూతనిచ్చిన నెమ్మి కాండ్రు - బహుభాషావేది వేదము వెంకటరాయశాస్త్రి (ఎం. ఎ., సాహిత్య అకాడమీ సభ్యుడు) సకలకళాకుశలుడు - నేలనూతల శ్రీకృష్ణమూర్తి (ఎం. ఎ., బి. ఎల్., అధివక్త.)

తక్కంగల సహృదయులకు నిండు ఎదతో నెనరు చూపు చున్నాను.

ఉస్మానియా యూనివర్సిటీవారి సంశోధక ప్రతి—

మూలమును సరిబత్తుటకు అవకాశమును కలిగించిన, ఆ సంఘ కార్యనిర్వాహకాధికారి - ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు చూపిన ఆదరమునకును, చేసిన సహాయమునకును—

వాత చేత మర్యాదచూపుట ఒంటబుట్టిన - డాక్టర్ దివాకర్ల వెంకటావధానిగారు నన్ను తమగదియందే కూర్చుండబెట్టి, ఆరు దినాలు పనిచేసికొనుటకు వసతినికల్పించిన సౌజన్యమునకును, నా సాంతాన అకాడమీపక్షాన కృతజ్ఞతను తెలుపుచున్నాను.

ఉస్మానియావారి పరిశోధన పరోపక్షఫలితముగా—

వావిళ్ల రామస్వామిశాస్త్రి ముద్రణాలయము—

అరవైఏండ్లనాడు చేసిన ఆంధ్రభాషాసేవస్వరూపము బయట బడుచున్నది. ఈ సంశోధకులు వావిళ్లవారి ప్రతినే మాతృకగా చేసికొని, ఎన్నో ఇతర ప్రతులలోనున్న పాఠాంతరములను మాత్రం

క్రింద ఫుట్‌నోట్సుగా చేర్చినారు; అంటే - యూనివర్సిటీవారు వావిళ్ల పాఠములనే గ్రహించినారనవచ్చును. ఈ వావిళ్ల పాఠమే నూటికి 95 పాళ్లు తిక్కనశైలికి, నుడికారమునకు సరిపోవుచున్నది.

వీరు నెల్లూరునుండి, చెన్నపట్నంపోయి, ఒక ముద్రణాలయమును నెలకొల్పి, భాషావిషయమున వారుచేసిన పరిశోధన పడినశ్రమ, వెచ్చించినధనము, ఆంధ్రుల ప్రశంసకు పాత్రములైయున్నవి. వావిళ్ల వారేగానలేకుండిన, తెనుగు నాట సాహిత్యముసంగతి అటుండనిచ్చి, వైదిక మత వాఙ్మయమే రామ బాణములపాలై యుండుననుట నిర్వివాదము. అది గుర్తించేగదా, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, కళా ప్రపూర్ణబిరుదమును వెంకటేశ్వర శాస్త్రిగారికి ఒసంగి, ఒక సముచిత కార్యమును చేసినది.

ఆనంద ముద్రణాలయమువారి ప్రతి (తేవప్పెరుమాళ్ళయ్య; దేవరాజసుధి పేరు పరిశోధించిన) వావిళ్లప్రతి ననుసరించియే యున్నది.

చదువరుల సేవక,

మరుపూరు కోదండరామ రెడ్డి.

# విషయానుక్రమణిక

| శీర్షిక | | | పుట |
|---|---|---|---|

శీర్షిక | పుట

# మూలగ్రంథము

ద్వితీయాశ్వాసము

| శీర్షిక | పుట |
|---|---|

| శీర్షిక | పుట |
|---|---|


## తృతీయాశ్వాసము

| శీర్షిక | పుట |
| --- | --- |

# అవతారిక

విప్రులు గడునర్థి వేఁడినఁ గడిమితో
  బొచ్చెంబు సేయక యిచ్చుటొకటి;
బలితంపు బగతురఁ బరిమార్చుటొక్కటి,
  దండియై యనిఁ జచ్చుటొండె నొకటి;
శరణాగతుని నెట్టి శత్రునైనను
  గరుణించి చంపక గాచుటొకటి;
భామినీ ద్విజ వృద్ధ బాలాతురులకైన
  యాపదఁ జెచ్చెరఁ బాపుటొకటి;
యనఘ, యివి వ్రతములై చెల్లు నాకు; నిం
దొకటి దప్పెనేని వికలకీర్తి
నగుదుఁ, గాన యిత్తు నఖిలభావముల, నా
ఖండలునకుఁ గవచకుండలములు!

—అరణ్య-7: 296.

కీర్తి విడువఁజాల, గీర్తితో మొలగంగఁ
జావు వచ్చెనేనిఁ జత్తుఁగాని;
జగములోన నెల్ల నడికంటెఁ జావు మే
లనఁగ బరఁగుమాట యనఘ, వినవె!

—అర-7: 293.

ఇదీ! ప్రబంధపరమేశ్వరుడు – శంభుదాసుడు – ఎఱ్ఱాప్రెగ్గడ సృష్టించిన దానవీరుడు రాధేయుని సూక్ష్మాకారచిత్రము!

కాబట్టే, 'కార్తీకంతో వానలు సరి, కర్ణునితో భారతము సరి' అన్న చాటువ లోకంలో సామాన్యమై పోయినది. తెనుగు భారతము కర్ణుని 'విమల యశోఘనుఁడు' 'నిష్ఠురభుజ విక్రమోగ్రుఁడు' 'ఇను మారొక శరము దొడగని శస్త్రసంపన్నుఁడు' 'దివ్యశర శిక్షావైభవ

పరమనిష్ఠకలిమి' గలవానుగా వర్ణించినది. శ్రీకృష్ణునివంటి విరోధి పక్షమువారిచే అగ్గింపజేసినది. 'అంతక కోపవహ్ని విపులాకృతిగైకొనివచ్చినట్లు' రెండుదినములు మగసిరి బయటబెట్టి, ఘోరసంగ్రామము చేయించి వీరస్వర్గము నలంకరింపజేసినాడు-కవిబ్రహ్మ! కౌరవ కార్యభారమంతయు వసుసేనుని భుజాస్కంధములపై మోపబడుటకు కారణముగూడ ఇదే! అని ఆ పూర్ణపురుషుడు-తిక్కయజ్వ కర్ణుని తేజోమూర్తికి చెన్నులు దిద్దినాడు.

ఇక కర్ణుడు అడుగడుగున ఓడిపోవు పిరికికండగలవాడుగా చాటుచున్నదెల్ల పౌరాణికులుచేయు కాలక్షేపములే! తెనుగు భారతమును ఏతట్టుకుగాని మొగ్గని మనసుతో చదివినచో సాక్షాత్కరించు కర్ణ రూపము భువనమోహనమైనది! మున్ముందు పరికింతము.

ఇక సంస్కృత-ఆంధ్ర ఆదిభారతములనుగూర్చి గరుడదృష్టిగా కొంత పరిశీలింతము :—

## 1. భారత ఇతిహాసము-గ్రద్దచూపు

భారతవిషయమై ఇంతవరకు పండితులు, పరిశోధకులు వెలువరించిన విషయసారాంశమే ఇందు పేర్కొనబడుచున్నది. వేదం వేంకటాచల అయ్యర్; బి. ఏ; బి. ఎల్., (Notes of a Study of the Preliminary chapter of the Maha Bharata-1921) పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి భారతచరిత్ర దీనికి ఎక్కువగా తోడ్పడినవి.

### ★ భరతజాతి-భరతఖండము

భరతజాతి ప్రస్తావనము ఋగ్వేదములోనున్నది. ఆ జాతివారి చరిత్రమే భారతము. ఈ వేదమున ప్రశంసింపబడిన భరతుని పేరనే యీ దేశమునకు భరతఖండమని పేరు గలిగినది. ఈయన మహావీరుడు; అశ్వమేధము లనేకములు చేసిన సమ్రాట్టు!

కాని, మార్కండేయపురాణము-స్వాయంభవు మనువు మనుమడు-ఋషభుని కొడుకైన భరతుని పేరనే యీ పుణ్యభూమికి ఆ పేరు వచ్చినదని వెలిబుచ్చుచున్నది. ఇంకను దుష్యంతునికొడుకు, శ్రీరాముని కొడుకు, జడభరతుడు అనువారుగూడ కొందరున్నారు; కాని వీరికి యీ పేరుతో ఎట్టి సంబంధముగాని లేదని పలువురు.

ఇట్టి తారుమారులు మనచరిత్రకు సహజగుణముగా నున్నది.

**★ భరతవంశము**

'వరమున బుట్టితిఁ, భరతవంశము జొచ్చితి' అని ద్రౌపది సగర్వముగా చెప్పుకొనుచున్నది; కాని ఆ భరతవంశము పిరివరకు సాగివచ్చినదో లేదో అని ఒక సందేహము.

(భాగవతము-9-వ స్కంధము 632 పద్యము మొదలు)

''దుష్యంతుడు గర్భవతి అయిన శకుంతలను వదలిపెట్టి స్వరాజధాని చేరినతర్వాత, ఆకాశవాణి-శకుంతలకు పుట్టిన బాలుడు నీ కొమారుడు; నీవు భరింపుము-అనుటచే భరతనామమున బఱగెను. ఇతడు 27,000 ఏండ్లు ధరణిని ఏలినాడు. ఇతని భార్యలు ముగ్వురు, ముగ్వుర పుత్రులను కని, వారు వల్లభునితో సరిగారని తెలిసికొని, తోడ్తోడన ఆత్మశిశువుల శిరముల దునుమాడిరి. అనగా, ఈ భరతునికి సంతతే లేకపోయినది.

''ఇట్లుండ, బృహస్పతి తన వదినె-మమత పైబడి (భర్త్యుని భార్య) సురతమునకు తార్కొనగా, అంతకుముందే ఆమెగర్భమునందుండిన బాలుడు వలదని వారించును. దీనికి బృహస్పతి అలిగి, వానిని అంధుడవు అగుమని శపించెను; ఆ గర్భస్థప్రాణి కోపముతో దేవగురువు ఇంద్రియమును బయటకు తన్ని వేయగా, అది బయటబడి బిడ్డడైనాడు. బృహస్పతి, ఆ శిశువును మమతను భరింపమనగా ఆమె ఆయననే భరింపుమనినది. వెంటనే ఆ ఇద్దరును ఆ బిడ్డను దిగనాడి, ఎవరిదారిన వారు పోయినారు. ఇద్దరు భరింపుమనినారు కాబట్టి ఆబిడ్డ భరద్వాజుడైనాడు. గర్భస్థశిశువు దీర్ఘతముడైనాడు.

"ఈ పరిత్యక్త శిశువును మరుత్తులు పోషించి, పెద్ద జేసినారు. ఆవల పుత్రార్థియై వాపోవుచుండిన భరతునికి యీ కుమారుని ఇత్తురు. ఆయన చేకొనగా, ఇతడు వితథుడు అను పేర భరతవంశమునకు వంశకర్త అయినాడు."

ఈనాటిదృష్టికి యిది అసభ్యమే! అందువల్లనే "పురాణములను, వాటి కవిత్వసౌభాగ్యము ననుభవించుటకే చదువవలెను" అని విసుగెత్తి శ్రీ వివేకానంద స్వాములవారు చెప్పినారు.

ఇట్లా ఈ భరతవంశ బీజమునకు జడ్డిగములోనే మిడతపోటు తగిలినది. ఒకవేళ ఇదే ఆవంశమని అనుకొనినా, భీష్మునితోనే నిస్సంతాన సికతాతలములో ఇఱ్ఱింకిపోయినది.

★ భారతగ్రంథము

భారతమును మొదట ద్వైపాయనుడు కావ్యముగా వ్రాసినాడు. (కృతమయేదం భగవాన్ కావ్యం పరమపూజితం) ద్వీపమే అయనం – ఉనికిగా గలవాడు ద్వైపాయనుడు; నల్లటివాడగుటచే కృష్ణద్వైపాయనుడైనాడు.

ఈయన భారతమునువ్రాసి వ్యాసుడైనాడు. పురాణములు వ్రాసినవారికి 'వ్యాస' అన్నది ఒక బిరుదము. ఇది బుద్ధుడు విక్రమాదిత్యుడు అను వాటివంటిది. మన పురాణములలో 28 మంది వ్యాసులు లెక్కకు వచ్చిఉన్నారు. అన్ని యుగములు బ్రతికియుండి, పరస్పర విరుద్ధములైన 18 పురాణములను ఒకేవ్యాసుడు వ్రాసినాడనుట పొసగదు. వేదవిభజనము చేసినది, బ్రహ్మసూత్రములను వ్రాసినది వ్యాసుడేగాని సూక్ష్మముగా వీరిని వేరుచేసినారు. వేదవిభజన వేదవ్యాసుడు చేయగా, బ్రహ్మసూత్రములు బాదరాయణవ్యాసకృతములని చెప్పుచున్నారు. వ్యాసపదమునకు వ్యాపింపజేయుట అనిగదా అర్థము. వేదవిభజనము చేసినవారికిగూడ వ్యాసబిరుదమే!

వ్యాసునికిముందే పురూరవమహారాజు, ఒక్కొక్కటిగా నుండిన వహ్నిని–వేల్పును–పురుషోత్తముని–వేదమును–ప్రణవమును తన బుద్ధిపెంపుతో మూడుగ నేర్పరచిరని భాగవతము చెప్పుచున్నది. ఇది సమంజసమే! ఆనాడు భూరివిద్య క్షత్రియులదిగదా. (సంస్కృత భాగవతము 9–స్క. 14–వ అధ్యాయం చివరన; తెనుగు 9–స్కం–420 పద్యము.)

"భ్రాజితవృత్తిమై బరగు భారతసంహిత, సంయమీంద్రులారా జయ నామ కంబునను రాజితభంగి జగత్త్రయంబునం బూజితకీర్తియై నెగడు...స్వర్గా–పర్వ–89

వ్యాసుడు మొట్టమొదట 'జయ' అనుపేర 8800 శ్లోకములలో భారతకావ్యమును వ్రాసినాడు. అది 24,000 లకు పెరిగి, ఆ కావ్యము ఇతిహాసమైనది; భారతమైనది; ఆవల మహాభారతమైనది; చివరకు పంచమవేదమైనది. ఇక లక్షగ్రంథమునకు పైన ఎట్లు కాకుండగలదు?

వ్యాసుని శిష్యులు–నారద, దేవల, శుక, జైమిని, వైశంపాయనులు యీ భారతమును చెప్పినారు. దానిని వినివచ్చి, నైమిశారణ్యమున సాగుచుండిన సత్రయాగములో, శౌనకాది మహామునులకు ఉగ్రశ్రవసుడను సూతుడు (రోమహర్షుడనువాని కొడుకు) 1,20,000 శ్లోకములతో చెప్పగా అది మహాభారతమైనది. (శౌనకాది భూసుర వరు లింపున గరఁగుచొప్పున చెప్పినవారు:–స్వర్గా–పర్వ–94)

## ★ తెనుగునకు మూలము

ఆంధ్రీకరించుటలో నన్నయ సౌతి మహాభారతమును, తిక్కన వైశంపాయన భారతమును చేపట్టినారు. ఎఱ్ఱన రెంటిని పేర్కొనుచున్నాడు.

ఆంధ్రభారతము ప్రథమముద్రణము 1850 లో ఆలూరు పీతాంబర జోస్యులవారిచే గావింపబడినది. లండన్ ఇండియా లైబ్రరీలో నున్నది. అచ్చు 1833 లో అని కొందరు. భండార్కారు సంస్థ

వారు తమ సంశోధనప్రతికి సహాయకారిగా అనువాదములలో ప్రాచీన మైన ఆంధ్రభారతమునే చేపట్టినారు. పంపని కన్నడభారతము క్రీ.శ. 901 ప్రాంతాన పుట్టినా, అందు వైదికదృష్టిమారి జైనప్రాబల్యము జొరబడుటచే మూలమునకు భిన్నమైనది. అందుచే కర్ణపర్వమును తిక్కన రచననే వారు గ్రహించినారు.

తిక్కన చేపట్టిన సంస్కృతమూలము, శారదా లిపిలో నున్న మూలమునకు దగ్గరదగ్గరగా సరిపోవుచున్నది. ఇది (కుంబకోణ) దక్షిణాదిప్రతికిగూడ సన్నిహితమైనది. కాని దక్షిణప్రతిలో ప్రక్షిప్త ములు, మార్పులు, తత్కాల వ్యతిరిక్తపురాణాంశములు చాల చేర్చ బడినవి. తలకోకతీరుగా వ్రాసినవి చాల ఇందు దూర్చబడినవి. శారదాలిపి ప్రతికి, దక్షిణప్రతికి మధ్యస్థంగా తెనుగు వ్రాతప్రతు లున్నవి. తెనుగు (సంస్కృత) ప్రతులు ఎక్కువగా ఉత్తరదేశ ప్రతితో సరిపోవుచున్నవి. ఈ కర్ణపర్వము ఎక్కువగా కుంబకోణపు ప్రతిని అనుసరించియున్నది.

తెనుగులిపి ప్రతులు—1. లాహోరు డి. ఎ. వి. కళాశాల నుండి (ఇప్పుడు, తూర్పు పంజాబు) హోషియార్‌పూరులో సాధు ఆశ్రమమును చేరియున్నది.

2. మేల్‌కోటలో, యదుగిరి యతిరాజ మఠ గ్రంథాలయ మున గలదు.

3. తంజావూరు సరస్వతీ మహాల్ గ్రంథాలయమున నున్నది.

ఈ సంస్కృత కర్ణపర్వము-వైశంపాయనుడు చెప్పినది. అట్లే తిక్కన తెనుగుగ్రంథముగూడ.

అర్జునుడు సంసప్తకులతో రెండుదినములు పోరాడినట్లుండ, తిక్కనప్రతిలోను, కొన్ని దక్షిణప్రతులలోను, ఆపోరు ఒకనాటిదిగా రెండవనాటి యుద్ధమునకే కొనిపోబడినది.

## ★ భారతయుద్ధము-గ్రంథము

నక్షత్రగతినిబట్టి (అశ్వన్యాది) భారతయుద్ధము క్రీ. పూ. 1500 లో జరిగినదని లోకమాన్య బాలగంగాధర తిలకు నిరూపించినారు. జాకొబి అను జర్మనుపండితుడు వేరువిధముగా పరిశోధించి, ఇదే నిర్ణయమునకు వచ్చినాడు. ఆనాడు కృత్తికతో గణన ప్రారంభమయ్యేది (కాబట్టే కార్తెలు) ఇప్పుడు అశ్వనితోగదా ప్రారంభమగుట. మొదట మనకు మేషాది పన్నెండురాసులు లేవు; గ్రీసు నుండి వరాహమిహిరుడు (యవనాచార్య) కొనితెచ్చినాడు. ఇట్లే వారములుగూడ విదేశీయములే!

గ్రంథరచనమునకు ముందు, ఎప్పటినుండియో రామాయణ భారతకథలు గేయరూపమున 'కుశీలవులు' అను గాయకజాతిచే గానము చేయబడుచుండినవి. క్రీ. పూ. 900 ఏండ్ల ముందు వెనుకలలో, లిపి పుట్టినతర్వాత ఈ గ్రంథములు వ్రాతకు వచ్చినవి. భారతము ఇప్పటిరూపమును క్రీ. పూ. 500-400 లలో పొందినదని లోకమాన్యతిలకు నిరూపణము. దీనిని జర్మనుపండితుడు వింటర్ నిడ్జ అంగీకరించుచున్నాడు. భాషతో మానవనాగరకము తప్పటడుగులు వేసి, లిపితో పరుగెత్తినదనిగదా పెద్దలు చెప్పేమాట! ఈ గ్రంథములను సూతులు ప్రచారములోనికి దెచ్చి వ్యాపింపజేసినారు. సూతులు బ్రాహ్మణస్త్రీకి క్షత్రియునికి బుట్టినవారు; రథకారకవృత్తితో బాటు పౌరాణికులుగాగూడ నుండిరి.

'యవన' శబ్దము భారతమున పేర్కొనబడుటచే, నేటిరూపము దానికి క్రీ. పూ. 400 ప్రాంతాన లభించినట్లు ఎన్నబడుచున్నది. భారతగ్రంథమును మొట్టమొదట పేర్కొనినది ఆపస్తంబుడు (క్రీ. పూ. 4-శ-; ఈయన రామాయణమునుగూర్చి ప్రస్తావించడు.) ఆతర్వాత భారతమును ఉదాహరించినది, క్రీ.పూ. 180 ప్రాంతమున వెలసిన పతంజలి.

దీనితర్వాత భారతమును పంచమువేదము చేయుటకు, వివిధ పురాణములనుండి కథలు కల్పనలు చేర్చబడి, మహాగ్రంథమైనది; ఇదే వైదికమత పునఃప్రతిష్ఠాపనమునకు ఏడుగడ అయినది.

## ★ మొదట నూరుపర్వములు

సంస్కృతభారతము ఆదిలో నూరుపర్వములుగా – ఇప్పటి అధ్యాయములవలె నుండినది. నన్నయభట్టారకునికిముందే ఇప్పటి 18 పర్వముల విభాగమును పొందినది.

పర్వానుక్రమణిక అని, పర్వసంగ్రహమని, భారతమందలి విషయములన్నిటిని టూకీగా చెప్పినభాగములు, భారతము మొదట నున్నవి. ఇవి పోతనామాత్యుని స్కంధాంత గద్యములవంటివి; ఇది విషయసూచిక. నన్నయ 18 పర్వములను తెనిగించుచునే, సంస్కృతమునుబడి, నూరింటికి అనుక్రమణిక, సంగ్రహమును వివరించినాడు. ఈపని పరిశోధనకు ఎంతగానో ఉపకరించినది. మూలగ్రంథ స్వరూపమును తెలిసికొనేదానికి ఇది మంచి అస్తిబారమైనది.

ఇందులేనివి అన్నీ ప్రక్షిప్తములని ఎన్నబడుచున్నవి.

## ★ కథను చెప్పినకాలము

భారతయుద్ధము ముగిసినతర్వాత, అర్జునుని మనుమడు–పరీక్షిత్తు 60 ఏండ్లు బ్రతికినాడు. ఆయనకొడుకు జనమేజయుడు, తన 50–వ ఏట సర్పయాగముచేసి, వైశంపాయునివలన భారతమును వినును. అనగా, యుద్ధానంతరము ఇంచుమించు 110–120 సంవత్సరములకు భారతకథ రూపొందియుండును.

క్రైస్తవుల బైబిల్‌లోని నూతన నిబంధన ముఖ్యాంగములైన సువార్తలు (Gospels) క్రీస్తుమరణానంతరం 78–80 ఏండ్లతర్వాత వ్రాయబడినట్లే, భారతము వ్రాయబడియుండును. కథ జరిగేదానికి ముందే రామాయణభారతాదులు, ఋషుల యోగదృష్టిశక్తితో వ్రాయబడినవనుట కల్పనాచాతురి. భారతము ఇతిహాసముకదా!

ఈ భారతరచన "ద్వైపాయనుండు సంవత్సరత్రయంబు నిర్మించి" (ఆది-1: 67) "సంవత్సర త్రయకృతంబు" (స్వర్గా-ఏకాశ్వాస: 81) అని చెప్పబడినది. ఇది సంస్కృత భారతరచన సంగతి కాదేమో! కానేకాదు.

తిక్కనకూడ 1243-46 మధ్య భారతమును మూడేండ్లలోనే వ్రాసినాడు. ఇది కాకతాళీయమా!

## ★ పదునెనిమిది పర్వములు

భారతమును ఒక తియ్యటి చెరకుగడగా పోల్చి, పద్దెనిమిది గణుపులు- పర్వములుగా వేరుచేసినారు- ఆవలి నిర్మాతలు. తురక వాసన తగులకముందు, మనవారికి యీ సంఖ్య పరమపవిత్రముగా నుండినది!

అప్పుడు, వైదికపరంగా 12 నెలలను 18 గా విభాగించినారు. దీనికిముందు, అనగా ద్వాదశాదిత్యులకుముందు 8-10 ఆదిత్యులు (సూర్యులు=మాసములు) ఉండినారు. అంతవరకుండిన (యాగ) బలి వితర్దులు పదకొండింటికి మారు 18 అయినవి. ఈ తిన్నెలు 10 మూరలు పొడవు, 8 మూరల వెడల్పుగా చేయబడినవి. దీనిని అనుసరించియే భారతము 18 పర్వములుగా వేరులు చేయబడినది. దీనితర్వాత యీ సంఖ్య పీల్చి పిప్పిచేయుబడినది:- భారతయుద్ధం 18 దినాలు; సైన్యం 18 అక్షౌహిణులు; సేనాపతులు 18 మంది; 'జయ' అనుమాటకు సంఖ్య 18 అని, దానినికూడ ఇప్పుడు ఈకోటిలో చేర్చినారు. విదుర ధృతరాష్ట్ర గాంధారి కుంతి యుద్ధానంతరం 18 ఏండ్లు బ్రతికియుండి, కార్చిచ్చులో నీఱగుదురు. ఆవల పురాణములు 18; ఉప పురాణములు 18 అయినవి. భగవద్గీతను 18 అధ్యాయ సంఘటితముగనే నిర్మించినారు.

## ★ గణేశుని వ్రాత

కట్టుకతలు స్థిరమైపోయి, పురాణమగుట హిందూమతములో వలెనే అన్నిమతములకును సహజలక్షణమై పోయినది. భారతమును

దేవగణము దీసికొనిపోగా, మిగిలినదే మర్త్యులకు దక్కినదట! వేదములను భారతమును అటు ఇటు ఒక తక్కెడలో బెట్టి తూయగా- ఎక్కడ, ఎప్పుడు, ఎవరో?-మొగ్గు అయిన భారతగ్రంథము మహా భారతమైనదట!

అంతకుముందు వ్యాసభగవానుడు, భారతనిర్మాణమును ఊహించుకొని, రూపము కుదుర్చుకొని, వ్రాయసగాడు లేడని చింత పడుచుండగా, పిలువనిపేరంటముగా, ఇంకేమీ పనిలేనట్లు బ్రహ్మ వచ్చి, వ్యాసుని ఎదుటనిలిచి 'గణేశునిచేత వ్రాయించుకోవయ్యా' అని చెప్పి, తిరోహితమైనాడు. అప్పుడు ఈ బొజ్జ గణపయ్య వ్రాయగా ఆయన చెప్పినాడు! ఇప్పుడు స్టెనోగ్రాఫర్ కు డిక్టేట్ చేసినట్లు పని జరిగిపోయినది. ఆ వ్రాత భూర్జరపత్రాలమీదనో, తాటాకులమీదనో వివరము చెప్పబడలేదు. కాగితాలు, సిరా కవిసార్వభౌమ శ్రీనాథుని నాటివరకు మనకు రాలేదుగదా!

ఈ కల్పనకు తీసిపోనేల? అని కాబోలు, మన తిక్కనకు కుమ్మర గురునాథుని వ్రాయసగాడుగా కల్పించినారు. ఇదిగదా కల్పనాచాతురీ పాండితి అనిన!

ఇంతకు, ఆ గణేశుని వ్రాతసంగతి సంస్కృతమూలమున లేదు; తెనుగులో నన్నియ అంతకుముందే దీనిని తవుడలేదు. అయినంత మాత్రాన కొదువ ఏమి? దట్టంగా ప్రాకిపోయి ఉన్నదిగదా! గురు నాథుడు, తిక్కనమధ్య తనమధ్య ఉండిన తెరను - యుద్ధఘట్టమున గడబిడ విని ఎత్తిచూడగా, ఒక వాలమ్మువచ్చి, అతనికంటికి తగిలి కనుగుడ్డు జననుకార్చి గుడ్డివానినిగా చేసివేసినదట! పాపం, పుణ్యా నికిపోయి, పాపం దెచ్చుకొన్నాడు- ఆ కుమ్మరి!

★ మార్పులు - చేర్పులు

భారతమునకు లిఖితరూపము ఏర్పడినతర్వాత, దాని స్వరూప పరిమాణాదులు గట్టిచట్టములో (Frame) బిగించవేయబడినట్లు ఈ

పర్వానుక్రమణిక, పర్వసంగ్రహము నిక్కచ్చిగా తేల్చి చెప్పు చున్నవి. భారతఛందము, మంచినీళ్ల ప్రాయమైన అనుష్టుప్పు కావడం చేత, పిల్లకవులకు — క్షుద్రపండితులకు — పక్షపాతులకు, తాము కోరిన అంశములను వ్రాసి భారతంలో ఇరికించివేసేదానికి సులభసూత్ర మైనది. ఒకడు తనకు నచ్చనిదానిని తీసివేసినాడు, ఇంకొకడు చిల్ల దీసి మార్చినాడు, మరొకడు తన పైత్యమును (కాళిదాసు కవిత్వ ముతో కలిపినట్లు) చేర్చినాడు, వేరొకడు — క్రోడగ్రంథలేఖకుడు — తన నోటికివచ్చిన, అన్యసామ్యశ్లోకములను–ఆఖ్యానములను ప్రక్క ప్రక్కననే కుదురుపరచినాడు. ఇట్లా ఈ ఇతిహాసమును పంచమ వేద ముగా చేయను, ఎక్కడెక్కడి ఉపాఖ్యానములను, వేదాంతవిషయ ములను కలిపి, పరస్పర విరుద్ధవిషయాలతో ఒక విజ్ఞానమహాకోశ ముగా చేసివేసినారు. ఇది ఒక మహార్ణవము, ఒక విశాల దుర్గమా రణ్యము అయిపోయినది.

దీనివల్ల పర్వసంగ్రహము–అనుక్రమణికలో లేని అంశాలన్నీ ఆవల చేర్చబడినవనే పెద్దల సిద్ధాంతము.

### ★ మొదట స్త్రీపర్వమువరకే

జనమేజయుడు, తన పూర్వులు ఎట్లా యుద్ధముచేసినారో చెప్పుమని అడుగగా, వైశంపాయనుడు అధిక ప్రసంగము చేయకుండా మృతవీరులకు నివాపాంజలి యిప్పించి స్త్రీపర్వముతో ముగించినాడని, మిగత ఏడుపర్వములు తర్వాత వ్రాయబడినవని, సహేతుకంగానే విమర్శకులు నిర్ణయించినారు. ఈ భాగమునందు నీతులు లోకవ్యవ హారములు చక్కగా చెప్పబడినవి. యుద్ధముతో ముగిగిచచ్చిన తర్వాతగూడ యుద్ధనీతి వదలబడలేదు.

### ★ ప్రక్షిప్తములు

వీరిప్రకారము, పర్వసంగ్రహ–అనుక్రమణికలలో లేక, భారత మహావృక్షానికి శాఖోపశాఖలుగా పెరిగిపోయి, పొద అయిన భాగ ములలో కొన్ని:—

ఈ ప్రక్షిప్తములవల్ల, భారతము వివిధకాలములలో వివిధ ప్రాంతములలో, వివిధరూపములలో ఉండినట్లు తేలుచున్నది. అందువల్లనే ఒక ప్రాంతపు ప్రతికి, ఇంకొక దేశప్రతికి సంబంధములేకుండా పోయి ఉన్నది. ద్రావిడప్రతిలో "వైష్ణవ ధర్మపర్వము" అనేది, 23 అధ్యాయములతో 1636 శ్లోకములు గలిగి, ఇతరప్రతులకంటె ఎక్కువగా నిండి నిబిడీకృతమై యున్నది.

ఆంధ్ర ద్విపద భారతములో కొన్ని వారలున్నవి. ఇక శ్రీపాద వారి కృష్ణభారతం సంగతి చెప్పనే పనిలేదు. మన కవిత్రయంవారు, దిగవేసి అపచారం చేసినారని ఆయన చేర్చని కథయే లేదు.

కొన్ని అంశములు అనుక్రమణికలో ఉన్నా, సంగ్రహంలో లేవు. సంస్కృతమూలములో 1-వ అధ్యాయములో ఒక కథాసంగ్రహమున్నది. అందు కథలో చాల మార్పులున్నవి. వారణావతవాసము-లాక్షాగృహ దహనము-హిడింబుని వధ ఇందు లేవు. రెండవ జూదం సంగతే లేదు. మొదటితడవ ఓడిపోగానే అడవికిపోదురు. బకాసుర వధ లేదు. కీచకవధ, ఒక గ్రీకు కట్టుకథనుండి తీసుకోబడినదని వీరి వాదము.

ఉపాఖ్యానాలన్నీ తరువాత చేర్చబడినవి. ఆదిలో మాద్రి సహగమనం చెప్పబడలేదు. యయాతి చరిత్ర మత్స్యపురాణము లోనిది. ఇట్లే ఇతర ఉపాఖ్యానములు గూడ.

### ★ ద్రౌపదీ వస్త్రాపహరణము

ఈ అనాగరక ఉదంతము మొదటిభారతంలో లేదని, ఆవల కౌరవులను అపకీర్తిపాల్జేయను దూర్చబడినదని చాలమంది వాదము. కుమారిలభట్టు (ఆంధ్రుడు; క్రీ. శ. 7-వ శ.) అప్పుడే ఈసంగతి వ్రాసినాడు.

వేదం వేంకటాచలయ్యారు, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వస్త్రాపహరణం జరుగనేలేదని, జరిగినదంతా - దాసి అయి

పోయిన ద్రౌపది సభకు రానందున జుట్టుబట్టి ఈడ్చుకొని రాబడుట మాత్రమేనని (కచగ్రహణము) భారతమునుండి అనేక ఉదాహరణలను ఎత్తిచూపి, నిరూపించినారు. తిక్కన కచగ్రహణమునే పలుమారు చెప్పి, 2–కి చోట్లమాత్రం గుడ్డలొలుచుటను ప్రస్తావించినారు. జుట్టు లాగుటనే ఎక్కువ మోపు జేసి, దాత్యసమయంలో తన్ను ఏకవస్త్రయగు దానిని గొనివచ్చినట్లు చెప్పి—

ద్రోవది, బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మనవిడ్చి, వెంద్రుకల్
దావల చేతబూని, యసితచ్ఛవిబొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలగ, మనంబున బొంగు విషాదరోషముల్
కావగలేక, బాష్పములు గ్రమ్మగ దిగ్గనలేచి, యార్తియై,

గోవిందు ముందటం బెట్టి ఇట్లనియె :—

ఇవి దుస్ససేను వ్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి; కౌ
రవులకడ దీని మాటల
యవసరమున దలపవలయు నచ్యుత, వీనిన్ !

అనిమాత్రమే చెప్పించుచున్నాడు – మహాభారత మహోదధిని మథించిన వైదికమత పరాయణులగు – తిక్కయజ్వ!

నన్నియ సభాపర్వములో, కృష్ణుడు గుడ్డ లిచ్చినట్లే వ్రాయక, దుస్ససేనుడు వలువలు లాగుచుండగా, ఆమె మనసులోపల ప్రార్థించుకొనుచు నిలువబడియుండినట్లే వ్రాసినాడు. తనకు యీ సంగతే తెలియనట్లు ఆ తర్వాత శ్రీకృష్ణుడు చెప్పుచున్నాడు. (సభా–2: 231)

రన్నడు వ్రాసిన (ఇతడు తెనుగువాడు) కన్నడ గదాయుద్ధ కావ్యమున కచగ్రహణమే ఉన్నది.

నన్నియ ఆశ్వాసాంత గద్యములు, పోతనామాత్యుని స్కంధాంత గద్యములవలెనే, ఆ కలివిషయమును శీర్షికప్రాయముగ వివరించును. సభాపర్వ ద్వితీయాశ్వాసాంతమున—"ద్యూత దుఃఖా

ర్ణవముగ్నులైన పాండవుల 'పాంచాలి యుద్ధరించుటయు'' అని సంస్కృతపర్వ సంగ్రహములోవలెనే చెప్పినాడుగాని, వీరే తాము వర్ణించిన వస్త్రాపహారణమును పేరుబెట్టి చెప్పలేదు.

ఇవన్నీ కౌరవులను తెగడను పాండవులను పొగడను, కృష్ణుని మహిమపరచను చేసినవని విమర్శకులు అనేమాట. యాదవకృష్ణుడు మహాపురుషుడై, దేవకల్పుడై, ఆవల అవతారమైనతర్వాతనే ఎంతో కాలమునకు ఇవన్నీ చేర్చబడినవని వీరివాదము.

## ★ క్రొత్త-పాతలు

తమతమ వాదానికి బలముగా, పట్టుగా, తమ ఇష్టానుసారముగా దూర్చిన చేర్చిన విషయములను, తద్భిన్నకథల ప్రక్క-ప్రక్కననే ఉంచుటవల్లనే భారతమున విరుద్ధములు విడ్డూరములు ఏర్పడి ఉన్నవి. ఇదీగాక ఈ గాథలు, గేయములు, తమతమ వంశకర్తలు అనాదిగా నోటిపాటగా తమకు సంక్రమింపజేయగా దిగి సాగివచ్చినవి. వ్రాసినవా రెవరో తెలియదు. ఇదే వాటి పరమపవిత్రతకు, పూజ్యతకు కారణమైనది. ఇక మార్చుటకు ధైర్య మెవరికి ఉండును ? ఇంతేగాక, తమ వంశానుగతమైన యీ విజ్ఞాననిధులను ఎవరు దిగవేయగలరు ? కాబట్టే పరస్పరవిరుద్ధభాగములు ప్రాచీనభారతీయ గ్రంథములలో ప్రక్క-ప్రక్కనే నిలిచిపోయినవి–అని కారణజన్ముడు–ఆ జర్మను పండితుడు ఫ్రెడరిక్ మ్యాక్సుమూలరు వివరించుచున్నారు. (Sacred Books of the East—Introduction.)

ఇట్టిదోషములు బైబిలుకుగూడ తప్పలేదు. (The Bible in the Balance —Charles Smith.)

## ★ ద్రౌపది పంచభర్తృత్వము

మొదట భారతకథ వ్రాసినవారు – ఇండో ఆర్యులలో బహుభర్తృత్వము సదాచారమైయుండిన కాలమునకు సమీపస్థులుగా నుండవలెను. పాండురాజు ''ఒక ఆలుకు ఒక మగడు'' అనేది తన

కాలమునకు కొత్త అని, పాతదినాలలో స్త్రీలు విచ్చలవిడిగా నుండే వారని కుంతితో అంటాను. (ఆది-128 అధ్యా-ద్రావిడప్రతి; సంస్కృతము) కాబట్టి, ద్రౌపది ఐదుగురుని పెండ్లాడుట సామాన్యవిషయము గానే మొదటికవి వ్రాసియుండును. వ్యాసుడు వచ్చి, ఇట్లు మగల గుంపుతో కాపురముచేసిన ఇల్లాండ్రను చాలమందిని ఎత్తిచూపి, ఇది ఆనాటికి విపరీతముకాదని చెప్పిపోవును.

పాండవులు పుట్టి పెరిగినది శతశృంగము. అంటే, ఇప్పటి టిబేటు ప్రాంతము. అక్కడ ఇప్పటికిని అనేకభర్తల పొందుగలదు. మన దేశంలో మరికొన్ని జాతులలో ఈ కులకట్టుబాటు ఇప్పటికీ ఉన్నది. (చోటానాగపూరుప్రాంతమున; నీలగిరిలో తోడాలలోను) రానురాను దేశంలో యీ ఆచారం మారినది. ఈలోపలనే పాండవులకు దేవతలతో సంబంధము కలిగినది. అందువల్ల యీ విపరీత ఆచారమునకు కారణములు- సమన్వయములను కుదిర్చి, తలకొక వ్రాతగా వ్రాసి, అన్నిటిని ఇందే జోడించి తలబీకనకాయ జేసినారు.

దీనిపై పుట్టగొడుగులవలె లేచిన కథలు:—

1. ఒక బ్రాహ్మణి-కుష్ఠరోగిభార్య వరపడి, ప్రత్యక్షమైన దేవుని ఐదుమారులు భర్త అని వరము కోరినది. ఆ వేల్పు మరుజన్మలో 5 గురుని ప్రసాదించిపోవును. సరే! పాండవులకు యీమె తగులాట'మేలనో? అది వరమో-శాపమో! కోరినది యీ జన్మలో, కాని ఇచ్చినది రాబోవుజన్మలో. ఇది ఒక Post-dated Cheque గా ఉన్నది. ఆజన్మలో ఈమె అగ్ని వేదికలో ఎట్లు పుట్టినది చెప్పబడ లేదు.

2. నాలాయని కథ:—నాలాయని అనునది ఒక జాతిపేరు. ఈమెపేరు ఇంద్రసేన. మౌద్గల్యుడు ఈమె పెద్దరోగపు భర్త. వరము. కొన్ని ఏండ్లతర్వాత ద్రౌపదిగా పుట్టును. ద్రావిడప్రతిలో దీనికి కొంత వ్యత్యాసమున్నది.

3. పంచేంద్రియోపాఖ్యానము. తెనుగులో యీ ఉపాఖ్యానము వింతవింత పువ్వులు కాయలతో నున్నది.

4. కాశీరాజకూతురే ద్రౌపదిగా అగును.

5. మార్కండేయ పురాణము.

6. బ్రహ్మవైవర్తము.

7. దేవీభాగవతములలో మరికొన్ని విశేషములు చేర్చబడి యున్నవి. వేదవతియే ద్రౌపది. ఈ వేదవతియే సీతగూడ అగును.

ఇట్లా, ద్రౌపదికథ ఒక గచ్చపొదై పోయినది.

## ★ భగవద్గీత

హిందువులకు పరమపవిత్రమై, సర్వ ఉపనిషత్తులు గోవుగా, కృష్ణుడు పాలుపితుకు గొల్లగా, పార్థుని వత్సముగా చేసి గ్రహించిన అమృతమయ దుగ్ధరూపమైన అపూర్వ వేదాంతగ్రంథము - యీ భగవద్గీత! భక్తియోగమునకు మూలగ్రంథమైన గీత, నేడు ప్రపంచ వాఙ్మయమున నేగాక, వేదాంత క్షేత్రమున పూజింపబడుచున్నది. ఈ పావనగ్రంథమునకు ఎట్లు-ఎప్పుడు ఈ పేరు వచ్చినదో నిర్ణయించుటకు ఎట్టి ఆధారములుగాని లేవు. భగవంతుడు చెప్పినదని, భగవంతుని విషయములను చెప్పినదని, పండితులు అర్థాలు చెప్పుచున్నారు (Song Celestial).

దారుణయుద్ధమునకు కత్తులుదూసి, ఎదురెదురుగా నిలబడి యున్న ఆ ఉద్రిక్త నిశితసమయంలో 700 శ్లోకాలలో, క్లిష్టతమ వేదాంతవిషయములను చెప్పుట - వినుట - ఎఱుగుట అనూహ్యాములుగా నున్నవని, అందువల్ల గీత కురుక్షేత్రమున సేనాముఖమున పుట్టిఉండదని చాలమంది మతము. తిక్కన సోమయాజి 50 పద్యములలో తేట తెనుగులో, ఇందలి వేదాంతమునంతా ఒలిచి చేతిలో బెట్టినాడు-అంతే!

ఇంతటి ప్రశస్తిగనిన గీతను, యీ పేరుతో పర్వసంగ్రహము గాని అనుక్రమణికగాని పేర్కొనవు. నన్నయ తెనుగుసేత గూడ చెప్పదు. నన్నయకంటె ఎక్కువ వైదిక మతాభిమానంగలవారుండినారా? పేరుకే కొరగాని, ఎన్నియో స్వల్పవిషయములను ఏకరువుబెట్టిన యీ విషయసూచికలు, ఇంతటి ఘనతర పవిత్రవిషయమును దిగవేసియుండగలవా? అని ప్రశ్నించుచున్నారు.

లోకమాన్య తిలకు, తమ గీతారహస్య విపులపీఠికలో, గీత లోని ముఖ్యవిషయములు, వైదికమతబీజములు, యథాతథముగ భారతమునుండి – ఉపనిషత్తులనుండి సరాయంగా పెళ్లగించుకొని రాబడి, ఇందు పాతిపెట్టబడినవని, నూటికిపైన శ్లోకభాగములను, భావములను ఎత్తిచూపినారు. భారతశ్లోకములు అనుష్టులైతే, గీత త్రిష్టుప్పు ఛందములో నున్నది. ఇది ఒక పటుకుగానే ఉన్నది.

అంతటి కృష్ణావతారమునకు, ఇంతటి హీన కుకవి వృత్తియేల అని మరికొందరి ప్రశ్న. ఈ దేవకీకృష్ణునికి ముందు వ్యాప్తిలో నుండిన ఈ మతసంప్రదాయమును, యీయన తన గురువు – ఘోరుడను ఋషివలన జ్ఞానోపదేశమును బొంది (ఛాందోగ్యోపనిషత్తు) ప్రచారమునకు దెచ్చినారని, ఆ మతగ్రంథమే ఇది అని – ఈ వర్గంవారు అనే మాట.

శ్రీ వివేకానందస్వాములవారు – గీతను ఆదిశంకర భగవత్పాదులవారే వ్రాసి, తన మతవ్యాప్తికి ఘనతకు ఆధికారికముద్ర లభించుటకు కృష్ణునిపేర బెట్టి, భారతములోనికి చొప్పించి అతికివేసినారు. (Foisted into the Body of Maha Bharata) అనే వాదమును కాదనరైరి. (ఆలంబాజారు; మార్చి–1897.)

గీతాభాష్యములకు మూలమని చెప్పబడే బోధాయన వ్యాఖ్య, దేశంలో ఎస కెక్కడా కనిపించలేదని, రామానుజాచార్యులవారు చూచినట శిథిలప్రతి అని చెప్పికొనినను, ఎందుకు దానిప్రతి వ్రాయించలేకపోయినారని సందేహించి శ్రీ వివేకానందులవారు చెప్పుచున్నారు.

2

ఈపని జరిగినతర్వాతనే - అనగా, శంకరుని తర్వాతనే (క్రీ. శ. 788-820) గీతకు ప్రాశస్త్య మబ్బినదని అంటారు స్వామీజీ. 'భగవద్గీత' పేరు, యీ వేదాంతము తిక్కననాటికి వ్యాప్తిలో నున్నట్లు లేదు. "కృష్ణుడు చెప్పినట్టి గీతలందు" (శాంతి-6: 494) అనియే నుడువుచున్నారు.

అనికిఁ దొడంగునప్పుడు మహాత్మ కలంగినఁ, గొన్ని తత్త్వబో
ధన మహనీయవాక్యము లుదాత్తప్రసం దగ నీవు సెప్పితే,
మనమున వానియర్థములు, మాధవ, నిల్వఁగఁజాలనైతి, న
వ్వినుత సుధారసము వీనుల నింకొకమాఱు నింపవే.

—అశ్వమేధ-1 ఆ-153.

అని స్పష్టంగా కొన్ని వచనములే అని పేరు బెట్టకుండా అర్జునునోటే, ఆ కృష్ణునితోనే తిక్కన పలికించుచున్నాడు. తిక్కన సోమయాజి కంటె వైదికపరాయణత ఇతరులకు గలదా!

ఆవల ఏదో ఒక గీత-అను గీత, ఉత్తరగీత, హంసగీత, హారీత గీత, వృత్తగీత, పరాశరగీత, బ్రాహ్మణగీత-లేవి పుస్తకమునకే గురుత్వము లేకపోయినది అని సెలవిచ్చుచున్నారు. మన ప్రబంధాలు పదహారువర్ణనలతోనే గౌరవము పొందుటకుగూడ ఇట్టి ఊహామాత్ర వ్యామోహమేగదా కారణము! శాంతిపర్వమున చాల గీతలు గలవు.

ఏమైతేనేమి? గీత ప్రపంచమతగ్రంథములలో ఉత్తమోత్తమై అలరారుచు, ప్రపంచ సత్యాన్వేషకులకు ఊరట విశ్వాసములనొసంగి, శాంతిభిక్షను బెట్టుచున్నది. ఆటంబాంబు సృష్టించిన-ఓపర్ హీం వంటి భౌతిక శాస్త్ర వాసనాబద్ధులైనవారికి మనుగడకు నీడపట్టుగా, ఆత్మ శాంత్యాలయముగా శరణ్యమైయున్నది. ఇది హిందూమతభాగ్యము! లోకకల్యాణ ప్రదాయిని!

★ భాసుని కాలమునాటి భారతము

సంస్కృతమున ప్రథమ నాటకకర్త - భాసమహాకవి, బుద్ధచరిత్రాదులను రచించిన అశ్వఘోషుడు (కనిష్కుని ఆస్థానము

నలంకరించినవారు) కవి కులగురువు కాళిదాసు మధ్య క్రీ. శ. 150-400 లో వెలసినవారు. భారత కథావస్తువును నాటకములకుగా ఉపయోగించినవారిలో ప్రప్రథముడు. ఇంతేగాక భారతము వ్రాయబడిన కాలమునకు ఇతరు లందరికికంటె దగ్గరివారు. ఆయన భారతకథను ఆ నాటకముల వస్తువుగా గ్రహించినాడు. వాటిలోని విషయములకు, ఇప్పటి భారతపాఠములకు చాల వ్యత్యాసములున్నవి. ఇవి భాసుడు చేసిన మార్పులు అనుటకంటే, ఆయన కాలమునాటి పాఠములనిన బాగుగ పొసగగలదు. మన కవిత్రయమువారి వ్రాతలవిషయమున గూడ ఇట్లే గ్రహించవలెనుగాని, ఇది వారు పాడుచేసినారు అది పాడుచేసినారనుట అపచారము. ఇప్పటివి ఆవలి చేర్పులో మార్పులో కావలసియున్నది.

భాసుడు కౌరవులనుగాని, కర్ణునిగాని కించపరచకుండుటేగాక వారిని ఘనపరచి, ఇప్పటి భారతము పాండవులకు ప్రాధాన్యమిచ్చినట్లే, కౌరవులను ఉచితస్థానమున ప్రతిష్ఠించినాడు. ఒక నాటకమును 'కర్ణభారము' అని, ఆయనను ఆయన దానగుణమును మహిమపరచినాడు. కవచకుండలములను ఇచ్చివేయుటను, వెనుక ఎప్పుడో అరణ్యపర్వములో బెట్టక, యుద్ధమునకు బయలు దేరునప్పుడే ఇమిడ్చినాడు. ఇంకొక నాటకము - 'ఊరుభంగము' ఈ పేరులోనే దుర్యోధనునిపట్ల సానుభూతి, భీముడు చేసినపని సముచిత రణనీతికి భంగమని తోపింప జేసినాడు.

భాసుడు అభిమన్యుని గోగ్రహణయుద్ధమునందే ప్రవేశపెట్టినాడు. ఆవల అభిమన్యుని పిల్లవానుగా మార్చినతర్వాత, ఈ అంశమును భారత పాఠమునుంచి తీసివేసియుందురు.

### ★ పంపని కన్నడ భారతము

దక్షిణాదిభాషలలోనికి సంస్కృత భారతము మొట్టమొదట తూరిగా కన్నడములోనికి అనువదించబడినట్లున్నది. ఇందు ఆంధ్రులకు కొంత సంతోషసంబంధమున్నది. ఇది వ్రాసిన పంపన్న గోదా

వరీతీరమందలి, వేంగిమండలమందు జన్మించిన బ్రాహ్మణుడు. వేంగీపుర అగ్రహారీకుడు - మాధవసోమయాజి పౌత్రుడు, అభిరామ దేవరాయుని పుత్రుడు. దేవరాయుడు జైనమును స్వీకరించినాడు. పంపని జననము 901-క్రీ. శ. దుందుభి.

పంపనితోబాటు కుమారవ్యాసుడు సంక్షిప్తముగ భారతమును కన్నడమున వ్రాసినాడుగాని, పంపనిదే అతి ప్రచారమునకు వచ్చి ప్రశస్తి గన్నది. కవితాగుణార్ణవ-కవికులగురువు-ఆదికవి-మొదలగునవి పంపని బిరుదములు.

పంపడు, వేములవాడ (కరీంనగరు జిల్లా) రాజధానిగా లెంబులపాటక దేశమును పాలించిన, చాళుక్యనృపతి - అరికేసరి మిత్రుడు హితుడు. అరికేసరి రాష్ట్రకూట చక్రవర్తుల సామంతుడు.

పంపడు తన రాజునే అర్జునుగా జేసి, భారతమును "విక్రమార్జున విజయము" అను పేర వ్రాసి, తనమిత్రుని ఘనపరచినాడు. వ్యాసుడు భారతమును మూడేండ్లు వ్రాయుగా పంపన్న కొన్ని నెలలలోనే ముగించినాడు. వ్యాసభారతమునందలి ద్రౌపదిస్థానమును సుభద్రకిచ్చి ఆమెనే ప్రధానపాత్రగా చేసినాడు. ద్రౌపదిని ఒక్క అర్జునుని భార్యగానే చేసినాడు. యుద్ధానంతరము అర్జుననే రాజ్యాభిషిక్తునిగా చేయుచున్నాడు. ఆ ప్రాంతపు వాడుక భాషలోనే (పులిగెరి) ఆయన కావ్యమును వ్రాసినాడు.

ఈ మార్పులనుబట్టియే, అనువాదములలో తెనుగు కవిత్రయము వారి గ్రంథమునే పరిశోధకులు గుర్తించుచున్నారు.

పంపని కాలములో గోదావరి ప్రాంతమున, తెలంగాణమున కన్నడభాషయే వ్యాప్తిలో నుండినది. తెనుగు కృష్ణకు దక్షిణముననే వెలసియుండినది. ఇది ఇంకను తేలిన మరియొక చారిత్రకాంశము.

## ★ భారతవీరుల వయస్సులు

నకుల సహదేవులు యువకులుగా, అభిమన్యుడు మాణవకుడుగా (Teenager) ద్రౌపదేయులు పిన్న పాపలుగా వర్ణించి కరుణ

రసమును గార్చుట మన పౌరాణికుల పాత పాచిపాట. కాని తెనుగు భారతప్రకారం 70 వ ఏట భీముడు కురుక్షేత్రయుద్ధమునకు దిగిన ట్లున్నది. (ఈ విషయమును, 1932 లో, నేను నా సొంత ప్రభాత ప్రెస్సును నడిపేటప్పుడు, మిత్రుడు వేమూరు సుందరరామశర్మ వ్రాసిన ధనంజయవిజయము అను నాటకమునకు పీఠికగా రచించి యుండినా-అదే మరల ఇప్పుడు)

1. శతశృంగమునుండి, పాండురాజు మరణానంతరం పాండవులు హస్తిపురము చేరునాటికి - షోడశ పంచదశ చతుర్దశ త్రయోదశ వర్షసంజాతులు-ఆదిపర్వము-ఆ 6:142. ధర్మజునికి 16, భీమునికి 15, అర్జునునికి 14, నకుల సహదేవులకు 13 ఏండ్లు.
2. హస్తిపురమున అస్త్రవిద్యలు నేర్చుకొనుచు వీరు 13 సంవత్సరము లుందురు——ఆది. 6:142. కవల వయస్సు 13+13=26.
3. వారణావతమున ఒక్క ఏడాది ఉందురు-ఆది. 3:15. కవలయీడు 26+1=27; భీమునికి 29 ఏండ్లు.
4. పాండవులు తిరిగి హస్తిపురమువచ్చి 5 వత్సరములు కౌరవులప్రాపున నుందురు. ఆది-8:64. యమజులప్రాయము 27+5=32.

ఇప్పటికే అభిమన్యుడు పుట్టి అన్నివిద్యలు నేర్చియున్నాడు. ఇప్పటి కాయన వయస్సు 12 ఏండ్లయినా ఉండదా? మాద్రేయులకు యీాయనకు 20 ఏండ్ల అంతరము.

5. ఇంద్రప్రస్థమున పాండవులు 23 ఏండ్లు రాజ్యపాలనమును నెరపి, ద్యూతమున పరాజితులగుదురు.-సభా-2: 311.

అమడలకు 32+23=55, అభిమన్యునికి 35; ఉప పాండవులు పుట్టి బాగా ఎదిగిఉన్నారు. పెద్దవానిమధ్య అభిమన్యునిమధ్య 15 ఏండ్లు

ఎడము ఉన్నను 20 సంవత్సరముల కోడప్రాయపువాడై యుండవలెను.

6. అరణ్య అజ్ఞాతవాసములు 13 ఏండ్లు.

55+13=68 సంవత్సరములు మాద్రేయులకు. అర్జునుడు 69, భీముడు 70, యుధిష్ఠిరుడు 71 సంవత్సరములవారు. అభిమన్యునికి 48; ఉపపాండవులలో మొదటివానికి 33. వీరు మహారథులు.

ఉద్యో-4:261.

భీముడు పుట్టిననాటికి నూరుమంది కౌరవులు పుట్టి ఉన్నారు. భీముడు దుర్యోధనుడు సమవయస్కులు.

కర్ణ అర్జున దుర్యోధనులకు తిక్కన నెరసిన వెంట్రుకలనే వర్ణించియున్నాడు. కర్ణుడు ధర్మజునికంటె అధమము పదేండ్లు పెద్దగానైన ఉండవలె.

## ★ భారతములో అపూర్వవిషయములు

భారతము సర్వవిషయకోశము—మానవప్రకృతి వివిధ భిన్నత్వమును వర్ణించినగ్రంథములో దీనికిమించినది ప్రపంచవాఙ్మయమున ఇంకొకటి లేదు. నేటికిగాని రేపటికిగాని సరిపోవునట్లు, ఇందు ఏదో ఒకరూపములో వర్ణింపబడని వ్యక్తిజగత్తున లేదు—ఉండబోదు. మానవప్రకృతి మారునదికాదు గాని, మర్యాదలు కట్టుబాట్లు అలవాట్లుమాత్రము కాలానుగుణముగ మారుచు, సంకరములై, కలిసి విడిబడి గంధర్వనగరములవలె (మేఘాకృతులు) రూపాంతరముల పొందుచు సాగిపోవుచుండును. దీనికి ఉజ్జ్వలోదాహరణము—భారత పాత్రలు, సాంఘికాచారములు! భార్యను తానికవానిని కంది, చిదురుచేసే క్రూరచేష్టామోదితులు ఇప్పుడూ కలరుగాని, ఆనాటి భీమునివలె బండెడన్నము తినేవారు లేకపోవచ్చును. ప్రకృతులు భేదించలేదుగాని క్రియావిధానము శక్తిమాత్రం మారినది. భారత కర్త తర్వాత, అంతటివాడు ఆంగ్లమహాకవి – షేక్స్పియరు అంటారు.

ఆనాటికి వినుటకు వింతగాదోచి, ఆవల జరిగినవి-ఇంకను జరుగ వలసినవి, భారతములో ఎన్నియో గలవు. ఫ్రెంచిరచయిత-జూల్ వెర్న్ (Jules Verne) నూరేండ్లక్రిందట చంద్రమండలములో మానవుడు దిగినట్లు, పయనించిన ఆ రాకెట్టువర్ణనములో ముగ్గురు వ్యోమగాములే పయనించినట్లు ఊహించి, శాస్త్రవిషయిక కల్పనాకథను (Sceintific Fiction) వ్రాసినాడు. అమెరికా అపోలో 11-చరిత్ర దీనికి తు-చ-లు తప్పకుండా సరిపోయినది. హెచ్. జి. వెల్సు; క్లార్కు మొదలగు ప్రఖ్యాతరచయితలు ఇట్టి ఊహాపోషక కథలను వ్రాసినారు. ఇంకను కొందరు వ్రాస్తున్నారు. వీటిని ఫిలిములుగా (చలన చిత్రములు) తీయుచున్నారు!

ఇతంతా మానవ మేథాసంపత్తి విలసనమేగాని నిజముకాదు.

ఇట్లనే, అపూర్వవిషయాలను ఊహించి, రూపకల్పనము గావించి, చైతన్యవంతిములుగ జేయబడిన ఎన్నియోవింతలు భారతమున గలవు. మన నారదమహాముని ఆడుచు పాడుచు బ్రహ్మాలోకాదులను మంచినీళ్లు త్రాగినట్లుగా చుట్టివచ్చుచుండును. ఇది నిజంగా జరిగినదని చంకలు తట్టుకొనిన ప్రయోజనం లేదు. పుష్పకవిమానం మొదట, మన పెద్ద పెట్టుబడిగాడు, కుబేరునిదే గదా. ఇప్పటి విమానాలు దానికి దిగదుడుపుకు పనికి రాకున్నవి.

వాలఖిల్యులనే అంగుష్ఠమాత్ర పరిమాణదేహుల కథ ఒకటి ఉన్నది. ఇది ఇంగ్లీషు నవలాకారుడు స్విఫ్టు (Swift) వ్రాసిన గలివర్ యాత్రలవంటిదే! కృత్రిమ గర్భాధానాలు; ఇప్పటి (Test Tube Babies) వలె, మగవాని తొడనుండి వెన్నునుండి పిల్లలు పుట్టుట; క్షణములో దేశదేశాలు తిరిగిరావడం, నేటి అణుశక్తియుగంలో సాధ్యమైన వాటిని ఎన్నిటినో భారతము వర్ణించియున్నది.

శాపమువల్లనో, వరముచేతనో, శిఖండి బృహన్నలవలె మగవాడు ఆడుది అగుట, ఇప్పుడూ వింటున్నాము. శస్త్రచికిత్సతో ఉండిన తనమును మార్పించుకొని సినిమాతారలైనవారినిగూర్చి గూడ ఇప్పుడు వింటున్నాముగదా! బంగారమును ఉమ్మివేసే ఒక

వ్యక్తి శాంతిపర్వమున వర్ణితుడై యున్నాడు. ఇది బంగారుగ్రుడ్లు బెట్టిన ఈసపు బాతువంటి కథయే! ద్రౌపదికి ప్రసాదింపబడిన అక్షయ పాత్ర, అర్జునుని అక్షయబాణ తూణీరములు అపూర్వకల్పనకు మచ్చు తునకలు. కర్ణపర్వములోని హంస కాకీయోపాఖ్యానము, ఈసపు వ్రాసిన కుందేటి తాబేటి పరుగుపందెపు కత వంటిదే గదా!

## ★ కురుక్షేత్రపు యుద్ధబలి-అతిశయోక్తి

భారత ఘోరసంగ్రామమున ఇరువాగులవారు 18 అక్షౌహిణుల చతురంగబలమును పొలికలను లోనికిదింపి, నెత్తురురొంపి - ఎరచి తిప్పలుచేసి, పంచపాండవులనుమాత్రమే మిగల్చుకొనినారు. అక్షౌహిణి అంటే- 21870 రథములు, 21870 గజములు, 65610 అశ్వములు, 1,17,450 పదాతులు, అంతు-2,26,800 సంఖ్యగలది అగుచున్నది. దీనికి రథరక్షకులు, చోదకులు, ఆశ్వికులు 1,31,220 మందిని చేర్చిన 3,58,620 జీవకోటి అగును. ఇక 18 అక్షౌహిణులకు-63,44 360 బలగమగును. ఇది నిజమనుకొన్నా, ఆనాటికి నమ్మ రాని లెక్కే!

ఇక అంచనగాడి ఆశకు అంతు లేదన్నట్లు-ధర్మరాజు ధృతరాష్ట్రునితో మొనలంగల జనులకొలంది ఎఱింగించి, 'చచ్చినవారి లెక్కగా-ఎఱుకపడినవారు, ఉత్తమజనంబులు 76 కోట్లు 24 వేలు; ప్రముక్కడిమూకలు 24 వేలా మున్నూట యిరువంద్రు తెగిరి'' అని సత్యవ్రతంగా ధర్మజుడు చెప్పుచున్నాడు. (స్త్రీ పర్వము-2:167) లక్షను కోటి అనుకొనినా, యీ సంఖ్య మించియే యున్నది. ఇట్టివి, మన పురాణములలోని అతిశయోక్తులు!

భాగవతములో కాలయవనుడు కృష్ణునిపైకి 120 అక్షౌహిణులతో దండెత్తి వచ్చినాడు. ఇది ఈనాటి ప్రపంచ జనసంఖ్య కావచ్చును.

మరికొన్ని విపరీతపు లెక్కలు :-

ఋగ్వేదములో ఊర్వశి పురూరవునిదగ్గర నాలుగేండ్లు ఉన్నట్లు చెప్పగా, ఇది విష్ణుపురాణములో 61,000 సంవత్సరము లైనది.

పురాణములలో 7 నరకములుండ, భాగవతములో వేలు, గరుడపురాణములో 84,00,000 నరకములు సృష్టింపబడినవి. ఒక్కొక్క తలకు ఒక్కొక్కటిగా నున్నదే! (వింటర్ నిడ్జ్-సంస్కృత వాఙ్మయ చరిత్ర.)

---

## 2. కర్ణుని జ్యోతిర్మయ జీవితము

భారత ఇతిహాసగ్రంథమునకు, ఇటు కర్ణుడు-ఇటు భీముడే నాయకు లనవచ్చును. కర్ణుని ప్రాధాన్యమును భాసుడు మొదలు పెక్కుమంది గుర్తించుచునే వచ్చుచున్నారు.

### ★ కర్ణోపనిషత్తు

భండార్కర్ పరిశోధకసంస్థవారు (పూనా) ప్రచురించిన సంస్కృత సంశోధితప్రతిలో, దేవబోధుని వ్యాఖ్యానము చేర్చబడి యున్నది. అందు ఉద్యోగపర్వము 138, 139, 140, 141 అధ్యాయములలోని 125 శ్లోకములను, ఆ వ్యాఖ్యాత "కర్ణోపనిషత్తు" అను ప్రత్యేక శీర్షిక క్రింద చేర్చి, రాధేయుని మహిమోపేతునిగా జేసినాడు. ఇది చాలును! ఆ వసుసేనుని ఘనతను చాటుటకు. ఈఘట్టము శ్రీ కృష్ణుడు కర్ణుని వ్యామోహాసముద్రము ముంచదలచుకొనిన అంశమును వర్ణించుచున్నది.

ఇక ఈయనవలె అపఖ్యాతికి పాల్జేయబడినవ్యక్తిగాని, తెగ పొగడబడిన వీరుడుగాని హైందవ ఇతిహాసములలో ఇంకొకరు లేరు. ఇట్లనే కర్ణుని వ్యక్తిత్వము విభిన్నప్రభలతో భాసించుచున్నది. ఆయన మానసము సంకీర్ణభావ సంకులము; ఆయన ఎద చిట్లిన దేగాని మైల పడలేదు, బీరము పొంపిరి పోలేదుగాని, పడగెత్తి కాటు వేయబోయిన

కోడె త్రాసు తటాలున తలవాల్చినట్లు, తొడరి దిగజారును. ప్రభు భక్తిపరాయణమై ఆయన రక్తము పొంగి కడలి అలలను రేగగొట్టును గాని తల్లిమాట చెలియలికట్టయై ఆ వేలాజృంభణమును ఉడిపి, చేజిక్కిన పగతురను కోడెగములతో వదలించివేయును. యుద్ధమున 'కనలధికమై లావెక్కును', వెంటనే వెనుదిరుగును. తన బాహువీర్యముపై ఆధారపడిన సుయోధనుని–ఆయన రణావసరములను మరచి, అడిగిన లేదనలేనివాడను పేరు ప్రమోయించుకొనవలెనను వృషాభిమానముతో సహజ కవచకుండలములను కోసి, తన విరోధి తండ్రికి యిచ్చివేయును. ఇట్టిది ఆ వీరుని వితరణ లేని దానశీలము! కాబట్టే ఆయన గుణ తేజో రేఖలు ఇంద్రచాప రుచులవలె భిన్నములై మురువు గొల్పును. ఇన్ని గజిబిజ గుణములలోగూడ, ఆయన నడతకు ఆవంతయేని కొరత కలుగలేదు. కాబట్టే, "కర్ణుడు విక్రమంబున కులగీర్తి కిల నాస్పదంబగుటకు జనియించిన వాడు" అని, (కర్ణ–2:109) గత మద మత్సరుడైన తిక్కన సోమయాజి, గుండెపై చేయిడి చెప్పుచున్నాడు. "విమల యశోఘనుడు కర్ణుడు" అని ఎరచిన కల్యాడే పొగడుచున్నాడు. (కర్ణ–1–253) ఈయన క్రోధకేతనమును ఎగగట్టి రణనీతిని భంగము చేసి ఎరుగడు.

★ అలౌకిక జన్మప్రకారములు.

ఒకవ్యక్తి, తన జీవితకాలములో గొప్పవాడైనతర్వాత, ఆ మనుగడకు మహిమలు కల్పించుట, అజ్ఞాతజన్మములకు దైవత్వములంటగట్టుట, అన్నిమతములకు అలవాటైపోయిన గోసాయి చిట్కాముచ్చు. ఆ తర్వాత ఆ పురుషుని ఎంతటి మానవాతీతునిగ జేసిన అంత గొప్ప. ఈపట్టున ఔచిత్యము–చరిత్ర–ప్రకృతి–వీటి నన్నిటిని మడతన ఇకేముద్దగా పౌరాణికులు భుజించి త్రేపనైన త్రేపరు.

నాజరెత్ జీజెసు, క్రీసు (అభిషిక్తుడు) అయినతర్వాత, ఆయన కానీనజన్మ పరిశుద్ధాత్మసంపర్కముతో అయినట్లు, మరి యమ్మ లోకమాత అయినట్లు, స్వర్గమును భూతలమున ఒక తడపతో

కలిపి కొట్టివేసినారు. ఇట్లే మన పురాణపురుషుల జన్మాదికములు గూడ! వారి జననీజనకుల అధర్మ అసహజసంపర్కములు, తత్ఫలితములైన జన్మలు సద్యోగర్భసంజాతములై, యీలోకపు తీరుతెన్నులకు, వాసనలకు అతీతములై పోవుచున్నవి. ఎంత మానవాతీతమైన అంత ఘనత అనుకొని, శరీరములో ఎక్కడబడితే అక్కడ నుండి మహాపురుషులను పుట్టించుచున్నవి పురాణములు. రెల్లు, తొట్టి, కుండగూడ పవిత్ర మాతృమూర్తులగుచున్నవి. ఇదంతా, ఆ వ్యక్తులు మహాపురుషులైనతర్వాత జరిగిన కల్పనయే!

ఆవల ఇది గొత్తిదాటుసేతగా సాగింపబడినది. ఇట్లు చేసినవారు, అంతకుముందు జరిగియుండినపనిని గుర్తించకనో, గుర్తించి గూడ భిన్నత్వమే ఏకత్వమునకు మూలమనిన వేదాంతసూత్రప్రక్రియ ననుసరించియో, ప్రక్కప్రక్కనే యీ విభిన్నకథలను, తలకొకతీరుగా వ్రాసి, పురాణములలో నింపియున్నారు. అంతటి మేధాసంపన్నులైన మహాకవులకు అనువదించునపుడు యీ చిన్నలోపము తోచలేదని అంటే మహాపచారమేగాని, అనక తప్పదు. ఏమి చెయ్యాల?

★ కర్ణుని జన్మప్రకారములు

కర్ణుని జన్మప్రకారములు భారతములో పలుతావుల ఉన్న విధానమును పరికించండి:-వీటిలో వివరములు పరస్పరవిరుద్ధముగనున్నవి.

౧. ఆదిపర్వము-5 ఆ. 17 పద్యము మొదలు సద్యోగర్భము. ఇది నన్నయభట్టారకుని రచనము:—యాదవకులవిభుడు-శూరుడు, తన పెద్దకూతురు-పృథకు, అపుత్రకుడు-కుంతిభోజుడు పెంచుకొనుటకు యిచ్చెను. పృథ అతిథి సత్కారములు సేయుచుండును. దుర్వాస ముని ఒకనాడు విందవు అగును. కోరిన ఆహారమిడగా సంతుష్టుడై "మెయ్యేని వేల్పు నారాధించిన, ఆ వేల్పు నీ కోరినయట్టి పుత్రకు

నిచ్చు''నని, యాపద్ధర్మంబుగా నొక్క దివ్యమంత్రంబు ప్రసాదించిన, నమ్మంత్రశక్తి నెఱుంగగోరి, కుంతి యొక్కనాడు ఏకతంబ గంగకు జని, తన హృదయంబున నాదిత్యుని నిలుపుకొని, ఆ మంత్రంబు స్మరించి' ''నీయట్టికొడుకు బ్రియంబున నిమ్మ''ని కోరును.

కమలమిత్రుడు తన తీవ్రకరత్వముడిగి, తరుణ ద్యుతితో గగనంబునుండి వచ్చెను. విస్మయసంభ్రమములనున్న ఆ కన్యక నోడకుమని, సూర్యుండు ప్రసన్నుండై, ''నీ కోరినవర మిచ్చితి''ననియె. కుంతి లజ్జావనత వదనయై, యజ్ఞానమున రావించినదానికి మన్నింపుమని వేడుకొనగా—''మదీయదర్శనంబు వృథగాదు; నీయభిమతంబు సేయుదు''నని సూర్యుండనియె. కుంతి—''కన్యక కిది గుణము కాదు; నాకు గర్భమైన నా తలిదండ్రులు చుట్టములు నగరే'' అన, విని సూర్యుడు దాని గరుణించి, ''నీకు సద్యోగర్భంబున బుత్రుడుద్భవిల్లు. నీ కన్యాత్వంబు దూషితంబుగాదు'' అని వరంబిచ్చిన, నా కన్యకకు దక్షిణంబ నంశుమంతు నంశంబున కానీనుండై ఒక బిడ్డ జనించె.

ఆ శిశువును ఇంటికిం గొనిపోలేక, అట విడనాడలేక ఆమె మనసులోన వందురి వగచుచుండ, నాదిత్యప్రేరితంబై, యనర్ఘరత్న వసుభరితంబై ఒక్క మంజస నదీప్రవాహమున గొట్టుకొనిరాగా, దానిలో కుంతి తన కొడుకుం బెట్టి, నీటవదలి నిజగృహంబునకు వచ్చె.

౨. వనపర్వము 7-307 పద్యము మొదలు, ఎఱ్ఱాప్రెగ్గడ.

తొల్లి కుంతిభోజునికడకు దుర్వాసుండు అతిథియైవచ్చి, వానిచే బూజితుండై ''నాకు నీయింట గొంత కాలము వసింప నిష్టంబైనది. నా ఉన్నంత కాలము భక్తి సేయవలయు; నోపుదే?'' అనుడు, అతండు ఒడంబడి, తనకూతును-పృథను ఆ బ్రాహ్మణును భక్తి భజింపుమనియె. అమ్మునీంద్రునకు చంద్రికా ధవళంబైన సౌధంబునందు శయనాసన ప్రముఖోపకరణములును, నభిమతాహార ద్రవ్యంబులును నాయతంబు సేయబడియె.

ఇట్లు ఒక సంవత్సరంబు పరిపూర్ణంబు కావుడు ప్రీతుండై దూర్వాసుడు "నీ యారాధంబునకు మెచ్చితి, అభిమతంబు లిచ్చెద నడుగుము" అనిన ఆమె వలదనును. కాని, అతఁడు "ఒక మంత్రంబు గైకొనుము. దీనంజేసి యెవ్వేని వేల్పు నాహ్వానంబు సేసెదు, ఆ వేల్పు చనుదెంచి నీ వశంబున నుండు"ననియె. కుంతి వెఱచి 'ప్రసాదంబు' అనియె. ఋషి యథేచ్ఛం జనియె.

(ఆదిపర్వమున ఋషి ఉనికి ఒక్కదినము, ఇచట ఒక్క ఏడు)

అంత కొంత కాలమునకు, ఒకనాడిచ్చక ఋతుస్నాతయై (కృతస్నాత అని పాఠాంతరము) సుదతీరత్నము పూర్వశైలితటిపై శోభిల్లు తిగ్మాంశుజూచి, దళత్పద్మముమాడ్కి నుల్లసితయై చిత్తంబు రాగిల్ల 'దేవా, భవత్సమాన సుందరుడగు నందను గరుణింపవే' అని మనంబున గోరుకొనుచు, మంత్రోచ్చారణంబుసేయ, ప్రభాకరుండు నిజయోగబలంబున మూర్త్యంతరంబు ధరించి, కుంతిపాలికిం జను దెంచె.

ఆయన మధురవచనంబున "నీ మంత్రబలంబున వచ్చినాడను; నీవాడనైతిని. నీ మనఃప్రియంబు సేయువాడ, చెప్పుము" అనగా, ఆమె "కార్యమొకటియు లేదు; కౌతుకమున జేసితిని; ఇంత మాత్రాన విచ్చేయవలయునా! మగుడ చనుడు" అనిన, సూర్యు డిట్లను-"మత్సమాన పుత్రుని గోరితివి; కావున మదీయ సమాగమం బునకున్ ఒడంబడుము."

"బాల్యానాపత్యమున నైచి, కన్యాధర్మంబు రక్షింపు"మని కుంతి సూర్యుని అర్థింప, సూర్యుడు అంగీకరించక పట్టుబట్టినందున "నికుఁ బంపగు తెఱంగాచరింపుము; ఆవల నన్నెవ్వడు నిందకు నోర్చెద" ననియెను. దినమణి "మదిరాక్షీ, మత్సమాగమంబున నీదు కన్యా వ్రతంబు చెడదు, (ఆదిపర్వమున కన్యాత్వంబు అని) నిన్ను లోక నిందయు పొందదు" అని పలికి, ఆమెను ఒడంబఱచి, సమాగమం బున ప్రీతుండై, ఆమెకు గర్భాధానంబుచేసి గగనంబున కరిగె.

అంత, బూర్వపక్షంబున జంద్రుండునుంబోలి, గర్భంబును క్రమంబున దినదినప్రవర్ధమానముగుచు, అభివ్యక్తంబయ్యె ప్రభాకరు మహిమఁ లోకవిదితంబు గాకుండె. తత్ప్రకారంబు దాదికూతు రొక్కతెకుం దెలియు...ఇట్లు వర్ధిల్లుచు, పదియగుమాసంబున, సహజకుండలాభిరాము నొక కొడుకుం గనియె. ఈవిధంబున జనించిన యర్భకుం జూచి, లోకాపవాదభయంబునకు వెఱచి, ఆక్షణంబ యొక్క మంజూషమున నర్భాలకు నిడి, సఖియు దానును, ఆ పెట్టెను గొని చని, దాని నొక తెప్పయందు నతిదృఢంబుగా బంధించి, పురము నొఱసి పారు, అశ్వినీ నదీప్రవాహమున విడిచి, గూఢప్రకారంబున గన్యాంతఃపురముసొచ్చి యప్పటియట్ల ప్రవర్తిలుచుండిరి.

ఇచట ప్రబంధపరమేశ్వరుడు తల్లి ఎదసొదను రాళ్లుకరుగ వర్ణించినాడు.

3. ఉద్యోగపర్వము-4: 29. కృష్ణుడు, కర్ణునితో "...ధర్మ సంవేదివి, తెలియంగ వినుము:—సిద్ధమంత్రబలంబున, మార్తాండు వరమున గన్నియతఱి గొంతి గన్నవాడవగుట" అని చెప్పుచున్నాడు. కన్నవాడవనుటలో సద్యోగర్భముగా కనుపించుట లేదు.

౪. ఉద్యోగపర్వము-4-59. కుంతియే స్వయముగా కర్ణునితో చెప్పుచున్నది:—"వినుము. సూతాన్వయంబున నీవు పుట్టుట గాం, కేను, మా కుంతిభోజు నింట, గన్నియ నాడు భాస్కరుని రావించితి; వరమంత్రబలమున వచ్చి యతడు సంప్రీతి నొసగంగ జన్మించి నాడవు నాకు" ఇందు ఈ జననమునకు అలౌకిక వాసనలు అంత లేదు. రావించుట, జన్మించుట అన్నియూ సహజ జన్మనే సూచించుచున్నవి.

౫. భీష్మపర్వము-3: 444. భీష్ముడు కర్ణునితో "నీ యుదయము దైవికగర్భాయత్తము. నీకు మర్త్యు లసదృక్షులు" అని నిగూఢముగ చెప్పుట ఔచిత్యమే.

౬. స్త్రీపర్వము-2: 176; 177. కుంతి మరల స్వయముగా ...మదీయాత్మ జన్ము డాతండరయఁ.

ఆ. "మీకు నగ్రజుండు, మాకు భాస్కరు దయ
అలిత కవచకుండలాతులతోడ
బుట్టినాడు గాన, బోయంగ వలయును, ది
లోదకంబు అమ్మహాత్మునకు"

అని మానవసహజరీతిగనే బుట్టినట్లు చెప్పుచున్నది—కన్నతల్లి.

౨. శాంతిపర్వము. 1: 11–16.

ధర్మరాజు, నారదునితో—మానసికశాస్త్రప్రకారము చెన్ను మీర ఇట్లు పలుకుచున్నాడు. ఇంతకుముందే, యీ ఉదంతము కుంతీదేవి చెప్పగా, అన్నగా కర్ణునికి ధర్మజుడు నివాపాంజలి ఇచ్చి ఉన్నాడు:

క. అతడు దుర్యోధనునకు
బ్రీతిగ, జూదంబు నాడు పెక్కాడెను ధ
ర్మేతరము; వానికి మ
చ్చేతోగతి కోపభరము చెందకయుండున్.

ఆ. అతని మేను కుంతియట్టుల కైవడి
యరయ నేనుజూచి, యాత్మ నెద్ది
కారణంబొ యిట్లు గానకుచు వడుదు:
నేమిసేయువాడ నింక జెపుమ.

క. కౌరవులు సేయు నవమతి
కారణముగ గోపమెత్తు; గర్ణుని వదనాం
భోరుహముం గనుగొన శమ
మారున్, నావశము గాక యంతనబుద్ధిన్.

అపగా నారదుడు చెప్పుచున్నాడు:—

సీ. మునిదత్తమగు మంత్రమున గొంతి కన్నియ
నాడు వేడుక, దిననాథు దనకు
బ్రత్యక్షముగ జేసి పడయుట, దా సిగ్గు
పెంపున సుతు వెలయింపదయ్యె;
గన్యాత్వ వికలత గాకుండ నా సూర్యు
వరము గల్గుట జేసి, వంశవర్య
రై పాల్చె; దేవరహస్య మిత్తెఱగు...

ఇట్లు ప్రాణికోటికి సహజమైన జన్మప్రకారమే చెప్పబడియున్నది.

౮. ఆశ్రమవాసపర్వము. 2 : 95-104.

కుంతి తానుగానే వేదవ్యాసునితో "లజ్జాసహితంబగు నంత రంగంబు" చెప్పుచున్నది :—

ఏను కన్యాత్వదశనుండగా, కోపనుడు-దుర్వాసుడు మదీయ జనకునికడకు వచ్చె. అతని సవినయార్చనా సమారాధితుండుగా జేసితి. ప్రీతుడై వరము కోరుమనియె. వలదన్నను, అమ్మాట తన మనంబునకు రానిచందంబు మొగంబునం దోప, వరము నొసగక పోవననుడు, పుత్రుంగోరితి. అమ్మునిపతి, ఒక మంత్రం బనుగ్రహించి అంతర్ధానంబు నొందె. అమ్మంత్రరూప ముల్లమున నెప్పుడును దలచు. ఒక్కనాడు మేడమీద బోడిమి నేఱుంచి బొడచుచున్న కమల మిత్రునిగని [ఆదిపర్వమున గంగకు బోయినట్లు. ఇందులోవలెనే వన పర్వమున సూర్యుడు పూర్వదిశయందే వెలుగుచున్నాడు] ముని మంత్రబలమున ఆసూర్యుని నావహించితిని. అద్దేవుండు మూర్త్యంత రంబు దాల్చి నాకడ కేతెంచె. [వనపర్వమునగూడ మూర్త్యంతరము దాల్చును] వచ్చి, అడుగుమిచ్చెద వరంబనిన, వడంకుచు కేలు మొగిచి, పొండు అని అంటిని. దానికి ఆయన—వృథాహ్వానమాచ రించుట తప్పు; నిన్నును నీకు మంత్రమిచ్చినవానిని శపింతుననియె. అంతట—భవత్సముడగు పుత్రునిమ్మని కోరితి. అయ్యపరిమేయ తేజుడు ఆత్మతేజమున, నా దృఙ్ముఖేంద్రియములు మనసును సమ్మో హితములు జేసి, యపుడు తనయుడు పుట్టెడుమనియె. పిదప ఆయన కన్యాత్వవికలత [కన్యావ్రతమని వనపర్వము] గాకుండ నానిచ్చి దివమున కరిగె. నేను జనకముఖ బంధు చిత్త వంచనముననడిపి, గూఢ మందిరాంతమున కొడుకును గంటిని [ఏటిగట్టున కాదు]

అని సహజజనన విధమునే, స్వయముగా మామూలుగా చెప్పినది. సద్యోగర్భము కాదు.

ఇవి ఆంధ్ర మహాభారతప్రకారము.

ఇక ఆంధ్రభాగవతము ప్రకారము ౯-వ జననపాఠము : 9 స్క. 717-721, కుంతి, కుంతిభోజునియింట పెరుగుచుండ ఒక

నాడు దూర్వాసుం డరుగుదెంచిన, అమ్మహాత్మునకు కొన్ని దినములు [ఒక్క నాడు గాదు, ఒక్క ఏడుగాదు] పరిచర్యలు జేసి, వేల్పులం జేర జీరు విద్యవడసి [వరము గాదు] ఆ విద్య లావెఱుంగ నొక్క నా డేకాంతంబున వెలుంగుఱేని నాకర్షించిన, ఆయన వచ్చిన, వెఱగుపడి ఇట్లనియె :

క. మంత్ర పరీక్షార్థం బభి
మంత్రించితిగాని దేవ, మదన క్రీడా
తంత్రము గోరి చీరఁగ
మంత్రించిన తప్పు సైచి మరలు దినేశా.

అనగా – దేవతలను పిలుచుట వమ్ము కారాదు, అని, నీకు నీతఱి గర్భంబగు, పుత్రుడుం గలుగు, నీ తారుణ్యము పూజ్యమగును; వెఱవఁ గార్యము లేదని, తగనీయకొల్పి, లలితాంగికి గర్భముచేసి దినేశ్వరుడు మింటికిఁ జనియె. అప్పుడు పుత్రుంగాంచి కృపదప్పి నీట బోవిడిచెను.

అప్పుడు అనుటలో వెంటనే అనియో, తర్వాత ననియో నిక్కచ్చిగా చెప్ప లేదు. వీటినన్నిటిని పరికించిన, మానవసామాన్య జన్మముగనే – కర్ణునిపుట్టువు గాన్పించుచున్నది. ఇట్లు ఇన్నిమారులు, భారతపాత్రలలో ఎవరి జన్మమునుగాని భారతము చెప్పియుండ లేదు. ఇది ఒక లెక్కింపే గావలయునేమో!

## ★ రాధేయుడు

కర్ణుడు, మెరసే పెద్దచుక్క మిన్నువదలి మన్నుపై బడినట్లు ఉద్భవించినాడు. ఆక్షణమందే భారత కథా దీపము వెలిగించబడినది! అది తిరిగి, ఆయనతోనే ఆరిపోయినది. ఈ భారత మహా ఇతిహాసమున, కీలకపాత్ర యీాయనే అయినాడు. ఈయన, తన అండలేకున్న సుయోధనుని సార్వభౌమత్వమే నిలువదని గుర్తెరిగియే, అందరు అన్నిమారులు ఆయన మనసును త్రిప్పను, వికలముచేయను తల క్రిందులుగ తపసు చేసినారు. ఇట్టిది భారతమున కర్ణుని ఆధిక్యము!

ఏటి నీట దొరకిన బిడ్డను అంత గారాబముగ పెంచు తల్లు లెంత అరుదో, పెంపుడుతల్లిని తండ్రిని ఇంతటి మమకారముతో పూజించిన బిడ్డగూడ అరుదు. దుర్భేద్యమైన యీ ప్రేమబంధమే కర్ణునిజీవితమును కీర్తిజ్వలితపథన నడపించింది. రాధ – అధిరథుల కంటె అన్యదైవమెరుగక ఎదిగినాడు రాధేయుడు. బంగారునగ లతో పెట్టెనుండి బయటకువచ్చినాడు కాబట్టి పెట్టిన వసుసేనుడను పేరుగాని, కర్ణకుండలములతో జన్మించినందున ఏర్పడిన కర్ణుడను నామముగాని [చెవులనుండి పుట్టినాడనునది పౌరాణికుల అపూర్వ కల్పనా చాతురీవిభవము!] ఆయనకు అంతగా నచ్చలేదు. తాను రాధేయుడనని, సూతనందనుడనియే అనుకొని ఆనందతన్మయుడై 'అమ్మా' అని ఆమెను నోరారబిలిచి ఊరట బొందినాడు. సూతుడని ఎగతాళి చేసినా, కులహీన మానహీనుడనినా, కానీనుడనినా లెక్క గొనని ధీరమానసుడు యీ రాధేయుడు! తన అంగరాజ్య మకుట మును తన తండ్రి పాదసన్నిధినిబెట్టి ఆనందాశ్రువులతో అభిషేకించిన పునీత ఆదర్శపుత్రుడు – యీ సూతకుల సంపోషకుడు! ఇంతటివానిని పెంచి పెద్దజేసిన ఆ మహారథి – అధిరథుడు శాశ్వతకీర్తితో ధ్రువ తారవలె వెలుగొందుచున్నాడు.

## ★ రాజరాజు నేస్తము

మానవులకు తల వంచని మన్నీడు – మానధనుడు – కౌరవపతి – సుయోధనుని కర్ణుడు చూచినక్షణమందే, పూర్వకృతమైన నెయ్య ముతో ఇద్దరూ ఒకటిగా పెన వేసికొనిపోయినారు. ఈ సంయోగము బంధు రక్తప్లావిత శమంత పంచక రణభూమిలో వారి శౌర్యోపేత భౌతిక కాయములకు గలిగిన విచ్ఛిత్తితోమాత్రమే ఛిన్నమైనది. అంతే గాని, మానవదౌర్బల్యము లేవిగాని దానిని త్రెంచలేకపోయినవి.

వీరిద్దరిస్నేహము అపూర్వము. ఒకరు రథకారకుడైన సూతుని సామాన్యగృహమున ఎదిగినను, ఇంకొకరు అఖండవిభూతికి ఆలవాల మైన రాజమందిరమున పెరిగినను, ఈ వ్యత్యాసములు ఆ సరళ

సన్నేహమానసములకు అంటకపోవుటేగాక, నేస్తమును పెంచుటకే సహాయకారి అయినవి. అమలినహృదయములకు భూతలవాసుల మలినము లంటవుగదా!

కర్ణుని బాహుబలసంపద, సుగుణరత్న సముదయము, స్నేహ స్నిగ్ధహృదయము సుయోధనునికి పట్టుకొమ్మలైనవి. దీనితో వారు భారత కథానాయకులైనారు.

అస్త్రవిద్యాప్రదర్శనమున, క్షుద్రగురువులు బయటబెట్టిన నీచ తారతమ్యాయములతో, ఆ సుమనస్కుడు-రాధేయుడు కీర్తిశిఖరము నుండి అవమానభూరి ప్రపాతమునకు విసరివేయబడనున్న, ఆ క్లిష్ట దారుణసమయమున కౌరవేశ్వరుడు కర్ణుని ఉద్ధరించి, అంగరాజ్యాభి షేకాంబు సమదయమున సూతకులన్యూనత అను కళంకమును కడగి వేసి, కర్ణుని సకల మహీపాలమండలమున తలమానికము చేసినాడు. ఇట్టి ఉద్ధరణమును మరువగలిగిన కీటకమే సృష్టిలో ఉండదనిన, 'నిష్ఠురభుజ విక్రమోగ్రుడు' (ధర్మరాజు, కర్ణప-3: 65) నిజస్వామికి అమ్ముడుబోయిన మానసముగలిగిన 'స్నేహశీలి-ధర్మశీలి' (కర్ణ-3: 344) కర్ణునిసంగతి చెప్పవలయునా? నీటినివలె విడదీయరాని యీ ఇద్దరి చెలిమి ప్రతిపక్షుల కన్ను గుట్టినది.

### ★ శుభాంగి స్వయంవరము

కళింగదేశాధీశుడు - చిత్రాంగదుడు, నిజపుత్రిక - శుభాంగి స్వయంవరమును చాటించెను. శిశుపాల జరాసంధ నీల రుక్మి మొదలు గాగల రాజలోకవిఖ్యాతులు, ఆ రాజధానినగరము - రాజపురమును నింపివేసినారు. కౌరవరాజును నిజప్రాభవోచితబలముతో, రాధేయు నితోగూడ వచ్చి చేరినాడు. వరవరణసభలో, కన్యకారత్నము రా రాజును గడచిపోయినది; ఇది తృణీకారమేగాక, సార్వభౌమాధికా రావమానముగా మనసు కెక్కినది - ఆ మానవేంద్రునికి. వెంటనే ఆయన ఆమెను ఒడిసి లాగిపట్టి, తన తేరుపై ఎక్కించుకొని బయలు దేరినాడు. ఇతరరాజన్యులకు యీ చులకన, పచ్చిపుండుపై కొరవి

బెట్టినట్లయినది. ఒక్కుమ్మడి కోల్తలపరచుకొని, అందరూ ఆయనపై బడినారు. కర్ణుడు వారిని వారించి, ఎదిరించి అందరిని త్రిప్పికొట్టి తరిమి వేసినాడు. ఇదే ఆయన తన రాజుకు అచ్చవలసిన నెనరు అప్పుకు కట్టిన వడ్డి చెల్లింపు ఇదే! ఆయన ప్రథమవిజయము. దీనితో యీ ఇద్దరి స్నేహబంధము అయోనిగళముగ ప్రబలిపోయినది.

ఓడిపోయిన జరాసంధుడు, కర్ణుని వీరవిహారమునకు మెచ్చి మాలినీనగరమును కానుక బెట్టినాడు; గుణలుబ్ధుల తీరుతెన్నులు ఇట్టివే గదా? (శాంతి-1: 30-34)

స్వయంవరానంతరము, కర్ణునికి శుభాంగిపై పవిత్రభావము; సుయోధనునికి రాధేయునిపై విశ్వాసము ప్రబలిపోయినవి.* ఒక నాడు రారాజు వేటకు పోయినాడు; కర్ణుడు వెంట పోలేదు. అభిమాన గౌరవములకు నిలయమైన ఆ కౌరవపతి అభ్యంతరమందిరములో, రాణీ-శుభాంగితో (భానుమతి అనిగూడ) కర్ణుడు చదరంగ మాడు చుండినాడు. రాణి ఆట కట్టుబడిపోవ నున్నది. ఆసునిశితసమయ ములో సుయోధనుడు వేటనుండి తిరిగివచ్చి నగరు ప్రవేశించినాడు. దేవేరి నిజవల్లభునిచూచి లేవబోయినది; కర్ణుడు, ఆమె, ఓటమిని తప్పించుకొనుటకే లేచిపోవుచున్నదని అటు నిటు తిరిగిచూడక, ఆట పావులందే చూపులుంచి ఆమెను నిలువరించుటకు చేయి ఎత్తినాడు. ఆ చేయి ఆమె తారహారమును త్రుంచి, పైటకొంగును చిక్కించు కొనినది. ముత్యములు చిల్లాపల్లా నేలమీదప్రాకి, తెల్లటి మిడి గ్రుడ్లతో రెప్పవాల్చక జరిగిపోయిన ఉదంతమును చాటుచున్నవి. సరిగా అప్పుడే రాజు ఆ మందిరమును ప్రవేశించి, ఈ విడ్డూరపు చూపునుజూచి, ఎలనవ్వు వికసింపజేసి లోపలికిపోయినాడు. ఎంతటి ధీరచిత్తము ఆ రాజుది! నిజకుటింబినిపై ఎంతటి అకళంక విశ్వా సము! తన కూర్మినెచ్చెలిపై ఎంతటి గాఢప్రత్యయము! కౌరవ

---

* ఈ కథ కన్నడభారతముననో, మరి ఏ అన్యభాషాభారతముననో ఉన్నట్లు కొందరుమిత్రులు నొక్కి చెప్పుచున్నారు. లేకున్నను ఇది ఒక రసవత్తర కల్పనముగా నున్నది.

నాథుడుగూడ కర్ణుని 'నాకు రేడుగడ; నిన్ను నీవ సర్వసేనాధిపత్యం బునకు బట్టము గట్టికొమ్ము' (కర్ణ-1. 54) అని మనసులోతును వెల్ల డించినాడు. కాబట్టే ఇట్టి విశ్వాసిని వదలరాదని, కృష్ణునితోను కుంతి తోను భీష్మునితోను చెప్పి తన హృదయనైర్మల్యమును దీపింప జేసి కొనినాడు-రాధేయుడు! ఇదిమొదలు వీరిలో ఒప్పుమి పుట్టనే లేదు.

★ ఆలుబిడ్డలు

భారత వీరకీర్తిహారములో మణిపూస అందగిన ఇంతటి కర్ణుని భార్యపేరు, గాలించి వెదకినా ఎక్కడా కలికమునకైన కనుపించదు. అర్జునాదిపురుషుల బహుముఖ కామశాస్త్రపాండిత్యము, దక్షిణ నాయకత్వము ప్రతిభాగమున పారబట్టబడి యున్నవిగాని కర్ణుని ప్రణయగాథ సంగతే లేదు. కడకు ఆమె ప్రస్తావనకూడ, పాలికల నిలో నిజస్వామి శవముపైబడి ఏడ్చునంతవరకు, ఇంత పెద్దగ్రంథము ప్రస్తావించదు. రాజరాజు భార్యకూడ అంతఃపురమువదలి రాజకీయ ములలో పాల్గొనినట్లు లేదు. వీరు, హైందవ వనితాస్థానము అభ్యం తరమందిరమే అని నమ్మి నడచుకొనినట్లున్నవి.

ఏ యువకవీరునికిగూడ తీసిపోవనియట్లు, కురుక్షేత్రమున యుద్ధముచేసి, స్వారాజ్య మనుభవించిన కర్ణుని వీరసంతానము పేర్లు, వారి గుండెలుదీసిన బంటుపోరు వర్ణితమైయున్నవి వీరు సుషేణ - సత్యసేన - చిత్రసేన - వృషసేనులనువారు. ప్రసేనుడుగూడ కర్ణుని కొడుకని ఉన్నది. (కర్ణ-3: 186) వికర్ణుడు కర్ణునికొడుకని పెద్ద అపోహ; ఇతడు ధార్తరాష్ట్రుడు. వీరినిగురించి ఇంతకంటె ఎక్కుడు వివరములు లేవు. వీరందరు తండ్రికి అంగరక్షకులుగానుండి యుద్ధ మున మడసినారు. ఈవిధముగా, తన కుటుంబమంతా కురురాజు అభి మానఋణమును, నెత్తురు దోసిళ్లతో చల్లి తీర్చుకొనినది. వాడిని వీడిని ముందుకునెట్టి, తనవారిని వెనుకకు లాగువాడుకాదు కర్ణుడు.

భార్యను-వృషసేనునితల్లి దీనావస్థను తిక్కన ఇట్లు వర్ణించు చున్నాడు:—(స్త్రీ-2 : 88, 92.)

తే. ఇతని చుట్టును గలకల మెసఁగ రోద
నంబు సేయుచుఁ బత్నీ నివహంబులోన
గంటె! వృషసేనుని తల్లి, యగ్గలపు టడలు
మూర్తియైన తెఱంగున నార్తిదూలె!
...పలు తెఱంగుల బలవించి, యుత్థితయై యాలోకించి—
తే. కాకులును గ్రద్దలును దిన్న గడును ద్రెస్సి,
యపరపక్ష చతుర్దశి యమృతకరుని
కరణి నొప్పెడు కర్ణు మొగంబుమీద
వనిత యందంద మోపెడు తన మొగంబు!
గ్రద్దలు తినగా రేఖామాత్రముగనే ముఖము మిగిలియున్నదని చెప్పు చున్నాడు. రాళ్లుగూడ కన్నీళ్లు గార్చేటట్లున్నది.

## ★ మహాదాత

కర్ణుడు మహాదాతయని, దానవీరుడని లోకములో దట్టముగ అలముకొని పోయిఉన్న వినుకలులు. కాని, ఆయన చేసిన దానము లేవి? అని చప్పరించేవారుగూడ కలరు. భారతములోనివిగాక ఒకటి రెండు కథలు వినండి: వీటికి మూలమేదోగాని రసవత్తర కల్పనా లతకు పాదులు.

అది వానాకాలము! మూడ్నాళ్ల ముసురుతో నాడు బీడు వత్తోడ్డిపోయినది. అప్పుడు ఒక బ్రాహ్మణుడు చేయుచుండినయాగము నడికొనియున్నది. వేలాది బ్రాహ్మణ్యం మూగియున్నారు. వంట దినుసులతో కొట్లు నిండియున్నవిగాని, వంటపందిలిలోమాత్రం మూరెడు వంట చెఱకు తునకగూడ లేదు. దిక్కుతోచక ఆ యజమాని నేరుగా కర్ణుని మందిరమునకుపోయి, దీనంగా సంగతి అంతా చెప్పుకొనినాడు. రాధేయుడు యోచించినాడు. ఎక్కడి కట్టెగూడ తడిసి, నీరు గ్రక్కు చున్నది. వాటినైనా తెచ్చేదానికిగూడ, మనిషి వానపెట్లకు తల బయట బెట్టలేకున్నాడు. కర్ణుడు తల ఊంకించి, తన ప్రాసాద ప్రాంగణపు మొగసాలవాసములను విప్పించి, తన బండ్లతో తోలించి ఆ యాగశాలకు చేర్పించినాడు. ఉన్న ప్రతిక్షప్తములుగాక ఇవి

కొసరా ! అని అందురేమో; ఔచిత్యభంగము లేకుండా కథలో చమత్కృతి, రసము బాగున్నవి.

దానగుణము ఒంట బుట్టవలసినదేగాని, తెచ్చిపెట్టుకొనిన అతుకునది కాదని చెప్పుచున్నది ఈ కథ :—

అర్జునుడు, కృష్ణభగవానునితో ఎప్పుడూ – "కర్ణుని దానములో విశేష మేమున్నది? ఇతరులసొత్తు వెదజల్లుట ఒక అబ్బురమా? తనకున్న దానిని ఇచ్చినగదా ఈవి అనిపించుకొనుట" అని అనుచుండేవాడు. కాని శ్రీకృష్ణుడు : "దాతృత్వము సహజగుణము. ఇచ్చేవాడికి ఎవరిదైనను సరే" అనుచుండినా, నరుడు పెదవి విరచుచునే ఉండేవాడు.

అది ఒక అమావాస్యదినము! పూర్ణ సూర్యగ్రహణము. చుట్టాలవరుస వారందరు – కౌరవులు పాండవులువచ్చి యాదవులతోపాటు ద్వారకకుపోయి సముద్రస్నానమునకు వాగర్తు చేరినారు. శ్రీకృష్ణుడు తన బావకు అహంభావమును అణచదలచుకొని, విడుపు ఇక ఒకగడియ ఉన్నదనగా, కడలిరేవులలో నిండియున్న ఇసుకతిన్నెలను నవరత్నరాసులుగా, తనమాయతో మార్చి "అర్జునా, గ్రహణ విముక్తికి ఇక కొద్దికాలమే మిగిలియున్నదిగదా? ఈ అమూల్యోపల సంచయమును, ఒక రాయియైన మిగులకుండ, ఇచట నున్నవారికి దానము చేయుము; ఏదీ నీ హస్తవేగశక్తిని చూతము" అన్నాడు.

ఇంద్రసూనుడు అంతరీయమును ఎగగట్టి, ఉత్తరీయమును తలకుజుట్టి, ఒక చేట చేతబట్టి, ఒక్కొక్కరిని పిలిచి, ఒళ్లలో పోయుచున్నాడు. ఒక్కగుట్టలో ఆవగింజపాటైన తరుగలేదు. విడుపు దరికొనిపోయినది. దాతకు ముచ్చెమట బట్టినదేగాని, ఈవి గడ్డకట్టలేదు. అప్పుడు ఆ జగన్నాటకసూత్రధారి – దేవకీనందనుడు, పిన్ననవ్వు వెలయించి, "ఏమి బావా! దానము ఒక విశిష్టమైనసర్గిక కళ అనగా నమ్మకపోతివిగదా! ఎవరిదానినో పంచిపెట్టమన్నను, ఒక్క చిన్నతిప్పనుగూడ కరగించలేక పోయితివిగదా. ఇక చూడు కర్ణుని పనితనము!" అని కోడెగమాడి, ప్రక్కనుండిన వసుసేనుని బిలిచి,

'రాధేయా, గ్రహణాత్యక్తము పూర్తియగులోపల యీ కెంపుల పోగులను దానము చేసివేయుము'' అనగా, కర్ణుడు నిలుచుండిన చోటునుండి కాలు కదపకయే, ఒక్కొక్కరికి ఒక్కొక్కరాశిని ఇచ్చి క్షణములో జల్లకడిగివేసినట్లు పనిని పూర్తిజేసి, 'ఇక లేవా ?' అని అడిగినాడు. "కడు నర్థివేడిన గడిమితో పొచ్చెంబుసేయక ఇచ్చుట" వ్రతముగా గలిగినవాని చేతలివి !

★ వితరణలేని ఈవి

కర్ణుని యీ దానవిధానమే రాజరాజుకొంపకు ఎసరు బెట్టినది. ఇందు ఆయనకు వితరణ తెలియదు. ఇంతేగాదు, కర్ణుడు ఇచ్చుటే గాని తిరిగి తీసికొనుట ఎరుగడు. ఇదే నిజ సహజధర్మ కవచమును ఇంద్రునికి ఇప్పించివేసి, తన యుద్ధకౌశలమును క్షతము గావించినది. దుర్యోధనుని బలవంతముమీదనే ఇంద్రుడిచ్చిన శక్తిని స్వీకరించినాడు. ఆయనకు దానము ఒక బేరముకాదు. ఇక అడిగినవాడు బ్రాహ్మణుడాయెనా — ఈ దొరకు ఒళ్లే తెలియదు. తల్లి—కుంతి అడుగగానే, అర్జునునిదప్ప ఇతరపాండవులను చంపనని మాటయిచ్చి, అస్త్ర సన్న్యాసము చేసి కౌరవ విజయలక్ష్మికి మున్ముందే అంగవైకల్యము కల్పించినాడు. కాని, స్థైర్యము విడనాడకుండుటే యీయన గుణసంపదకు రాణింపు.

★ అచంచల స్థైర్యము

లగ్గుకు పెరుగని, ఎగ్గుకు తరుగని స్థిరచిత్తుడు కర్ణుడు. ఎంతటి ముప్పు తలమీదవ్రాలినా తన జీవిత ధర్మలక్ష్యమును విడనాడని ధీరుడు. తనకర్తవ్యమును నియమమును పాలించుటకు ఆత్మార్పణము చేయగలిగిన సాహసి — యీ రాధేయుడు. కృష్ణుడు, తన పుట్టుపుగుట్టు బయటపెట్టి, రాజ్యకాంక్షతో — ద్రౌపదీయనుభవలోభముతో ఆకృష్టునిజేయ ప్రయత్నించినను. చిన్నపేడైన ఎత్తని దారు హృదయము యీ సూతనందనునిది ! కన్నతల్లి తన సిగ్గు చిమడబెట్టుకొని

"నినుగని నీట గలిపితిని, తిరిగి నా ఒడిలోనికిరమ్ము" అని దీనయై అర్థించినను, తమకని రాతిగుండె - యీ ప్రభుభక్తి పరాయణునిది. శల్యుడు తేరునొగలో కూర్చుండి, నయవంచనముతో కారుకూతులు బలికినను చలించని స్థిరసంకల్పము ఈ యోధునిది. భీష్ముడు తన్ను అర్థరథుని జేసి మాట్లాడినప్పుడు, రెచ్చి పొంగినాడేగాని, ఆ నిందా వాక్యముల లెక్కబెట్టలేదు; ఎద నిండుకుండ కాబట్టి తొణకలేదు. గురువు భూదేవులు శపించినారు - దేవతలు పెడమొగము బెట్టినారు - భూతలము వంచించి, ఆయన రథచక్రమును తనలోనికి గుంజుకొని నది - తనపక్ష యోధాగ్రేసరులు చాలమంది యుద్ధభూతమునకు ఆహుతి అయిపోయినారు - సొంతకొడుకులందరు తన కండ్ల ఎదుట నెత్తుట దోగి దివ్యులలో గలసినారు - ఇన్నిటినిచూచిగూడ, పిరికికంత బడని యోధాతియోధుడు వసుసేనుడు. ఇక ఆయనను ముంచినది ఆయన వ్రతమే! అయినను "సంగ్రామకేళీవ్యసన రసికుడుగానే" (శాం-2 : 434) కడపటి నెత్తురుబొట్టువరకు నిలచినాడు.

## ★ శౌర్యసంపద

కర్ణుడొక పిరుడా? ఎప్పుడూ వెక్కబలముచూపి పరుగెత్తిన వాడేగదా అని, ఒక సర్వసాధారణమైన ఎత్తిపొడుపు. ఆయన శస్త్రాస్త్రసంపద శక్తహుని, జర్మని హిట్లరు మంత్రి - గోబెల్సువలె ప్రచారముచేయబడు పాత పాడుమాట.

గోగ్రహణమున, కర్ణునొక్కనినేగాదు - అందరు కౌరవవీరు లను, ఒక్క నరుడే చాపచుట్టగా మడచిపెట్టినాడు. ద్రౌపదీ స్వయం వరమున ఓడినది ఇంకొకటి. గంధర్వరాజుచే పరాభూతుడగుట మరి యొంకటి. ఇవే నూటికి నూరు నిజమైనచో ఈ మూకను నమ్ముకొని అంత పెద్ద యుద్ధమునకు దిగు వెట్టి వెంగళప్ప ఉండునా? కాని, కురు క్షేత్రయుద్ధమున ద్రోణుని సేనాధిపత్యముక్రింద ఆ ఐదుదినములలో ఎనిమిది పెద్ద యుద్ధములుచేసి, తన బీరమునకు ఆటుపోటులు లేవని చూపినాడు. మదమాతంగమును బిసకాండ తంతువులచే కట్టినట్లు,

తల్లికి యిచ్చినమాటలు మనసుకు వచ్చి ఆకపెట్టగా, చేజిక్కి దీను లైన నలుగురు పాండవులను పరాజయ పరాభవములకు పాల్జేసి వదలి వేసినాడు. తానే సేనాపతిగా రెండునాళ్లు వీరవిహారము జేసినాడు. "ఆకలిమైవచ్చు కృతాంత వక్త్రమున దగిన అస్త్రముల" ప్రయోగించి పరిపంథుల అలయింప జేసినాడు మాయలమారి-ఘటోత్కచుని "మృత్యువు తోడబుట్టిన వనగా" పేర్గాంచినశక్తితో సమయించినాడు :

చరమఘట్టమున—

ఉ. గాండివి శౌరికిట్లను: 'కర్ణుని జూచితే! యేకవిక్రమో
ద్దండత దెంపుసేసి, పటుదర్పము సూపుచు దేరిచూడ
కుండెడునట్లుగా, నలుక నుగ్రతిమం డెడు! నిప్పు డేర్పుమై
నుండక నీసునందొడరి యోటమి జెచ్చుకొనంగ నేటికిన్.

—కర్ణ-3 . 16.

క. వచ్చిన మతి గెల్వగొనక
వచ్చునె? తన యొడలుగలుగ వైరుల గెలవన్
వచ్చుం దతి, వచ్చిన నది
మెచ్చు జయార్థులక, మరుదమిత్ర ధ్వంసీ. (క-3 : 17)

తే. పట్టపగలింట సూర్యునిపగిది కర్ణు
డుగ్రమూర్తియై వెలుగుచున్నవాడు!
మనరథంబిప్డు, మాధవ, మరలనిమ్ము;
బ్రతికియుండిన శుభములు వడయవచ్చు. (క-3 : 18)

అని, అర్జునుడే కర్ణునికి తట్టుకోలేక (Discretion is better part of Valourగా) వైదొలగనుండ అన్యులమాట లేల?

ఇక కర్ణునికి ప్రాప్తించినది దుర్మరణము; అది శత్రు విజయ చిహ్నముగాదు. తేరుగాలు క్రుంగిపోగా, అంగరక్షకులు లేక, సారథి నొగలనుండి దిగకయుండ, నిరాయుధుని, రణనీతి సముదాచారమును త్యజించి నరుడు నారాయణుని ప్రేరేపణతో, సహాయంతో తల దునిమినాడు. ఇది కర్ణునికి ఖ్యాతియే! సక్రమమార్గముల అతని సమ

యింపలేమని యీ కృష్ణులిద్దరికి తెలిసియే యున్నది. కాని, కర్ణుని శస్త్రాస్త్రసంపద కుంటువడకయే దీపించినది.

గురువు భార్గవుడు శపించి, ఆవల దానిని ఉపసంహరించుకొని, ఒక్క భార్గవాస్త్రమే పారదనినాడు. "జమదగ్నిసుత కృపాశ్రయమున బడసిన విలువిద్య కలరూపు వెలయజేతు" ననుచున్నాడు. కాబట్టే అన్ని అస్త్రములు ప్రయోగించి అందరి వీరులచేత పొగడ్త లందినాడు. (కర్ణ-1 : 232)

కపికేతనమువలెనే కర్ణుని హస్తికక్ష్యయు తపోబలమున పొందబడినది. (కర్ణ-3 : 256)

ఇక శస్త్రములసంగతి, అదేల; తనపేరు చెక్కిన బాణములు బండ్లతో తోలించి తెప్పించుకొనినాడు.

(కర్ణ-1 : 236; 3 : 112; ద్రోణ-5 : 113.

ఇదిగాక, కర్ణుని రథము, హస్తికక్ష్య కేతనము, అశ్వములు, ధనుస్సు, శంఖము మొదలగు యుద్ధోపకరణములన్నియు, ఆ పార్థుని వాటివలెనే దైవదత్తములు! అట్టివిటిని క్రిందుచేయుట పాడిగాదు. ధనువు పరశురామదత్తము. (కర్ణ-1 : 233)

ఇక కర్ణుని చావుకు నారదమునీంద్రుని వ్యాఖ్యానమే అంగీకరింపదగియున్నది. ఆయన ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు :—

"వినుము నరేంద్ర, విప్రుదలివేఁ, జమదగ్నిసుతుండు శాపమి
చ్చె, సమరభర్త వంచనముచేసె, వరంబనికోరి కుంతి మా
న్పెనలుక, భీష్ముడర్ధరథుజేసి యడంచె, గలంచె మద్రరా
జనుచితమాడి, శౌరి విధియయ్యె, నరుండటు జంపె గర్ణునిన్.

(శాం-1 : 35)

[నరు చేతను నాచేతను
వరమడిగిన కుంతిచేత వాసవుచేతన్
ధరచేత, శల్యుచేతను
అరయంగా గర్ణుడీల్గె నార్వురచేతన్.

అని, కవిత్వసంపద లేకపోయినా, కృష్ణునిమాటలుగా, సూటిగా చెప్పిన ఈ చాటునొకటి ప్రచారములో నున్నది. "నీ చేతను, నా చేతను" అని లోకులనోట నానిన పాఠము. వీరికి ప్రాసకు గర్భస్రావమైనను, 'యతికి కపాలమోక్షమైనను' పాటిన లేదుగదా!]

★ ప్రభుభక్తి పరాయణత

కర్ణుని గుణభూషణప్రతతిలో ప్రభుభక్తి పరాయణత-ధార్మిక తృష్ట మకుటాయమానములు! తన సర్వస్వమును రాజరాజు యశశ్శ్రీకి-రాజ్యశ్రీలకే వినిమయము చేసినాడు. ఆదరించి ఘనపరచిన ఆయన ప్రాభవమును పెంచను నిజవ్యక్తిత్వమునే అణచివేసికొనిన త్యాగి; మనినది మరణించినదీ ఆయనకొరకే!

"అనుదినంబును నంతకంతకు బెరిగెడి
యధిపు మన్నన యప్పుడీర్ప"
"కురురాజు మన్నన యప్పుదీర్త ప్రాణమాసపడక

(కర్ణ-2 : 21)

అని, ఎదపై తలపై పేరుకొని అణచివేయుచుండిన కృతజ్ఞతాఋణమును వడ్డితో చెల్లించను ఉవ్విళ్లూరి, ఒక్కొక్క-మన్ననకు ఒక్కొక్క-గాయముగా మరణించినాడు. తాత భీష్ముడు అంపశయ్యాగతుడై యుండి, చూడవచ్చిన (ఆయన ఆడినమాటలను మరచిపోయిన సరసహృదయుడు) కర్ణుని సాదరమతితో జూచి, కౌంతేయులను గలసియుండుమనగా, కర్ణుడు మారుబలికిన చేవమాటలివి:—

ఉ. "వారు మహాబలుల్, హరియు వారికి బ్రాపుగలండు; వారలం
బోర జయింపరామియును బుద్ధినెఱుంగుదు; నైన గౌరవ
త్స్మారమణుండు సేయు తగు మన్ననలెల్ల దలంచి చూచినన్
భూరివివేక, యే విడిచిపోవుట ధర్మమె? వీర కర్మమే?

(భీష్మ-3 : 447)

ఇన్ని తెలిసికూడ ధర్మవ్యతిరిక్తమునకు ఊలుకొనని ప్రారబ్ధవాది-ఈ స్వామిభక్తి పరాయణుడు! అది తెలిసికొనియే, భూరి

వివేకుడైన భీష్మునితో పలికిన క్రింది ఉక్కుమాటలు సువర్ణాక్షరము లలో సాహిత్యప్రపంచమున నిలిచిపోగలవు.

శా. దైవాధీనము సర్వమున్, మనమతిం దప్పింపగావచ్చునే?
నీవింకన్ నను నొందువల్కుక, పరానీకంబుపై బంపు, మ
త్సేవాధర్మము నిర్వహించెద, బలోత్సేకంబు లోకంబునం
భావింపన్ విహరించెదన్, మురరిపున్ బార్థుం దలంకించెదన్.

(భీష్మ-3 : 450)

అవును, మరెంతో గతి అంతగదా! స్వామిభక్తులకండలు కదలించి, స్వామి ఘాతకులహృదయముల చీల్చగలిగిన ములుకు లివి! ఏరీ ఆ దేవ తావళి? పనిబాటలులేక విమానములలో తిరుగాడుచు, పాండవ వీరులపై పుష్పవర్షము కురిపించుచుండిరే - ఎక్కడకు పోయినారు? ఏ దానవవీరుడైనా వారిపై దండెత్తిపోయినాడా? లేక సత్యవీరము యీ స్వర్గవాసులకు రుచించ లేదేమో!

మహానుభావుడు-భాసుడు "పంచరాత్రము"లో కర్ణుని కీర్తి మూర్తికి బంగారు నీరుబోసి మెరుగెక్కించిన వహి చూచుడు:

ఐదుదినములలో పాండవులు అజ్ఞాతవాసమునుండి బయటికి వచ్చి కనుబడినచో, తిరిగి వారి రాజ్యభాగము వారికి ఇచ్చివేయుదు మని, భీష్మునిపోడుపై అంగీకరించిన పట్టున, దీనిపై అందరి అభి ప్రాయమడిగినప్పుడు, దుర్యోధనునితో కర్ణుడు—

"భాగమియ్యగ లేదన, ప్రభుడవీవు!
ఆ పాపమైన నేను సహాయపడుదు"*

అని వాదములపొంత బోక చెప్పినాడు. భారతవీరులలో యీ గుణ విశేషమున రాధేయుని మించిన రాచపుట్టువే గాదు, మనుజశరీరుడే లేడు!

## ★ ఇతరులు చేసిన కర్ణుని గుణకీర్తనము

తిక్కన తనమాటలలో పాత్రలను పొగడడు-తెగడడు. "మెత్తటి పులి ధర్మసూతి" అనినా, "అంతర్మదదుష్టుండు ధర్మ

* శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి అనువాదము.

సూతి'' అనినా ఇతరులచేత చెప్పించినవే! ''పేరు ధర్మరాజు పెను వేపవిత్తయా'' అని మొరటుగా వేమనవలె తిక్కన చెప్పడు. ఇట్లే కర్ణునిగూర్చి ఇతరులచే చెప్పించిన పొగడ్తలు కొన్ని :

బ్రహ్మ రుద్రునితో (కర్ణ-3 : 248) కర్ణార్జునలకుగూర్చి-

క. ఇరువురు నతిరథులు, సమ
స్ఫురణులు, విక్రాంతిపరులు, శూరులు, వీరో
ద్ధారువులతో బెనగగ న
శ్వరమగు జగ, ముడుపరాదె సమరం బనఘా.

ఇట్లు దేవతలు చెప్పినను. భూదేవతలు కర్ణుడు అస్త్రప్రయోగమునకు మతిమరపు తగిలిందని విడువక చెప్పుదురు. కౌరవుల దేవిడిలోనే ఉండిన తాత - భీష్మాచార్యులవారుమాత్రం ఈయనను అర్ధరథుని జేసి, ద్రౌపదేయులను ఎత్తిపెట్టి మహారథులను జేసినారు.

(ఉద్యో-4 : 260)

కాని, కృష్ణుడు ధర్మజునితో (కర్ణ-3 : 387)

క. ''భువనములన్నియు నొక్కట
గవిసియు గర్ణు బరిమార్పగ నోపునె?...

ధర్మజుడు : (కర్ణ-3 : 65)

''నిష్ఠుర భుజవిక్రమోగ్రుడగు సూతతనూభవుడు''

ధర్మరాజు కృష్ణార్జునలతో—(కర్ణ-3 : 29)

మ. సురసైన్యం బలమెత్తి కర్ణుని రణక్షోణిన్ జయింపంగ నే
ర్తురె? యవ్వీరుండు జామదగ్న్య కలితాస్త్రం డిద్ధతేజంబునన్
దొరసప్తార్చికి, లావునం బవనుతో దుల్యుం డగణ్యుండు సం
గర సంక్రీడలయందు, చేరొక్కనడగున్ గాంభీర్యధైర్యంబులన్''

ఇది అన్ని అపదూరులకును ప్రత్యుత్తరము! ధర్మతనయుడు అర్జునునితో—(ద్రోణ-5 : 195)

క. నడురేయి తీవ్రభానుడు
పుడమి వెలిగెనను తలంపు పుట్టించును

గడువగు తేజంబున వెలి
గెడు కర్ణుడు, బాణరుచులు గిఱికొన దెసలన్.

అర్జునుడే-(విరా-5 : 11)

శా. యోధాగ్రేసరు డిద్ధతేజుఁడు, రణోద్యోగానురక్తుండు, దు
స్సాధ్యప్రక్రమ బాహువీర్యుఁడు, పురుత్సాహాలవాల్లభ్య ల
క్ష్మీ ధామాత్ముఁడు, జామదగ్న్య కలిత శ్రేష్ఠాస్త్ర విద్యాఢ్యుఁడీ
రాధేయుండొక చీరికింగొనఁడు వీరవ్రాతముం బోరులన్.

నూర్గురను కన్న ఆ కడుపు కొట్టుబుట్టగా, గాంధారి శ్రీ కృష్ణునితో అంటున్నది:—(స్త్రీ పర్వము)

పాండుపుత్రుల భుజాబలమున నలుకక
యెవ్వీరు ప్రాపున నెదురునడచె
దుర్యోధనుడు; గొంతి తొలుఁజూలి కవ్వఁడు
హృదయశల్యంబయి నిదుర సెఱచు,
నట్టి కర్ణుండు, మదాంధసింధురము,
బలోద్ధత, ద్విరదమహోగ్ర విక్ర
మమున గీటడఁగినమాడ్కి, నర్జును బలు
గడిమిచే నెగటార్పబడియె, వీని

బాహు విలసనమునబడిన మహాయోధ
వరు లనేకు, లితఁ డవార్య రోష
దూషితుండు, పరుష భాషణ శీలుండు,
ధైర్యధనుడు, దాన శౌర్యశాలి!

అని ఉన్న గుణములను వర్ణించినది.

ఆయనసంగతి తెలిసిన ఎదిరిమాటలకంటె బిగువైన యోగ్యతా పత్రము ఉండగలదా?

ఇక రాధేయుని సొంతమాటలు—

కాండ మహాతరంగంబుల వైరులముంచు
విజయాంబురాశికి వేలనగుదు,
బాణరశ్ముల బరిపంథుల బొదివెడు
నర్జునాదిత్యున కభ్రమగుదు,

విశిఖోగ్రశిఖల విద్విషుల నేర్చు కిరీటి
　　ఘోరదావాగ్ని కాసారమగుదు,
ప్రదరవేగమున నరాతులగూల్చు పార్థాతి
　　వాయువునకు నచలమగుదు,

విల్లు పట్టెడువారికి నెల్ల నెక్క
డనగ నెగడన గాండీవి నాహవమున
దొడర, ప్రాణంబులకు నాసపడు లఘుప్ర
కారులకు వచ్చునే, నాకు గాక శల్య?

హృదయమును ద్రవింపజేసే, ధర్మరాజు అనుతాపముతో యీ శోకగ్రస్తులప్రోవును ముగింతము. (స్త్రీ-2 : 174 మొదలు:-)

ధృతరాష్ట్రాదులందరు, కుంతీదేవితో వీనుగు వెంటగానున్న పాలికలనుకుపోయి, తమతమ వారి శవములను వర్సరించి, వేరి, నివాపాంజలి యిచ్చు సమయమది. అప్పుడు-కుంతి యెల్లవారు వినగ నిట్టులనియె—

తరలము- వినుము! కౌరవకోటికిం దన విల్లు పెట్టని కోటగా
　　ననియొనర్చి, భవద్బలంబుల నన్నిటిన్, మిము నేవురం
　　దనిపి, యంబర చారులెల్లను దన్ను మెచ్చి నుతింప బా
　　ర్థుని మహాస్త్రము బల్విడిం దలద్రుంప గూలిన కర్ణునిన్.

......మదీయాత్మ జన్ముడారయన్'' అని కడుపుగుట్టు బయటబెట్టి, అట్టి అగ్రజునికి తిలోదకదానము చేయుమనినది. అప్పుడు ''ధర్మనందనుడు దల్లడిల్లుచుం దల్లితో నిట్టులనియె :—

“అనిలార్జునుల మార్కొన నేర్చె యెవ్వని
　　యుత్సాహమూది సుయోధనుండు,
వైదేహ పాంద్రాది వసుదేశు లెవ్వని
　　కడిమి సొంపున నరిగాపులైరి,
మనసైన్యకోటి యెవ్వని బాహువీర్య సంపద
　　కోడి యంతంత నొదుగుచుండు,
నద్భుతం బొనరించె నమరుల కెవ్వని యసమాన
　　వివిధ దివ్యాస్త్రమహిమ,

మిమ్ము నందఱ నెవ్వని మహితశక్తి
యెక్కుడై సంగరంబున జిక్కుపఱచె,
నట్టి కర్ణుని, గొంగున నగ్నిదాచి
నట్లు లెమ్మొయి దాచితోయమ్మ చెప్పుమ!

ఆ. అతడు మాకు నన్నయని మున్న యెఱుగంగ
గన్న గురుఫలంబు గలక బడక
మనుడు, మట్టులైన మనుజలోకమునకు
గలుగ దడలు, మాకు గలుగదడలు."

* "తల్లీ భరతకులమను పెద్ద దూదిబోరెములో నిప్పంటించి తివే! ఆయన ఆర్యధర్మపరుడు, నేను అనార్యుడను. నాజోటివారు వేయిమంది అయినను ఆయనతో సాటిరారు. ఆయన సువ్రతుడు, మహావీరుడు. కర్ణునిమాటలకు కోపము క్రెళ్ళి పొంగునుగాని, ఆయన మిగాలు చూడగనే అదేలకో నోరాడదు; కోపము ఉడిగి చల్లారి పోవును. ఇప్పుడు తెలిసినది తల్లీ, ఆ పాదములు నీ పాదములవంటివే!" అని చుట్టుపట్ల ప్రకృతియే కంట తడిబెట్టునట్లు చేసినాడు.

ఇట్టివి, భారతమున, పసిడితునకలవంటివి ఎన్నియోగలవు.

## ★ కర్ణునితేజము వారిజాప్త బింబము సొచ్చుట

తిక్కన, కర్ణుడను అపూర్వజ్యోతి ఎట్లు ఆరిపోయినదో చెప్పచున్నాడు తిలకించండి :- (కర్ణ-3 : 362, 363

క. చరమ గిరినుండి పడియెడ
తరణి కరణి నూతపుత్రుని తలవడ, గాంచి
స్ఫురణోజ్జ్వలంబు, నతి సుం
దరమును నగు కాయమట్లు ధరణిబడియె!

---

* ఈ క్రింది వచనభాగమును, ఒక శిథిలమగుచుండిన తెనుగులిపి సంస్కృత భారతమునుచూచి, నా 'కర్ణుడు' పుస్తకములో ఉదాహరించియుంటిని. ఇప్పుడు ఆ ప్రతి వివరములను - సంపాదకుడు, ముద్రణాలయాదులు - చూడదలచుకొనగా, ఆ శాస్త్రిగారు అది తుట్టమారా చెడిపోగా పారవేసినామని చెప్పి వ్యాకులమును కలిగించినారు. ఇతర-కొన్ని సంస్కృతప్రతులలో ఇది లేదు.

తే. అధిప, యంతన కనువిచ్చి యఖిలజనులు
కనుగొనంగ నయ్యుజ్జ్వల తనువు విడిచి
చని, సముద్దీప్తమైన తేజంబు వారి
జాప్తబింబంపుసొచ్చె నత్యద్భుతముగ!

ఆ మహావ్యక్తి వీర్యవంతమైన జీవితమునకు పరమోచితమైన పరిసమాప్తి! ఇక మిగిలి, మనిన దొరలు రక్తమలిన మహీతలమునే పాలించినారు, కాబట్టే కర్ణుని శిరము "అతిగర్వసమన్వితము" అయినది. (కర్ణ-3:37)

చివరకు-"వినుము నరేంద్ర, యీ క్రతువు విష్ణుమయం; బిది నిర్వహించి రర్జునుడును గర్ణుడుఁ సమరరూపమునఁ దగ" అని ఫలశ్రుతితో ముగించుచున్నాడు కవి. (కర్ణ-3:397)

ఇదీ తెనుగుభారతము ప్రదర్శించిన కర్ణుని కీర్తిమూర్తి!

★ కర్ణదేవాలయము

నెల్లూరు మొదలు దక్షిణాదిన శ్రీకృష్ణ (ద్రౌపది) ధర్మరాజ దేవాలయములు గలవు. ద్రవిడదేశమునుండి వచ్చిన అగ్నికుల క్షత్రియులు (వెల్లాలులు; నెల్లూరుప్రాంతమున కామాటులు అని అందురు) పూజారులుగా ఈ గుడులందు వీరపూజ చేయుదురు. మూడేండ్ల కొకసారి యీ వీరులకు తిరునాళ్లు జరుగును. పద్దెనిమిది దినములు భారతయుద్ధమునే సమగ్రముగ ఇచట ప్రదర్శింతురు. కడపటినాడు నిప్పుల గుండము. ద్రౌపదిఒడిలో గుండపునిప్పులు బోయుదురు. చీర కాలకుండుటే ఇందలి మహిమ. ఇతరతిరునాళ్లలో కొడి గట్టుటవంటిదే (ధ్వజారోహణము) ఇందు కత్తి నిలుపుట.

ఇట్లే, నేటి మధ్యప్రదేశమున భాగల్‌పూరునందు కర్ణుని దేవాలయము గలదు. ఇందు అర్చనాదికములు, అతి పూజ్యభావముతో జరిపించబడుచున్నవి. ఈ ప్రాంతము పూర్వము కర్ణుని ఏలు

బడిలోనుండిన అంగరాజ్యమని ప్రజల విశ్వాసము. (చరిత్రకు సరిపోవు నట్లు లేదు) ఇచటివారి పేర్లలో కర్ణుడు—కుంతి, తక్కంగల పాండవుల నామములు సర్వసాధారణములు.

---

## 3. తిక్కన కవితాశిల్ప వైభవము

### ౧. చరిత్రాంశము లేశము

**★ విక్రమ సింహపురము**

క్రీస్తుశకము నాల్గవశతాబ్దంలో ఈ ఊరికి గడ్డ ఎత్తబడినది. దండకారణ్యమును నరికి, జనపదములు కట్టించిన "కాడువెట్టు (=అడవిని నరకు) ముక్కంటి" అను నామాంతరముగలిగిన త్రిలోచన పల్లవుడు దీనిని ప్రోదిచేయగా, పల్లవుల బిరుదమైన "సింహ" నామాంకితమైనది. అది మొదలు కాంచీపుర సామ్రాజ్యధవళాతపత్ర ఛాయల క్రిందనే నెల్లూరు అయినది. (నెల్లి=వడ్లకు పేర్గాంచినది) మూలస్థానేశ్వరస్వామి నెల్లి (=ఉసిరిక) చెట్టుక్రింద ఉద్భవించినారు కాబట్టి నెల్లూరు అయినదనుట యీావలి చతురకల్పన. ఈ రాజ్యము నేలిన మనుమసిద్ధి (తెనుగు) చోళుడు. కావేరికి అనకట్టగట్టిన ఆ పురాతన ఇంజనీరు—కరికాల చోళ మహారాజు సంతతివాడు. వేంగీ దేశాధీశుడు—రాజరాజనరేంద్రుని కొమారుడు—రాజేంద్రుడు, ఉభయకులోత్తుంగుడై, నెల్లూరు రంగనాథస్వాములవారికి కైంకర్యములు చేయించినాడు. ఈయన, గోదావరి కావేరినదులు, నిజ రాజ్యలక్ష్మికి రెండు బాహువులుగా సంతరించినాడు. ఇట్లు కృష్ణకు దక్షిణప్రాంతము, పెన్న మాగాణములు తమిళసంప్రదాయములలో ఊరినవే. తెనుగుదనమునకు శ్రీకృష్ణదేవరాయల దినాలలో చేవ ఎక్కినదనవచ్చు. చోళులకు ముందు 12 బోయకొట్టములు (దుర్గములు) కందుకూరుకు దక్షిణాన రాచరికములు నెరపుచుండినవి.

8-వ శతాబ్దాంతమున, పండ్రంగడు అను బ్రాహ్మణసేనాని, కందుకూరు రాజధానిగా ఏలినాడు. ఇతడు తెనుగుకవియై కవులను పోషించి, తెనుగుపద్యాలలో శాసనములు వేయించినాడు. ఇవే ఆంధ్ర కవితావర్షమునకు తొలకరిము త్రైపు చినుకులు.

తెనుగు చోళులైన తిక్కన, మనుమసిద్ధి మొదలగువారు, ఓరుగంటి కాకతీయులకు సామంతులై, కవిబ్రహ్మ తిక్కనపుణ్యాన మాన్యపరుపబడినారు. ఆవల కొండవీటి పంటరెడ్ల పాలనకు దత్తమై పోయినది-నెల్లూరుసీమ. పంటనాడు అనునది, ఇప్పటి గూడూరు తాలూకా ప్రాంతమని చరిత్రకారుల మతము.

ఈ మండల దక్షిణభాగము కొంత, కొన్నాళ్లు పాండ్యుల, కొన్నేండ్లు చోళులచేతులు మారుచు వచ్చుచుండినది. గజపతులు గూడ దీనిని పాలించినారు. ఆవల విజయనగరభాగమై, గోల్కొండ సులతానుల వశమైనది.

## ★ నెల్లూరు తెలుగు చోళులు

ఇమ్మడి (రెండవ) మనుమసిద్ధి తిక్కన సోమయాజిని 'మామా' అని పిలిచి, ఆయన కావ్యకన్యక-నిర్వచనోత్తర రామాయణమునకు కృతిభర్తయగుటచే, ఆంధ్రభారతి దీప్తిమంతముగ వెలసినంతవరకు చరిత్రలందు ఆయన, కొడిగట్టని తిళ్ళికగా విరాజిల్లగలడు. మనుమసిద్ధి రాజ్యమెంత? పిడికెడు! కాని, తిక్కన నేస్తము వల్ల ఇంతటి ఖ్యాతిగాంచిన ఈ అర్ధతమిళుడు ధన్యుడు.

నెల్లూరు రాజ్యస్థాపకుడు-నల్లసిద్ధి, చెంగల్పట్టు కడప నెల్లూరు మండలభాగమును, నెల్లూరు కంచి రెండు రాజధానులుగా, 1213 సంవత్సరపు సరికట్లలో పాలించినాడు. ఇతని మనుమడు, మొదటి బేతరాజు కొడుకు-ఎఱ్ఱసిద్ధి, విశ్రుతుడు. ఈయనకు మొదటి మనుమసిద్ధి, రెండవ నల్లసిద్ధి (బేతరాజు నామాంతరము) తమ్మసిద్ధి అను ముగ్వురు కొడుకులు. పెద్దవాడైన మనుమసిద్ధి రాజైనాడు. ముమ్మడి కులోత్తుంగుడు 1180 లో నెల్లూరుపై ఎత్తివచ్చి, మనుమసిద్ధిని రాజ్య

భ్రష్టుని జేసి, ఈయన తమ్ముడు–నల్లసిద్ధిని గద్దెపై కూర్చుండబెట్టినాడు. ఇతడు 1187–1207 వరకు రాజ్యము చేయుచుండగా, ఇతని తమ్ముడు–తమ్ముసిద్ధి అన్నరాజ్యమును అపహరించి, ఉత్తర దక్షిణ పెన్నలకు మధ్యభూమికి-కంచి నెల్లూరు సీమలకు ఱేడైనాడు.

ఓరుగల్లులో, కాకతి గణపతిదేవుడు, ఆంధ్రసామ్రాజ్య సింహాసనారూఢుడై, తన రాజ ఛత్రఛాయలను యీ తెనుగు చోళులపై బరపినాడు (1199–1261).

మొదటి మనుమసిద్ధికొడుకు–తిక్క–భూపతి, కాకతీయ ప్రభువులపక్షమున, వెలనాటి పృథ్వీశ్వరుని ఓడించినాడు. వెంటనే కాకతీయ గణపతి నెల్లూరువచ్చి, తిక్క–రాజును సింహపురి సింహాసనాధిష్టుని జేసి, దక్షిణదేశయాత్రకు వెడలినాడు.

తిక్క–భూపతి ఓరుగంటివారి సామంతుడుగా చుట్టుపట్లరాజ్యములను ఆక్రమించుకొని "చోళ స్థాపనాచార్య" బిరుదమును ధరించినాడు. ఈ విజయయాత్రలను, కవి తిక్కన 1234–46, మధ్య నిర్వచనోత్తర రామాయణమున కీర్తించినాడు.

### ★ వీరగండ గోపాల-ఇమ్మడి మనుమసిద్ధి

తిక్క–భూపతి కొడుకు–ఇమ్మడి (రెండవ) మనుమసిద్ధి నెల్లూరు రాజ్య ప్రభువైనాడు. కాకతి గణపతి దేవునికి, కళింగులతో జరిగిన యుద్ధమున, మనుమసిద్ధి సహాయపడి గెలుపుగొనినాడు. దీనితో కాకతీయ–చోళమైత్రి దృఢమైనది. ఈ మనుమసిద్ధికి వీరగండ గోపాల అని బిరుదము.

బయ్యన–విజయగండ గోపాలుడు, కంచిరాజ్యమును ఏలుచుండగా, జటావర్మ సుందర పాండ్యుడు 1260లో దండయాత్రసలిపి, విజయుని ఓడించి, నెల్లూరు చోళుల అర్థరాజ్యమును స్వాధీనము చేసికొనినాడు.

1251–57 నడుమ, ఈ సుందరుడే, నెల్లూరుపై రెండుమారులు ఎత్తివచ్చి పారిపోయి ఉన్నాడు.

## ★ తిక్కన-బయ్యనల తిరుగుబాటు; ఖడ్గతిక్కన వీరమరణము

ఇమ్మడి మనుమసిద్ధి (తిక్కయజ్వమిత్రుడు) తండ్రి-తిక్కభూపాలుని పెద్దభార్య తమ్ముడు తిక్కరాజు. ఇతడు తిక్కభూపతి కూతురును పెండ్లాడి, నెల్లూరువారి ప్రతినిధిగా కాంచీపురములో అధికారము సాగించుచుండినాడు. దీనితో ఇతనికి సింహాపురి రాజ్యస్థానమున మంచి పలుకుబడి లభించినది. దీనికిదోడు పరాక్రమశాలి గూడ. తిక్కభూపతి రెండవభార్య కొడుకే మన మనుమసిద్ధి. తిక్కరాజుకు సింహాపురి రాజ్యలక్ష్మిపై కన్ను బడినది. దీనికి కలిసికట్టుగా విజయాధిత్యుడను దూరపు చుట్టముగూడ దాయాదిపోరు లేవదీసినాడు. వీరిద్దరు, కర్ణాటకులు మొదలగు ప్రక్కరాజులతో చేతులు గలిపి, ఉమ్మడిదండుతో నెల్లూరుపై బడినారు. నెల్లూరులో పాలించుచుండిన తిక్కభూపాలుడు పరాజితుడైనాడు; కడపలో మండలాధికారిగానుండిన మనుమసిద్ధి పలాయితుడైనాడు. ఈ కల్లోలములోనే ఖడ్గతిక్కన వీరమరణము.

ఈ తిక్కన, కవి తిక్కన పెద్దనాయన-సిద్ధనపుత్రుడు. ఇది "తిక్కన-పరిహారి బయ్యనల తిరుగుబాటు" అని, 1249 లో జరిగినదని ఓరుగల్లు గణపతిదేవుని శాసనము చెప్పుచున్నది. ఈ తిరుగుబాటుచేసిన తిక్కన మనకు దెలిసిన మనుమసిద్ధి పెద్దమ్మ తమ్ముడే! వ్రేలువిడిచిన మేనమామగూడ. పరిహారి అంటే-ద్వారపాలకుడు. తిక్కరాజు, తిక్కభూపతి అంతఃపురసేవకుడైన బయ్యనను లోగట్టుకొని, చంపించుటకు కుట్రబన్ని యీ తిరుగుబాటును లేవదీసియుండును.

## ★ కాటమరాజు కథ

కాటమరాజు కటియావుల రాజు అనే ఆయనకు, మనుమసిద్ధికి, ఆవుల పులవరివిషయమై ఒప్పమిపుట్టి, చివరికి యీ వివాదము పెద్ద యుద్ధముక్రిందికి దిగినది. ఆ యుద్ధమందు (పెనుబల్ల చెరువు) ఖడ్గతిక్కన మొదట ఓడి, ఇల్లుచేరుట, వీరపత్ని చానమ్మ చేసిన

గెలిక మగసిరిపొంగి మరల యుద్ధభూమికి వెడలి వీరస్వర్గ మలంక రించుట–అనునది అతి వ్యాప్తమైయున్న కథ.

ఇట్టి వీరగాథలు (Ballads) బయకారములు (Musical Compositions) ద్విపదలో రచింపబడి, మాలదాసరులు, జంగమదేవరలు, బైనాటివారు మొదలగువారికి బాగా నోటికివచ్చి, పల్లెల చవికెలలో, చావళ్లలో పాడబడి, వినిన గ్రామీణుల నెత్తురు వేడి ఎక్కించి, కండలు కదలించేవి. పల్నాటియుద్ధము, బొబ్బిలియుద్ధము చిన్నమ్మ–లక్ష్మమ్మ–కామమ్మ కథలు, దేశింగరాజు కథ–(దీనిని వ్రాసినది నెల్లూరువాస్తవ్యుడు–జంగము వీరయ్యదేవర) మొదలగు వీరగాథలు ఇందు ముఖ్యములు. భారత రామాయణాదులుగూడ మంజరీద్విపద–రగడ మొదలగు ఛందములలో ప్రచారములో నున్నవి. ఇవివిని, సీతమ్మకష్టాలకు కంట తడిబెట్టని తెనుగువారు లేదు. ఇదంతా సినిమాలకు ముందు జానపదుల మురిపించిన మంచిదినాల ముచ్చట.

ఇట్టి మంజీరద్విపద వీరగాథయే ఈ కాటమరాజు కథ. ఇది ఎంత ప్రచారమునకు వచ్చినదంటే–"రామాండ కతలెల్ల మేమెరుంగని పనే? కాటమరాజుకు కర్ణుడోడె" అని వేణుగోపాలశతకము పండిత బ్రువులను ఎగతాళి పట్టించుచున్నది.

ఇది ఇంతటి ప్రాణమున్న రచన అయినా చరిత్రకు సంబంధించినట్లు లేదు. మనుమసిద్ధికి మొదలే సంబంధము లేనిది. దీనిని రచించిన లోకకవి–గంగుల యెల్లయ్యకొడుకు, పిన యెల్లయ్య. ఈ జంగమకత (బుఱ్ఱకథ) ఇంతటిప్రచారమునకు వచ్చుటకు, ఈ కవి వీర్యవంతమైన జీవకవిత్వమే కారణము.

ఈ కావ్యములో, నెల్లూరురాజు పల్లవ నల్లసిద్ధి అని ఉన్నది. ఈ నల్లసిద్ధి చోళుడుగాని పల్లవుడుగాదు. ఆవులు మేసిన బీడులు కనిగిరికి ఆవల, నల్లమల అడవులు, అందుచేత అప్పటి నెల్లూరుసీమను నల్లమల తాకదు. నల్లమల కర్నూలుప్రాంతము. ఇదే తూర్పుకనుమలకు కడప మండలమున ఎఱ్ఱమల అని (అహోబిలమున్న కొండలు) నెల్లూరు

జిల్లాలో వెలిగొండలని (పెంచలుకోన) పేర్లు. ఇంతేగాక ఈ కథ 1630 తర్వాత వ్రాయబడినట్లు క్రిందిచరణములు చెప్పుచున్నవి :

ప్రళయకావేరి మైలాపురంబు గల్పి
భీమున బోర, నది మట్టుపెట్ట తంఢ్రి
పేర.........విభూతి............
నలవరచె చెన్నపట్టణమయ్యె నృపతి.

దీనివల్ల కథ ఎప్పటిదైనా వ్రాతమాత్రం ఆంగ్లేయుల భారతదేశ ప్రవేశానంతరమేనని తేలుచున్నది.

తిక్కన బయ్యనల తిరుగుబాటు జరిగినతర్వాత దీనిని ఏదో ఒక పేదరాజు పెద్దమ్మ చెప్పిన కథగా నిర్ణయింపవచ్చును. అయితే నేమి? ఈ రచన ఆంధ్ర జానపదగేయ వాఙ్మయములో కండ ఊపిరి కలిగినది.

తిక్కన బయ్యనల బెడదను తప్పించుకొనుటకుగా, తమ పూర్వపరిచయమే దారిబత్తెముగా మహాకవి తిక్కన, తన యువరాజు-చెలికాడు మనుమసిద్ధికొరకు ఏకశిలానగరము వెడలినాడు. ఆనాటిదారి ఏలేశ్వరముమీదుగా సాగినది. ఏలేశ్వరము, నాగార్జునకొండకు ఉత్తరాన, కృష్ణకు ఆవలిఒడ్డునఉన్న పురాతనమైన, శిథిలత గన్న పట్టణము. ఇచట చారిత్రక పరిశోధకఖననములు జరుగుచున్నవి. ఇక్కడ దొరికిన ఒక శిలాశాసనములో మనుమసిద్ధి ఆ త్రోవన ఓరుగంటికి పోయినట్లున్నది. బహుశః ఇద్దరూ పోయి ఉందురేమో? మనుమసిద్ధి, నాగార్జునకొండలోయలో దక్షిణపు మొగదలలో నేడు ఉద్ధరింపబడియున్న రంగనాథాలయమును నిర్మించినాడు.

ఇంతలోపలనే, మనుమసిద్ధితండ్రి-తిక్కభూపతి మరణించినాడు. అచట గణపతిదేవుడు కవిబ్రహ్మకు గొప్పగా గౌరవములు జరిపి, స్వయముగా సేనల నడిపించుకొనివచ్చి, వెలనాటి చోళరాజులు మొదలగువారిని నిర్జించి, మనుమసిద్ధిని సింహపురీ సింహాసనారూఢునిగా జేసి, గౌరవింపబడినాడు (1249) కవి నడిపిన ఇట్టి రాజకీయ

దాత్త్యము ప్రపంచచరిత్రలో అరుదేమో! ఈ విప్లవయుద్ధములో మనుమసిద్ధియే విజృంభించి, తనకు ద్రోహముచేసిన విజయాదిత్యుని స్వయముగా సంహరించి కసి దీర్చుకొనినాడు.

★ మనుమసిద్ధి రణమరణము

జటావర్మ సుందరపాండ్యుడు రాజరాజచోళు డంతటివాడు. కృష్ణదేవరాయలదాక, ఆమధ్య అంతటివిజేత లేడు. "సమస్త జగ ధార-హేమాచ్ఛాదనరాజ (దేవాలయ విమానములకు బంగారునీరు తొడుపులు వేయించినవాడు) మహారాజాధి రాజశ్రీ పరమేశ్వర-మరకత పృథ్వీభృ త్కాంచీపురం కొండాళ్ (జయించినవాడు) రాజతపన-కర్ణాటక లక్ష్మీబంధన నాటకకులతిలక-సర్వజ్ఞ ఖడ్గమల్ల-కవీశ్వరభామ-సాహిత్యరత్నాకర" మొదలగునవి ఈ పాండ్యుని బిరుదావళిలో కొన్ని.

ఇతనికి నెల్లూరుపై కన్ను 1251 నుండియే ఉన్నది. 1260 లో మరల పెద్దఎత్తున తన తమ్ములసహాయంతో ఎత్తివచ్చినాడు. మొదట కంచిని పట్టుకొని, మనుమసిద్ధి బంధువు - విజయగండగోపాలుని పార ద్రోలినాడు. ఆవల తనసైన్యమును రెండుగా చీల్చి, ఒకదానిని కడప మీదుగా త్రిపురాంతకముచేర్చి, అచట కాకతీయసైన్యమును ఓడించినాడు. తాను స్వయంగా, సముద్రంమీద నెల్లూరుకు, ఆగ్నే యమునన్న కండ్లేటి ముఖద్వారం ప్రవేశించి, ముత్తుకూరుయుద్ధ ములో నెల్లూరుసైన్యముల ఓడించి, మనుమసిద్ధిని వీరస్వర్గ మలంక రింపజేసినాడు. (1263).

ఓరుగంటి గణపతి 1261 లోనే దివంగతుడైనాడు. తిక్కన సోమయాజి 1258 (సెప్టెంబరు)లో, కాళయుక్తి భాద్రపదమున బ్రహ్మమును చేరినాడు.* ఇక నెల్లూరు రాజ్యలక్ష్మికి దిక్కెవరు?

---

* క. అంబర రవి శశి శాకా
బ్దంబులు చన, గాళయుక్తి భాద్రపదపు మా

జటావర్మ, విజయోత్సవముతో సింహపురము ప్రవేశించి, చిత్తరిమేల్ విణ్ణగరు (=శ్రీ వైకుంఠము; నేటి రంగనాయకులపేట) నందు, తిరుప్పాలకడలి (=క్షీరసాగరము; దేవళము) యందు, పళ్లి కొండు పెరుమాళ్లు (=శయన నారాయణ; ఇప్పటి తల్పగిరి రంగనాథ స్వామి)కు కైంకర్యము చేసి, మాన్యములిచ్చి, మండపములో వీరాభిషేకము చేసికొనినాడు. తిరిగిపోయి కంచిలో రెండవ వీరాభిషేకము చేసినాడు. అనగా, సింహపురిరాజ్యరాజధానులు రెంటియందును అభిషేకింపబడినాడు.

తిక్కన నవనవోన్మీలనముతో తెనుగుకవితను వెలయింపజేయుచుండిన, ఆ కవితాకన్య పెండ్లిసమయములో, నెల్లూరు మండలమున రాజభాషగా తమిళము ప్రచారములో ఉండినట్లు శాసనములు తెలుపుచున్నవి. అవును! తమిళగం నడిబొడ్డున-తంజావూరు, ఒరయూరు, సింజి (జెంజి) మధుర, పుదుకోట్టలందు తెనుగుగడ్డలు రూపొంది, ఆంధ్రవాఙ్మయమును ప్రోదిచేసిన విధమేగదా ఇది! తిక్కనకు తమిళముగూడ వచ్చియుండవలెను, కాని దీనికి ఆధారములు దొరుకలేదు.

---

## ౨, తిక్కన జన్మాదికములు-ఒక కొంత

### ★ వంశము

కవికేతన చెప్పినట్లు "అనితర గమ్యవాఙ్మయ మహార్ణవ కర్ణధారి, కళావిదుడు, పరహితార్థి" అయిన తిక్కన కొట్టరువు కొమ్మన-నెల్లూరు ఆడబడుచు, అన్నమ్మకు, కారణజన్ముడై, రాజకీయ మతవాఙ్మయప్రపంచమున ధర్మసంస్థాపనార్థము పుట్టిన పూర్ణపురుషుడు-ఈ బ్రాహ్మణుడు.

---

సంబున, నంబరమణి బిం
బం బనదగు తిక్కయజ్వ బ్రహ్మముచేరెన్.

1913 కాళయుక్తి, మరల 1978లో తగులును. వెనుకబడిపోయిన యీ కాళయుక్తి సరిగా 1258కి సరిపోవుచున్నది.

తిక్కనతాత-మూవెన, 1127 ప్రాంతాన, గుంటూరు సత్తెనపల్లి పరిసరములందు వెలనాటిచోళుల శుల్కాధికారిగా పని చేసినాడు. మూవెనకొడుకు కేతన. ఈ కేతన ముగ్గురికొడుకులలో నడిమివాడు భాస్కరుడు. ఈయనే "సాహిత్యవిద్యా పారీణుడు"-తెనుగులో రామాయణము వ్రాసిన మొదటివాడు. కవి తిక్కన పితామహుడైన యీయన గుంటూరు విభుడైనాడు.

అప్పుడు వెలనాటిచోళుల ప్రాభవము తరిగి, నెల్లూరుచోళుల అధికారము పెరుగుచుండినది. రాజ్యాధికారము చవిచూచిన, భాస్కరుని నలుగురి కొడుకులలో ముగ్గురు, రాజాశ్రయముకొరకు నెల్లూరు తిక్కభూపాలుని ఆస్థానమును చేరినారు. వీరు:- కేతన, మల్లన, సిద్దన. "సారకవితాభిరాముడైన" భాస్కరునిపేరు, "కవిసార్వభౌముడు" అని పేర్గాంచిన తిక్కభూపాలుని నెల్లూరు కొలువుకూటములో మారుమ్రోగియే యుండెనది. అందులో, కేతన "నవరసభావ భావుకుడు" ఇక సహృదయుడైన ఆ రాజు చాచినబారలతో కేతనను ఆహ్వానము చేసియుండడా? మల్లనగూడ ఆ దివాణములో చేరుకొనినాడు. ఈయన తనకొడుకుకు, తిక్కభూపతి తండ్రి-మనుమసిద్ధి పేరునే పెట్టుకొని నెనరు చూపినాడు.

మూడవవాడైన సిద్దన "సామాద్యుపాయపారగుడు-ఉదారనృపనీతి బృహస్పతి" అగుటచే పాలనాశాఖలో ప్రవేశించి ఆప్తమంత్రి అయినాడు. ఈ సిద్ధనపుత్రుడే "గంధవారణ" బిరుదాంకితుడు-ఖడ్గతిక్కన. ఈ శూరుని *"వీరకల్లులు"-ఒకటి సోమేశ్వరాలయమున (సోమశిలదగ్గర), ఇంకొకటి, నెల్లూరు - మూలపేటలో, మూలస్థానేశ్వరస్వామివారి గాలిగోపురమునకు వెలుపల, దక్షిణపు మొత్తలో నున్నది.

ఇక భాస్కరుని నాల్గవకొమారుడు-కవి తిక్కన తండ్రి-కొమ్మన గుంటూరు విభుడుగనే, అచట ఉండిపోయినాడు. క్రమేణా

* గొప్పవీరుని ప్రతిమలు చెక్కినరాళ్లు. వీరమరణమునొందిన ప్రఖ్యాత యోధులు అనేకుల స్మృత్యంకముగా ఇవి చాలతావులందు నిలవేయబడి ఉన్నవి.

గుంటూరువారు కొట్టరువువారైనారు. కొట్టరువు అనగా, ధాన్యాగారము; బహుశః కొమ్మన రాచగాదెలపెత్తనంలో ఉండుటచే ఆ యింటిపేరు వచ్చియుండును. ఆతర్వాత యీ వంశమువారు నెల్లూరు వచ్చి పాటూరువారైనారు.

### ★ జన్మస్థానము

తిక్కన, పాతగుంటూరులోనే పుట్టినాడు, అనినదానిని, మాటవరుసకు ఒప్పుకొనినా, ఆయన పురిటిపాత్తిళ్లతో ఉయ్యాల ఉగ్గుగిన్నెతో ముక్కుపచ్చలారకముందే నెల్లూరుచేరి, పెన్నసీరు త్రాగి ప్రోదిఅయిన విజ్ఞాని అని మాత్రం అందరూ అంగీకరించవలసినదే!

కాని, నెల్లూరులోనే పుట్టియుండుననుటకు ప్రబలకారణము లున్నవి :—

అమ్మమ్మఇంట; అనగా మేనమామఇంట, ఆ ఇంటి ఆడుబిడ్డ మొదటికాన్పుచేయుట తెనుగువారికి వాలాయము. అల్లే, అన్నమ్మ నిండుచూలాలుగా, అమ్మవారింటికి నెల్లూరువచ్చి, యీ తేజోనిధిని కనియుండవచ్చును.

ఉద్యోగపాలనముకొఱకుగా, కొమ్మన గుంటూరులో ఒక బస మాత్రమే పెట్టియుండును. ఇక ఆయన బంధువులందరు నెల్లూరులో అన్నిరంగములందును పాతుకొని బలసిపోయిఉన్నారు. కాబట్టి కొమ్మనఉనికి ఎక్కువకాలము, అత్తవారింటనే అయి ఉండవలెను.

### ★ పేరు

'తిక్కన' అన్నపేరు తిరుక్కాళ (=శ్రీ కాల) శబ్దభవము. ఇది తమిళము. తిక్కన భారతము తెనుగున వ్రాసేదినాలలో, ఇచట తమిళసంప్రదాయములు బాగా అలముకొనియుండినవి. అంతేగాకుండ, నెల్లూరు రాజులపేరులలో "తిక్క" ఎక్కువగనే కాన్పించుచున్నది. అందుచేత గుంటూరువారు నెల్లూరుకు స్థానికమైన యీ పేరు పెట్టుకొనియుందరు.

1168–69 సంవత్సరమున వేయించబడిన, సన్నమూరు (పొదిలి, మూరెళ్లసీమ) శాసనమున, ఆ దానమునకు సాక్షి చేవ్రాలు చేసినది మాఊవ్వూరు తిక్కన. (Nellore District Inscriptions. Vol. III. Page 120, Butterworth & Venugopala Chetty) ఇది మా మరుపూరేమో! దీనివల్ల తిక్కన అనేపేరు నెల్లూరుమండలములో చాల ప్రాచీనకాలమునుండి వాడుకలోఉన్నట్లు తెలియుచున్నది. నెల్లూరులోపుట్టిన కవి తిక్కనకు అట్టిపేరు పెట్టియుందురు. తల్లి అన్నమ్మ పేరు ఇప్పటికిని నెల్లూరులో వినబడుచునేయున్నది.

తిక్కన మేనమామయింటనే పెంచబడినాడు. అప్పుడే మనుమసిద్ధికి యీాయన సహవాసగాడైనాడు. తిక్కన రాజపుత్రునికంటె కొంచెము పెద్ద అగుటచే ఆటలాడుకొనుచు, రాజు ఆ బ్రాహ్మణుని "మామ" అని నోరార బిలిచి, ఒకేబడిలోగూడ చదువుకొని యుందురు. కవి సార్వభౌముడు శ్రీనాథుడు, విదేశవ్యాపారి కలికివాయి బిట్రగుంట అవచి తిప్పయ్యశెట్టి ఇట్టి స్నేహమునే కలిగి యుండినారు. ఇట్టిదీ! ఆనాటి అకలుషిత సాంఘికవాతావరణము. ఈ 'మామ' అన్న పిలుపు సార్థకముగానేమో, తిక్కన తన ప్రథమ కావ్యకన్యక – నిర్వచనోత్తర రామాయణమునకు బాల్యసఖుడు–మనుమసిద్ధిరాజును కృతిభర్తగా జేసినాడు.

### ★ తిక్కన సంపద-సద్యశము

తిక్కన చుట్టపక్కములతో నెల్లూరు రాచదేవిడి నిండిపోయి ఉన్నది. మన కవి కుటుంబము పెన్నకు ఉత్తరాన, నెల్లూరుకు 5, 6 మైళ్ళలో పాటూరు గ్రామమున స్థిరవాసమేర్పరచుకొనినది. మొన్న మొన్నటివరకు వీరి వంశమువారు ఇచటనే ఉండి, ఈమధ్య యిల్లు వాకిలి పొలము అమ్ముకొని హైదరాబాదు చేరినారు. ఆ ఇల్లు–ఆ పాత బావి–వీరి కులదేవత అయిన, సిద్దేశ్వరుని ఆలయము, తగిన మర్యాదలు లేక నేడు బావురుమనుచున్నవి.

తేజోమయ అమృతాక్షముల సృష్టించిన తిక్కయజ్వ గంటమును కాపాడుచుండిన, పవిత్రీభూతమైన ఒరమాత్రము, సిద్ధేశ్వరాలయములో పూజ లందుచున్నది. దీనిని మొన్న మొన్నటివరకు ఈ వంశీకులే ఆరాధించుచుండినారు.

ఇప్పుడు పాటూరువారి వంశశాఖ ఒకటి, ఇందుకూరుపేటలో శాఖోపశాఖలై సంపదాకరముగ నున్నది. కరణంగా ఉండిన పాటూరు ఆదినారాయణయ్య కవి-పండితుడు. తిక్కన కొడుకు కొమ్మన; పౌత్రుడు హరిహరనాథుడు.

ఆనాడు తిక్కనసంసారము సంపత్పూర్ణముగ నుండినది. అది ఒక చిన్న రాచకొలువు! నిరతాన్నదానము, విద్యాదానములతో, ఒక కులపతి ఆశ్రమమువలె, ఆంధ్రదేశమందంతటా వైజ్ఞానిక ప్రభలను ప్రసరింపజేయుచుండినది. దానిని "దేవేంద్ర సమానవిభవము" అని, చూచిన కేతనాదులు వర్ణించినారు. తిక్కన శిష్యకోటి పెద్దది. విద్యార్థులకు అన్నంబెట్టి చదువు జెప్పినాడు. తన చెలికాడు-మనుమసిద్ధికి తీసిపోని రాచపోకడలతో మని, భాసించినాడు. దీనికిగా ఆనందమేగాని అసూయ ఆ రాజు మనసులో పొడచూపలేదు.

## ★ తిక్కనకవి జనాదరణము

"కవిజన రాజకీరసహకారము - కవి సరోజమార్తాండుడు - పోషిత సత్కవీంద్రుడు - పంకిత పుండరీక వన పంకజబాంధవుడు - కవీంద్రలోకాధారుడు - సుకవీంద్ర బృందరక్షకుడు -" ఇట్టివి, వేంగి నుండి వచ్చి, పాటూరులో తిక్కన చల్లటి నీడలో చేరిన, అభినవ దండి - కేతన, తిక్కన మనీషి కీర్తిమూర్తిని పూజించిన పూజా సుమములు. కేతన తన దశకుమారచరిత్రను యీ కవిబ్రహ్మకు అంకిత మిచ్చినాడు. ఈ అంకితమిచ్చే సంప్రదాయము తెనుగునాటనే, నెల్లూరుసీమలోనే పుట్టి పెరిగినట్లున్నది. ఇంతేగాదు, ఒక కవి ఇంకొక కవికి గ్రంథమును అంకిత మిచ్చుటకుగూడ ఇదే మొదలేమో! కవి తిక్కన రాజకీయదౌత్యము - కృతి భర్తృత్వములు అపూర్వములు.

ఆనాటి పాండిత్యమునకు సోమయాజి అంగీకారముద్ర, ఒక పట్టభద్రతవలె ఎన్నబడుచుండేది. అనంతామాత్యుని తాత - బయ్యనకు, తిక్కన "భవ్యభారతి" అను బిరుదమిచ్చి, సాహిత్యముద్రాధికారమును నిలుపుకొనినాడు. కాబట్టే కవిబ్రహ్మ "మిత్రోదయ జృంభిత హృదయుడు" అని జేజేలు గొనినాడు. మార్కండేయపురాణకర్త - మారన తాను ఈ మహాభాగుని శిష్యుడని చెప్పుకొని మురిసిపోయినాడు. నాచన సోమునికి తిక్కనపైగల గౌరవము ఇంతింతగాదు.

గంగాదేవి, మధురా విజయమనే తన సంస్కృత కావ్యమున, ఆంధ్రకవులలో ఒక్క తిక్కనకే అంజలి సమర్పించినది; ఇది అపూర్వము! ఈమె, నెల్లూరుమండలమున ఉదయగిరి దుర్గమునేలిన కంపరాయని భార్య.

## ★ ఓరుగంటి సందర్శనము-చారిత్రక కావ్యములు

తిక్కయజ్వ ఏకశిలానగర సందర్శనము, చారిత్రక మత సాహిత్యపరముగా అత్యంత ప్రాముఖ్యమైనది. భారతీయులు చరిత్రపై కన్నుబెట్టి దానిని ఏర్పరించక, పురాణములతో కలిపివేయుటచే చరిత్రహీనులమని వగవవలసినదేగాని, హీనచరిత్రులము మాత్రము గాము. అంతకుముందే బాణుని హర్ష చరిత్ర, (గద్యము) కల్హణుని రాజతరంగిణి (పద్యము) అను కాశ్మీర దేశచరిత్ర మొదలగునవి సంస్కృతమున వెలసియుండినవి. ఇట్లే తెనుగుసాహిత్యమునకు భిత్తి మూలము లనదగినవి రెండుగ్రంథములు పద్యరూపమున, మరియొకటి గద్యమున నున్నవి. ఈ మూడునూ కాకతీయవంశ చరిత్రలే అగుట ఇంకొక విశేషము.

మొదటిది:-ప్రతాపచరిత్ర. గద్యము. ఏకామ్రనాథ విరచితము. చరిత్రాంశములు సరిగా సూటిగా చెప్పబడిఉన్నవి.

రెండవది:-కాసె సర్వప్ప అను బ్రాహ్మణుడు వ్రాసిన శ్రీ సిద్ధేశ్వర చరిత్ర. ఇతడు 1550-60 కాలమువాడు. ఏకామ్రనాథుని వచన రచననే మంజరీద్విపదగా వ్రాసినాడు. చివరన;

ప్రతాపరుద్రుని ఉదంతము మాత్రము గద్యమున నున్నది. సిద్ధేశ్వరుడు, అనుమకొండ దేవాలయములలో, ఒక కోవెలలో వెలసిన దేవుడు.

మూడవది:—కవిసార్వభౌమ—కూచిమంచి తిమ్మకవి తమ్ముడు – తిట్టు కవిత్వపు చక్రవర్తి – జగ్గకవి వ్రాసిన సోమదేవ రాజీయము అను పద్యకావ్యము. ఇది రసవత్తర రచనము. (1700–1720) ఈ దూర్వాసుడు చంద్రలేఖావిలాసమును, విలాపము చేసినట్లు ఈ రాజీయమును రాజానలము చేయకుండుట ఆంధ్రులచరిత్ర అదృష్టము. సోమదేవుడు కాకతి వంశకర్త. కూచిమంచి, సూర్యాపేటకు ఉత్తరమున దగ్గరలోనే ఉన్నది. అందువల్ల ఈ రాజవంశచరిత్రను చేబట్టను, యీయనకు ప్రాంతీయాభిమానమే కావచ్చును. ఈ చక్కటి కావ్యమును, తణుకు నరేంద్రనాథ మండలి వారు ప్రచురించినారు.

★ తిక్కన-వైదికమత పునరుత్థానము

ఏకశిలానగర సామ్రాజ్యములో జైనబౌద్ధములు, వైదిక మతముతోబాటు ప్రక్క-ప్రక్కన ప్రబలియే యుండినవి. కాని, కొన్నిచోట్ల మైలారవీరులను వీరశైవగణము విజృంభించి, బౌద్ధ జైనులపైబడి గారియ పెట్టుచుండుటచే మతకలహములు రేగి దేవుని పేర రక్తవసంతోత్సవముల సాగించిరి. అప్పుడు ఒక మత సదస్సు జరిపి మత సామరస్యమును సాంఘికశాంతిని నెలకొల్పవలెనని గణపతి సార్వభౌముడు సంకల్పించినాడు. తదనుగుణ్యముగ ఒక పండితసభ జరుపబడినది.

ఆ సభకు ఓరుగంటికి బౌద్ధజైనపండితులు అనేకులు వచ్చినారు. కాని, వైదికమతపక్షమున వాదించుటకు, నెల్లూరునుండి ఒక్క కవి తిక్కననే పిలుచుకొనిపోయినారు. ఇది 1249 వత్సర ప్రాంతము. ఇప్పటికే తిరుక్కాలుడు సోమయాజియై భారతమును

ఆంధ్రీకరించియున్నాడు. (1245–49) సోమయాజి, కొన్నినూర్ల మంది శిష్యులు గొలువ, ఒక రాజాధిరాజవైభవములో, ఆధ్యాత్మిక సాహిత్యప్రభలతో ఆంధ్రనగరు చేరినాడు. జగ్గకవి వర్ణించిన తీరు చూడండి (సోమదేవరాజీయము).

గీ. ...............

...............

"చోటి కొకనాడు తిక్కన సోమయాజి

వచ్చె నెల్లూరునుండి భూవరునికడకు.

సీ. వచ్చిన, యయ్యార్యవర్యు నెదుర్కొని

వినయ సంభ్రమభక్తి నినుమడింప,

నతిథి పూజలొనర్చి, యతనిచే భారతా

ర్థమును, ద్వైతాద్వైత తత్త్వములను,

విశ్రుత చిదచిద్వివేక లక్షణములను

బ్రకట ధర్మాధర్మ పద్ధతులును,

రాజనీతి ప్రకారంబును, భారతవీరుల

మహిమంబు వినుచునుండి,

యనుమకొండ నివాసులైనట్టి బౌద్ధ

జనుల రావించి, అంత తిక్కన మనీషి

తోడ వాదింపజేసిన, తొడరి వారి

జులకనగా సోమయాజులు గెలుచుటయును."

దీనితోగూడ ఆ రెండుమతములవారు దేశమును వదలిపోయిరి. మిగిలినవారు వైదికాచార సంపన్నులైనారు. బౌద్ధజైనాలయములు కూలద్రోయించబడినవి.

"దేవరాజు సోమయాజుల పటువాక్యశక్తికి మెచ్చి, యతని బహుప్రకారంబుల పూజించి, యెనిమిది గ్రామంబు లొసంగి, యతడు వచ్చినకార్యం బడిగిన..."

తనప్రభువు మనుమసిద్ధికిగలిగిన అక్కన (తిక్కన) బయ్యనల పోరుసంగతిజెప్పి సహాయమడిగెను.

"అట్లకాక యనుచు.........
......యప్పు డొక్క నవరత్నధనమును
యజ్ఞ ఖండలములు నతనికిచ్చె."

తర్వాత గణపతి ససైన్యముగ నెల్లూరుకు బయలుదేరి, మనుమసిద్ధిని పునరభిషిక్తుని జేసిరి.

ఇక, ఈ విషయమునే కాసె సర్వప్ప సిద్ధేశ్వరచరిత్ర ఇట్లు వర్ణించుచున్నది :—

"ఆరీతి గణపతి నటుజూచు వేడ్క
దిక్కున సోముడు నక్కడే తెంచె.
నొక్కొక్క పండితుల్ వక్కలాకులను
జక్కని తాంబూల (సమితులతోడ)
నొక్క పెట్టున రాగ నక్కజంబుగను
దిక్కుదిక్కులనుండి వెడలి విద్యార్థు
లక్కడ నక్కడ కావ్య శ్లోకార్థ
మొక్కొక్క విధమున నొగి వినిపించి,
జక్కన వినుచును, మిక్కి అందలము
నెక్కి తిక్కన సోము డక్కడే తెంచె.
నారీతిగా సోమయాజులరాక
వారక తా ఫణిహారు లేర్పరుప
గణపతి మహారాజుగా రెదుర్కొనిరి.

...............

భారత శాస్త్ర ప్రవీణాగ్రగణ్యు
డారీతి వేదశాస్త్రాభ్యాసవిదుడు
చాల విద్యావిద్య (?) జాలంబులెల్ల
పాలు నీ రేర్పరుప (గల) హంసుండు
నట్టి మహాత్ముని నా సోమయాజి
నెట్టన నెదురేగి నేర్పుగా రాజు
తెచ్చి యర్ఘ్యాసన స్థితుని జేసి;

...............

పూజించి యందర పూర్వోక్తముగను

యోజించి శాస్త్రంబు లోక కొన్ని వినుచు,
గొన్ని దినంబులు మన్నన నుండె.
తిక్కన సోమయాజులు నక్కజముగ
పెక్కులుగా జెప్ప నొక్కొక్క యర్థ (?)
ద్వైత మద్వైత ము త్త(మ) జీవ దైవ
మతి; చిద్వివేకములగు ధర్మ మర్మ
మగు రాజనీతియు నట, బురాతనుల
కగు భారతాఖ్యాన మా వీరవరులు
తగజేయు యుద్ధ ప్రకార పర్వములు
వినియు సంతోషించె......
అట నన్మకొండలో నతి బౌద్ధమతము
ఘటనగా వాదంబు గావలె ననుచు,
బౌద్ధులు తమ మత ప్రావీణ్యశాస్త్ర
వృద్ధులు పాపసమృద్ధులు వేదవి
రుద్ధులు వాద సమృద్ధులు, జైన
బౌద్ధుల బిలిపించి, పట్టి వాదించి
యోడించె శాస్త్రార్థ పోడిమిగాగ!
...............
ఆరీతి నోడించి, యా వసదులెల్ల
గూలద్రోయించియు, గూడ నా దైవ
ముల, నా మతమంతయు మునుముట్ట నడిచి
నామంబు అణచియు, సీమ వెళ్ళగను
దోమలుగాజేసి తోలె వెళ్ళగను,
ముప్పదాఱైనట్టి మునిజైన వసతు
లొప్పగా గూలద్రోయించి, నరికించె
యందర జైనుల.........
సోమయాజులవారు సురుచిరోద్దండ
భీమపరాక్రమ బిరుదులొప్పార..."

అంతట మెచ్చి సమ్మానించుట, నెల్లూరుకు సైన్యమంపుట వర్ణితమై యున్నది. జైనులను దోమలవలె తోలుట సోమయాజి పనియే గాని,

వారిని చంపించుట మైలారువీరుల పనియైయుండును. ఇట్టి మతస్థాపన గౌరవము ఆంధ్రకవులలో మరి ఎవ్వరికిని లేదు. ఇతరకవులు తమకు చేసిన సమ్మానముల సొంతము చేసికొనిరి. కాబట్టే తిక్కనను పూర్ణ పురుషుడని కేతన వర్ణించినాడు.

తిక్కన మనీషీ గావించిన ఆంధ్రనగరీసందర్శనమును, ఆ ఓరుగంటి కవులు, రాచకీయవాదులు, మతాభిమానులు ఒక మహాసంఘటనగాభావించి నేటికిని మథులగుచున్నారు. శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు 1942 సంచికట్లలో ఇట్లు ఒక రమ్యగీతము నాలపించినారు:-(పచ్చతోరణము-ఓరుగల్లు.)

"తిక్కనామాత్యుండు, తెనుగుదేశపురాజు
కలిసి మాటాడిన కొలువిదేమొ!"
"అల్లని స్వేచ్ఛకై నెల్లూరి నెఱజాణ
పరియించె నిచటనే భారతంబు."

రామానుజరావుగారు న్యాయశాస్త్ర పట్టభద్రులు. మంచి వ్రాతగాడు. కార్యభారనిర్వహణధురీణుడు. హైదరాబాదునందలి సాహిత్యసంస్థ "ఆంధ్రసారస్వత పరిషత్తు" ఈయన చేయివాసితో పెరిగి పెద్దఅయినది. వీరే ఈ సాహిత్య అకాడమీ కార్యదర్శి.

వైదికధర్మ సంస్థాపనమునకు యీ సోమయాజి పథగాములయ్యే, ఆవల విద్యారణ్యులవారు విజయనగరసామ్రాజ్యమునకు హరిహర బుక్కరాయులచే అంకురార్పణము గావింపజేసినారు. ఆతర్వాత సమర్థ రామదాసస్వాములవారు ఛత్రపతి శివాజీ మహారాజుకు ధర్మమార్గమును చూపినారు.

ఇందు విధిక్రూర విలాసముగూడ గలదు-ఈ తిక్కన ఎలప్రాయమున నున్న ఆ దినాలలోనే, 1192 లో, ఉత్తరమున, ఆ పురాతన పుణ్యకురుక్షేత్రమునందే, తరెయిన్‌గ్రామమున (తానేశ్వరము దగ్గర) గోరీ మహమ్మదుతో యుద్ధముచేసి పృథ్వీరాజు చౌహాణుడు ఓడిపోయి, మేచ్ఛవాహినులు భారతదేశముపైబడి ముంచివేయుటకు

కలుజులు దీసినాడు. ఓరుగల్లులో మతేతరులైన స్వదేశీయులు అణగిపోయినారు; కాని, అచట-ఉత్తరాన విదేశీయులైన మతవిరోధులు విజృంభించినారు.

★ తిక్కననాటి సంఘటనలు

తిక్కనకాలమునాటికి, అటునిటుగా ప్రపంచచరిత్రలో కొన్ని ముఖ్యఘట్టములను పరికించిన తిక్కనయుగ వైశిష్ట్యము గోచరించగలదు! కరకు మంగోలుడు- జఙ్గిస్ఖాను 1214లో ఆసియాఖండపు తూర్పు చివరనుండి, హిమాలయములకు ఉత్తరముగా లక్షలాది మూకలనడపి అఫ్ఘనుస్థానముచేరి మానవరక్తముతో నేలను అసటు చేసినాడు. ఆవల ఇతనిసంతతివాడైన కుబ్లాయ్ఖాను విజృంభించినాడు (1240–60). గ్రీకులు కాఙ్స్టాంటినోపుల్ (ఇప్పటి ఇస్టఙ్బుల్) పట్టణమును పట్టుకొనినారు (1261). ఇటలీ మహాకవి, 'డివైఙ్ కామిడీ' అను మహత్తరగ్రంథకర్త-డ్యాంటె జననమందినాడు (1265). కుతుబ్షా ఢిల్లీలో ముస్లింరాజ్యమును నెలకొల్పినాడు. గంగవంశీకుడు మొదటి నరసింహుడు కోణార్కులో సూర్యదేవాలయమును (1255), రేచర్ల ఆరుద్రదేవుడు రామప్పదేవళమును (1234) లో కట్టించినారు. ప్రపంచమున ప్రజలస్వామ్యమును ప్రప్రథమముగ గుర్తించిన మాగ్నచార్ట (మహాస్వామ్యపత్రము) ఇంగ్లండురాజు ప్రజలకు అనుగ్రహించినాడు. (1215) మహామతి తిక్కనకాలములోనే పశ్చిమతీరమున ఉడిపిలో మధ్వాచార్యులవారు, తమిళ రామాయణ కర్త-మహాకవి కంబరు వెలసియుండినారు. (తాత భాస్కరుని కాలమున)

★ హరిహర నాథోపాసనము

క్షుద్రమతవైషమ్యములతో తోడివారి నెత్తురు చిందించుట- "సర్వమున్నతని దివ్యకళా మహిమంచు" చాటు వైదికమతమునకు గిట్టలేదు. అందుచేత శివకేశవులను ఒకటిచేసి పూజించు సామరస్యమతప్రకారము ఆంధ్రదేశమున 8-వ శతాబ్దమునాటికే పుట్టి ప్రబలి

నది. పల్లవరాజు–నరసింహుడు, నెల్లూరు ఉదయగిరిసీమలో, సీతారామపురమునకు ఈశాన్యమున 7, 8 మైళ్ళలోనున్న భైరవుని కోనయందు, బౌద్ధవాస్తుశిల్పము ననుసరించి, ఏడు శివలింగాలయములను, గట్టి కాశిరాతి (Granite) కొండలో మలిపించినాడు. (ఈ రమ్యమైన కోన, ఈ అపూర్వచారిత్రకసంపద, ఇప్పుడు కొత్త ఒంగోలుజిల్లాలో చేర్చబడినవి).

ఈ గుహాలయములవరుసకు ఎదురుగా, ఒక సెలఏటి ఒడ్డున ఒక పెద్ద నిడుపు చట్రాతి గేడిపాటున (నిలువుప్రక్కన) హరిహరనాథుని అర్ధమూర్తి చెక్కబడియున్నది. ఈ స్వామికి ఎనిమిదిచేతులున్నవి. ఇందు ఇద్దరుమూర్తుల ఆయుధములు ఇరుప్రక్కల అలరారుచున్నవి. ఈప్రతిమకు ఎడమతట్టు, వామపార్శ్వమునకు భంగిమమును త్రిప్పియున్న నటరాజస్వామివారి ప్రతిమగూడ గలదు. ఈ పవిత్ర శాంతి మగ్న వాతావరణములో హరిహరనాథోపాసనము ననవేసి దిక్కులకు తీగలల్లినది. "సోమభృత్భక్తిమత్తుడు – లసితహరిపదపద్మైకావాస చిత్తమధుకరము" (కేతన) అయిన తిక్కయజ్వయీ అర్చావిధానమునుగ్రహించి వ్యాపింపజేసి, "హరిహరనాథ సర్వభువనార్చిత నన్ దయజూడు మెప్పుడున్" అని ప్రార్థించినాడు (స్వర్గా–94). నాచనసోముడు ఈ కలగలుపువేల్పునే పూజించి, కృతిభర్తగా చేసినాడు. (14–వ శ.)

ఈ దేవుని ఉపాసించిన మరికొందరు ఆంధ్రకవులు:——

(౩) కొరవి గోపరాజు (15–వ శ.) సింహాసన ద్వాత్రింశిక (౪) దూబగుంట నారాయణకవి (16–వ శ.) పంచతంత్రము. (౫) బైచరాజు వెంకటనాథుడు (16–వ శ.) పంచతంత్రము (౬) కంభంపాటి నారాయణామాత్యుడు (16–వ శ.) భగవద్గీత–15–వ అధ్యాయము. (౭) తాళ్ళపాక పెద్ద తిరుమలాచార్యుడు. (౮) హరిభట్టు (16–వ శ.) నారసింహపురాణము. ఆధునికులుగూడ కొందరు గలరు.

ఈ మతము కన్నడదేశమునకుప్రాకి హరిహరనగరము కేంద్రమైనది. ఆగ్నేయ ఆసియా–జావాలో యీ మూర్తులు దొరికినవి,

ఈ వ్యాప్తికి సోమయాజి, పల్లవరాజ్యవైభవములే కారణములు. ఇట్లు ఉభయకవిమిత్రుడు శివకేశవ సామరస్య మతప్రవక్తగూడ అయినాడు.

బాదామి గుహాలలోగూడ హరిహరమూర్తులు చెక్కబడి యున్నవి. ఈ బాదామియే వాతాపి, వాతాపిపురము అనబడినవి. ఇప్పటి బీజపూరుజిల్లాలో హుబ్లి-గదగ్ రైల్వేస్టేషనులమధ్యనున్నది. ఈ గుహాలలో ఎల్లోరా, అజంతా (అజంతా) గుహాలయములలో వలెనే జైన బౌద్ధ శైవ వైష్ణవ ఆలయములు మలచబడియున్నవి.

పశ్చిమ చాళుక్యరాజు-పృథ్వీవల్లభ బిరుదాంకితుడు-మంగ లేశ్వరుడు క్రీ. శ. 578 లో చెక్కించి పూజించిన మూర్తులివి. ఇవి భైరవునికోన దేవాలయములకంటె ముందు పుట్టినవి. ఇచట హరి హరనాథవిగ్రహములు రెండుగలవు.

1. ఇరుప్రక్కల దేవులుగల హరిహరనాథుడు.

2. ఒంటరిగానున్న హరిహరనాథుడు.

రెంటికిని నాలుగేసి చేతులే.

## ★ నెల్లూరులో హరిహరనాథాలయము ఉండలేదు

నెల్లూరు పట్టణములో, ఇప్పటి రంగనాథస్వామివారి గుడి వెనుక, పరమట, పినాకిని ఉత్తరవాహిని అయిన కునిలో (మూల పులో) హరిహరనాథుని దేవళము ఉండినదని, ఆ దేవులప్రాల తిక్కన కూర్చుండి, (కుమ్మరి గురునాథుని సహాయముతో) భారతము తెనిగించినాడని, అందరినోటా నానే వినికిడి. ఇట్లే పోతనామాత్యుడు, బమ్మెరలోనో ఒంటిమిట్టలోనో శ్రీరామాలయమున కూర్చుండి భాగవతం వ్రాసినట్లు పుక్కిటిపురాణము. ఇవి రెండును నిజములు గావు. ''ఈదృశంబులగు పుణ్యప్రబంధములు దేవసన్నిధిం బ్రశం సించుచుండుటయు'' (విరా-1: 31) అనినదానినిబట్టి తిక్కన హరి హరాలయమున కూర్చుండి భారతమును వ్రాసియుండునని కొందరు, ముఖ్యముగా యితరప్రాంతములవారు తలంచుచున్నారు.

కాని, వీరనుకొనేచోట నెల్లూరులో హరిహరనాథ దేవాలయము ఎప్పుడూ ఉండలేదు. 5, 6 నూర్ల ఏండ్లవరకు, పెన్నానది, ఇప్పటి దేవళమునకు ఎగువ, రెండుగాచీలి, ఒక అంతర్వేదిని (DOAB–దొ ఆబ్ = రెండుపాయల నీళ్లు) ఏర్పరచినట్లు గట్టిగా తెలియుచున్నది. కావేరి కొలరూనుగా చీలి, శ్రీరంగమును గడ్డగా ఏర్పరచినట్లే, ఉత్తర పినాకిని, వృద్ధపినాకిని, ఇప్పటి రంగనాథస్వామి ఆలయప్రదేశమును ఏర్పరచియుండినవి. ఈ రెండుక్షేత్రములును శయన రంగనాథుల వారివే ? (పళ్ళికొండు పెరుమాళ్లు). ఇక ఆ కూడలిలో హరిహరనాథాలయ ముండుటెట్లు ? శాసనములు, దేవాలయమును తిరుప్పాలకడలి (శ్రీ దుగ్ధవారాశి) అనుటకు గూడ ఇదే కారణము కావచ్చును. మైసూరుదగ్గర శ్రీరంగపట్టణము, అచటి శయన నారాయణుడుగూడ కావేరీనదీ అంతర్వేదియందే వెలసిఉన్నాడు.

జక్కనకవి వర్ణనము యీ నెల్లూరు జనశ్రుతిని గట్టిచేయుచున్నది. విక్రమార్కచరిత్ర రచించిన జక్కన 1410 ప్రాంతమువాడు. ఈయనతాత–పెద్దయామాత్యుని కాలమునుండి (1279) యీ కవివంశమునకు నెల్లూరుసీమతో సంబంధమున్నది.

తిక్కన మనుమసిద్ధి కొడుకు, రెండవ తిక్కరాజు జక్కన తాతను ఆదరించి యుండినాడు. జక్కన కవిసార్వభౌముడు–శ్రీనాథుని కాలమునాటివాడు. మల్లినాథసూరి యీ అదనుననే వ్యాఖ్యానములు వ్రాయుచుండినాడు.

విక్రమార్కచరిత్రలో ఒక నెల్లూరు నెఱజాణకథను వ్రాయుచు (ఆ–7 : 132, 133, 134) స్త్రీలు పాపములకు మూలమనుటకు ఒక కీరము చెప్పిన కథాఘట్టము.

"...సముద్ర సౌధాగ్రతల సమగ్ర
శాతకుంభ మహాకుంభ జాతగుంభ
భోరురత్న వినూత్న శృంగారమగు
సిరులనొప్పారు విక్రమ సింహపురము."

దానిని పాలించే ప్రతాపమకుటుడనే——

"...రాజేంద్రుని నందన యా రూఢస్మరవికార యౌవన లక్ష్మి గౌరవనిధి, సకలకళాపారీణ, విలాసవతి" అవును! నెఱజాణే.

ఈ తండ్రి, పాటలీపుత్ర రాజు-సుధర్ముని పిలిపించి కూతురునిచ్చి పెండ్లి చేసినాడు. ఆమె ఒకనాడు చెలులతో గూడి అంగజారాధ చేయుచు, ఆమె కేలు మొగిచి "జలపక్షి పక్షపటలీ సంఛన్నకుం బెన్న కున్" జయకార మొనరించెను. ఆవల ఆమె ఒక విప్రునితో కల యును లెండి; అదెందుకు మనకు? ఇచట—

"అమృతసాగర విభుని యర్ధాంగలక్ష్మి
యిందుధరునిల్లు పుట్టిన యిల్లుగాగ
నెగడెడు పినాకినీతటినీ వధూటి
పట్టణాంతరసీమ జూపట్టుటయును."

అని వర్ణించినాడు. నదులు గతులుమార్చుట, అంతర్వాహినులగుట ఎరిగినదే గదా. ఈ దక్షిణపు పెన్న పాయ ఆవల క్రమేణా పూడి పోయినది. ఈ పాత చీలిక, ఇప్పటి రంగనాయకులపేట చిత్రకూటము మీదుగా, జేమ్సుగార్డను, ఉదయగిరివారితోట (ఇప్పటి లక్ష్మి పురము) నవాబుపేట నవలాకుతోటలు (9 లక్షల చెట్లుండినవట) మీదుగా, ఇందుకూరుపేట మడుగులు అడుగుగా పారి, ఉత్తరముఖమై ఊటుకూరుదగ్గర సముద్రంలో గలసినదని, ఈ ప్రాంతమును వృద్ధ పినాకిని అని ప్రజలు సహేతుకముగనే ఇప్పటికిని అంటున్నారు.

ఇం తెందుకు? తిక్కనయే "ఏను విన్నపంబు సేయు తెఱం గుగా నంతః సన్నిధిని గలిగించుకొని, యిమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు చేసెద (విరా-1: 37) అని చెప్పుచుండ, గుడిసంగతి మన కేల? రాజభవనసదృశమైన సొంతయింటనే యీ మహోజ్జ్వలకృతి నిర్మింపబడినది. ఇట్లే బమ్మెర పోతనగూడ "రాముని సన్నిధాన మును సంకల్పించుకొని" భాగవతమును వ్రాసినట్లు చెప్పుకొని యున్నాడు.

తిక్కన సోమయాజి, ఓరుగంటి కొలువుకు పోవుటకుముందే 1246–1249 నడుమ, భారతాంధ్రీకరణమును పూర్తిజేసియున్నాడు. ఈయన నిర్యాణము 1258 లో (కాశయుక్తి).

## ★ ఆంధ్రభారత ప్రశస్తి

తెనుగువారికి శ్రీరాముడు కులదైవము. రామమందిరములేని ఊరుగాని, రామునిపటములేని ఇల్లుగాని తెనుగునాట లేవు. భద్రాద్రి సీతమ్మ వీరి అమ్మ. ఇట్లయ్యు, ఆంధ్రదేశములో ఆంధ్రభారతమున కున్న కీర్తివ్యాప్తి, దానిపైగల గౌరవము ప్రీతి రామాయణమునకు లేవు. భారతదేశమందంతటా రామాయణమే పారాయణగ్రంథము. ఆంధ్రలో ఈ కీర్తికి కవిత్రయమువారి ప్రజ్ఞయే కారణము. వారి కవితాశక్తియే దీనిని నడిపించుచున్నది.

## ★ ద్విపద భారతము

ఈ గౌరవమును పాటించే, ఇంకొక కవిత్రయము, ఆది త్రయ భారతమును అనుసరించి, భారతమును ద్విపదలో వెలయించినది. ఈ ముగ్గురిని కనిపెంచిన గౌరవము నెల్లూరుమండలమునకే దక్కినది. వీరు, ఆత్మకూరు తాలూకా బట్టెపాటిగ్రామ పరిసరములవారు. క్రీ. శ. 1500 ప్రాంతమువారు.

తిమ్మయ మొదటి 6 పర్వములు.
బాలసరస్వతి సభాపర్వము ఒక్కదానిని,
సోమన చివరి 11 పర్వములు వ్రాసినారు,

తిమ్మయ, విరాటపర్వమును, పంటకులావతంసుడు –జంగాల ముమ్మయరెడ్డికి అంకితమిచ్చినాడు. ఇట్టిదీ నెల్లూరువారికి భారతముపై గల మక్కువ. (ఇది ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారి ప్రచురణము.)

## ★ కావలి వెంకటరామస్వామి ఇంగ్లీషుచరిత్రలో తిక్కన

ఇంగ్లీషులో మొట్టమొదటిసారిగా ఆంధ్రకవులనుగూర్చి వ్రాసినది ఆంధ్రుడు–కావలి వెంకటరామస్వామి (1765–1840). తాను

వ్రాసిన దక్కనుకవుల చరిత్రలో 47 మంది ఆంధ్రకవుల జీవితాంశముల పేర్కొనియున్నాడు. (1829) ఈ కావలిసోదరులు నలుగురు. వీరిలో బొర్రయ్య, లక్ష్మయ్య, రామస్వామి-కాలిన్ మెకంజీగారిక్రింద పనిచేసి, వారి మెప్పులంది కైఫీయత్తులను సేకరించిరి. రామస్వామి విశ్వగుణాదర్శమను సంస్కృతకావ్యమును దీనికిముందే ఆంగ్లములోనికి అనువదించినాడు. చాల పలుకుబడికలిగిన ఇతడు కలకత్తాలో లిటరరీ అన్టిక్వేరియన్ డిపార్టుమెంటులో అనువాదపండితుడుగా పనిచేసినాడు. గవర్నర్ జనరల్- విలియం బెన్టిక్ ప్రభువుకే ఈ కవుల చరిత్రను అంకితముచేసినాడు. రామస్వామి రామరాజభూషణుని వసుచరిత్రనుగూడ ఇంగ్లీషులోనికి అనువదించినాడు. మూడు భాషలలోనికి ఎక్కిన (ఇంగ్లీషు-సంస్కృతము-తమిళము) తెనుగు గ్రంథము ఇదొక్కటే!

కావలి రామస్వామి తిక్కననుగూర్చినదానిని ఉన్నది ఉన్నట్లుగానే పొందుపరచుచున్నాడు. భారతీయుడువ్రాసిన ఆనాటి ఇంగ్లీషు-స్పెలింగులు గమనించదగియున్నవి :—

## TEKKANA SOMAYAGI

This was a famous historian and poet, and a native of a village called Pature, in the Nellore district, he flourished in the twelfth century of Salivahana. When he was very young, he studied Sanscrit and Telugu under Kavi Rakshasa, and in a short time made very rapid progress in those languages. At the desire of Mania Sidharajee, he undertook to translate the Mahabharat into Telugu, and completed fifteen volumes in a comparatively short space of time, he was possessed of a quick genius and a ready talent at versification, in addition to a critical knowledge of the Sanscrit language. For this performance he obtained the grant of an extensive tract of land from the king, the greater part of the produce of which he expended in sacrifices; these religious acts

procured for him the appellation of Tekkana Somayagi. This poet died universally lamented.

*Cavelly Venkata Ramaswamie.*

★ కవిత్రయ భారతము - తమిళానువాదము

కవిత్రయభారతమును ద్విపదచేసినట్లే. సుబ్బరామదీక్షితులు దీనినే తమిళములోనికి వచనముగా అనువదించి ముద్రించినాడు. సుబ్బరామదీక్షితులు ఎట్టియాపురం సంస్థానపండితుడు. ఆంధ్రాంగ్ల ద్రావిడభాషలలో పండితుడైన ఆ సంస్థానాధీశుడు-ఎట్టియప్ప జగదీశ్వర రామకుమార్ ఆదరముచే యీ కార్యము నెరవేరినది. ఈ ఆస్థానమునందే తమిళ జాతీయకవి-సుబ్రహ్మణ్యభారతి, ఆయన గురుతుల్యుడు అన్నామలై రెడ్డి వెలసియుండినారు. ఈ రెడ్డిగారే తమిళములో లోకప్రియత గాంచిన "ఆండి పండారం" అను కావడి చిందును వ్రాసినవాడు.

### 3. తిక్కన కవితాసౌరభము

★ ఆంధ్రావళి మోదమును పొరయుట

సర్వశాస్త్రముల, సాహిత్యశాఖల పరపు లోతు కనుగొనిన తిక్కన మఖి "ఆంధ్రావళి మోదముఁ బొరయు" భారతము తెనుగు చేసినట్లు ప్రతిన! అంటే-ఆనాటి తెనుగువారికి, సర్వసామాన్యంగా అర్థమయ్యేటట్లు, వాడుకలోనుండిన జాను తెనుగనే వాడినాడు అనుట! తెనుగులో ఇది రెండవకృతియో మూడవగ్రంథమో; అంత వరకు మతము సంఘము రాజకీయము అన్నీ సంస్కృతమునందే సాగుచుండినవి. పురాణాదులు సంస్కృతమున చదువబడి తెనుగున చెప్పబడుచుండినవి. "మంత్రముతోబాటు భాషయు బ్రాహ్మణాధీనమై యుండినది", ఇక తెనుగుసేత అనగా, డు-ము-వు లుగా మార్చుటే కాకూడదు గదా. అందుకనే తేటతేనె తెనుగున, వైదికమత పునరుద్ధరణముకొరకు, అందరికీ తెలిసేటట్లు – సంస్కృతపండితునితో అగత్యములేకుండ, అందరూ చదువుకొనేటట్లు పంచమవేదమైన

భారతమును, తిక్కన తెనుగుజేసి ఆంధ్రావళికి మోదము కలిగించి నాడు మన ప్రాచీనకవులు ముఖ్యముగా పోతన, కన్నడ పంపడు తమనాటి వాడుకభాషనే ఉపయోగించినారు. కాని ఇప్పటివారు కొందరు పెంపును ప్రాదనమును వలదనుటచే భాషాభివృద్ధి గిటక బారి పోగలదు. ఈ తెనుగుసేత బుద్ధుడు పాళీలో ధర్మప్రచారము చేయుట వంటిదే!

ఇక, ఆనాటి తిక్కన తెనుగు ఈనాడు అందరికి తెలియక పోయినదానికి కారణం – ఆ వాడుకభాష మారిపోవుటే. దేశీయ నానుడులు మాటలు నుడికారములు మొదట సంస్కృతమునకు, ఆవల ఉరుదూ పారశీకములకు, ఈవల ఇంగ్లీషుకు చోటిచ్చి, అవి పాతపుస్తకములలో నక్కినిపోయినవి. ఇప్పటికిని యీ భాష నెల్లూరుపల్లెలలో చాలవరకు వాడుకలో గలదు. ఇప్పటి పెద్ద వారు వారు పోయినచో, దాని అంతే బట్టదు. అప్పుడు నిఘంటువులే శర ణ్యము కాగలవు. పూర్తిగా భాష మారినదంతా–పట్టణములలోను, పాశ్చాత్య విద్యాధికులలోనుమాత్రమే. పల్లెలలోనికి వ్రేళ్లుపారని కేవల పుస్తక భాషాపండితులకు ఇది అర్థము కానిదిగనే ఉండిపో గలదు. అప్పుడు దిద్దివ్రాతుమనుదొరలు బయలుదేరుదురేమో!

కొందరు, "తిక్కన నెల్లూరు తెనుగుబెట్టి భారతమును పాడు చేసినాడు" అని అనిరట. దానికి ప్రత్యుత్తరముగా కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రులవారు "కాదు కాదు; గుడికట్టి పాడి చేసి నాడు" అని చమత్కరించిరి.

తిక్కన కవిత్వములో ఉన్న విశేషమంతా, ఆయన వాగ్వై ఖరియందే! ఆయన దొరకవితావేశము! ఇంగితమెరిగిన ఆయన విశాలహృదయ సరోవరములో రేగిన భావతరంగములకు, అనువైన కమనీయ జీవపదము దొర్లివచ్చి, విషయమునకు క్రొత్త చెన్నువన్నె లతో ప్రాణముబోసి మన కండ్లఎదుట ప్రకటితముగ జేయును. సంఘటనకు దగినభాష ఉక్తి వైచిత్ర్యముతో పొరలివచ్చును. పద ప్రయోగౌచిత్యము పదగౌరవము పాత్రపోషణము ఆయన కవితా

లక్ష్మికి ఎనలేని సొమ్ములు. కాబట్టే శ్రీనాథకవి సార్వభౌముడు "రసాభ్యుచిత బంధము" ఆయన తీరు అని మర్మమెరిగి చెప్పినాడు. భావము సామాన్యమైనది కావచ్చును; కాని ఆయన దానిని అలంకరించిన భాషలోనే జీవము సౌభాగ్యము సౌందర్యము నవ్యత వెల్లువ బెట్టును. ఈ కళలో, ఆంగ్లమహాకవి షేక్స్పియరు ఆరి తేరినవాడని, ఆ పెడకట్టె – బెర్నార్డుషాగూడ చెప్పుచున్నారు. ఇదేగదా కవికుల గురువు కాళిదాసుని విభూతి.

సోమయాజి నవరసములను నవకముతో ఒప్పించగలడు. ప్రణయమెంతో ప్రళయముగూడ అంతే ఆయనకు; కాని వెంటిసీ వెగటు బుట్టింపడు. కాబట్టే ఏళ్లూట ఇరవై ఏండ్లు గడచినా, ఆంధ్ర వాఙ్మయప్రపంచమున ప్రాగల్భ్యముతో జాతీయకవియై మన్ననలు బొందుచున్నాడు. కవిత్వమును శిల్పమనినది ఈ కళావేది, ఈ లోక కవియే! ఈయన ప్రపంచమహాకవులతో, భుజము లొరచుకొని, ఒకే బంతిన కూర్చుండగలిగిన సార్వలౌకిక మహాకవి. ముఖ్యంగా తిక్కన కవితాక్షేత్రము శాంతిపర్వలో, తెనుగుదనపు తేనెతో జోడెక్కి పోయినది. కవిత్వము మదరమాగినది.

ఆయన కవిత్వపు అమృతవాహినిని, కొన్ని పాయలుగాచీల్చి, అందు త్రావి ఆనందింతము :—

## ★ భావము సర్వజనీనమైనది

జాతి మత స్థానిక క్షుద్రభిత్తికలు భావమును అడ్డుపెట్టలేవు. అవి దేనిపాటికి అవిగా ఉద్భవించుచుండును. మహావీరుడు నెపోలియన్, సెంట్ హెలీనా దీవిలో బందీగా ఉన్నప్పుడు "I exist but I dont live" అని ఆవేదనపడినట్లు ధృతరాష్ట్రుడు – "చోద్యుండనై దుర్దశ నునికి మనికి యగునె (కర్ణ–1 : 30) అనుచున్నాడు. ఇట్లే బద్దె భూపాలుడు After me the deluge అనేదానికి 'తన చావు జలప్రళయము' అని సుమతిశతకములో అన్నాడు. ఇవి కాపీ కొట్టినవిగావు. ఇట్లే—

—సిగ్గు జలముడిగ్గ ద్రావి-కర్ణ-1 : 133 (Swallow the Humiliation)
—చలము దిగద్రావి-కర్ణ-2 : 248.
—నాలుక యడంచియుండు-కర్ణ-2 : 109 (Hold your tongue)

## ★ విరోధాభాస వాక్యము
## (Oxymoron)

**Tremendous Trifles** - బ్రహ్మాండస్వల్పములు, **Splendid defeat**-వైభవోపేత పరాజయము అనునట్టి వింతవాక్యములను తిక్కన రమణీయముగా ఉపయోగించును.

—యుద్ధ శాంతవీరులు (ఉద్యో 3: 284)
—వినియుఁ గాదా విననిచెవులు జేసి (కర్ణ-2: 12)
ఆయనకు విన చెవుడు అని స్థానికప్రయోగము.
—మోహారంబు త్సాహ తీవ్రంబయి (కర్ణ-3 : 155)
—అలఘు లఘుత మెఱయ (కర్ణ-3 : 160)

## ★ బీభత్సములో చారుత

ఐదుపర్వముల పద్దెనిమిదిదినముల యుద్ధము, వీటి అన్నిటితో సరితూగినట్లున్న ఒక్క ఉత్తరగోగ్రహణమును వర్ణించి, స్త్రీ పర్వములో - ఎముకలగుట్టలు, ఈరువుకొండలు, ప్రేగులతిప్పలు, నెత్తురులను కల్పించి కన్నీటిమడుగులు నింపినను, అంగవైకల్యము నొందిన ప్రాణికోటిని వర్ణించి ఒళ్లు పులకరింపజేసినను-విసుగు పదురు వేవగింపు గలుగదు. బీభత్సమునకు ఒక దర్శనీయత, వీరమునకొక రామణీయకత అంటగట్టి కవిత్వమును ప్రసన్నదనముతో ఆహ్లాదికారిగా జేసినాడు. ఇందలి బీరమునకు కనుగవ ఎరుపెక్కునేగాని, కండలు కదలునేగాని, ఎదలో నలి నంజలి పుట్టవు. యుద్ధఘట్టములు ఉత్సాహ ప్రతిపాదకములుగనే సాగిపోవును. ఇట్టి పనితనమునే నాచనసోముడు గూడ కొంత చూపినాడు.

—చారు భీషణంబుగా నొకళ్ళొకళ్ళ జుట్టుకొని (కర్ణ-1 : 77)
—రథ చిత్రచారు లఘుభీషణ సంచరణంబు లొప్పగఁ (క-1 : 106)

—తనరథంబు రయంబున దర్శనీయంబుగా (క-1 : 139)
—విద్విషద్భయద గదారుచి స్ఫురితబాహు విలాసభాసమానమై (క-2 : 221)
—దునిసిపడి భీమాభిరామంబుగా (క-2 : 227)
—శిరము ధరడొల్లె గుండలస్ఫురణ మెఱయ (క-2 : 246)
—మత్తగజకేళీ సుందరోల్లాస మాభీలత్వం బలరింప ద్రిప్పుచు (క-3: 210)
—ఉరము వ్రచ్చి నెత్తురుదేనియ యిడ ద్రావెదన్ (క-3 : 212)
—తను పుగ్రసుందరముగా నన్నరు డేతెంచె (క-3 : 219)
—నెత్తుట దోగి, మేను కమనీయ రుచిం గొమరార (క-3 : 339)
—అభిరామ భీషణంబగు రణాంగణంబు (క-3 : 380)

ఆ పీనుగుపెంటలలో—

తే. రెండు వీళ్ళజనంబులు రేలు వివిధ
హృద్య సంగీతములను సాహిత్యమధుర
లలిత గోష్ఠీ నినాదంబులను ప్రమోద
భరితులై ప్రొద్దుపుత్తురు భరతముఖ్య (భీష్మ-2 : 343)

అని, నెత్తురును మరపించి ఆనందింపజేయుచున్నాడు – సుకుమార భావబంధురుడైన కవి.

## ★ కూర్పునేర్పులో సొంపు

పీనులవిందుగా, పదగౌరవమెరిగి, క్రొంగొత్త తెన్నున వాక్యములనుకూర్చి భావములను వెల్లడించి ఆనందమును కలిగించుపనిలో తిక్కన మొనగాడు. ఇట్టి మధురవాక్యసముదాయము యీాయన కవిత్వములో కుప్పతిప్పలు.

—పవలింటి దివియ చందమయ్యె దినకరుండు (క-1 : 62)
—కయ్యంపు వేడుక మొగంబులం జిగురొత్త (క-1 : 69)
—పాండునందనులు... నేడు నూడబోదురు జము (క-1 : 70)
—నిప్పుల్ రాలు కన్దోయితోన్ (క-1 : 91)
—పాలివోని కలికితనము (క-1 : 101)
—నెత్తుటి పొందేమియులేక యుచ్చి చనినన్ (బాణము) (క-1 : 121)
—అలంతి నవ్వు చెలువంబు మొగంబునకు వింత చెన్నొసంగ (క-1 :176)

—తనూజా భుజగర్వ విహీనత నొంచె చిత్తముల్ (క-1 : 187)

—చేతులు తీటవోవ (క-1 : 197)

—చేతుల కసివోవంగ (క-2 : 300)

మనసుకుగాక చేతులకే కసి గల్పించినాడు.

—చేసెత్తురుగాకుండ, నక్కిరీటి గీటడగించువిధం బూహింపుము (క-1: 230)

—మధురాక్షర విన్యాసంబుగా పలికె (క-2 : 252)

—గర్వాగ్రహ విధేయుడు (క-2 : 7)

—చూచియుం దిరమయి నీవు నాలుకకు దెచ్చిన మాటగదా వినందగున్ (క-2 : 11)

—పాడుచు నాడుచు... జెలితుమనుట నోరి చేటుగాదె (క-2 : 24)

—అర్జును నమ్ములు దుప్పువట్టెనే (క-2 : 25)

—రెండు మానుసులకు భీషణంబులు, నాకు బరితోషణంబులు (క-2 : 46)

—లక్ష్మికి జేవయు, గీర్తిపన్నత విజృంభణము కలుగన్ (క-2 : 105)

—నేడు మేలు చేయైతి నేనియు మృత్యువునకు నెన్నడు నగుపడ (క-2 : 107)

—అంతరంగమేర్చు నలుక శామింపంబడగ జూచిన చందము (క-2 : 204)

—గన్మీతవక్త్రి సహస్రపత్త్రిలక్ష్మి యతిశయిల్ల (క-2 : 221)

—గద పండువు (క-2 : 222)

—మనములు మెచ్చ్వన గరగె (క-2 : 284)

—బ్రతుకరావంత పుట్టిన (క-3 : 32)

—అప్పలుకు లలంచుచుండె, మది చాయవు గీటినయమ్ములట్ల (క-3 : 36)

—ధను వనలవలయము తెలుగున (క-3 : 49)

—ఏపారిమండునె యాలింగలదీపము (క-3 : 49)

—తెలుగంబు బిగు వుడిపికొని (క-3 : 92)

—భవన్మహాస్త్రదివ్య మహిమలో నడంగిరి (క-3 : 114)

—లోపగ రాజబెట్టను (క-3 : 124)

—భవద్బాహు దండంబునకు మూలధనంబైన గద (క-3: 141)

—జనుని నాలుకయుం బోని యతులశక్తి (క-3 : 162)

—మొడలు దెగంగ నేసి రణమేదినికిన్ బలిసేసె నత్తలన్ (క-3 : 180)

—నిటలమున బటువరొప్పిల్లనితుడగుచు (క-3. : 198)

—అంత్యకాల యమరేఖ చేర్చి (క_3 : 219)
—ఎవరు కడంగుదురొకో యని కన్నడియుండి (క_3 : 228)
—తలిమెచ్చును నొల్ల డేమియుఁ (క_3 : 271)
—అత్తొలుతాకు వెఱగుపడ జేసె (క_3 : 278)
—కన అధికమైన లావెక్కిన యయ్యంగపతి (క_3 : 345)
—కోపానలంబు, రోమకూపంబుల బటుజ్వాలారూపంబున వెడలుట (క_3 : 357)

## ★ సహజోక్తి

లోకపరిజ్ఞానము మెండుగాగల యీ మహాకవి ప్రకృతిని చూచి గ్రహించి, దానిని కవిత్వసంపదతో కై సేసి ప్రదర్శించును. ఆ భాష అనుదినము వాడుకలోనుండు నానుడిగనో సామెతగనో చాటువగనో నుండి, జీవశక్తితో కలకలలాడుచుండును. ప్రజాభాషను తీర్చి దిద్ది ఉపయోగించేనేర్పున యీయన దిట్ట. చూడండి :—

—రథము రథముతో జేరగ దెచ్చి, యమ్మేదినీశ్వరునితో గర్ణుడిట్లనియె (క_1 : 229)
—నీవు నా చెప్పినట్లు చేసితేనియు మేలు, సేయకుండినం గడు మేలు (క_2 : 53)
—కాకులలో గలుప దగవుకాదే నినుఁ (క_2 : 77)
(హంసకీయోపాఖ్యానము)
—మృతభటులు రయమునకు విఘాతమొనరింప (క_2 : 154)
—సారథి సమయించిన దేరు తురంగంబులం దొలంగంగనీడ్చికొని పోయిన* (క_2 : 222)

* ఈ స్థితిని పలుమారు వర్ణించినాడు. ఇదిగాక తేరు దిగునప్పుడు పగ్గములను (Reins) నొగలకు గట్టియే ప్రతిసారథి క్రిందికి దిగునట్లు వర్ణించుట తిక్కన, లోకపరిజ్ఞానమునకు పెద్ద గురుతు. ఇట్లు చేయకుండిన పగ్గములు గుఱ్ఱముల కాళ్లక్రిందబడి, కాళ్లకు జుట్టుకొని అపాయస్థితిని కలిగించును. ఈ అత్యంత అవసర కార్యమును మరచినవాడు, తిక్కన సారథులలో ఒక్కడూ లేడు.

—నీవిక దప్పి యార్చికొమ్మని పలికి (క_3 : 179)

* ఒకరికి ఇంకొక యోధుడు సహాయముగావచ్చి మొదటివానిని విశ్రాంతి దీసికొనమనుట.

—రథ్యంబుల జలపాన ఖాద్యఖాదనంబుల ప్రబలంబులం గావించి,
పూన్పించి (క_3 : 112)

* ముఖ్యమైన యీవిషయమును, సంకుల సమరమధ్యమమున గూడ కవి మరువడు. అవి సేదదీర్చుకొని, మేసి, యథారీతి బలము చేకూర్చుకొనుట సహజము.

* మూకలు అర్జునరథమును చుట్టిముట్టి (ఇప్పటి రాజకీయ భాషలో ఘెరావుచేసి) ఒక్కొక్కడు ఒక్కొక్క రథభాగమును పట్టుకొని నిలుపుట కండ్లఎదుట పొడకట్టుచున్నది. ఇదే వాక్య చతురత - వర్ణనానైపుణి (క-2 : 229)

—సమూదీర్ణుండై నిడుము మెఱయ దిరిగి (క_2 : 229)

* గుంపులో దూరమునకు కనుబడునది రథకేతనమే! అది ఎవరిదో గుర్తించి, వెంటనే అచటికి తన రథమును తోలుమని యోధుడు చెప్పుట సహజము. సంకులసమరములో ఇదే కార్యసాధనకు అనువు. ఇందు ఒక సొగసుగూడ గలదు. ఇట్లు పెక్కుతావులలా చెప్పబడియున్నది.

—విజయంబు వీక్షించి గుణంబు సారించి "గాండీవంబు నీ కెదురే?"
యని యగ్గించి (క_3 : 13)

† విజయము కర్ణుని విల్లు; ఇది దైవదత్తము. ఇట్లు తన ధనుస్సుతో - ప్రాణమున్నదానితోవలె పలికి, పొగడి ఉపయోగించుట - కలుషాలుదీసి పారించిన ఆనందరస స్రవణము! ఇట్లే గుఱ్ఱమును మెడపైతట్టి మాట్లాడని సాది ఉన్నాడా?

—పొడవుగానెత్తి నేలపైవ నొర్చితి నను బగవారినడుము (క_3 : 58)

* బాగా పైకెత్తి పగులవేసినాడు అన్న చాటువకు సరిపోవుచున్నది యీ పలుకుబడి.

† కర్ణపర్వము 3. ఆ. ౧3 వచనముక్రింది ఫుట్‌నోటును చూడుడు.

—నిన్ను ద్రుణము చేసి, నన్నా దురాత్ముండు బంధుహీనుబోలె బఱుప (క_3 : 64)

—గదాఘాతంబుల కాలంగేలను (క_3 : 86)

—మున్నే మిసేసిన జేసితింక నైన దుర్బుద్ధితనములు మాని (క_3 : 89)

—పొగవాసి మెఱయు నగ్నివోలె (క_1 : 180)

—ధూమమడగిన వెలుగొందు ననలుచందము (క_2 : 238)

—పొగలేని మంటపగిది (క_3 : 15)

* అగ్ని తీవ్రతను చెప్పుటకు యింతకంటె శాస్త్రీయపద్ధతి లేదు. పొగ (కార్బన్) అంతాపోగా మంటకు వేడి ఎక్కువను. ఇది తిక్కన సైన్యపరిజ్ఞానము. ఇంకొకచోట చంద్రనిప్పులు చెరిగినట్లు అని చెప్పినాడు. చిక్కటి చంద్రకొయ్యకు వేడి ఎక్కువ. అందులో చేటలోబోసి చెరగిన, కణికలు రాజి, వేడి ఎలపాన వ్యాపించును. చింతనిప్పులకుగూడ వేంద్రము ఎక్కువ.

—వానిని గానిగ గ్రద్దగమి దొలువ కనుగొనవలదే (క_3 : 126)

* ఇది ముఖ్యంగా ఆడువారి తిట్టువంటిది. "నీవు పురుగుబట్టి చావ" అన్నట్లు.

—ఆ సభలోన గొన్న బుణమంతయు నీగగగంటి వడ్డితో
(భీమసేనుడు దుస్ససేనునితో; (క_3 : 195)

—వివిధ విశిఖజాలంబు లడరించిన, నంబురంబు
శలభపటల సంవృతంబునువోలె నుండె (క_1 : 129)

* మిడుతలదండు చూచినవారికి ఇది మనసున అట్లే అచ్చుపడిపోవును. (Good Earth) అనే చలనచిత్రమందలి మిడుతలదండు దృశ్యము కట్టెదుట నిలిచిపోవుచున్నది.

—కాల్ నిలువక తెరలంగ (క_3 : 230)

—కర్ణ మద్రపతుల కాంతల విధవలజేయువాడ (క_3 : 264)

* "నీ ఆలు ముండమోయిస్తాను చూడు" అనేది పలుమారు చెవిన బడే తిట్టు.

—(తేరుగాలు) వండ మునుగంగ దిగబడిన (క-3 : 350)

—తెగనిండ దిగిచియేసిన (క-3 : 360)

* తెగ తిను, తెగ మాసిన వాటివంటి ప్రయోగము.

—మనుజులు పాండు తనూజులు, జననాయక, నాకు ఒక్కసరకే తలంపగ
(క-1 : 241)

* ఒక లెక్కా పక్కా—అనుట.

★ ఉపమానములు

ఈ ఉభయకవిమిత్రుని సారవంతమైన మానసిక క్షేత్రమున మొలకెత్తి, మొగ్గ పూవు దొడిగి, రామణీయాకృతులతో ఉపమానములు రూపొంది, పాఠకుని పులకితుని జేయుచున్నవి. ఈ కవి ఊహాలు మన్నువదలి మిన్నుకు ప్రాకేవిగావు. పోలికలు పాటక జనముగూడ చూచినవే! ఇక మాటలు తెనుగువారి సొంతవి.

—మేఘ పిహితుడైన మహీరుని చాడ్పున వాడిలేక యున్నవాడు
(క-2 : 121)

—పెనుదుంగ మడువులో గజపతి యున్మత్తవృత్తి గేలి సలుపుపగిది
(క- 2: 340)

* తుంగపోచలను, అడ్డము ఆపులేకుండ త్రొక్కివేసినట్లు. అందులో అది గజపతి, సామాన్యమైన ఏనుగుగాదు.

(చూడు : భీష్మ-2 : 222)

—నాళముననకు వికసితాంభోరుహము బాపు
కరవుదోప దునిమె వెస...శిరంబు (క-2 : 168)

ఉపమానములతో నిండిన ఈ సీసను చూడుడు (క-2 : 187)

నవ్వుచుఁ జాపంబు నడిమికి ద్రుంచి, పైఁ
మఱువు దొంబడి శితమార్గణముల
ఛేదింప, రత్నప్రభాదీప్త మగునది
సౌదామనీ చారు జలద మంబు
జాప్తుని తనువున కడ్డమైయుండి వా
తాహతంబై పాయునట్లు పోలె
బహుటయు, మణిమయాభరణ సుందరమైన
యతని గాత్రము సకారాంబరము

బోలి యప్పుడ యా సూత పుత్రుచేత
రక్తమయమైన పల్లవోద్రిక్త కల్ప
తరువు చందంబునొందె; నతండు రాజ
ధర్మమూది చలింప కదల్చె నధిప.

—విచ్చె నబ్బలము సింగంబుగనిన లేడి గమియుబోలె (క-2 : 278)

* లేడి అంటే ఆడుజింక, అబలలు పరుగెత్తినట్లు అను సూచన.

ఉపమానమును పెంచి వర్ణించి, ఉపమేయము ఇట్టిదనుట తిక్కన ఉపమాలంకారములలో ఒక చారుతర ఫక్కి. దీనిని గ్రీకు మహాకవి - హోమర్ చేబట్టి, పరమటికవితకు వన్నె దెచ్చినాడని దీనిని Homeric Simile అంటారు. ఇక ఇందు తిక్కన బాణీ చూడండి:-

—(భీముడు) వాని నెల్లద్రుంచి, వలద్రచ్చికొని లీల
నిగుడు చోలవోలె వెగడుపడక తతిమి (క-3 : 158)

* చోల-చొరచేప (Shark) అతి భయంకరమైనది. దాని ముక్కు పొడవుగా, రెండుతట్టులా రంపపు పండ్లవంటి ముండ్లుకలిగి యుండును. ఇది వలను తుక్కుతుక్కుగా నరికివేయుట తెలిసినసంగతి. ఈ ఉపమానముతో భీముని భీకరమూర్తి ఆకళింపునకు రాగలదు.

భీముని తిక్కన ఆబోతెద్దుకే పోల్చి సుందరదృశ్యము నిట్లు సృష్టించినాడు.—(ద్రోణ-4 : 154.)

చ. అరదమువిడ్గి యప్పటు శరావళిశోర్చి మొగంబు వాంచి స
త్వరుడయి, వాన పైగురియ వంచినమస్తక మొప్ప బోవు సుం
దర వృషభంబులీల జని, దర్ప మెలర్పగ నొక్కచే నొగల్
వెరవునబట్టి తేరు, ప్రజ విస్మయమందగ పీచివైచినన్.

* కారెలు దిరిగి చెండుబెట్టిన కోడెసింహామునకంటె గంభీర మని తెలిసి, తిక్కన యా పోల్కపై మమత జూపును. వానలో ఇది తలవంచి రాజఠీవితో నడచుటను పల్లెలలోచూచి ఆనందించని వారు లేరు.

—శా. సింగంబాకటితో గుహాంతరమందు చేడ్పాటుమైనుండి, మా
తంగ స్ఫూర్జితయూథ దర్శన సమద్యత్క్రోధమై వచ్చునోజ
(విరాటపర్వము)

—చ. కని యభిమన్యు ముఖ్యుల వికంపితవృత్తి కడంగి యేసినం
దనువున నెల్ల రక్త జలధారలు గ్రమ్మగ, వారణేంద్రు దే
పున నెఱయేరు లొక్కమొగి బోరన బెక్కడరంగ లీల నై
కొని ఘనకేళిసల్పు నడగొండగతిన్ సముదగ్రమూర్తియై (భీష్మ-2 : 240)

—ఉ. అంగదనాథుమ్రింగిన వృకావతి దన్ వెస ముట్టికొన్న స
ర్వాంగములుం జలింప వెగడందుచు దిక్కులు సూచుచున్న సా
రంగియుఁబోలెనుండె, కురురాజ, భవత్సుతుసేన భీష్ము నా
జిం గబళించి పాండవులు జృంభిత విక్రమలీల బొల్చుటన్.ద్రోణ-1 : (17)

మొదలగు రసగుళికలు ఎన్నో కలవు.

—ఆవిసిన కలంబు జనంబులు దీవి సేరినయట్లు కర్ణుం జేరి, కాలుదన్ని
భూమిపై నిలచి (క-3 : 165)

* కాలుదన్ని (ఊని) నీట నిలుచుట సహజము.

—బెబ్బులి లేడి కొదమం బొదువుపోలికం బొదివి (క-8 : 205)

—పెక్కు పాములు బొదివిన బెనగు గరుడు ననువుదోపగ (క-2 : 273)

* ఎందరు చుట్టిముట్టినను లెక్కలేక పోయినదనుట.

—అంతక కోపవహ్ని విపులాకృతి గైకొనివచ్చినట్లు (క-3 : 288)

—(మహాస్త్రము) ఆకలిమైవచ్చు కృతాంతవక్త్రమన (క-3 : 358)

## ★ చిత్రీకరణము - ఉత్ప్రేక్ష

ఒక సన్నివేశమునుగాని, వ్యక్తి అవస్థనుగాని వర్ణించుటలో కవిబ్రహ్మ గంటమునకు నెఱజాణతన మబ్బినది. ఇవి చదివిన వినిన మన కన్నులలో, సినిమాదృశ్యములవలె మసలుచుండును. పాత్రలు సజీవములై మన కట్టెదుట తిరుగాడుచుండును. ఇదంతా ఒక గారడి, ఒక కనుకట్టుగా నుండును.

—ధరాధూళికి దోడు సంధ్యారాగంబు మిళితంబైన తిమిరంబు గవిసిన
(క-1 : 209)

—కం. అనిన విని కెంపు సొంపున
గనుగవ యుగ్రముగ బొమలు గదియఁగ, ఘూర్ణి
ల్లున జెమట వొడమ, నీ సుతు
గనుగొని యిట్లనియె నతఁడు కటము లదరఁగన్. (క- 1 : 248)

ఇది శల్యుని దృశ్యము.

—ఆ. మెఱుఁగుతోడి లలిత మేఘంబుమీఁదికి
బోయి వెలుఁగు భాను పోలువుదోప
మద్రరాజ సహిత మహితమై యొప్పు న
త్తేరు కర్ణుఁడెక్కి తేజరిల్లె. (క-1 : 318)

—తే. ఈడఁబోక రాధాసుతుఁడేసె నిరువ
దేను నారాచములు పవమాన తనయు
కత్తళముదూరి యంగంబు గాడిపోయి
నిలువకట చని మేదినీ తలము సొరఁగ. (క-2 : 212)

* అంత బలముతో వదలబడి, అంత వేగముతో వచ్చుటచే, దేహంగుండా దూరి నేల జొచ్చునంతవరకు నిలువలేదని వర్ణించుచున్నాడు.

—పెఱమూకలు వెఱగునం జెయ్యేది కరళ్లడంగిన మున్నీటి యట్లుండె
(క-2 : 274)

* సైన్యమంతా చలనములేకుండా స్తంభించిపోయినది. మున్నీటివలెనే ఇదిగూడ హేరాళముగ పరచుకొనియున్నది. ఇదీ మనసుకు తట్టే దృశ్యము. రెండుపాళ్ల దున్నినపొలముగూడ అలలణగిన వారాసివలెనే ఉండును. (బుద్ధచరిత్రలో అశ్వఘోషుడు యీ దుక్కి పోలికను చెప్పినాడు.)

—కం. తురగ ద్విపద రథ తూర్యా
భరణధ్వజ చామరాతపత్ర శకలముల్
పొరిబొరి ధరగప్పఁగ, నె
త్తుర్రు టేరులు వాని ద్రొలఁగ ద్రోచుచువచ్చెన్. (క-2 : 301)

* తుమురు చెత్తతో అనగా (అడ్డుకట్టగా) ఏర్పడియుండగా, వచ్చిన నీరు ఉబ్బి, ఆ కట్టను నెట్టి త్రెంపి కొట్టుకొనిపోవుట సర్వ

సామాన్యదృశ్యము. ఈ వర్ణనము ఆదృశ్యమును చిత్రించి, మన చూపుమేరలో నిలిపివేయుచున్నది. ఇది చిత్రకారుని కళావైదుష్యము.

—మహిఁబడు విమానములట్లు యఱకలైనట్టి యరదములు (క-3 : 176)

* పైనుండిబడి తునకలైన విమానములు ఇట్లేగదా కనుపించును.

—క. నిగుడు దివాగ్ని జ్వాలల
వెగడందిన మృగకులంబువిధమున నతి భీ
తి గదిరి నలుగడ విచ్చిన
జగతీశ్వర, యతడు మెఱసె జక్కని బయలన్, (క-3 : 208)

* ఇది ఒకసాటి హోమరిక్ సిమిలి. కాలిపోయినతర్వాత బయలే (తెఱిపే) గదా అగును. ఇందొక నారస్యము-చిత్రీకరణపు సొంపుగూడ గలదు.

★ పదసారస్యము

ఈ కళను ప్రదర్శించుటలో ఈ కవికి ఒక సహజప్రతిభాదీపనము గలదు. తల్లిని పట్టుకొని 'బింబాధరోష్ఠి' అని అనడు. పాత్రలను తానుగా తిట్టడు. సందర్భోచితముగ పదప్రయోగము చేసి ఆ పదగౌరవమును నిలువబెట్టును.

—వచ్చినవాడు ఫల్గుణు డవశ్యము గెల్తుమనంగ రాదు (విరా-గోగ్రహణము)

* ఫల్గుణీ నక్షత్రము జయతార; అందు పుట్టినవానికి - అర్జునునికి అపజయము లేదు. కాబట్టే గెలువ లేరని సూచించినాడు.

—దూర్వారోద్యమ బాహు...కీచకా-అనే విరాటపర్వపద్యములో ద్రౌపది కీచకా=అంటే వెదురా, అని సంబోధించి, నిన్ను విఱగబొడుచుట అంత సులభమని తోపింపజేయుచున్నది.

—భీముడు విస్ఫురద్గదను రభసమొలర్ప ద్రిప్పును.

—సవ్యసాచి (రెండుచేతులా ఏసి) అంపవాన గురిపించును.

ఇదీ తిక్కన సమ్మోహనాస్త్రము. ఇట్టి ప్రయోగములు ఇయా పర్వమునగూడ గలవు.

## పాత్ర చిత్రీకరణము

తిక్కన భారతపాత్రలు ప్రాణములేని తోలుబొమ్మలు గావు; అవి చైతన్యపూర్ణములు; మానస్వభావమూర్తులు! ముఖ్యముగా కౌరవులలో కర్ణుడు, గాంధారి; పాండవులలో భీముడు, ద్రౌపదియే ఈయన తీర్చిదిద్దిన ప్రధానపాత్రలు–అని అనవచ్చును.

### I ద్రౌపది

నెఱజాణ బిగువు, గార్గి వాదనాబలము, సత్యభామ ఆత్మోత్కర్షము, తెనుగు గడుసుదనము సమపాళ్లుగా కలిపి రూపురేకలు దిద్ది ప్రాణముబోసి ఈమెను నిలువబెట్టినాడు పల్నాటివీరుల కథలోని నాయకురాలైన నాగమ్మ, ద్రౌపదికి అస్ఫుట ఛాయాచిత్రము కావచ్చును. ద్రౌపది తెనుగుదనమునకు రూపాంతరము.

పంతము సాగించుకొనుటలో, కసి దీర్చుకొనుటలో అంతటి వ్యక్తి భారతమున ఇంకొకరు లేరు. దుస్ససేనుడు లాగి త్రెంచిన వాలు వెంట్రుకలను, అతని పచ్చినెత్తుటనే కడిగి ఆరబెట్టిన తరువాతనే ముడిచి కొప్పుబెట్టినది. ఈమెకు భీమునిపై ఉన్నంత విశ్వాసము ఇంకొకరిమీద లేదు. స్వర్గారోహణపర్వములో, ధర్మరాజు–ఆమెకు అర్జునుపై వలపు మొగ్గు అన్నదానికి భారతములో ఎక్కడా పోబడియే లేదు. తన ఎదసొదను భీమునితోనే చెప్పుకొని, కీచకుని దుశ్శాసనుని మట్టుబెట్టించి పగ సాధించుకొనినది. అర్జునాదులు మీనమేషము లెక్కించుచు, వెనుక ముందులు ఆలోచించేపాటికే, ఉన్న పుణ్యకాలము రవ్వంత చెల్లిపోయెడిది. వారు యుద్ధములోదప్ప అన్యక్లిష్ట కార్యసరణిలో తెంపు చూపలేకపోయినారు.

తన గాండీవమును తిట్టిన అన్నను, అర్జునుడు చంపుదునని నైకిదాకి, చివరకు ఆ ధర్మజుని చిట్టిన కొసవెంట్రుకలను నరికి వ్రతము చెల్లించుకొనినాడు. కాని ద్రౌపది పెట్టిన చివాట్లకు, కుక్కిన పేనువలె నోరెత్తలేదు – ఈ ఇంద్రసూతి! ఆమె అన్నంతనే పాండవులందరికి భయమే – అగ్నిలో పుట్టినదని కాబోలు. కుంతి,

ఆ_త్తగా యీామె జోలికే పోయినట్లు లేదు. ద్రౌపదిని శ_క్తిస్వరూపిణి అని అనినది - నిర్వ్యాతనశ_క్తి స్వరూపిణియగుటచేతనే కాబోలు! తిక్కన, అడుగడున ద్రౌపది వైశిష్ట్యమును చిత్రించినాడు. ఆమె కార్యాచరణ దక్ష; స్వాభిమానిని.

## II భీముడు

ఒళ్లు దాచుకొనని తెంపు, మొగటిమి, చేవ, సత్తువగలిగి, కల్లకపటమెరుగని మొండివాడు - యీా పాండవేయుడు. అవమానమును దిగమ్రింగి పడియుండ లేదు.

''కుంభనిక్షి_ప్త భుజంగమువలె'' బుసకొట్టుచు సమయమునకు వేచియుండి, శత్రువు చేజిక్క_గానే వికృతముగా తునకలుచేసి తృ_ప్తి పడేవాడు-భీముడు. ఈయన లేకున్న - పాండవపక్షమే లేదు. స్వగౌరవప్రతిష్ఠాపనముగాని, రణవిజయముగాని, ప్రాణోపద్రవకాలమందు ఆత్మరక్షణముగాని వారికి దక్కి_యుండవు. భారతములో (కల్పిత) గోగ్రహణమునందుదప్ప, భీముడు చేయిజేసికొని తనవారిని ఉద్ధరించని క్లిష్టసమయమే లేదు. లాక్షాగృహదహనముతో ఆయనబాధ్యత ప్రారంభమైనది. పేరుబడిన యోధులు - ఎక్కు_వమందిని యీాయనే సమయించినాడు. ధా_ర్తరాష్ట్రులందరూ ఈయన గదాఘాతములకే ఆహుతియై పోయినారు.

ఇది బాగా గు_ర్తించియే, భాసమహాకవి - తాను వ్రాసిన భారత నాటకములు ఐదింటిలో రెంటికి - మధ్యమవ్యాయోగము, ఊరుభంగము - భీమునే నాయకునిగా జేసి, రాణింపు గూర్చినాడు.

కన్నడ కవిత్రయములోని రన్నడు - ''సాహస భీమసేన విజయము'' (గదాయుద్ధము) అను నాటకమున దుర్యోధన భీమసేనులనే వీరులుగా వర్ణించినాడు (రన్నడు తెనుగువాడు; నన్నయకు ముందు యాభై యేండ్ల నాటివాడు; అర్జునుని పెద్దచేసి కన్నడభారతము వ్రాసిన పంపని తరువాతివాడు. ఇతడూ తెనుగువాడే!)

యుద్ధపంచకములో భీముని వీరవిహారమే ఎక్కువగా వర్ణితమై యున్నది. ఇక కర్ణపర్వమున కర్ణునికి ఎదురుగా భీమునే ప్రతినాయకుఁ డనవలసియున్నది. దుస్ససేన సంహారఘట్టము తిక్కన చేతిలో మహా కావ్యసంపదతో, తీరి దీపించినది. కీచకుని చంపుటవలెనే ఇదీ అమానుషము! అట్టిదీ భీమునికి వారిపైగల కసి! కాని ఆ వికృత చిత్రీకరణము జుగుప్సను కలిగించదు. ఈ గుణము తిక్కన ప్రత్యేక కళ.

> "మును సభ బలికిన దానం
> బనిపోక యిచ్చుటకి వెదకివచ్చితి, యే
> మనియెదు దనుజ! నీ మాటలు
> వినుటకు నాకినుక సాల వేడ్కపడియెడుఁ. (క_3 : 206)

అని ఎంత సహజంగా, ములుకులు గుచ్చుకొనేటట్లుగా ఎత్తి పొడుచుచున్నాడో చూడండి! కినుక వేడ్కపడుట బీభత్సమునకు ఒక నాణ్యము!

ఆపట్టున దుస్ససేనుని శరీరమునకు పట్టించిన పాట్లు పరికించండి: (క–3 : 210)

> శా. లీలం గేలనమర్చి, మత్తగజకేళీ సుందరోల్లాసమా
> భీలత్వం బలరింపఁద్రిప్పి, జదలం బృథ్వీస్థలిన్ వైచు, ముం
> గాలంద్రోచు, మొగంబుఁద్రేయు, దెసలుగ్రస్ఫూర్తి వీక్షించు, మో
> కాలూఁదుం బయి, గ్రమ్మఱంగ మెడ చిక్కంద్రొక్కి నిల్చున్, నగున్.

సుందరోల్లాస మాభీలత్వం బలరింపచేయుచున్నాడు! తిక్కనకు సౌందర్యము తోపింప జేయును అనువుగాని సంఘటనమే ఉండదు. అదిగాక యిందు - ఒకే పద్యమున అనేకక్రియలను చొప్పించి ఆఖ్యాతకవిత్వమునకు ఉదాహరణముగూడ సమకూర్చినాడు - ఈ కవితాశిల్పి. ఈ చేతలు కనులకుగట్టినట్లుగ దా నున్నవి!

అంత జోస్సిక -

> "ఏనురము వ్రచ్చి నెత్తురు
> దేనియ యిదె త్రావెదం; గదిసినను గడిమిన్
> మానుప దిక్కుగలిగిన
> వాని మెలుగింపు, మీ మొనగలవారిన్." (క_3 : 212)

'మీా అబ్బతో చెప్పకో పో' అన్నట్లు సహజంగా అను చున్నాడు భీముడు. ఆయనకు ఆ క్లిష్టపరిస్థితి లఘువై, నెత్తురు తేనె వలె రుచుల నూరించుచున్నది. భీముని అక్కసంతా యీా 'తేనె' అన్న పదమునందే నింపివేసినాడు. ఇంకను పగ తీరలేదు; నిర్యా తనోత్సాహము మందగించలేదు. ఇంకను అంటున్నాడు:-"తల్లి చనుపాలు, పలుతెఱంగుల తేనియలు, ఖండశర్కరతోడి దుగ్ధం బులు యింత యింపుగావు" అని వికృతహట్టహాసమును పొంగుతో చేయుచున్నాడు.

ఇంత చేసినను జుగుప్స బీభత్సముకలిగి, భావము వికటించ కుండునట్లుగనే "ఉగ్రసుందరముగా నవ్వీరు డేతెంచినాడు!" (క-3 : 219)

దుస్ససేనుని "పసరమా" అని మెత్తటిమాటలో తిట్టుట, దారుణాఘాతముకంటె బెట్టిదముగ నున్నది. వెంటనే అతని ఱొమ్ము చీల్చి,

"క్రమ్ము రుధిరమ్ముల్లాసిల్లె దోయిట న్వారంవారం గొని త్రావు,
మెచ్చు చవికిన్" (క-3 : 214)

ఈ వికటస్ఫూర్తిలోగూడ చిత్రణశిల్పము కవి లేఖినిని బాయలేదు. వెరవారగొని త్రావుచున్నాడు. చవికి మెచ్చుట - ఆ త్రావుట గూర్చిన అత్యంతతృప్తికి ఒక సజీవరూపము కల్పింపబడుచున్నది.

ఈ ఘట్టము చదువునప్పుడు, స్పెయిను, మరికొన్ని ల్యాటిన్ అమెరికాదేశములందలి వృషభయుద్ధమును (Bull Fight) చూచు నప్పుడు కలుగు ఘోరరామణీయకతనే కవి మనచే అనుభవింప జేయుచున్నాడు. ఇట్టి దృశ్యదర్శనము ఉత్సాహమునేగాని విసుగును కలిగించదు.

ఇంతలుచేసి, "ఒకటి కడతేఱె! బాపాత్ము సుయోధను బోరిగొని తలదన్నుదు" నను రెండవపనియు దీర్పనరిగెద (క-3:225) నని, భారతకథా నిర్యాతన చరమాధ్యాయమునకు బీజావాపము చేయుచున్నాడు.

మెఱసి, బహుగమనాయాసమునొంది పఱచుచుండినది. పోవుచు పోవుచు, కులము తక్కువ కాకి మిడిసిపడిన పాట్లు ఇవి :—

ఆ. ఎలమి గడచిపోవు, నిలుచు, గ్రమ్మఱవచ్చు
ముక్కు ముక్కుమీద మోపు, జుట్టు
వేచి తిరుగు, నీక లీకలతో రాయు,
నోరయు, జిత్రగతుల మురియు, నవ్వు!

చెడి బ్రతికిన ఆ కాకిచేష్టలు ఎంతటి స్వభావముగ నున్నవి! ఎంతటి ఎచ్చింపులు! అల్పుల మురిపెము ఇట్టిదేగదా. కవి పొడిమాటలే దీనికి ప్రాణము.

ఇంతేగాదు, హంసంబుల గేలిగొని నవ్వుచు, "మరాళంబు పరాభవంబు పొందెను"మని, పెద్ద యెలుగునం బలుకుచుండినది. ఈ పట్టున హంసయు భరితోత్సాహయైనది; నిగిడి పెలుచ బఱచి, ఉదంచిత త్వరితగమన కళావైదగ్ధ్యమును చూపినది. కాకము ఆకులాంతరంగంబును, వికలాంగబునై, "బుద్ధిమాలి పోటీ బెట్టుకొంటిని, ఇచట గిరులుపొద లేమియు గనుపించవు"-అనుచు, దీనమానసంబై భయంబున కలంగి, డస్సి, సొగసి, అవశత కాకి అంతకంతకు దిగిపోవుచుండినది. సందుచూచుకొని హంసము కోడెగమునకు దిగినది. "నీవనేకగతులు నేర్తిది యేగతి చెపుమ?" అని బాధకు అవమానము కలిపినది. ఇక కాకి దీనావస్థ చూడండి :—

కం. తలకొని జలములు పక్షం
బులు దుండము దోక సోక, బోరిబోరి నెగయఁగ
బలమఱి, మెయి దిగబడఁగా
సొలసి యెగయలేక వాయసుడు వెగడొందెఁ (క- 3: 74)

'వాయసుడు' అనుటలో ఒళ్ళు దెలియక, తారతమ్యముల గమనించని మానవజాతినే ఉద్దేశించుచున్నాడు కవి.

కాకి కొవ్వున పొంగినదానికి చెంపలు వేసికొని—

క. నాకొలది యిప్పు డెఱిగితి,
నీ కరుణాలోకనంబు నిగిడించి, శర

> ఖ్యా, కావు! నన్ను మఱిడం
> గాకులలో గలుప దగవుగాదే పికకా !

అని ప్రాధేయపడినది. చచ్చుబడిన నీచులు పడనిపాటే లేదుగదా! ఇక శరణాగతి దైన్యము ఒక లెక్కా-పక్కా వారికి! అందిన పిగ, అందకుండిన కాళ్ళుబట్టుట, ఇట్టివారి కార్యాచరణవిధానము!

మున్నీట మునిగిపోవనున్న ఆ కాకిని, కలహంస కాబట్టి, అన్నీ మరచి, కారుణ్యమున, దానిని తన రెక్కలలో ఇరికించుకొని, మోసికొని ఎగిరివచ్చి, మిట్టన ఎప్పటినెలవున దానిని దించి, బుద్ధిసెప్పి తన దారిని తాను మిన్నంటి చక్రవాళంలో గలసిపోయినది.

కథ కవిత్వము బాగున్నవి. పాత్రల స్వభావమునకు ఇది దర్పణప్రాయము. కాని, కర్ణుని దూరను శల్యుని నోరెట్లు రేగినదో గమనించండి. అల్పు డెపుడుపలుకు ఆడంబరముగాను - అనిగదా పెద్దల వచనము!

పరిపక్వ ఫలభారావనత భూరిభూరుహమువలె, ఎఱుక కలిమిచే వంగి, "బుధారాధన విరాజి" అని నమ్రతతో చెప్పుకొనిన మహాశిల్పి - తిక్కన మహానుభావునికి ఇవే నమోవాకములు.

'హరిహరనాథ, సర్వభువనార్తిహృతి, నను దయజూడు మెపుడున్'

అని తిక్కనవలెనే ప్రార్థించి ముగించుచున్నాను.

అపర్ణ
నెల్లూరు - 14-9-1970.

—మరుపూరు కోదండరామరెడ్డి.

# మలిమాట

'తిక్కన భారతము'—అన్న తలపేరునుగూర్చి కొంత చెప్పుకోవలసి ఉన్నది. 'శ్రీ మదాంధ్ర మహాభారతము'-అన్నది, మొదట అచ్చువేసిన పండిత ముద్రాపకులు పెట్టినపేరు. 'శ్రీమత్' అన్న గౌరవవాచకం తీసివేస్తే, 'ఆంధ్రమహాభారతము' అన్నప్పుడు అది

వచనమో ద్విపదో ఎవరు వ్రాసినదో తేలుటలేదు. ఇట్టివి ఎన్నో భారతములు ఇప్పుడు ఉన్నవిగదా! ఇంతేగాక, ఈ ఆంధ్రగ్రంథములో మహాభారతమనుటకు ఆధారములేవీ లేవు.

నన్నయ ఆదిపర్వం మొదట 1–31 పద్యాలలోపల 8 మార్లు భారతమనే వాడినాడు. 2 చోట్ల ఛందోనుకూలముగ మహాభారతమన్నాడు. [భారత శ్రవణాసక్తియు 1–12; భారతకథా శ్రవణాభిరతిన్; భారతకథా శ్రవణప్రవణంబు–15; మహాభారత–16; భారత బద్ధస్పృహులగువారికి–17; భారతభారతీసముద్రము–19; భారత భారతీ శుభగభస్తి–22; మహాభారత సంహిత–24; భారత ఘోరరణంబు–25; చేసెభారతంబు–31.]

తిక్కన విరాటపర్వారంభంలో, 1–38 పద్యాలవరకు 5 చోట్ల భారతమనే చెప్పినాడు. [భారతాఖ్యమగు లేఖ్యంబైన ఆమ్నాయము 3; భారతమను పేరబరగు పంచమవేదము–17; భారతసంహిత చెప్పగంటి–27; జనాభ్యర్చితమైన భారతమపారకృపా–28; భారతామృతము గర్ణపుటంబుల–38; దీనితర్వాత–ఇమ్మహాభారతము అని–43 లో వచనారంభమున నున్నది. ఈ 'మహా' పదాన్ని గద్యంలో ఎవరైనా ఇరికించి ఉండవచ్చును.]

కాబట్టి ఈ గ్రంథమునకు 'తిక్కన భారతము'–(కర్ణపర్వము) అని పేరు పెట్టినా. ఈ పుస్తకమును చూడగానే ఇది తిక్కన వ్రాసిన పద్యగ్రంథమని, కర్ణపర్వమని సులభంగా తెలుసుకొనగలుగుచున్నారు. ఇది చెవికి ఇంపుగాగూడ నున్నది. (EUPHONIC). ఈ శీర్షిక రసజ్ఞులకు మెచ్చుకోలు కాగలదని ఆశపడుచున్నాను.

12–1–72.

మ. కో. రెడ్డి.

ఓం

హరిహరనాథాయనమః.

# తిక్కన భారతము:

# కర్ణపర్వము

## ప్రథమాశ్వాసము

శ్రీపరిణామస్థితి వి
ద్యాపారీణత్వకారితా విరతా పాం
గా, పరమ నైష్ఠికత్వ
వ్యాపారపరానుషక్త హరిహరనాథా! ౧

— సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్ణుని వీరమరణమును జెప్పుట —

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె :- నట్లు మహాప్రాజ్ఞుండగు సంజయుండు దండునుండి హస్తిపురంబున కరుగుదెంచి ధృతరాష్ట్రు మందిరంబు ప్రవేశించి, యంతఃపురంబున నున్న యన్నరనాథుం గనుంగొని, కృత ప్రణాముం డగుటయు, నతం డాదరించిన వాసీనుండై ; ౨

క. బలవిక్రమములు వినుతం
బులుగా మనమొనలుఁ బాండుపుత్రానీకం
బులు రెండునాళ్ల పోరుట
దెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా. ౩

వ. అని పలికి కర్ణునిం బ్రశంసించి— ౪

చ. 'నరకుగొనండు పాండుసుతసైన్యనికాయము నింపకేనియుం,
గరులు రథంబులుఁ హరులుఁ గాల్బలముల్ దనవీఁక విచ్చియుం
మరలియుఁ దూలియుం బిలుకుమాలియు నగ్గడఁ బాఱియుం, నియ
చ్చరులకు వేడ్కసేయ భుజసారము శౌర్యముఁ జూపె నేపునన్. ౫

వ. 'చూపి యక్కౌంతేయులం గలంచి యాడి పదంపడి: ౬

తే. 'తనకు బిమ్మిటి యైన యర్జునుని బాహు
లీల నెమ్మెయిఁ ద్రోవంగ లేక తెగియె
నధిప, యాఁబోతు బెబ్బులికగ్గ మైన
పగిది యై, పాండవులకును బగ యడంగె.' ౭

వ. అనుచు శోకోపహతుం డై, సూతసూనుండు నిట్టూర్పు నిగిడించి, దగ్గుత్తిక వెట్టి
యి ట్లనియె:— ౮

చ. 'అది యొకఁ డేల, కౌరవచయంబు జయాశ యడంగిపోవ, బె
ట్టిదుఁ డగు భీమసేనుఁడు గడిందిమగంటిమి దుస్ససేను దు
ర్మద మడఁగించి పేరురము వ్రచ్చి, మహోగ్రతఁ ద్రావె నెత్తు, ర
య్యది తుది వింత పుట్టు నవి యాప్తజనంబులు మున్న చెప్పరే. ౯

తే. 'కొడుకు లంతరాజ్యంబును గొనఁగ శక్తు
లను దురాశను వారల యవినయములు
నీ వుపేక్షింతు, మానునే యావిరుద్ధ
కర్మమున ఫల మొందక కౌరవేంద్ర?' ౧౦

వ. అనిన విని, యాంబికేయుండు దుర్యోధనుండును దెగియెనకాఁ దలంచి, విహ్వ
లించి మూర్ఛిల్లినం దల్లడిల్లి, యార్తనాదంబులతో వివశంబు లయి వనితా
జనంబులు గన్నీరు గ్రమ్మ వసుంధర నొఱగిన, నంతకు మున్న వచ్చియున్న
విదురుండును నా సూతనందనుండును జేరి, చేసేత శీతలజలసేచన మృదువ్యజన
వీజనంబుల నన్నరనాథుని నారీసముదయంబును సేదదేర్చిన, నాసీనుం డై
యతండు, దీర్ఘనిశ్వాసంబు లడరం జింతిల్లి, యంతర్గతంబున దైవంబు గర్హించి,
పాండవుల నగ్గించి, తన బుద్ధియు శకుని వెరవును నిందించి తన్నుం దాన
యుపశమించుకొని ధైర్యంబు సిక్కంబట్టి: ౧౧

క. 'తెలియ విన నీవు సెప్పిన
పలుకులు, దుర్యోధనుండు పడఁడు గదా వై
రుల విక్రమమున? సంజయ,
కలరూ పెఱుఁగంగఁ జెప్పు క్రమ్మఱ నాకున్.' ౧౨

చ. అనుటయు నాతఁ డిట్లనియె నమ్మనుజేంద్రున:-'కాఁకఁ గర్ణుఁడుం
దనయులుఁ దమ్ములుం బడిరి దారుణవిక్రమకేలి నల్పి, నె
ట్టన బలుపారఁ బట్టి, వికటంబుగ వక్షము వ్రచ్చి దుస్ససే
నుని రుధిరంబు మారుత తనూజుఁడు ద్రావె మదం బెలర్పఁగన్.' ౧౩

క. అనిన విని, యంత కేమియు
నన కూరక యుండు, 'సంజయా, నీమాటల్
విన నేరదు విభ్రాంతిని
మునిఁగినయది చిత్త'మని విమూఢాత్మకుఁ డై. ౧౪

వ. ధృతరాష్ట్రుండు ప్రమానుపడి యుండి, కొండొకసేపునకు సేద దేఱి, యా సూత
నందనున కిట్లనియె:— ౧౫

క. 'నా దుర్ణయమునఁ జేసియు
నా దుర్యోధనునిబుద్ధి హీనివలనను
గాదె యిటు లగుట? మర్మవి
భేదన మగుశోక మింత పెల్లయి యున్నేఁ? ౧౬

వ. 'దుఃఖంబు విస్తరింపనోపుదునొకో' యని తలంచుచున్న నాదు సంశయంబు వాయ
నింతకుమున్న కయ్యంబునం గడచనిన మనవారిని, వారివారిని నేర్పడం జెప్పు'
మనిన, నతనికి సంజయుం డిట్లను:-'మనయందు భీష్మ ద్రోణ కర్ణ వికర్ణ వృష
సేన దుశ్శాసన లక్ష్మణాదులను, వారలలోన విరాట శతానీక ద్రుపద ఘటోత్క-
చాభిమన్యు పాండ్య ప్రముఖులను వేఱువేఱ నిట్టిట్టివారిచేత నిట్టిట్టివారు దెగి'రని
యేర్పడ నెఱింగించిన, నమ్మహీపతి 'గురుసేన నింక నెవ్వరు గల'రని యడుగు
టయు, నతం డశ్వత్థామ కృతవర్మ శల్య శకుని కృపాచార్యులం బేర్కొని,
బ్రదికియున్న కురుకుమారులను, గర్ణు కొడుకులలో నున్నవారలను, మఱియుం
గల యోధులను జెప్పి, 'వీరలం గొని యనికి నుత్సహించి, పొనఁగుపడ్డ యగ్గి
వేఁడిమి వోని వాఁడిమితో దుర్యోధనుండు ధైర్యం బవలంబించి, జయార్థి యై
యున్నవాఁ' డనిన విని, కొడుకు కడిమికి వెఱవెఱ యూఱడిల్లిన యుల్లంబునం,
దనవారు పెక్కండ్రు వొలిసిన యలమట మునింగి, యొక్కింత ప్రొద్దూరకుండి
రాధేయుదెగుట దలపోసి, యమ్మనుజనాథుండు— ౧౭

తే. 'ఆలలోని యాఁబోతునుబోలె నొప్పు
గురుబలంబులో నున్నద ద్విరదమూర్తి.

సింహసంహననుండు, విప్రపవిత్ర
మాభిరాముండు, వోయెనే యక్కటకట !' ౧౮

వ. అని తొడంగి, హాహాకారంబు లెసంగ రోదనంబు సేయుచు— ౧౯

క. 'సంజయ, మురభంజనుని ధ
నంజయునిం జీరికిం గొనఁడు కర్ణుం, డిం
ద్రుం డెనకి యైన గెలుచు న
నం, జచ్చెనె యట్టివాఁడునుం గయ్యమునన్. ౨౦

— ధృతరాష్ట్రుఁడు కర్ణుని శౌర్యమును బ్రశంసించి శోకార్తుఁ డగుట —

సీ. 'పాండుసూనులతోడి పగ కోర్చె నెవ్వని
యుత్సాహ మూఁది సుయోధనుండు,
వైదేహ పౌండ్రాది వసుధేశు లెవ్వని
కడిమిపొంపున నరిగాఁపు లైరి,
మనమూఁక లెవ్వని పెనుఁబ్రాపు గాంచి గ
ర్వితము లై సంగర క్రీడ నలుపు,
నద్భుతం బొనరించు నమరుల కెవ్వని
యసమాన వివిధ దివ్యాస్త్రమహిమ,

ఆ. యట్టి కర్ణుఁ డీల్గె నట్టె, యిం కెక్కడి
బ్రదుకు మనకు ? నేటి భండనంబు ?
దీని వినియు నాదుమానసం బేమియుఁ
గాదు, వజ్రమయము గాఁగ నోపు.' ౨౧

వ. అని విలాపించి మఱియును. ౨౨

క. 'పౌరి బంధుపుత్త్రమిత్త్రుల
పరిభవములు వించు, నిట్లు ప్రాణముతో నె
వ్వరు నుండుదురే యే నొ
క్కరుఁడును దక్కంగ ? నింతకష్టం బగునే.' ౨౩

వ. అని పలికి, మరణోద్యుక్తుం డై, జలాగ్ని విషప్రాయోపవేశాదు లగ్గడించిన
విని సంజయుం డతని కి ట్లనియె:— ౨౪

ఉ. 'కులమున శ్రీయుఁ దేజమున నకుంఠితకీర్తియుఁ జూడఁ దొంటిరా
జుల కెనవత్తు. నీవిటులు శోకసమాకుల చిత్తవృత్తివై
గలఁగుట యొప్పునే? శ్రుతము గౌరవముం బొగ దొందునట్లుగా
నిలుపుము. ధీరతాతిశయ నిష్ఠఁ జలింపకయుండ భూవరా.' ౨౫

వ. అనుటయు నాంబికేయుండు సంజయున కి ట్లనియె:— ౨౬

తే. 'శోకవారిధి పారంబు నాకుఁ బొంద
నేల వచ్చుఁ, జిత్తంబునఁ గీలుకొని య
సహ్యమై కర్ణమరణోపజనిత మైన
పరిభవం బమళల్య మాతురతఁ జేయ? ౨౭

క. 'పౌరుష మేటికి? దైవం
బేరూపునఁ జూడ ఫలదమే మందము. దో
ష్పార విశాంతోజ్జ్వలుఁ డగు
నా రాధేయుండు సచ్చె నర్జునుచేతన్. ౨౮

క. 'అలఘుతరాయువు నాకుం
గల దది యె ట్లనినఁ- బోరఁ గర్ణుని పాటేఁ
దెలియ వినఁగ నాడెందము
పలువలియలు గాక యున్నభంగి నెఱిఁగితిన్. ౨౯

క. 'మును లోకముచే సత్కృతి
గని నెగడెడువాఁడ. నాకుఁ గలవా రెల్లం
జన, శోచ్యుఁడ నై దుర్దశ
మనికి మనికి యగునె? దీని కోర్వఁగ వశమే.' ౩౦

సీ. 'దుఃఖపరంపర *గ్రొక్కనఁ బెట్టె నా
చిత్తంబు ననిమిషసింధు తనయు
పడుటయు, ద్రోణుండు పరలోకమున కేఁగు
టయు, సూతజాని తెగుటయును వినియు,
నందుఁ గర్ణుఁడు లేమి యత్యంతదుఃఖంబు
సేసె, దుర్యోధనునాస మానె,

* గ్రొక్కనబడియె నా చిత్త యయ్యనిమిష.

నతఁ డేడుగడయునునై యుండు. నతనికి
నెవ్వరు గలరు ది క్కింకఁ జెపుమ?

ఆ. మనబలంబు చేవయును. వైరిసైన్యంబు
భయముఁ జెడఁగ రాధపట్టి గొంతి
పట్టిచేత సమసిపడి యున్నవాఁడె. వా
నవుని కడిమిఁ బడిన జంభునట్లు। ౩౧

క. 'విను పిచ్చుకకుం బతిరయ
మునఁ బోకకుఁ బడుట. పేదముదుకఁడు వేశ్యా
జనముం గోరుట. దుర్యో
ధనుఁ డింక జయంబు గొనఁగఁ దలఁచుట యరయన్. ౩౨

క. 'మనలోఁ గయ్యం బేటికి
నని ధర్మసుతుండు చెప్పె. నది మీసతి గై
కొనఁ డయ్యె; రోగి పథ్యా
శనమునకుం జొరనిభంగి సంజయ. యెట్లున్. ౩౩

సీ. 'శరతల్పమున నుండి శాంతనవుండు దీ
ర్ఘత్వ దివ్యాస్త్రవైభవము దెలుపఁ,
దివిరి జలం బట్లు దెప్పించుకొని యప్డు
పాండుసూనులతోడి బాంధవంబు
నడపుము. సిరి పంచి కుడుచుట మే లింత
తోఁ గయ్య ముడిగి శాంతుఁడవుగమ్ము.
బ్రదుకుము పీ-వన్నపనుపు పేయఁడు
సుయోధనుఁ డిప్డు శోకాబ్ధి మునుఁగకున్నె?

ఆ. పడుచు లేక లూఁచ్చి పట్టి యాడెడునట్టి
పులుఁగుచంద మయ్యెఁ దలఁప నా య
వస్థ. యెందుఁ జొచ్చువాఁడ. వీయలమట
దీర్ప నెవ్వ రింక దిక్కు గలరు.' ౩౪

వ. అని పెక్కుభంగుల నివ్వటిలు నెవ్వగలు బయలుపడం బలుమాట లాడి. రాధేయు
తెగినతెఱంగు తెలియ వినం దలంచి యి ట్లనియె:— ౩౫

—♦ రణన్యాయమును పాండవులు తప్పినదానికి ధృతరాష్ట్రుని వగపు ♦—

మ. 'విజయుం దాఁకి పెనంగుచో నతని దోర్వీర్యంబు సైరించెనో,
భుజదర్పోద్ధతిఁ జూప నోపెనొ, చలంబుం జేవయుఁ జైన్యయు
గ్మజనంబుల్ వినుతింపఁ బేర్చెనొ, తొలంగం బాఱెనో, తెంపు న
క్కజపుంబెంపును దీఱ డింపఁడు గదా కర్ణుండు దీనాకృతిన్ ? ౩౬

క. 'తక్కటిపైవిను లవి న
య్యొక్కని దిగ విడిచి పాఱిరో, లావుం బే
రుక్కును మెఱయఁగఁ దోడ్పడి
పెక్కండ్రు పడిరొ బెరసుఁ బీనుంగులుగాన్.' ౩౭

వ. అని మఱియును; ౩౮

క. 'ముందర శిఖండి నిడి సం
క్రందన నందనుండు పేరి గంగాతనయుఁ
బ్రమందించెఁ గపటమున, నా
చంద మొకటి కర్ణునందు జర్పించిరొకో. ౩౯

క. 'సామజము పడిన-నశ్వ
త్థామ పడియె-ననఁడె ధర్మతనయుఁడు గురువిం
దా మడియించుటకై, య
ట్టేమేని యొనర్చి రొక్కొ యితఁడు పడుటకున్. ౪౦

క. 'మాయోపాయంబుల గాం
గేయుండును గురుఁడు నవిఁ బెగిర కాక, రణ
న్యాయంబు దప్పకుండఁగ
నా యరువుర నోర్వ నెవరికైనను వశమే. ౪౧

సీ. 'పరశురామునిచేతఁ బడసినవాఁడు బ్ర
హ్మాస్త్రంబు సర్పముఖాస్త్ర, మలఁతిఁ
బోవునె దివ్యాస్త్రములు ? పెక్కు మఱియును
గలవు రాధేయున కలవు మెఱసి,
యభిమన్యువిల్ దునుమాడఁడె నాగాయు
తత్రాణు ననిలనందనుని బాదు

దలఁ బట్టె, సహదేవుఁ జాలుకన మర్దించి
మందల విడువఁడే, మాయలాని

తే. మేటిమగని ఘటోత్కచు గీటడఁపఁడె ;
యట్టిజెట్టికిఁ బోరఁ జా వెట్టిభంగి
నయ్యెఁ ? దేరికి సూతున కంచితాస్త్రముల
కు దైవోపహతిఁ జేటు మూఁడెనొక్కొ. ౪౨

క. 'రథ మవితథ మైనను, సా
రథి పవి నెఱపిన, మహాస్త్రరాజి విధికృతిఁజ
వృథగా కున్నను, గర్ణునిఁ
బ్రథనంబున గెల్వ దేవపతికిఁజ వశమే ; ౪౩

ఉ. 'సారథి యెవ్వఁ డాతనికి ? శల్యుఁడు ద్రోణతనూభవుండు గాం
ధారవిభుండునుం గృపుఁడుఁ దత్సమయంబున నేమిభంగిఁ దో
డైరి ? సుయోధనుండు హృదయంబునఁ దాఁ గృతవర్మ దర్పము
ద్భిరము వచ్చి యుండుఁ, దగ నెయ్యము సూపెనె యాతఁ డత్తఱిన్.' ౪౪

క. 'వారలు గెలఁకుల నడవఁగ
రారాజు పిఱుందఁ గదిసి రా, నెబ్బంగిం
గారణము లేదు చావఁగ
నా రాధేయునకుఁ, జోద్యమయ్యెడుఁ దలఁపన్. ౪౫

ఉ. 'పాండవకోటి సూతసుతుపై నడతెంచిన చంద మెట్టు ? లా
ఖండల సూతి సర్పముఖకాండము తాఁకున రూపుమాపి పో
కుండుట యెట్లు కల్గె ? సమరోద్ధతి దక్కటి నల్వురందు నె
ట్లుండె ? బలద్వయంబు నెటు లోపి పెనంగె దినద్వయంబునన్ ?' ౪౬

—♦ అశ్వత్థామ కర్ణుని సేనాముఖము చేయుమనుట ♦—

వ. అనిన విని, సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె:- గయ్యంబుతెఱంగు మొదలు కొని చెప్పెద నాకర్ణింపుము: ద్రోణుండు దెగిన, నశ్వత్థామ తన యోపినంత సమరంబుసేసి చాలించి, సేనలఁ దివియించి మరలి వచ్చిన, దుర్యోధనుం డప్పుడు గొలువిచ్చియుండి, నశ్వత్థామ లోనగు దొరలం గలయం గనుంగొని-మనకు నిటమీఁదఁ జేయంగలపని యెయ్యది-యని యడుగుటయు, నగురుసుతుండు—

క. 'విను, మాదర ముత్సాహం
బనూన[1]ధార్ష్ట్యంబు నీతి యను సద్గుణముల్
పని సఫలం బగునట్టుగ
జననాథ, యొనర్చు దైవసాహాయ్యమునన్. ౪౮

చ. 'తలఁపఁగ సద్గుణంబులకుఁ దావల మై పెను పొందు నుజ్జ్వలా
త్ముఁడ వవి. రైన [2]నేఖరము దోఁపఁగ నీ దగు దొంటిశౌర్యముం
దలకొని నిర్వహింపు ముచితంబుగ. దైవము తోడుపాటునుం
గలిగెడుఁ గాక ; యున్న రథికప్రవరుల్ దలపోయ నల్పులే? ౪౯

క. 'మనము బలశౌర్యమునుఁ గ
ర్ణుని సేనాముఖము సేసి, నూల్కొని యరిమ
ర్దన మొనరింత, మితనియం
దనూనతం బొల్చు సద్గుణావలియు నృపా. ౫౦

క. 'వైవస్వతుచందంబున
నీ వీరుఁడు రిపుబలంబు నెల్ల నడంపం
గా వలఁతి, దివ్యశరశ
శావైభవ పరమవిష్ఠకలిమి నరేంద్రా.' ౫౧

వ. అని సూతపుత్రుం జూపిన, భవత్పుత్రుండు ప్రీతుండయి, యతండు పాండవుల జయించు ననునాస యగ్గలంబైన యంతరంగంబుతో నయ్యంగపతి కి ట్లనియె:-

శా. 'నీవిక్రాంతియు, నాపయిం గల యతిస్నేహంబుఁ బ్రఖ్యాతముల్
గావే! భీష్ముఁడు ద్రోణుఁడుం దెగుట నీ కౌరవ్యసైన్యంబులం
గావంగాఁ దగు నీకు, వారల యుపేక్షం గాక యిన్నాళ్ళు లే
లా వైరం బడఁగింప ? నీ వయిన లీలఁ గెల్తు కౌంతేయులన్. ౫౨

వ. 'నీవు ప్రాజ్ఞుండవు ప్రబలుండవు, విశేషించి నా కేతుగడయు నీవ. కావున నీకును మదీయ హితం బవశ్యకర్తవ్యం, బట్లుం గాక మన మా భీష్మద్రోణుల నవమానింతుము; వారలు భండనంబునం బడిన నొదిఁగియుండ నేర్తుమే? కడంగుము, పగఱకు నీకడంక చీఁకటికి సూర్యునుదయం బెట్టి దట్టి దయ్యెడుం గాక, బృందా

1. దక్షతయు నీతి.
2. నేఖరము దోఁపఁగనీక దొడంగి కార్యముం.

రకసేన సేనాని నడపినవాఁడవై వడిం గౌరవసైన్యంబు నడిపి నన్ను గెలిపింపుము. విన్ను నీవ సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టికొమ్ము' వినం బ్రీతుండయి, రాధేయుండు గాంధారేయునకుం బ్రహర్షంబుగా భూవల్లభులెల్ల నాకర్ణింప ని ట్లనియె : ౨౪

మ. 'విను, నీ కిచ్చినబాస యే మఱతునే? వీరంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్రవీర్యమును నీ భూలోకసంచారు లె
ల్లను గీర్తింపఁగఁ బాండుపుత్రుల మదోల్లాసంబు మర్దింతు, నీ
వనుమానింపక నిల్చి చూడుము మదీయంబైన సంగ్రామమున్. ౨౫

— * కర్ణుఁడు సర్వసేనాధిపత్యంబు వహించుట —

వ. 'నన్ను సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టు' మనవుడుఁ, బొంగి రారాజు దగు రాజులుం దానును శాతకుంభకుంభంబులం బవిత్రజలంబులు దెప్పించి, మహనీయ మణి కుసుమౌషధి గంధాక్షత మంత్రకలనం బాచరించి, సమున్న తౌదుంబరపీఠంబునం బరమాస్తరణం బొనర్చి, యంగపతి నందు నిలిపి, పుణ్యాహఘోషంబులుఁ దూర్యనినదంబులు వందిజనస్తుతులును జెలంగ నభిషేకించి, యలంకరించి పట్టంబుగట్టిన; నతండు భూసురోత్తములకు నర్థిజనంబులకును వివిధార్థంబులు దానత్యాగరూపంబున నొసంగుచు వెలింగె. నప్పు డుబ్బిన శూరయోధుల జయజయశబ్దంబులును, భూపతుల యభినందనవాక్యంబులును, గృష్ణసమేతు లగు పాండవుల గెలువుమని దీవనలిచ్చు మాగధుల యెలుంగులును నింగి ముట్ట, నవోదితుండైన భానుండునుంబోలె శోభిల్లు నా కర్ణుండు సముదీర్ణుండై యక్కురుపతి యాననం బాలోకించి— ౨౬

తే. 'బంధు మిత్రయుతంబుగఁ బార్థురూపు
మాపి, యే నిత్తు నీకు సామ్రాజ్యలక్ష్మి,
ధాత్రిఁ బాలింపు సుస్థితిఁ బుత్త్రపౌత్త్రి
గాఢ భోగార్హ మగునట్లు గాఁగ నధిప ! ౨౭

క. 'విను, సత్యధర్మరతుఁ డగు
మనుజునకుం గార్యసిద్ధి మసలక యగు బా

* భీష్ముఁడు పొలికలన పడునంతవరకు కర్ణుఁడు విల్లు ముట్టకపోయినను, ద్రోణుని నాయకత్వమున (ద్రోణపర్వము) ఎనిమిదితడవలు యుద్ధము చేసియున్నాఁడు. సర్వసేనాధిపతిగా ఇది ప్రథమయుద్ధము.

డ్పున, శౌర్యబాహువిక్రమ
ఘనుఁ డగు నా కాజి జయము గలుగుం జాలన్. ౭౮

వ. అని పలికె. వి త్తెఱంగున రాధేయు సర్వసైన్యముఖ్యుం జేసి, యతని మందిరం బునకు మహావిభవ సమేతంబుగాఁ బుచ్చి, సమస్తపరిజనంబులను నిజ నివాసం బులకుఁ బోవంబనిచి, సంతోషం బంతరంగంబు నిండి వదనంబున వెల్లిగొన, నీ కొడు కభ్యంతరావాసంబున కరిగె. రాత్రి యే నిట వచ్చి, ద్రోణు వృత్తాంతం బంతయు నీకుం జెప్పి, నీ వనుప మగిడి చని సూర్యోదయసమయంబున మన శిబిరంబు ప్రవేశించితి, నయ్యవసరంబున; ౭౯

—♦ కర్ణుఁడు వింత చెన్నుతో యుద్ధమునకు వెడలుట ♦—

సీ. తళతళ మనియెడు [1]దంత ప్రభలతోడ
ఘనకేతువున హస్తికక్ష్య మెఱయ,
హంసవర్ణములైన హయముల పటుగతి
నర్కప్రభంబగు నరద మొప్ప,
దీప్తకాంచన రసలిప్తమై చెలువొందు
వజ్యకార్ముకము హస్తమున వెలుఁగ,
[2]వీటికి సమరసమాటోప మొదవ నా
ఖీలశంఖము దనమ్రోల మ్రోయ,

తే. రణసముత్సాహలక్ష్మి వక్త్రమున వింత
చెన్ను వెలయింప, నా పుత్రు సేరి రెండు
పక్కియలయందు బవరంపుఁబటులు లెనఁగ
వడవ సొంపారి, కర్ణుండు వెడలె నధిప. ౮౦

వ. అతండు పడవాళ్లం బనిచి వెడల నియమించిన, నెల్లదొరలును దురంబునకువెడలి రట్లు సకలబలంబులు కలనికి నడవందొడంగిన; ౮౧

సీ. తురగ రింఖాముఖోద్ధూత ధూళీపట
లములు దిక్కులఁ బలంకరించె,
మాతంగకటి గళన్మదజల బహుళ ప్ర
వాహవిలాసంబు వాని నడఁచె,

---

1. ధవళ.
2. వీరరసాటోప విభవంబులెసఁగి నాఖీల.

బహువిధ వాదిత్ర భైరవారావంబు
పెల్లంబరము పిక్కటిల్లఁ జేసె,
శింజినీ టంకార సింహనాదంబుల
పెక్కువ యాత్రమోఁతఁ [1]బిలుచుకొనియె,

ఆ. లలిత భూషణముల రశ్ములఁ గేతన
చ్ఛత్త్ర చామరోపసక్త మణుల
రుచుల సుభట హేతిరోచులఁ, బవలింటి
దివియచంద మయ్యె దినకరుండు. ౨౨

వ. అట్టియెడ. ౨౩

క. జనములు భీష్మద్రోణులు
చనిన వగలు డిగ్గఁ ద్రావి, సంతోషము నె
క్కొనియెడు మనములతోఁ గ
ర్ణునిఁ గనుఁగొని రతివికాస రుచిర నయను లై. ౨౪

—♦ కర్ణున నాయకత్వమున మొకటినాటి పోరు – మొంపలి మొంగ్గరము ♦—

వ. ఇవ్విధంబున బలంబులకుం బ్రమోదం బెసంగ నడచి, రాధేయుండు దుస్సహం బుగా మకరవ్యూహంబు సమకట్టునెడ, నందుఁ దుండంబునఁ దాను నిలిచి, నయ నంబుల శకునియు నులూకుండును, శిరంబున నశ్వత్థామయుఁ, గంఠంబున దుర్యోధనానుజులును, [2]నుదరంబున దుర్యోధనుండును, ముందట వామపాదం బున నారాయణ గోపాలయుతుండై కృతవర్మయు, దక్షిణపాదంబునఁ ద్రిగర్త దాక్షిణాత్యసంవృతుండై కృపాచార్యుండును, వెనుక దాకాల నానాదేశసేనతోఁ శల్యుండును, వలకాల ననేక రథ కరి తురగ సమేతుండై సుషేణజననాథుం డును, బుచ్ఛంబున మహాసైన్య సమగ్రుండయి చిత్రుండను ధాత్రీపతియు నతని తమ్ముండగు చిత్రసేనుండును నిలుచున ట్లొనర్చి, తక్కినవారల నెడ నెడం బన్నించె. నటమున్న యుధిష్ఠిరుం డుద్దామ సామజాది చతురంగోల్లాస భాసితుం డయి నడతెంచె. నట్లు నడతెంచి, యమ్మనుజవిభుండు మనమొనం జూచి సవ్య సాచి కి ట్లనియె:— ౨౫

1. బిల్చికొనియె; బిల్చుకొనియె.

2. మధ్యంబున.

మ. "కనుఁగొనఁ జాల్కొ నైనయది కౌరవసైన్యము గంటె; సూతనం
దనుఁ దొకయొద్దుగా నిలిపి, తాను ముఖంబున నిల్చి, కయ్య మె
ల్లను దనమీఁదఁ బెట్టికొని, లావున వీరముఁ జూపఁ బూని యే
పున నతిమేర, భవచ్ఛిఖి పుంజములం దెగటార్పు మీతనిన్. ౧౬

క. "వనమునఁ బం డ్రెండేఁడులు
మన ముత్కట దుఃఖవార్ధి మగ్నులమై యీ
ట్లునికికిఁ దగ, నితని భవ
త్సునిశితబాణాబ్ధి ముంపు దుర్దమలీలన్." ౧౭

ఉ. "వీఁ డొకరుండె యింక బలవిక్రమసంపద గల్గి పోరిలోఁ
వాఁడిమి సొంపు సూపఁ గలవాఁడు సుయోధనుపాలఁ, బేర్చి నీ
వేఁడిమి సూపి, యీ పడఁపు వీనిఁ, బురందరపుత్ర, యంతతోఁ
బోఁడిమి మాలు నాతఁడు, ప్రభూతజయోన్నతి నిల్చు నీకడన్. ౧౮

—♦ అర్జునుని ప్రతివ్యూహము ♦—

వ. 'నీకుం బోలిన యొగ్గరంబు గావింపు' మనవుడు, నర్జునుం డర్ధచంద్రవ్యూహ విధానంబున మోహరించి, తాను మధ్యప్రదేశస్థుం డై, వామ దక్షిణశృంగంబుల భీమ ధృష్టద్యుమ్నుల నిలిపి, యుధిష్ఠిర నకుల సహదేవులం బింగలిగా నావర్చె. నతని చక్రరక్షకులగు యుధామన్యుండును నుత్తమౌజుండునుం గయ్యంపు వేడుక మొగంబులం జిగురొత్తఁ బొలిచిరి. తక్కినయోధులుం దగినచోట్ల నిలిచి, రి ట్లిరువాఁగును బన్ని యున్నసమయంబున— ౧౯

మ. హరియును బాండునందనులు నాజి నవశ్యము వేఁడు సూపఁ బో
దురు జము నంచు, నాత్మఁ బరితోషముఁ బొందె భవత్తనూజుఁడున్;
దురమునఁ గర్ణయుక్తముగఁ ద్రుంగు సుయోధనుఁ డాతలంపుతోఁ
బరమ సముద్యమస్ఫురణఁ బాండవముఖ్యుఁ డెలర్చె భూవరా. ౨౦

ఆ. ఒకటి కొకటికంటె నుబ్బుచు వర్తించు
చాడ్పు దోఁప రెండుసైన్యములును
బొలిచె నపుడు, మెఱఁగె భూరిభేరీ ముఖ
తూర్యములు నభంబు దూఁటుకట్ట. ౨౧

వ. చిందముల మ్రోఁతకు నిందు నందునుం దమకించి భటులు గెలంకులం దాఁకఁ, దోడ్తో నెఱపిన యగ్గలిక నొండొంటిం బెరయ యొగ్గరంబు లురవడించి; ౨౨

సీ. వివిధ ఘంటావళీ నిక్వణంబులతోడ
భీషణబృంహిత ఘోషములును,
ఘనవేమి విస్ఫురధ్వనుల [1]పొందులఁ గేతు
నిర్ఘర కింకిణీ నినదములును,
జటుల ఖురవ్రాత పటురవంబులతోడ
నాభీల హేషా మహాస్వనములు,
భూరి భుజాస్ఫాలనా రావములతోడ
మేదురతర సింహనాదములును,

ఆ. బరఁగి, దిక్తటములఁ బగిలింప, ననిమిష
ఖచర సిద్ధ యక్ష గరుడగణము
లంతరంగములు నితాంత కౌతుక భరి
తములు గాఁగఁ జూడ్కి గములు వఱపె. ౬౫

వ. ఇట్లు దలపడి, యిరువాగును బేరువాఁడిఁ బోరునెడ, గరుడ ప్రహారంబుల నొచ్చిన పంచాస్య పన్నగంబులం బోని బాహువులను, గాంతత్వ రుచిసౌరభంబుల పెంపున సంపూర్ణచంద్రార్క కమలంబులం గ్రేణిసేయు నాననంబులను సంగ్రామరంగం బలంకృతం బయ్యె. వాహనంబుల మీఁద నుండి భూషణకిరణంబులు మెఱయ, పైవికలు నేలం గూలునప్పుడు పుణ్యావసానకాలంబున నాకలోకపదభ్రష్టం బగు మహాత్మలోకంబు చందంబు దోఁచెఁ. జతురంగంబులును దమతమ జాతిచేతం బడుటయు, నేనుంగు లదరిన నరదంబులు నదియుటయు, నాశ్వికులు వావివివం గరులు ధరం దొరంగుటయు, భటు లురవడించినం దురంగంబులు గడికండంబు లగుటయు, రథంబులు గవిసినం గాల్బరు దుమురగుటయుఁ, గ్రందున నెల్ల తెఱంగులు నన్ని దెఱంగులం గలయ బడలు వఱచుటయు, రౌద్రరసంబుఁ బెనిచె. నావసమయంబున సాత్యకి ధృష్టద్యుమ్న చేకితాన *ద్రౌపదేయులు ప్రభద్రక చేది పాండ్య చోళ మగధ వంగాదిదేశంబుల బలంబులతోడ బరవసంబు సేసి తఱిమిః రట్టియెడ— ౬౬

1. పొందున.

ద్రౌపదేయులు :—

పాండవులు ఇంద్రప్రస్థపురమునందు 13 ఏండ్లు ఉండురు. మొట్టమొదట అభి మన్యుఁడు జన్మించును. ఆవల అదమము 10 ఏండ్లకు, ద్రౌపదియందు, పాండురాజనంద నులకు, వరుసగా ప్రతివింధ్య, శ్రుతసోమ, శ్రుతకీర్తి, శతానీక, శ్రుతసేనుఁడు – అను ఉప పాండవులు జనింతురు. (ఆది. 8–228)

—♦ భీముని విజృంభణము ♦—

ఉ. దంతిఘటల్ మహోగ్రసముదగ్రతతో నడతేర, దర్పదు
ర్దాంత గజాధిరోహణ వితాంత సముజ్జ్వలభంగిఁ బ్రౌఢవి
క్రాంతివిలాస మొప్పఁగ, నఖండితపౌరుషుఁ డైన భీముఁడ
త్యంత సముద్ధతిం గవిసె నస్మదనీకము సంచలింపఁగన్. ౩౭

క. ఉదయాచలమున రుచిసం
పదఁ బొలుచు పతంగుపగిదిఁ [2]బ్రసర త్తీవ్ర
ప్రదరములు నెఱయ మెఱయఁగ
మదావళముమీఁద వెలిఁగె మారుతి యధిపా. ౩౮

వ. అమ్మహావీరు నాలోకించి, కులూతదేశాధీశుం డయిన క్షేమధూ ర్తి నిజబలంబులం బురికొల్పికొని, యేచి త్రోచి యాహ్వానంబు సేసి, తనకరటిం గొలిపిన, నది గిరి గిరిం దాఁకుతెఱంగున నతని మాతంగంబునకు మార్కొనియె; నయ్యిరువురు నొండొరులపై దోమరస్తోమంబు లడరించి యార్చుచు, నుద్దండపరాక్రమంబులగు వేదండంబుల పటుప్రచారంబులు చారుభీషణంబులుగా నొకళ్ళొకళ్ళం జుట్టుకొని వచ్చుచుం బెనంగి; ౩౯

---

ఘటోత్కచుడు అభిమన్యునికి అధమం 7 ఏండ్లముందు పుట్టి ఉన్నాఁడు.
జూదమునాటికి పాండవులకు - 59, 58, 57, 56 ఏండ్లు.
ఘటోత్కచునికి - 31.
అభిమన్యునికి - 24 (సుభద్ర).
ఉపపాండవులకు - 14, 13, 12, 11, 10 ఏండ్ల ప్రాయము లుండులు.
పాండవుల ఇతర పత్నులు - తనయులు (స్వయంవర లబ్ధలు)
ధర్మజ - దేవిక - యౌధేయ
భీమ - జలంధర - సర్వగ
అర్జున - ఉలూపి - ఇలావంత
చిత్రాంగద - బభ్రువాహన
నకుల - రేణుమతి - నిరమిత్ర
సహదేవ - విజయ - సుహోత్ర
(వీరు యుద్ధమున పాల్గొనినట్లు లేదు).
కర్ణుఁడు ధర్మరాజుకంటె పదేండ్లయినా పెద్దగా నుండును. (ఆది. 4-116).
2. ప్రస్ఫురిత శిఖప్రదర.

క. కోదండంబులు గొని బా
హాదర్పము లెసఁగఁ బోరి, యన్యోన్య ధను
శ్ఛేదంబులఁ బోరిఁ బోరి నా
పాదించిరి జనులు రయము ప్రసుతి సేయన్. ౭౮

వ. దానం గోపం బగ్గలించి. ౭౯

తే. శక్తులను దోమరంబుల సరభసముగఁ
బొడిచె భీమసేనుని పేరురమున
క్షేమధూర్తి సముజ్జ్వలతోమరంబు
లేదు నాటించె దర్పంబు రూఢి కెక్క. ౮౦

ఉ. అనిలతనూభవుండు దపనాంశునిభంబగు తోమరంబు వై
చిన, నడుమం గరూశపతి చిత్రముగాఁ దునుమాడి, వీఁక నా
తనిఁ బటుషష్టి కాండ పరితాడితదేహునిఁ జేయ, మేటివిల్
గొని యతఁ డక్కులూతపతి కుంజరముం వెసఁ గప్పె నమ్ములన్. ౮౧

వ. అట్లు భీమసేనుండు గరూశపతి విక్రమంబు సరకుసేయక, యతనిదిక్కునం జూడక, క్షేమధూర్తి సామజంబును సాయకమయంబుఁ జేసిన, నది మొగతిరిగి పఱచినం బోవనీక యప్పావని వెనుకొనుటయు, నక్కులూతపతి ప్రయత్నంబున నమ్మాతంగంబు మరల్చి, యతని యంగంబునను దద్గజంబు శరీరంబునను విశాత శరపరంపరలు పఱపిన: ౮౨

ఉ. ఉఱక సమీరసూనుఁడు దదుగ్ర ధమర్దళనం బొనర్చి, యే
త్తెఱఁ గతి నొంప; నాతఁడు గడిందిమగంటిమి నొందువింట న
న్నెఱిఁగులు గ్రమ్ముకోల నతనిం గడునొంచి, తదీయహస్తి పా
ల్పఱి మహి మ్రొగ్గ సేసిన, ధరాధిప, నీబల మార్చె నుబ్బునన్. ౮౩

మ. గద సేతం గొని దంతి డిగ్గి చని, యా కౌంతేయుఁ డవ్వీరుని
న్మదమాతంగముఁ గూల నేసినఁ, గృపాణ స్ఫారదోర్దండుఁడై
కదియంగా వచ్చె నతండు; నిష్ఠుర గదాఘాతంబునం గూల్చె నే
పు దలిర్పంగా వెస నా మరుత్తనయుఁ డాభూమీశు భూమీశ్వరా. ౮౪

వ. ఇవ్విధంబున నేనుంగు పీనుంగుకడన పడిన క్షేమధూర్తి వజ్రప్రహారంబునం గూలిన కులశైలంబు సమీపంబున నిర్ఘాతపాతపతితం బైన కంఠీరవంబుకరణి

నొప్పె నతనిం గనుంగొని మనమున వెఱచఱచి పఱచినఁ, బాండవబలంబులు వెనుకొనుటయు; ౨౩

—♦ కర్ణుడు మాఱొడ్డి పేర్చుట ♦—

మ. పటుబాణప్రకరంబు లంబరముఁ గప్పం గర్ణుఁ డాపేనఁ దాఁ
కుటయుం, సైన్యము దైన్యముం దొఱఁగి మార్కొన్నం భుజాసంప దు
త్కట గర్వోద్ధురభంగిఁ బాండుసుతులం దర్పంబు సొం పేర్పరిం
చుటకుం జొచ్చినఁ, బేర్చెఁ బో రవిమిషస్తోమద్భుతాపాది యై. ౨౪

వ. అందు, ౨౫

క. సూతతనయ నారాచ
స్యూతము లై వారణంబు లొఱుఁగు సొగయుం
భూతలమునఁ బొరలు దెరలు
పే తూలను జిట్టుఁ ద్రిరుగు విచ్చుం జచ్చున్. ౨౬

వ. అప్పుడు నకులుం డతని మార్కొనియె. భీమసేనుం డశ్వత్థామను, సాత్యకి గైకేయు లగు విందానువిందులను, జిత్రసేనుం డనురాజు శ్రుతకర్మను, బ్రతివింధ్యుండు చిత్రుం డను మనుజనాథుని, ధర్మపుత్రుండు దుర్యోధనుని, ధనంజయుండు సంశప్తకులను, ధృష్టద్యుమ్నుండు గృపాచార్యుని, శిఖండి గృతవర్మను, శ్రుతకీర్తి శల్యుని, సహదేవుండు దుశ్శాసనునిం దలపడి; రట్టియెడ. ౨౭

—♦ సాత్యకి విందాను విందులఁ గూల్చుట ♦—

సీ. *శైనేయుతోడ విందానువిందులు మహా
హవము సేయంగ నయ్యాదవోత్త
ముఁడు పేర్చి, వారి కార్ముకములు రెంటిని
దునిమి యంగంబుల నినిచెఁ దూపు,
లవ్వీరు లన్యశరాస నోద్దాము లై
యతనిపైఁ బఱపిరి శితశరంబు,
లతఁడును వారు నన్యోన్యచాపచ్ఛిదా
వైచిత్రి నొప్పారి రేచి, దొడ్డ

* శైనేయుఁడు – శిని యాదవులలో నొక ప్రసిద్ధుఁడు. అతని సంతతివాఁడైన సాత్యకి – శినివరుఁడు.

తే. విల్లు గోవి యతిరయమున భల్లనిహతి
వాతఁ దనువిందుతల ద్రుంప, నది ప్రదీప్త
రత్నకుండల శోభాభిరామ పతన
భంగిఁ దదనీక శోకసంపాది యయ్యె. ౯౦

మ. కవి. విందుండు ప్రదీప్తచాపధరుఁ డై కాండప్రసారంబులన్
శివిపీరుం గుసుమాఢ్య కింశుక సముం జేయంగ, నయ్యోధుఁ డా
శివి యంగంబులఁ బంచవింశతి శితాస్త్రంబుల్ వడిం గ్రుచ్చె నే
పున, వా రొండొరు సూతులం దునిమి విప్పుల్ రాలుకన్దోయితోన్. ౯౧

తే. ఒకట లొకటల హయముల నుర్విఁ గూల్చి,
యొండొరుల కార్ముకమ్ములు ఖండితములు
సేసి, తేరులు డిగ్గి రుద్భాసితాసి
చర్మశోభితహస్తు లై సంభ్రమముగ. ౯౨

వ. ఇట్లు పాదచారు లై మండలప్రచారంబుల మెఱయుచు. ౯౩

క. చేరి బహుచిత్రగతులం
బోరంగా నొడ్డనములఁ బొలిసెం బలకల్
నేరిమియై [1]గెలన్న శివి
వీరుం దిరువఱియ గాఁగ విందుని వ్రేసెన్. ౯౪

—♦ ధృతరాష్ట్రుని మనుమఁడు శ్రుతకర్మ వీరవిహారము ♦—

వ. ఇత్తెఱంగున నయ్యిరువురం జంపి, సాత్యకి యుధామన్యు తేరెక్కి యుక్కున
నేకొక్కరథంబు సన్నద్ధంబు గావించుకొని కైకేయబలంబులం బఱపెఁ. జిత్ర
సేనుండును నీ మనుమం డగు [2]శ్రుతకర్మయుం బెనంగునెడ, నా శ్రుతకర్ముండు

క. ఆరాజు నైదువాలిక
నారసముల నొంప, నతఁడు నవశరముల న
క్కౄరవుని నేసి నొంచెను;
సారథి నైదింట నధిక సంరంభమునన్. ౯౫

1. గెడపున.

2 ఇతఁడు ఎవరికొడుకో ఏర్పడలేదు.

చూడు ఇదే ఆశ్వాసము_148 వ పద్యం. ఇచట శ్రుతకర్మ_ధృతరాష్ట్రుని కొడుకుగా చెప్పబడుచున్నది. శ్రుతవర్మ అని పాఠాంతరము.

సీ. శ్రుతకర్మ కోపించి క్రూరనారాచ మ
  జ్జననాథు జత్రుదేశమున నాటఁ,
బడి [1]మూర్ఛవోయినఁ బైపయి వెండియు
  నేయఁ దెప్పిలి యతఁ డెఱుక మెసఁగ,
నుక్కునఁ దునుమాడె నక్కుమారుని శరా
  సన, మతఁ డొండొకచాప మెత్తి
తఱుచుటమ్ముల నేసి వెఱిగిన చందంబు
  పేపె రయంబునఁ జిత్రసేను;

తే. నాతఁ డాతని యురమున శాతశరము
  దూఱ నేయ, నబ్బాలుండు తోన వివిధ
  బాణముల నా నృపుని ముంచి శోణితమున,
  భల్ల మొక్కటఁ దల నేల ద్రొల్ల నేసె.  ౯౧

—౹ ద్రౌపదేయులలో అగ్రజుఁడు ప్రతివింధ్యుఁడు చిత్రుఁడను రాజును జంపుట ౹—

ఉ. ఏలినవాని పాటు గని యేత్తెఱఁ దప్పల మొక్కపెట్ట యా
  భీలతఁ జుట్టు ముట్టుటయుఁ, బేర్చినయుద్ధతిఁ దీవ్రసాయక
  జ్వాలల నేర్చి, యుద్భట భుజావిభవం బలరంగ నగ్గతం
  బోలె, మదాత్త విక్రమ కుతూహలి [2]ప్రతివింధ్యుఁ డుర్విపా.  ౯౨

---

1. బీరువోయిన.

2. ఈ మనుమఁడు పాండవేయుఁడు. ద్రౌపదియందు ధర్మజునికి గల్గిన పెద్దవాఁడు.
  శా॥ ఉద్రేకంబునవారు, శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు, కిం
  చిద్ద్రోహంబును నీకుఁజేయరు బలోత్సేకంబుతోఁ జీఁకటిన్
  భద్రాకారులఁ జిన్నపాపల, రణప్రౌఢ క్రియాహీనులన్,
  నిద్రాసక్తుల, సంహరింప నకటా! నీ చేతులెట్లాడెనో!
  (భాగవతం 1-స్కం.-161)

అని పోతన కమ్మటి కవిత్వమునజెప్పి తెలుఁగువారికి మచ్చుమందు చల్లినాడు. ఉప పాండవులు చిన్నపాపలుగారు, అంతకుముందే రణప్రౌఢ క్రియాహీనులునుగారు. ఈ పెద్ద పోరు సంగతి అటుండనిచ్చి,

మ॥ రథవక్షోభిత మేదినీతలముపై రథ్యప్రచారంబు లొ
  ప్ప భుజాగర్వము నెమ్మొగంబులఁ దలిర్పం, గన్నె శయ్యంబు వ

సీ. అప్పుడు ప్రతివింధ్యుఁ డై దుబాణములఁ జి
త్రుని మేను నొంచి, తత్పూతువక్ష
మునఁ గ్రూరశరములు మూఁడు నాటించి, యొ
క్కమ్మునఁ గేతు వల్లార్చి పేర్చి,
యతఁడు దన్నుగ్ర నవాస్త్రపీడితుఁ జేయ
విల్లుద్రుంచి, వెనఁ బంచవిశిఖ విహతుఁ
గావించి, శక్తి యుగ్రమ్ముగ వైచినఁ
బెఱచ నాలుగు దువియలుగఁ జేసె;

తే. నలిగి యాతండు గదవైచి యక్కుమారు
ఘోటకంబుల సూతునిఁ గూల్చె, నదియ
పట్టుకొని వైచె మగుడ నప్పాండుపౌత్రు
చేయి వడి నుచ్చి పోవ వచ్చిత్రుఁ దధిప. ౯౯

ఉ. బాహువు నొచ్చినం గినిసి, భాసురతోమర మెత్తి కౌరవ
వ్యూహము సంచలింప, నతఁ డుగ్రత వైచినఁ గంకటంబుఁ ద
ద్దేహము నుచ్చి పోవుటయుఁ ద్రెళ్లె, నరేశ్వర, యవ్విధుండు వ
జ్రాహతిఁ గూలు పర్వతమునాకృతి నుత్కట వైకృతంబుగన్. ౧౦౦

వ. ఇట్లు చిత్రుండు దెగటాఱినం గనుంగొని, మనయోధులు ప్రతివింధ్యుపై నడరి, యనేకాస్త్రశస్త్రంబులం బొదివినం, బొలివోని కలితనంబున నేల తుటికి యక్కుమారుండు గోదండ టంకారంబున నంబరంబు పూరించుచు, బాణాసారంబు వరఁ

ర్థి తపత్సుత్రుల మీఁది కోపమున నుద్దీపింప నేతెంచి ర
య్యభిమన్యుండును ద్రౌపదేయులును మాద్యద్దంతి యూథాకృతిన్॥
(భీష్మ. 1-100)

అని, కన్నె కయ్యమును, అంటే ప్రథమయుద్ధమునకు (Maiden Battle) పోయినట్లు చెప్పబడి, ఉపపాండవుల యుద్ధకళాప్రౌఢి పెక్కుతావుల వర్ణింపఁబడి యున్నది. ఇప్పటికి వీరు కౌరవప్రాయములో ఉన్నారు (20-24). ఇంతేగాకుండా భారత సౌప్తికపర్వం ప్రకారం వీరందరు నిద్రబోవుచున్నప్పుడు చంపఁబడి వచ్చినెత్తుటి మడుగులో పారవేయఁబడలేదు. అశ్వత్థామతో ఒక్కొక్కరు బిరుసుగాపోరి వీరస్వర్గ మలంకరింతురు.

కర్ణుని అర్ధరథునిజేసి క్రిందికి యీడ్చిన భీష్ముఁడు. (ఉ 4-234)
"ద్రౌపదేయులు మహారథు లేవురు" అని పైకి ఎత్తిపెట్టినాఁడు. (ఉ. 4-260)
పౌరాణికులు తికమకచేసిన కథాంశాలలో ఇది ఒకటి.

గింపఁ బాండవసైనికుల బెట్టిదంపుటురవడిం గదిసి యతనికిం దోడ్పడుటయుఁ
దనవారలు విచ్చి వెన్నిచ్చి పఱచి. రప్పు డశ్వత్థామ భీమసేనుల సంగ్రామంబు
భీమం బయి చెల్లె. నందు— ౧౦౧

—♦ భీమసేన అశ్వత్థామల భీమ సంగ్రామము ♦—

క. గురుపుత్రుఁడు దొంబది శిత
శరములఁ బావనిరథంబు సంవృతముగఁ జే
సె. రయం బారంగ సాయక
పరంపరలు వఱపె నతనిపై. నతఁ డలుకన్. ౧౦౨

వ. వాని మగిడించి, ౧౦౩

క. అనిలజు ఫాలము గురునం
దనుఁడు పటుప్రదరకీలితము సేయుడు, నా
తని విటలంబున నతఁ డే
పున బాణత్రయము నాటె భూవరముఖ్యా. ౧౦౪

వ. మఱియును— ౧౦౫

చ. గురుసుత భీమసేను లతిఘోరవిధంబులఁ బోరి, యొండొరుం
దెరలుప లేనిసామ్యమున దీపితు లై, లయకాల విస్ఫుర
త్తరణియుగంబుఁ బోలె శరధామ సమగ్రతఁ బ్రజ్వరిల్లి యొ
ప్పిరి రథ చిత్ర చారు లఘుభీషణ సంచరణంబు లొప్పఁగన్. ౧౦౬

తే. వారి వీక్షించి-ఖచరులు వోరు లెందుఁ
జూడమే! దీని కెన యవి యాడఁగలదె!
కలుగ వింకను, వీరలబలముఁ జలము,
నలవు వెరవు నిట్లుండ నే-యనుచునుండ, ౧౦౭

చ. ఒండొరు కేతువుల్ దునిమి, యొండొరు సూతుల నొంచి, యేపుమై
నొండొరు తేరివాహముల యుబ్బడఁగించి, నిశాత విస్ఫుర
త్కాండచయంబు లొండొరుల కాయములన్ వడిఁ గ్రుచ్చి. వ్రాల ం
ప్పాండుసుతుండుఁ గుంభజాపపట్టియు మూర్ఛలు దమ్ముఁ గ్రమ్మిపన్. ౧౦౮

వ. ఇట్లు రథంబులపై నొఱగి మూర్ఛిల్లిన, ౧౦౯

క. అనిలజు సారథియును, గురు
తనయుని రథచోదకుఁడు నతని నాతనినిం
గొని యుల్లంబుల బలితపుఁ
దునుకు సొరఁగ ననికిఁ దొలఁగఁ దోలిరి రథముల్. ౧౧౦

— ఉపపాండవుఁడు-శ్రుతకీర్తి శల్యునితో పోరుట —

ఉ. క్రీడితనూజుఁ డైన శ్రుతకీర్తియు శల్యుఁడు నేచి, దిక్కు ల
ల్లాడఁగఁ బోరుచో, శరము లాఱయిదుల్ శ్రుతకీర్తి శల్యుమై
గాడఁగ నేయ, మూఁడు పటుకాండము లాతనిమేనఁ గ్రుచ్చి, సం
తాడితుఁ జేసె సూతు నిశితప్రదరంబున నాతఁ డుద్ధతిన్. ౧౧౧

చ. నరతనయుండు దత్తనువు నాటఁగఁ దొమ్మిదియమ్ము లేచి, న
త్వరముగ సూతునంగమున వాలికతూపులు మూఁడు నాటి, వి
స్ఫుర శరపంచక స్ఫురణ చూపినఁ గోప మెలర్ప, నమ్మహీ
శ్వరుఁడు గడంగి విల్ దునిమి సప్తశరంబుల నొంచె నాతనిన్. ౧౧౨

వ. అట్టియెడ; ౧౧౩

సీ. వేఱొక్క వి ల్లెత్తి వివ్వచ్చుకొడు కఱు
వదినాలుగమ్ములు వఱపె మద్ర
పతిమేన, నతఁడు దొంబదితూపు లదరించి
యేసె నవ్వీరు శరాసనంబు
ఖండంబుగ, వాఁడు గం డడంగక గద
వైచినఁ బొడిసేసి యేచి, శక్తి
విగిడింపఁ దునుమాడె, నిశితభల్లంబునఁ
ద్రుంచెఁ దదీయ సూతుని శిరంబు,
ఆ. వాయుజవము లైనవాహంబు లప్పుడు
గలఁగి యరద మనికిఁ దొలఁగ నీడ్చెఁ
దెఱపి గాంచి శల్యుఁ డటిమిఁ జొచ్చి క
లంచెఁ బాండుసుతుబలంబు నధిప. ౧౧౪

సీ. కమలాకరములీలఁ గలఁచి యాడెడుగంధ
దంతావళము సముద్దండతయును,

దరమిడి మృగసముత్కరము ఘోరంబుగా
వధియించు కంఠీరవంబు నేఁపు.
వీరసారణ్యంబు నిర్వరాటోపతఁ
గాల్చు దావాగ్ని యుగ్రక్రమంబుఁ.
బ్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమ
యించు ఫాలాక్షుని యేర్తెఱయును.

ఆ. [1]బోల్పఁ బట్టు నయ్యె. భుజగర్వ శౌర్య
ప్రతాప దుర్దమ ప్రకోపములకు
మద్రవిభుఁడు గోలుసునఁగి శాత్రవసైన్య
హననకేలి సల్పునవసరమున. ౧౧౫

—♦ దుశ్శాసనుఁడు సహదేవునితో యుద్ధంబు సేసి మూర్ఛిల్లుట ♦—

ఉ. ధీరజనోత్తముండు సహదేవుఁడు మైగలి దుస్ససేనుఁడున్
వీరులు పిచ్చలింపఁ బ్రజ విన్నద్రువం బొరి నార్వఁ బోరుచో.
వారక సాయకత్రయము వాఁడిమి నయ్యువరాజు నొంచె వి
స్తారమనోజ్ఞ హారలసితంబగు నాఘనబాహు వక్షమున్. ౧౧౬

చ. ధృతి వాగడొంద నేచి సహదేవుఁడు నీసుతు శాతదీప్తస
ప్తతిశర విద్ధుఁ జేసి. వడిఁ దద్రథచోదకు మార్గణత్రయా
హతుఁడుగఁ జేయు. నల్గి వెస నాతని చాపము ద్రుంచి. యాతఁడు
ద్ధతి యలరంగ దెబ్బది శితప్రవరంబుల మేను నొంచినన్. ౧౧౭

సీ. నకులానుజుఁడు గృపాణంబున వైచిన
దుస్ససేనుని విల్లు దునియ లయ్యె.
నెద గని యవ్వీరుఁ దేచి బల్వింట మం
టలు గ్రమ్మ నమ్మేయుటయు. నతండు
గడువెన నెత్తిన కరవాలమునఁ ద్రుంచి.
యతనిమై లక్షించి యదియ వైవ
నడుమన యాతండు నఱికినఁ. బ్రస్ఫుత
చాపంబు గొని చతుష్షష్టి నిశిత

1. బోల్పఁబడియె నపుడు.

ఆ. కంకపత్త్రములను గదఁక నయ్యువరాజు
పరఁగఁ జేయుటయును, బాండుతనయుఁ
డదఁచె నొక్కటొకటి నైదైదు తీవ్ర శి
లీముఖముల బాహులీల మెఱయ. ౧౧౯

వ. ఇట్లు విక్రమవిజృంభితుం డై సహదేవుండు శతశాతశిలీముఖంబు లడరించిన,

శా. రయమున వాని నన్నిటి శరత్రితయంబునఁ ద్రుంచి, సాయక
ద్వయమున నాతనిం, బటు నవప్రదరంబుల సారథిన్ భవ
త్ప్రియతనయుండు నొంచి, దివి దీటుకొనంగఁ జెలంగి యార్వ, న
త్యయ సమవర్తిచాడ్పున నతం డుదిత భ్రుకుటీవిలాసుఁడై. ౧౨౦

మ. పటునారాచము దీప్తిజాలము నభోభాగంబునం బర్వ, ను
త్కటవేగంబున నేయ గంకటము వక్షఃపీఠముం దూఱి, నె
త్తుటి పొందేమియు లేక యుచ్చి చనినం దూగాడి, యాతండు గ్రా
లటయుం, దేరు దొలంగ సూతుఁడు భయాలోలాకృతిం దోలినన్. ౧౨౧

క. అమ్మాద్రీపుత్రుఁడు వా
లమ్ముల దుశ్శాసనుని మహాసైన్యము రౌ
ద్రమ్ముగఁ గలంచె దివిజ గ
ణమ్ము వినుతి సేయఁ, దమమొనలు నలి నార్వన్. ౧౨౨

—♦ నకులుఁడు కర్ణునితోఁ దలపడి పరాభూతుఁడగుట ♦—

చ. నకులుఁడు సూతపుత్రుఁడుఁ బెనంగుచునెడన్, నకులుండు సూతపు
త్రకునకు నిట్లనుం: 'దలఁచి దైవము నేఁడు విజృంభనన్నదృ
ష్టికి నమఁ బాత్రభూతుఁడుగఁ జేయుట గానఁగ వచ్చె నాదు చూ
డ్కికి నిను గోచరంబుగ ఘటించిన యాచతురత్వ సంపదన్. ౧౨౩

క. 'కౌరవపాండవులకు నీ
వైరము నీవలనఁ గాదె వచ్చెను? నిను మ
ద్ఘోర శరవిహతిఁ బడఁ గ
న్నారఁ గనుంగొనక కోప మాఱునె యొంటన్.' ౧౨౪

చ. అనవుడు, 'రాజసూతివి మహాస్త్రవిదుండవు నైన నీకు ని
ట్లనుట దలంప నర్హ మగు, నైనను జెన్నఁటిపల్కు లేల? నె

ట్టన భుజశక్తి మార్తుర కదంక యదంచినఁ బల్కు టొప్పఁగా
క. నిలిచి చూపు పీచఁము కల్మియుఁ జేతుల బల్మియుం దగన్.' ౧౨౫

వ. అని పలికి కర్ణుఁడు ; ౧౨౬

సీ. ఉబ్బి మాద్రీసుతు డెబ్బదిమూఁడుదూపులఁ
గప్పుటయు, నతఁ డలిగి యతని
పై డెబ్బది విశితబాణంబు లేపిన
నాసూతనందనుఁ డక్కుమారు
ధనువు నుగ్గుగఁ జేసి, తనువున ముప్పది
కాండముల్ నొవిపిన, నొండువిల్లు
గొని డెబ్బదింట నాతని నొంచి, మూఁడు మా
ర్గణములు సూతునంగమునఁ జిలిపి

తే. భల్లమున విల్లు దునుమాడి, యెల్లజనులు
నద్భుతం బందఁ ద్రిశతసాయక పరీతుఁ
జేసె నకులుండు, విస్ఫుర హాసభాసి
తాననాంభోజుఁ డై పొలుపారె నధిప. ౧౨౭

క. సూతసుతుఁడు బలువిలు గొని
యాతవిపక్షమున నాటె నై దమ్ములు, వి
ఖ్యాత సమస్తశరముల
నాతఁ డతని నొంచి, విల్లు నఱిముఱిఁ ద్రుంచెన్. ౧౨౮

వ. మఱియు నొక్క మహనీయ కార్ముకంబు గొని కర్ణుడు గడంగె. నప్పు డయ్యిరు
వురు నొండొరుల తూపులు ద్రుంచుచు, విజమార్గణంబుల నొక ల్లొకళ్లనెత్తుట
ముంచుచుం బేర్చి వివిధ విశిఖజాలంబు లపరించిన నంబరంబు శలభపటల
సంవృతంబునుంబోలె నుండె. నాసమయంబున నకులు నగ్రభాగంబునకు వచ్చిన
పోమకబలంబులు గర్ణ క్రూరనారాచాది బహుళ బాణపాతంబులఁ బలాయితంబు
లయ్యెఁ. గర్ణునకు బాసటయై తఱిమిన కౌరవసైనికులు మాద్రేయు రౌద్ర విజృంభ
ణంబున దూరవిఘటితు లైన ట్లిరువాఁగును నెడ గలిగి చూచుచుండ, వారథికో
త్తము లుదాత్తఘోరాకారంబుల నుల్లసిల్లి, భల్లప్రముఖ ప్రదరంబులఁ బరస్ప
రాంగంబులం బొదివి, యంబుద పిహితమూర్తులగు మార్తాండ శశాంకులవందంబు
నొంది, యన్యోన్య దివ్యాస్త్రతేజోవిలాసంబుల నయ్యైయస్త్రంబుల వారించుచుం
బోరి. రట్టియెడ. ౧౨౯

క. అలుక వొడమి కర్ణుండు న
కులుచాపము ద్రుంచి, సూతుఁ గూల్చి, తురంగం
బులఁ జంపి, చక్రరక్షుల
తలలు నఱికి, సిడము ద్రుంచి, దరహాసముతోన్. ౧౩౦

వ. మెఱసినం, గుపితచిత్తుండై — ౧౩౧

చ. పలకయు వాలునుం గొనియెఁ, బాండుకుమారుఁడు [1]పెక్కు చెక్కులై
యిలఁ దొరఁగంగ నేసె, గద యెత్తినఁ ద్రుంచె, రథంబు డిగ్గి యు
జ్జ్వల పరిఘాభిరాముఁ డయి వచ్చిన నప్పరిఘంబు రూపుమా
పి, లసిత లాఘవస్ఫురణ పెంపునఁ గర్ణుఁడు నొంచె నాతనిన్. ౧౩౨

ఆ. మర్మ భేదులైన మార్గణంబుల కోహ
టించి, సిగ్గుఁ జలము డిగ్గఁ ద్రావి,
యెల్లజనులుఁ జూడఁ బొల్లఁదనంబున
కోర్చి యక్కుమారుఁ డోడి పాఱె. ౧౩౩

— కర్ణుఁడు నకులుని అవమానించి వెల్లబుచ్చుట —

క. వెనుకొని రాధేయుఁడు నిజ
ధను వాతని కంధరమునఁ దగిలిచి నలిఁ బ
ట్టిన, నింద్రచాప పరిగత
ఘనాకృతిని బొలిచె నతఁడు కౌరవనాథా. ౧౩౪

వ. ఇట్లు పాండుతనయు బాడుదలఁ బట్టి, మందస్మిత సుందరాననుండై — ౧౩౫

క. 'పలుకులు వృథగా నన్నుం
బలికితి, మున్నింక నెన్ని పలుక వలసినం
బలుకుము నీకేఁ దగ; నా
యలవుఁ జలము నీ వెఱింగి తంతియ చాలున్. ౧౩౬

క. 'అల వెఱఁగి పెనఁగు పెనఁగం
దలచిన, నది గాక సిగ్గు దలకొని యనికిం
దొలఁగుట యింకిట దగు, వి
చ్చలవిడి నర్జునునికడకుఁ జనుము కుమారా.' ౧౩౭

---

1. రెండు.

క. అవి విడిచె నకులుఁ, గుంతిన
చనములు దృఢవృత్తి చిత్తసంకలితము లై
యువికిం గర్ణుం; డతఁడును
జని ధర్మజునరద మెక్కె నవ్రీడముగన్.

వ. ఎక్కి, యిట్టూర్పు నిగుడం గుంభనిక్షిప్త భుజంగంబుచందంబున నుండె. నవ్విధం బున మాద్రీపుత్ర మానమథన విజృంభితుం డగు నవ్వీరుం డప్పుడు మధ్యందిన గతంబైన మార్తాండబింబంబునకుం బ్రతిబింబంబునుంబోలెఁ బ్రదీప్తమూర్తి యై, వెలిమావులను వెలివడగయు నుల్లసిల్ల, శోభిల్లు తనరథంబు రయంబున దర్శ నీయంబుగాఁ బాంచాలబలంబు దఱిసి, పెక్కుతెఱంగుల మెఱుంగుటమ్ములగ ములు గదియించి; ౧౩౯

సీ. సూతులఁ దెగటార్చి, కేతనంబుల వీట
తాటంబు సేసి, రథ్యములఁ గూల్చి,
చామర చ్ఛత్త్ర భూషణములు పొడి సేసి,
రథికజనముల శిరములు ద్రుంచి,
కొమ్ములు నఱికి, యంకుశములు దునిమి; తొం
డములు ఖండించి, కుంభములు వ్రచ్చి,
జోదుల తనువులు భేదించి, మోరలు
గళ్యాలతోడఁ జెక్కలుగఁ జేసి,
ఆ. కంధరములు దుల్చి, కాళ్ళులు ద్రెంచి, యా
శ్వికులఁ జంపి, చర్మ విశిఖ కుంత
ముసల ముద్గర ప్రముఖ సాధనములు భ
గ్నములు సేసి, భటుల సమయఁ జూచి. ౧౪౦

వ. బాహువిలాసంబు మెఱయ నెఱయం బొలిచె. భవత్పుత్రుం డగు యుయుత్సుండు పర్వతప్రతిముం డగు నులూకుపయిం గవిసి, కులిశ నిభం బగు విశిఖంబున నొంచినఁ గోపించి యాఁబల్లిదుండు విల్లువిఱుగ నేయుటయు, నక్కుమారుండు— ౧౪౧

—♦ కౌరవుఁడు-యుయుత్సుఁడు,
సౌబలనందనుఁడగు నులూకుని మార్కొనుట ♦—

తే. మేలువిలు గొని యఱువదినాలుగమ్ము
లతని మెయిఁ గ్రుచ్చి, సాయకత్రితయ నిహతి

సూతు నొప్పించి, మఱియు విశాత శరచ
యమ్ము వరఁగించె నధికరయమ్ము మెఱయ. ౧౪౨

వ. దానం గనలి, ౧౪౩

క. బలువిడి నులూకుఁ డిరువది
శిలీముఖము లొడలఁ జొనిపి, పిడము రయమునై
విలఁ గూల్చిన, వీసుతుఁ డు
జ్జ్వలవిశిఖము లయిదు నాటె వానియురమునన్. ౧౪౪

వ. ఇట్లు నాటించిన నొచ్చి, యా సౌబలనందనుండు రౌద్రంబు రూపంబు దాల్చిన రుద్రువిధంబున విజృంభించి: ౧౪౫

శా. భల్లం బొక్కటఁ జంపె సూతునిఁ, జతుర్బాణాహతిన్ వాజులన్
ద్రెల్లంజేసె, విశాత పంచవిశిఖాటోపంబునం జించె వీ
రోల్లాసంబు వికాసముం బొరయ, మే నుక్కేది నీనందనుం
డెల్లం జూడఁగఁ బాఱి, యొండొకరథం బెక్కెం గురుగ్రామణీ. ౧౪౬

క. గెలుపున మెఱు వొదలఁగ సౌ
బలసూనుఁడు రథము పఱపి, పాంచాలబలం
బులగులపడఁ బలుదెఱఁగుల
యలవుల విహరించె నుద్భటాటోపమునన్. ౧౪౭

— నకులసుతుఁడు_శతానీకుని విజృంభణము —

సీ. శ్రుతకర్మ నకులుని సుతుని శతానీకుఁ
దాఁకి యశ్వంబుల ధరణిఁ గూల్చి,
సూతునిఁ బరిమార్చెఁ: నాతఁడు గద వైచి
రథవాహనముల సారథిని గేత
నముఁ బొలియించె, భూరమణ యిమ్మెయి విదు
[1]తనయుండు నకులనందనుఁడు విరథు
లై, యొండుదేరుల కరిగిరి శ్రుతసోముఁ
దలపడి కడిమి గాంధారనాథుఁ

1. శ్రుతకర్మ ఇచట ధృతరాష్ట్రపుత్రుఁడుగా చెప్పఁబడుచున్నది. కాని ఇదే ఆశ్వాసము ౬౮ వద్యమున మనుమఁడుగా పేర్కొనఁబడినది. శ్రుతవర్మ అని పాఠాంతరము.

తే. దతని యదరించి, వివిధసాయకము లెల్లఁ
దునిమి, బాణత్రయంబునఁ దమవు నొంచి,
తురగముల నరదమ్ముఁ గేతువుఁ దిల ప్ర
మాణశకలంబులుగఁ జేసె మద మెలర్ప. ౧౪౮

— భీమసేనపుత్రుఁడు శ్రుతకీర్తి సౌబలునితో యుద్ధము చేయుట —

మ. విరథుండై పొలివోనిబీరమునఁ బృథ్వీభాగసంచారియై
శరజాలంబుల భీమసేనసుతుఁ డాశ్చర్యంబుగా, నీమఱం
ది రథం బేర్తెఱఁ గప్పినం, దునిమె నుత్సేకోగ్రుఁ డై యమ్మహీ
వరుఁ డబ్బాలుని చాపదండము భుజావష్టంభ మేపారఁగన్. ౧౪౯

చ. అతఁడు ప్రదీప్తఖడ్గము రయంబు మెయిం గొని, యానృపాలుఁ డు
ద్ధతిఁ బరఁగించు సాయకశతంబులు ద్రుంచుచు మల్లపిల్ల, న
ప్పతి పటుభల్లఖండిత కృపాణునిఁ జేసిన నీడఁబోక, చే
తి తునియ బెట్టు వైచె, జగతీవర, యాతనివిల్లు రెండుగన్. ౧౫౦

వ. ఇట్లు కోదండంబు దుండంబులు సేసి తొలంగి, యక్కుమారుండు శ్రుతకీర్తి స్యందనం బెక్కె; సౌబలుండు వేఱొక్క విల్లెత్తి యత్తెఱపి నురవణించి పాండవరథికులం గలంచెఁ. గృపాచార్య ధృష్టద్యుమ్నులు పెనంగునెడ గౌతముండు పాంచాలవరుం బొదువునాటోపం బాలోకించి యక్కౌంతేయసైనికులు దమలోన.

— ధృష్టద్యుమ్నుఁడు కృపాచార్యునితోఁ బోరి పారిపోవుట —

ఉ. 'ద్రోణుపరాభవం బధికరోషము సేయఁగ నున్న యీతఁ డ
క్షీణపరాక్రమంబు విలసిల్లఁగ, నీద్రుపదాత్మజుఁ గత
ప్రాణునిఁ జేయ కే లుడుగుఁ? బై కొను, నంతటఁ బోక విస్ఫుర
ద్బాణవిలాసముల్ నెఱపుఁ దా మనసైన్యము దల్లడిల్లఁగన్. ౧౫౧

వ. అని వెండియు; ౧౫౨

మ. 'వరదివ్యాస్త్రవిదుండు బాహుబల గర్వస్ఫేమ నిర్వాహకుం
డరులం జీరికిఁ జేకొనం డితఁడు, క్రోధాత్తాత్ముఁ డై నేఁడు ని
ర్భరశౌర్యంబు నుదాత్తధైర్యము నుదగ్రస్ఫూర్తి శోభిల్ల దు
స్తర దర్పోద్ధతిఁ దేక యున్నె మనలం దా నేలకుం గోలకున్. ౧౫౩

వ. 'ధృష్టద్యుమ్నుండును బెండుపడి యున్నవాఁ' డనుచు నుండె. రట్టియెడ బెట్టిదంబు
లగు గృపాచార్యుల తూపులయేపు రథ్యంబుల నొంచి, సారథి గ్రొవ్వడంచి, యా
ద్రుపదనందను తనువు నెత్తుటం దోఁచి, యుల్లంబు గలంచె; నప్పు డాతని
సూతుం డతనితో నిట్లనియె :— ౧౫౫

చ. 'వినుము కుమార, విప్రభుజవీర్య మవార్యతఁ దేజరిల్లెడుం,
జనవు భవత్సమగ్ర శరజాలము లీతనిమీఁద, దైవసం
జనితము సువ్వె! యియ్యెడరు సంగర మిట్టిది తొల్లి యెందు నా
కవినది లేదు, తేరు దొలఁగం గొనిపోవుట కార్య మిత్తఱిన్. ౧౫౬

వ. 'నీయట్టివాని విక్రమంబునుం దిట్టివయట్లు నమయుటంజేసి యిమ్మహాత్ముం డవ
ధ్యుండని నిశ్చయించితి; నామాట కియ్యకొను' మనవుడు, నా వృషతపౌత్రుం డిది
యట్టిద యని నిశ్చయించి పలికి, మఱియు హీనస్వరంబున నిట్లనియె :— ౧౫౭

చ. 'చరణములుం గరంబులును నంచలభావము నొందఁ జొచ్చె, మే
నిరవిరఁ బోవు చున్నయది, విహ్వల మయ్యె మనంబు, నీతల
పరయఁగ మేలు; మారుత సురాధిప సూనులలోన నల్ల నొ
క్కరుదెసకై రథంబు దొలఁగం గొని పొ మ్మడిబీర మేటికిన్.' ౧౫౮

చ. అనవుఁడు సూతుఁ డెంతయు రయంబునఁ దేరు వృకోదరాంతికం
బున కెగవంగ శంఖరవముఁ గుణనిస్వనముఁ నిగిడ్చి, యే
పునఁ గృపుఁ డుజ్జ్వలప్రదర పుంజములం బరఁగంగఁ జేయుచుఁ
వెనుకొని పొల్చి నిల్చె, గిరి వెన్కఁ నిల్చిన వజ్రికై వడిన్. ౧౫౯

—♦ కృతవర్మ శిఖండుల యుద్ధము ♦—

తే. తడఁగి కృతవర్మతోడ శిఖండి పెనఁగు
చుండి, శరపంచకంబున నురము నొంప,
నతని నయ్యాదవోత్తముఁ డలఘుషష్టి
విశిఖవిద్ధునిఁ జేసి విల్ విఱుగనేసె. ౧౬౦

క. ఒండుశరాసన మెత్తి శి
ఖండి గురియు నవతిసాయకమ్ములు పెలుచఁ
ఖండించె నతఁడు, తత్కో
దండం బా ద్రుపదనృపతి తనయుఁడు నఱకెన్. ౧౬౧

క. ధనువు దునిమి. కొమ్ములు [1]మురి
సిన వృషభముచంద మగుడు. శీఘ్రస్ఫురణం
దనువున శితశరములు వడిఁ
జొనిపి, యతం డతని గళితశోణితుఁ జేసెన్. ౧౬౩

ఉ. అలుక మనంబునం గదిరి యాదవసత్తముఁ డొండువింట దో
ర్బల మెసఁగంగ, దెబ్బదిశరంబుల నాతని మేన రక్తధా
రలు దొరఁగించి, పెక్కుప్రదరంబులు పైవయి వేయుచుండ, న
గ్గలికిఁ బెనంగె వెండియు, శిఖండి విచిత్రరథప్రచారుఁడై. ౧౬౪

వ. ఆ ద్రుపదనందనుండు జత్రుదేశంబున నంబకత్రయంబు నాటించిన. ౧౬౫

శా. క్రూరోల్లాసము పల్లవింపఁ, గృతవర్మం డుగ్రదీప్తిస్ఫుర
న్నారాచంబులు పెక్కు లొక్కమొగి మేనం గ్రువ్వ, మూర్ఛిల్లె న
వ్వీరాగ్రేసరుఁ, డప్డు సారథి భయావిర్భావ దీనాత్ముఁడై
తే రచ్చోటు దొలంగఁ దోలుటయు, భీతిం బాఱెఁ దత్సేనయున్. ౧౬౬

వ. వివ్వచ్చు విక్రమవిహారంబున కోర్చి, శిబి త్రిగర్త సాల్వ సంశప్తక సైన్య నారాయణ గోపాలోపేతుండై సత్యసేన చంద్రదేవ మిత్త్రదేవ మిత్త్రవర్మ పౌశ్రుతి సువర్మ సుశర్మాదు లగుసోదరసుతులు బాసటగాఁ ద్రిగర్తపతి పెనంగునప్పుడు;

సీ. సత్యసేనుఁడు మూఁడుసాయకంబుల మిత్త్ర
దేవుండు షష్టిసందీప్తమార్గ
ణంబులఁ, గ్రూరబాణంబులు మూఁటను
జంద్రదేవుఁడు, శరప్తకమున
మిత్త్రవర్ముఁడు, గంకపత్త్రి త్రిసప్తతి
పౌశ్రుతి, యేడు నిశాత విశిఖ
ములను శత్రుంజయుఁ, డలఘువింశతికాండ
ములను సుశర్ముఁ డుజ్జ్వల నవాస్త్ర
తే. ములను గప్పి రప్పార్థు, నాబలియుఁ డంబు
దములధారలు వొదువ మదాత్తరేఖ
గరము వొలుపారు మేదినీధరము భంగిఁ
దలఁపఁ, బట్టగుధీరతఁ బొలిచె నధిప. ౧౬౭

1. దునిసిన.

వ. ఇట్లు సుస్థిరుండై మిత్త్రదేవునంగంబునఁ గంకపత్త్రశతంబును, సత్యసేను తను వున మార్గణత్రయంబును, సుశర్మ మిత్త్రవర్మల శరీరంబుల శిలీముఖాష్టక నవకం బులను బఱపి, శత్రుంజయు శిలాశితశరంబులం బడవైచి, సౌశ్రుతిం బంచ వింశతికాండంబుల గీటడంగించియుఁ, జంద్రదేవుని నెనిమిది యమ్ములం దునిమి యుల్లసిల్లిన: ౧౬౮

—♦ సత్యసేనుఁడు శ్రీకృష్ణుని క్షతగాత్రునిగాఁ జేయుట ♦—

చ. కనకపుఁ గామతోమరము గర్వ మెలర్పఁగ నెత్తి పద్మనా
భుని భుజశాఖ యుచ్చి చన, భూరిబలుండగు సత్యసేనుఁ డు
క్కున విగిడింపఁ, జేతి మునికోలయుఁ బగ్గములున్ మహీతలం
బున నొగలందునుం బడిన, భూవర, పార్థుఁడు క్రోధదీప్తుఁడై ౧౬౯

క. హరిదెసఁ గన్గొని 'యాతని
యరదముఁ గదియంగ నడపు మరద' ముననుడుఁ, జె
చ్చెర నొండొక మునికోలం
గర ముద్ధతి నడపె ఘోటకంబుల నతఁడున్. ౧౭౦

క. తేరతని యరదమునకుం
జేరువ యగుటయును, గ్రీడి శితబహుభల్ల
స్ఫారగతుల గాత్రశిరో
దారణ మొనరించి యొప్పె దరహాసముతోన్. ౧౭౧

వ. ఇట్లు సత్యసేనునిఁ జిత్రవధంబు చేసి; ౧౭౨

చ. ఘనతర [1]వత్సదంత శరఘాతమునం బడవైచి, మిత్త్రవ
ర్మని రథసూతు నట్టి దొకక్రూరపుఁదూపున నుర్విఁ గూల్చె, నా
తని సముదీర్ణమై పెలుచఁ దాఁకి త్రిగర్తబలంబు సుట్టు ము
ట్టిన వివిధోగ్రసాయక పటిష్ఠత నొప్పి కలంచె నేపునన్. ౧౭౩

—♦ విష్వచ్చుని బీభత్సవిహారము ♦—

వ. వెండియు సుశర్మని జ్ఞాతులు వోక పెనంగిన. ౧౭౪

ఆ. వెండిపింజఁ బొలుచు వెడఁద యమ్మున మిత్త్ర
సేన ధరణినాథుశిరముఁ ద్రుంచి,

1. సర్ప.

వాఁడినారసము సువర్మవక్షంబున
నాఁటె నయ్యమర్త్యనాథసుతుఁడు. ౧౬౫

వ. అట్టియెడ సంశప్తకగణంబు లన్నియు నార్పులు వింగి ముట్ట నలుదిక్కులం గిట్టి, బెట్టిదంబులగు నస్త్రశస్త్రపరంపరలు గురిపిన, నమ్మేటివిలుకాఁడలుక నూవిన యలంతి నవ్వుచెలువంబు మొగంబునకు వింత చెన్నొనంగ విజృంభించి, యైంద్రాస్త్రంబు ప్రయోగించిన, నది ప్రదీప్తభల్లాంజలిక ప్రముఖ విశిఖరూపంబుల బరఁగుటయు. ౧౬౬

సీ. తేరుల చెక్కులు, వారణంబుల ఖండ
        ములు, భూషణంబుల పొడియు, ఘోట
కంబుల తునియలుఁ, గరవాల తోమర
        శర పరిఘాదుల శకలములును,
రథికజనంబుల వ్రయ్యలుఁ, జామర చ్ఛత్ర
        కేతువుల యంశములు, భటుల
తుమురును, రౌతుల తుండంబులును. గంక
        టముల భాగములుఁ, జిందముల నుఱుము
తే. గలపి నెత్తుట మునిఁగి ప్రేవులఁబెనంగి
మెదడ్రుంగి, వియచ్చర హృదయములకు
నద్భుతంబు బీభత్సంబు నావహింప
సంగరాంగణ మతిఘోరభంగి యయ్యె. ౧౬౭

వ. అప్పుడు. ౧౬౮

క. కరి హయ శవముల, విఱిగిన
యరదంబుల, విషమమైన యాజిక్షితి, నె
త్తురు రొంపిలోన రథ్య
స్ఫురణకతనఁ దవులఁబడక శోభితగతి యై. ౧౬౯

—♦ దుర్యోధన ధర్మజాల ద్వంద్వయుద్ధము ♦—

తే. నరుఁడు దీవ్రశరార్చులు వరఁగఁజేయఁ
గలఁగి, హతశేష సంశప్తక వ్రజంబు
పలుగడల విచ్చుటయుఁ, బొగ వాపి మెఱయు
నగ్నియుంబోలె వెలుఁగొందె నాతఁ డధిప. ౧౭౦

ఉ. కౌరవరాజు ధర్మజుఁడు గయ్యము సేయునెడం, గడంకమైఁ
గౌరవరాజు ధర్మజుని కాయమునన్ వవసాయకంబులన్,
సారథిమేన నొక్కపటుసాయకమున్ విగిడింప, నాతఁడు
న్ఘోరతరాత్ముఁడై యతని నొంచెఁ ద్రయోదశసాయకాహతిన్. ౧౮౧

వ. నొంచి తోడన; ౧౮౨

తే. తునియలుగఁ జేసె హరులఁ జతుశ్శరముల,
సూతుఁ బంచమమున, ఘనకేతుయష్టి
షష్ఠమునఁ, జాపదండంబు సప్తమమున,
నలిగి యెత్తిన కరవాల మష్టమమున. ౧౮౩

క. ఆలోనన యజ్ఞనపతి
వాలిక నారసము లైదు వక్షమున వడిం
గీలించి, ధైర్యసారము
దూలించినఁ, దొలఁగి నీసుతుం డిల కుఱికెన్. ౧౮౪

చ. వికల రథప్రయత్నుఁ బృథివీపతిఁ గన్గొని, ద్రోణపుత్ర క
ర్ణ కృపులుఁ దక్కనుం గలుగు నాయకులున్ రయ మార వచ్చి, తూ
డికొనుట సూచి, యెంతయు వడిం జనుదెంచిరి ధర్మసూను చెం
తకు సముదగ్రులై యతనితమ్ములు సంగరకౌతుకంబునన్. ౧౮౫

వ. ఇత్తెఱంగున నపరాహ్ణంబున దొరలమొత్తంబు లొక్కటెసఁగం దార్కొనిన, నుభయ బలంబులు నురవడించి కలయం బెరసినం, గ్రందుకయ్యం బయ్యె. నందుఁ జిందంబుల మ్రోఁతయు, నార్పుల యులివును, బాణకృపాణాది హేతి సంఘట్టనంబునం బుట్టురణనంబును, రథావయవాస్థి కపాల భంజనంబున నెసంగు నినదంబునుం గూడి పరఁగిన దిక్కులు పిక్కటిల్లెఁ; గరుల కొమ్ములం జిక్కి వ్రేలు తురంగంబులును, నందుకొని చొచ్చిన సుభటులు పెరివివ నొఱగి కూలు శుండాలంబులును, నాశ్వికుల మొగంబునం బడి బులాయంబులు సొచ్చిన నరో వరంబులచందంబగు కాల్బలంబులును, రథికులు వోక పెనంగిన నఱవఱలయిన యరదంబులును, నెత్తురు కాలువలును, గండల తిట్టలును, బ్రేవుల ప్రోవులును, నెమ్ముల రాసులును, నత్యంతరౌద్రంబు నావహించె ననుటయు, నాంబికేయుండు:-

చ. 'సమరము పెంపు చెప్పెదవు సంజయ, చెప్పవు నీవు మీమహీ
రమణునిభంగి, ధర్మజు శరంబులచే విరథత్వ మొంది మా
నము( జలము౦ దెగం దొల(గెనా? మగుడం బరికొంట లేదె? వి
క్ర_మ చెపుమా, తనూజు భుజగర్వవిహీనత నొంచె( జిత్తమున్.' ౧౭౫

వ. అనిన నాసూతనందనుం డమ్మానవపతి కి ట్లనియె:— ౧౭౬

తే. విరథు( డయ్యెన కాని, యవ్వీరు( డాహ
వంబు దక్క_క, యొండురథంబు వన్ని
కొని సమద్ధతి వచ్చి, సక్రోధ మైన
మనముతో సూతునకు నిట్టు లనియె నధిప:— ౧౭౭

ఆ. 'శెల్ల [1]నీవిరులను వెల్లవిగొడుగు నై
యల్లవా(డె పాండవాగ్రజుండు।
మెఱసియున్నవా(డు వఱపు మచ్చోటికి
రథము ఘోటకముల రయము మెఱయ.' ౧౭౮

వ. అనుటయు నతండు నట్ల చేయ, నయ్యుధిష్ఠిరుండు నిజసారథి నాలోకించి 'యహి
కేతు మహితం బై వచ్చుచున్న ధృతరాష్ట్రనందన స్యందనంబునకు సమ్ముఖం
బుగా మనరథంబు నడపు' మనుటయు, నాతం డవ్విధం బాచరింప, నయ్యిరువు
నతిరథికులకు( బ్రకటప్రథనం బయ్యె. నట్టియెడ, ౧౭౯

సీ. పాండవుచాపంబు ఖండించె నీకొడు,
కొండొక ధను వెత్తి యుఱక యాత(
డక్కు_రునాథు విల్ గ్రక్కు_న( దునుమాడె,
నత(డు వేఱొకవింట నతని నేయ,
నయ్యుధిష్ఠిరు(డు నానాస్త్రంబు లేపిన
నాచ్ఛాదితం బయ్యె నంబరంబు,
వా రొండొరులు ర క్తధారాప్లుతుల(
జేసి పుల్లకింశుక భంగి( బొలిచి, రేచి

ఆ. ఘోరశక్తి నైచె( గౌరవపతి, యది
నడుమ( దునిమి, ధర్మనందనుండు

1. హారుల రథము; నైనసిడము.

నొంచె విశిత విశిఖ పంచకమ్మున నమ్మ
హీశునురము, దర్ప మెసక మెసఁగ. ౧౯౨

వ. ఇట్లు కౌంతేయముఖ్యుచేత నొచ్చియు గాంధారీనందనుండు; ౧౯౩

చ. బరవస మొప్పఁ గ్రూర నవభల్ల విదారితుఁ జేసె నమ్మహీ
శ్వరు, వతఁ డల్గి బల్విడుగుచాడ్పు శిలీముఖ ముచ్చి పోవ న
క్కురుపతి నేయఁ, గయ్యమునకుం దుది యప్పుడ చేయువాఁడుగా
నరదము డిగ్గె, నాతఁడు గదా కలనోద్ధృత బాహుదండుఁడై. ౧౯౪

క. డిగి, రయమునఁ గదిసిన నా
జగతీపతి యేచి యుగ్రశక్తి నురము బె
ట్టుగ వైచిన, నీతనయుఁడు
మగుడఁగ రథ మెక్కె వింట మూర్ఛనువాఁడై. ౧౯౫

క. అత్తఱిఁ గడుఁ బెల్లుగఁ గ్రొ
వ్నెత్తురు వడియుటయు, నతఁడు నిర్భరమూర్ఛా
యత్తుఁ డగుడుఁ, గృతవర్మఁ డు
దాత్తత నెడసొచ్చె బాహుదర్పము నెఱయన్. ౧౯౬

—♦ విజయుఁడు పోరులో దూరుట ♦—

ఉ. ఆతనిఁ దాఁకె వీఁక ననిలాత్మజుఁ డప్డు బలంబు మారుతో
ద్ధూత పయోధివోలె వడిఁ దోడ్పడియెం గృతవర్మ, కంత ను
ద్ద్యోతితశంగి వచ్చి విజయుండు వెసం దునుమాడె లీలమైఁ
జేతులతేఁట వోవ రథ సింధుర వాజి భటోత్కరంబులన్. ౧౯౭

వ. అంత; ౧౯౮

క. కురుపతి దెప్పిఱి, బాహు
స్ఫురణంబు దలిర్ప నింద్రజుని మూర్ఛని, వి
స్ఫుర వివిధ విశిఖ వినిహత
శరీరుఁ జేయుటయు, నతఁడు సక్రోధుం డై. ౧౯౯

తే. కార్ముకముఁ గేతువును ఘోటకముల సూతు
వెడఁద బలుతూపు లేడింటఁ బడమిఁ గూల్చి,

భల్ల మొక్కట వనవి పెవ్విల్లు దునిమి,
ప్రాణముల్ గొనఁ జాలెడుబాణ మేసె. ౨౦౦

క. కని, యాఱమ్ముల నెడ నడి
దునియలు గావించె గురుసుతుం, డాతని వి
ల్లును హరులఁ దునిమి పార్థుఁడు
దనుమార్కొను కృపుని చాపదండము ద్రుంచెన్. ౨౦౧

—♦ కర్ణార్జునులు ఒకరిపై నొకరు విజృంభించుట ♦—

చ. పదిఁ గృతవర్మ దాఁకిన, నవారణఁ దద్ధనువుఁ హయంబులఁ
పిడమును రూపుమాపి విలసిల్లి యెదిర్చిన దున్నసేను విల్
నడిమికిఁ ద్రుంచి, గాండివగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల నె
క్కుడు మద మొప్పఁ గర్ణుదెసకుం జన, నారథికుం డుదగ్రుఁడై; ౨౦౨

క. అన్నరుని మూఁడుశరముల,
వెన్నుని నిరువది నిశాతవిశిఖముల వెనఁ
భిన్నాంగులఁ జేసి, విజయు
మున్నేసినయన్ని బాణముల బిట్టేసెన్. ౨౦౩

వ. అంతకు మున్ను సాత్యకితోడం బోరి పోరి, యా రాధేయుండు దవదెవ కడరిన,
కవ్వడిం గని యక్కడ మొగం బయి యటు పరాక్రమించినం జూచి, యేచి
యానవ్యసాచి కడ్డపడి, యక్కేశవామజుండు— ౨౦౪

తే. నవ తిశరముల, నవమార్గణముల, శత శి
లీముఖంబుల నేసి దోర్లీల మెఱయ,
సారథి ధ్వజ హయ రథ సహితముగ ను
దీర్ణదర్పుఁ డై కప్పె నక్కర్ణుఁ డధిప! ౨౦౫

వ. అప్పుడు యుధామన్యుండును శిఖండియు ద్రౌపదేయులు నుత్తమౌజుండును
యుయుత్సుండును గవలును ధృష్టద్యుమ్నుండును జేకితానుండును బ్రభద్రక
చేది కరూశ మాత్స్య కేకయ వత్సబలసమేతంబుగా ధర్మనందనోత్సాహ దీపి
తాటోపశోభితు లయి కవిసి, వివిధాస్త్ర శస్త్రవ్రాతము లాహూతనూతనయి నడ
రించిన, నవ్వీరుండు— ౨౦౬

మ. అవి వేగంబ మరల్చి భూరి పవనవ్యాపార నిర్మర్దితా
టవులం బోలఁగఁ జేసి, దంతి భట ఘోట స్యందనశ్రేణులన్
దివిజవ్రాతము పిచ్చలింప రభసోద్రేకంబు రౌద్రంబుఁ బెం
వ విజృంభించె, ధనుర్గుణధ్వని నభోభాగంబు భేదింపఁగన్. ౨౦౭

మ. కని, గాండీవధరుండు దర్ప మెసఁగం గర్ణాస్త్రజాలంబు నీ
మున వారించి, శిలీముఖార్చులు పరిస్ఫూర్జత్ప్రభం బర్వఁ, దే
ర్చివఁ గార్చి చ్ఛదరక్ష మృగంబులు భయోద్రేకంబునం బాఱు చా
డ్పున నీమూఁకలు నల్గడం బఱచె నుద్భూతభ్రమార్తంబులై. ౨౦౮

—♦ కర్ణుని సర్వసేనాధిపత్యమున ప్రథమదివస సమరము ముగియుట ♦—

వ. అంత నంశుమంతుం డపరగిరి యవులకుం జనుటయు, ధరాధూళికిఁ దోడు సంధ్యా
రాగమిళితంబైన తిమిరంబు గవిసిన, నెద్దియుం గాన రామిం జిత్తంబులు
గలంగ, రాత్రియుద్ధంబునకు నోహటించుటంజేసి మనవారలుఁ బాండవసైనికులు
దళిమినం దాల్మి వాటింపక తిరిగిపోయిరి. జయంబు సేకొని వీరి నవ్వుచు వారు
గవ్వడిం గమలనాభునిం బ్రశంసించుచుం జని. రవ్విధంబున నుభయసైన్యంబులు
నిజశిబిరంబుల కరిగి విశ్రామంబు నొందె, నని చెప్పుటయు; సంజయునకు ధృత
రాష్ట్రుం డి ట్లనియె: — ౨౦౯

'తెల్లము మిమ్ము నందఱ వధింపఁగ నయ్యమరేంద్రనందనుం
డొల్లక పోక, వాఁడు దనయుగ్రత సూపెద నన్న మీమహీ
వల్లభు వారికేల యమవహ్నుల కైనను రూపుతోడఁ బోఁ
జెల్లదు గాన తద్భుజవిశేషము రూఢము గాదె సంజయా? ౨౧౦

సీ. 'యాదవ వీరచయంబు నాటోప
సముద్రేక ముడిపి, సుభద్రఁ దెచ్చె;
ఖాండవం బాహుతిగా లీల నొనరించి
సప్తార్చి నత్యంతతృప్తుఁ జేసె;
శబరవేషముఁ దాల్చి చనుదెంచి తొడరిన
శివునితోఁ బెనఁగి మెచ్చించె నతని;
గంధర్వు చేపడ్డ కౌరవసత్తము
విడిపించె లావున వెరవు మెఱయఁ;

ఆ. గాలకేయకులముఁ గాలవిప్రోలికి
ననిచె; నఖిలనృపుల నరికి నియ్య
కొలిపెఁ గ్రీడి; జగము గొనియాడ నేకకో
దండ చండవిలసితమునఁ గాదె! ౨౧౧

వ. 'కావున మనవారికి నోటమి యక్కిరీటివలనం గలిగె నను కలుష వారిగర్హింపం దగ; దట్టిజెట్టితోడం బెనంగుటఁ బ్రశంసకుం దగుదురు. పదంపడి నా రేమి సేసి' రనిన ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె:— ౨౧౨

ఆ. అట్లు దివిసి పోయి. యాటుఁ బోటు నొడళ్ళఁ
గలయఁ గలిగి, దప్పి గదిరి సొలయు
దొరలఁ దాను నపుడు దుర్యోధనుఁడు విచా
రాభియుక్తి నున్నయవసరమున. ౨౧౩

—♦ కర్ణుఁడు రారాజుతో నుత్సాహవచనంబులు పలుకుట ♦—

వ. పార్థుదెసఁ బలుకు పుట్టినం గ్రోధంబున నూర్పులు నందడింపఁ గర్ణుఁడు భగ్న దంష్ట్రం బయి విషంబులేని భుజంగంబునుం బోల్పం దగి, పరాజయంబునొంది దీనదశకు వచ్చియున్న యా రథికవరులం గలయం గనుంగొని కౌరవేశ్వరున కి ట్లనియె:— ౨౧౪

ఆ. 'అలవు వెరవుఁ దలఁపఁ గలఁ డితం డన [1]వాసి
కెక్కినట్టి రథికుఁ డక్కిరీటి;
వలయు నెడల నతని వాసుదేవుండు బో
ధించు నెల్ల తెఱఁగుఁ దేటపడఁగ. ౨౧౫

క. 'అనిమిషనాథుం డిచ్చిన
ఘనశక్తికి నసుర నొడ్డి గాండివిఁ దొలఁగిం
చిన హరివంచన పదపడి
మన మెల్లను దెలియ వినమె మనుజాధీశా! ౨౧౬

క. 'అగుఁ గాక, యతని నాతని
మగఁటిమియును నేర్పు నెల్లి మాన్చెద, నీకుం
బగ యనియెడుమాటయు ని
జ్జగమునఁ గలుగంగ నీను జగతీనాథా.' ౨౧౭

---

1. రాసికెక్కినట్టి.

వ. అనినం బ్రియం బంది, నీ నందనుం దతనిం దగువారలను నిజనివాసంబులకుం బోవం బనిచి, తానును నభ్యంతరమందిరంబున కరిగె. నారాత్రి సుఖనిద్ర వేసి రేపకడ సమస్తజనంబులు సంగ్రామంబునకు నడచి. రంత నక్కడ మక్కుమిగిలి పాండవబలంబులుం దోతెంచె. ధర్మనందనుండు బృహస్పతిమతంబున దుర్జయ వ్యూహంబు పన్నించినం జూచి, మనవారును దానికిం బ్రతిగా మోహరించుటకై రాధేయురాకకు నెదురుచూచుచు నొకభంగిం బన్ని రనిన విని, యాంబికేయుండు-

—♦ అంబికేయుని అలజడి, సంజయుని ఓదార్పు ♦—

క. శీతార్తజనంబులు ప్ర
ద్యోతను నుదయంబు గోరుచున్నకరణి, తా
నేతేరఁగోరు జనులకు
నాతఁడు నిజతేజమునఁ బ్రియం బొసఁగెనొకో. ౨౧౯

ఉ. 'అమ్మెయి ధర్మనందనుని యగ్గలికం దొలునాఁడు రాజు బ
న్నమ్ములపాటు సూచుచు, రణంబు కడంక దొఱంగి చన్న బం
టెమ్మెయి న ద్దినంబున నహీనపరాక్రమలీల సూపెనో.
తమ్ము నెఱుంగ రేమియు నతండును నాతఁడు; నేమి సేయుదున్? ౨౨౦

తే. 'కర్ణుఁ డట్టె కలనఁ గౌంతేయవర్గంబుఁ
గృష్ణయుతముగాఁగ గెలువఁ జాలు.
నేమి సెప్పఁగలదు మీ మానవేంద్రుని
చిత్తమాంద్య మతనిఁ జెఱుపకున్నె. ౨౨౧

క. 'సౌబలు నీతియుఁ గర్ణు భు
జాబలమును గూడి తనకు సామ్రాజ్యం బీఁ
గా, బలసి వెలయువాఁ డై
యాబే లూఱడు మనంబునం దేబ్రొద్దున్. ౨౨౨

క. 'జూదంబునాఁడు మొలచిన
యాదుర్దశ పెరిఁగి, సంజయా. నిర్భరదుః
ఖోదయ పరంపరా సం
పాదిని యై మనసు విట్లు పఱిగొనియెడినే। ౨౨౩

క. 'దుర్యోధను చేసిన యవ
కార్యంబున వచ్చినట్టి కష్టంబులు దా
ధైర్యంబున విడియెదఁ బ్రతి
కార్యంబులు గాని మనసు గందుచు నుండన్. ౨౨౪

క. 'పాండునృపసుతులతో నా
క్కొం దైనను నొవ్వఁ డింతకును, మును వనితా
మండలిచేరువ మెలఁగెడు
గండున మెఱసెదరు కురువికాయము నడుమన్. ౨౨౫

వ. 'దైవంబు బలవంతం' బనిన విని సంజయుం డజ్జననాథునితో:—'దేవా, వినుము, వగచినం గృతపడినకార్యంబు గ్రమ్మఱం బొడమునే? డెందము గుందు నంతియకాక; యట్లుంగాక నీవు చేసినయదియ చూవె ఫలించె! ఖండవంబు వల దని యెన్నిభంగులం జెప్పినం బాండవులకుం గీడు దలంచి, యప్పలుకులు [1]గొనవైతివి; వారలవలన ము న్ననేకపాపంబు లాచరించితి, నీవలన సర్వ జన క్షయంబు వాటిల్లెం గావునఁ గడవంబడినదానికి వగవం బని లేదు; దారుణంబైన రణప్రకారంబు విను' మనుటయు, నతండు - కర్ణుం డట్లు దడసినకారణంబుఁ దొడంగి యెఱింగింపు మనుటయు, నమ్మానవేశ్వరునకు నా సూతసూనుం డి ట్లనియె:— ౨౨౬

క. రేవకడ సకలబలములు
భూపాలురు వెడలి నడువఁ బోరికి, బిదపన్
నీపుత్త్రుఁడు వెడలెను సా
టోపతఁ దమ్ములును గర్ణుఁడును దో నడవన్. ౨౨౭

వ. అయ్యవసరంబున; ౨౨౮

—♦ కర్ణుఁడు నిజ అస్త్రశస్త్రాది దివ్యమహిమను పేర్కొని
తనకు మద్రపతిని సారథిగా చేయఁగోరుట ♦—

సీ. రథము రథమ్ము జేరఁగఁ దెచ్చి యమ్మేది
నీశ్వరుతోఁ గర్ణుఁ డిట్టు లనియె:-
'నాకుఁ గృత్యంబు లనేకముల్ గలిగె ము
న్నా ధనంజయునకు నట్లు కాన,

---

1. గై కొన.
కొనవైతివి అనుచో నెల్లూరు వాడుక. 'నామాట తీసికోకపోతివే' అనుచో గలదు.

యీరసంబున మాకు నిద్దఱ కొండొరు
విడువక పెనఁగఁ జొప్పడద, యింకఁ
గలహ మొక్క మొగంబు గావున నేఁ దేము
దలపడి పోరుదు మలవుఁ జలము

ఆ. నల్లపిల్లి, నొక్క రాకరుని నొంపను
జంపఁ జూతు, మానిలింపనాథు
వలనఁ గన్నశక్తి వాలియుట నామీఁద
నలుకు లేక తఱుము నాతఁ డధిప. ౨౨౯

వ. 'అప్పుడు చే నెత్తురు గాకుండ, నక్కిరీటి గీటడంగించు విధం బూహింపుము.

చ. 'సరి యగు నాకు దివ్యశరజాలములం దలపోసి చూడ న
న్నరుఁడు, దృఢత్వలాఘవ గుణంబులఁ దక్కు, దూరపాతవి
స్ఫురణఁ గరంబు వ్రటపడు, భూవర, సౌష్ఠవరేఖ నేమియుఁ జా
దొరయఁడు, ధైర్య శౌర్య పటుదోర్విభవంబుల హీనుఁ డెంతయున్. ౨౩౦

క. 'మును విశ్వకర్మ దేవేం
ద్రునకై నిర్మించె మహితరూపము విజయం
బనుచాపము, దానన బహు
దనుజుల మర్దించె నతఁ డుదగ్రస్ఫూర్తిన్. ౨౩౧

చ. *'పరిచయ సక్తచిత్తుఁ డయి భార్గవరామున కాతఁ డిచ్చినం,
బరుషపరాక్రమమ్మున నృపాలుర నెల్లను నమ్మహోభుజుం
డిరువదియొక్కమాఱు నమయించెఁ దదీయనితాంతశక్తి న
ప్పరమదయాపరుం డొసఁగెఁ బార్థివ, నా కది గూర్మి పెంపునన్. ౨౩౨

---

* భార్గవరామదత్తమైన చాపమహిమ, ఇట్లు తరుగకుండగా, వాసవదత్త శక్తియుండగా, కర్ణుఁడు శాపగ్రస్తుఁడనుట పరిపాటిమాటగా వాడుకలో నున్నది. విశ్వకర్మనిర్మితమైన ఇతని శరాసనమే విజయమనునది-(చూడు. కర్ణ-3-13.) విరుగునుగాని అట్టిదే అయిన అర్జునుని గాండీవము సన్నపేదైన ఎత్తదు. రాధేయుని స్యందనము రథ్యములుగూడ తెల్లనై దైవ ప్రసాదములై యున్నవి. గోగ్రహణమందే అందరు అట్లు ఒక్క అర్జునికే ఓడియుంటిన, ఇప్పుడు ఇంతటి పెద్దయుద్ధమునకు దిగియుందురా? ఈమాత్రము భీష్మాదులకు తెలియదా?

ఇచట కర్ణుఁడు తన శక్తియుక్తులను చేవమాటలతో రక్తిగట్టించి చెప్పుకొను చున్నాఁడు. కాబట్టేగదా అందరు పెద్దలు యీ దానవీరుని అట్లు కొనియాడి ఉండుట. ఇఁక

ఉ. 'ఆ మహనీయచాపమున నర్జును దర్ప మడంచి, నేఁడు నం
గ్రామము మజ్జగించెద నకంటకసుస్థితి గల్గ మేటి నై,
భూమి యమర్చెదం గొనుము, భూవర, నీ దగుపుత్త్రపౌత్త్రులన్
శ్రీమహిమన్[1] సమస్తజనసేవ్యమహోన్నతిఁ బొందునట్లుగన్.' ౨౩౪

వ. అని పలికి, వెండియు ని ట్లను:-'నా విజయంబును విజయుగాండీవంబును నొక్క రూప; యతనికి నక్షయతూణీరంబులు, నగ్ని దేవుం డిచ్చిన యభేద్యరథంబును, నవధ్యరథ్యంబులుం గల, వవి యొక్కఁడయినను, దాని కంతఁ జింతింప; ౨౩౫

క. 'నారాచము లాదిగఁ గల
ఘోరప్రదరములు బండ్లఁ గొని వచ్చెద, బల్
తేరులు దృఢవాజులు నా
తేరివెనుకఁ బె క్కమర్చి తెచ్చెద నధిపా. ౨౩౬

వ. 'మఱియు నొక్కం డాకర్ణింపుము:-భువనప్రవర్తకుం డయిన కృష్ణుండు సారథ్యంబు సేయుట నప్పార్థుపరాక్రమం బసాధ్యంబై యుండు, న ట్లగుటం జేసి; ౨౩౭

తే. 'ఖండనమునేర్పుమెయిఁ గృష్ణుపాటి యనఁగ
మహిఁ బొగడ్తకు నెక్కిన మద్రనాథు
నాకు సారథి గాఁగ నొనర్పవలయు
గెలుతు నట్లైన నన్నరు నలవు మెఱయ. ౨౩౮

క. 'హరి కెక్కు డరయ మద్రే
శ్వరుఁ డశ్వజ్ఞానమున, నసంశయ మే న
న్నరునకు మిక్కిలి బలవి
స్ఫురణంబునఁ గర్మకుశలబుద్ధిఁ దలంపన్. ౨౩౯

క. 'కావున నవ్వర మి మ్మటు
గావించుట, యెల్లహితముఁ, గావించిన య

---

తనకు గావలసినది నేర్పరి అయిన సారథి అనఁగా, పంచమదళ నాయకాగ్రణి సైంధవుఁడు నొగ లెక్కుచున్నాఁడు.

ఇట్టి సుయోధనునిమాటలు, యీ ఆశ్వాసమున 307-వ వచనమును, ద్వితీయాశ్వాసము 21-వ పద్యమును పరికింపుడు. బ్రహ్మాస్త్రము తోచుచున్నట్లు ఇందే 2-ఆ-94 లో చెప్పుకొను చున్నాఁడు. (3-ఆ. 287-300 వరకు) కర్ణుఁడు దివ్యాస్త్రముల బ్రయోగించుచున్నాఁడు.

1. మోన్నతిన్ వెలయఁజేయుము రాజ్య మఖండధీరతన్.

నై వేలయు వింత సేసి మ
హీవర, నను జూడు పోర నె ట్లేచెదనో. ౨౪౦

క. 'విను మి త్తెఱఁగున నే న
య్యనిమిషవర్గంబు నైన నాజి జయింతుఁ;
మనుజులు పాండుతనూజులు
జననాయక, నాకు నొక్క నరకే తలఁపన్?' ౨౪౧

వ. అనిన విని, నీపుత్త్రుండు ప్రీతుం డయి రాధేయు నగ్గించి, నీ కెల్లభంగిని శల్యు
సారథిం గావించెద నని పలికి యుత్సాహదీప్తుం డై— ౨౪౨

క. 'అమ్ములబండ్లును రథర
థ్యమ్ములనుం బెక్కు దెత్తు, నవనీశులు నా
తమ్ములు నేనును నీపా
ర్శ్వమ్మున నడచెదము, బరవసం బుగ్రముగన్.' ౨౪౩

క. అని చెప్పి, ప్రీతుఁ డగునా
తనిఁ దోడ్కొని నడచి, సముచితంబుగ శల్యుం
గని భక్తిఁ బ్రణతుఁ డై యి
ట్లను దుర్యోధనుఁడు సవినయముగ నతనితోన్:— ౨౪౪

— కౌరవపతి శల్యుని కర్ణునకు సారథ్యము చేయుమని అర్థించుట —

సీ. 'సత్యవ్రతంబును, శాత్రవదుర్దశా
పాదనంబును, మహాభాగతయును
నీకు నైజంబులు; నాకుఁ బెద్దయుఁ గూర్మి
గావున ని న్నేను గారవించి
వినతుండ నై వేఁడికొనియెద, రాజుల
నడుమ నీ దగుసౌమనస్య మెఱిఁగి,
యర్జును నవిఁ దెగటార్పఁగ నలయుట
యూహించి, సంభృతోత్సాహలీలఁ

ఆ. గావు మితని' ననుచుఁ, గర్ణునిఁ జూపి 'యీ
తనిరథంబు గడపు, మనఘ, యిట్టు
లైన నితఁడు పగఱఁ బో నీక పొదివి య
స్ఖలితగతుల నొంపఁ జంపఁ జాలు.' ౨౪౫

'గురుఁడును భీష్మఁడుం జనివఁ, గొంచెపుమూఁకలతోఁడ నేను సం
గరవిజయంబు గోరి, భుజగర్వమునన్ నతి నన్ను పాండుభూ
వరసుతవర్గముం దొడరువాఁడన కావున విశ్చయించు టె
వ్వరిఁ గొని? యింత నీ వెఱుఁగవా? వినుఁ గర్ణునిఁ గాదె నమ్మితిన్. ౧౪౬

క. 'ఇ మ్మిత్వరమ్మ, సార
థ్య మ్మితనికిఁ, జేయు మినన కరుణుఁడు పాహా
య్య మ్మొనరించినట్లుగఁ, డిమి
రమ్ముక్రియన్ రూపు పెడి యరాతు లడంగన్.' ౧౪౭

క. అవిన విని కెంపుసొంపునఁ
గనుఁగవ యుగ్రముగ బొమలు గడియఁగ పాల
మ్మునఁ జెమటవొడమ వీసుతుఁ
గనుఁగొని యిట్లనియె నతఁడు కటము లదరఁగన్ :— ౧౪౮

—♦ శల్యుఁడు కర్ణుని చులకనచేసి మాట్లాడుట ♦—

సీ. 'నను వింతసేవపుఁటవికిఁ బంపఁగ నీకుఁ
　　　దగునె? భూవర, వర్ణధర్మవిధము
లెఱుఁగవే? శూద్రుల కేనాఁటఁ బరిచర్య
　　　పేసిరి మూర్ధాభిషిక్తులైన
రాజులు? సూతజు రాదేయు దొరఁజేసికా
　　　ని యేను సారథ్యమునకుఁ జొరఁగఁ
జాల, నీతని బంశాలిఁగాఁ దలఁచెదు
　　　నాకంటె, నిట్టిబన్నంబుఁ గలదె?

ఆ. పగఱలోన నొకనిఁ బాల్పెట్టు మెట్టివాఁ
డైన సమయఁ జూచి యరుగువాఁడ,
నట్టిభంగి పాల దంటేనిఁ దరవాయి
గొని వధింతు శత్రుకోటి నెల్ల. ౧౪౯

క. 'విను మేను విక్రమింపఁగఁ
గనుఁగొనియెడునంతవాఁడుఁ గలఁడే? కులశై

లు నికాయంబుల నగలుతు.
వనవిధులు గలంతు. ధరణి బ్రద్దుం గలయన్. ౨౫౦

చ. 'నరవర, చూడవే తెలియ! నాదగు బాహుబలంబు, మద్బలంబు నీ
వెరయక పల్కు. తే నొకని కక్కట! సారథినై రథిత్వవి
స్ఫురణము దక్క నోపుదునె? సూతతనూజుడు షోడశాంశముగా
దొరయడు నాకు. వాసవసుతుగా మురమర్దనుఁ జీరికిం గొనన్. ౨౫౧

వ. 'ఇట్లగు టెఱుంగక చెప్పితి; వెఱింగియుం గర్ణుపక్షపాతంబున నన్నవమానించె దేని మాభూమికిం బోయి వచ్చెద'నని పలికి, రాజమధ్యంబున నుండి వెడలిపోవం జూచినం, గురుపతి సప్రణయబహుమానంబునం జని నిలువరించి, సాంత్వన స్వరంబున మధురాక్షరవిన్యాసంబుగా నతనితోడ:—'కర్ణుండ యేల తక్కు? నీ కెక్కుడయిన రథికులుం గలరే? కడింది పగఱకు హృదయశల్యం బగుటంగాదె నీకు శల్యుండను నభిధానం బయ్యె. నాయభిప్రాయంబు వినుము—ధనంజయునకు రథికగుణంబులం గర్ణుండు మిక్కిలి. కృష్ణునకు నశ్వహృదయజ్ఞానంబున నీ వధికుండవు. ధనంజయునకుఁ బ్రతివీరుంగా మనము కర్ణుం జాలించితి. మది కృష్ణుండు సెల్లనీ కునికిం జేసి కృష్ణవర్తనంబునకుఁ బ్రతివిధానం బాచరింప నిన్నుం గోరితి; నింతపని నీకుం దక్క నొరులకు శక్యంబగునే?' యనిన విని ముదితహృదయుం డయి మద్రేశ్వరుఁడు. ౨౫౨

క. 'నను గృష్ణుకంటె నధికుం
డని, యిమ్మనుజేంద్రకోటి యాకర్ణింపం
గొనియాడితి. *విమలయశో
ఘనుఁ డగు కర్ణునకు రథము గడపెద నధిపా.' ౨౫౩

వ. అని యాసూదనందను నుద్దేశించి వెండియు నిట్లనియె:— ౨౫౪

క. 'జనవల్లభ యొకసమయము
విను. నీతనితోడ నేను విచ్చలవిడిఁ దోఁ
చినమాట లెల్ల నాడుదు.
నను నెగ్గులు పట్టకుండినం బొం దొనరున్.' ౨౫౫

---

* కొద్దిసేపటికే ఉబ్బిపోయి, మద్రపతి కర్ణుని విమల యశోఘనుఁడుగా వర్ణించుచున్నాఁడు, ఇందు కర్ణుని ఘనతగూడ కొంత ఉండవలయునుగదా.

క. అనుటయు, గారవమున నీ
తనయుఁడు రాధేయుఁ జూచి 'తగు నిట్లగుఁ గా
కని పలికి, శల్యునిం గనుఁ
గొని 'యిది గడు లెస్స' యనియెఁ గురువంశనిధీ. ౨౩౬

వ. ఇట్లభినందించి యున్న యన్నరేంద్రుం దమ్మద్రపతి మనం బురియాడునో యని శంకించి, యతనితో మఱియు నిట్లను:-'నివ్విధం బాచరించుటకు విచారంబు వలదు. తొల్లింటి పెద్దలవృత్తాంతంబు వినుము—మార్కండేయమహాముని మా తండ్రి కేను వినుచుండఁ జెప్పినయది, నీకుం జెప్పెద. సురలతోడి దురంబున నసురవరుండగు తారకుండు దెగినపిదపఁ, దదీయతనయులు-విద్యున్మాలియుఁ, దారకాక్షుండును, గమలాక్షుండును ననువారలు వారిజాసను నుద్దేశించి— ౨౩౭

—♦ త్రిపురాసురుల వృత్తాంతంబు ♦—

క. దమమున నియమంబున ను
త్తమమును ఘోరంబునైన తప మతినిష్ఠం
బ్రమదితులై చేయఁగ, న
క్కమలభవుఁడు దోఁచి పరమకారుణ్యమునన్; ౨౩౮

వ. వరంబులు గోరికొం డనవుడు, వా రందఱు నొక్కమాటయకా 'సకలభూతంబులవలనను సర్వకాలంబులయందును నవధ్యత్వంబు మాకు నీవలయు'నని యడుగుటయు, నయ్యజుండు: ౨౩౯

క. 'ఆచంద్ర మెందుఁ గలఁ? దది
గోచరమే! యిచ్చుటకును గొనుటకుఁ దగునై
సూచి యడుగుండు, శుభదం
బై చెల్లెడునట్లుగాఁ బ్రియంబున నిత్తున్.' ౨౪౦

వ. అనవుడు, నయ్యసుర లట్లేని 'మాకు మువ్వురకు మూఁడుపురంబు లెల్లసుఖంబులుం గలిగి, కామగమనంబులై దేవ దానవ యక్షోరగాది జాతులకుం జెఱుప రాక విలపిల్లినట్లుగా నొసంగు. మేము భవత్ప్రసాదంబుసొంపున నిర్భయులమై పెంపొంది సంచరించెద' మనుటయుఁ; బద్మభవుం 'డిది లెస్స. దీనికిఁ దుది యిట్టిద' యని నుడివి, యట్టిది గా కుండ నప్రమత్తులరై వర్తిలుం డనిన; నద్దనుజేంద్రు 'లప్పురంబు లెప్పు డొక్కెడం గూడె, నప్పుడు బలియుం డగువాఁడు

వెఱపం దలంచినం జెఱుపనీఁగా నొడంబడితిమి. త్రిపురంబులు సంగతంబులు గాకున్న నసాధ్యంబులై వెలయు వలయు' నని పల్కిన. నద్దేవుండు 'మీరు పురత్రయంబును సంపాదించుకొనుం డే నమ్మహానుభావంబులం బొందునట్లు గా విచ్చితి' నని నిజస్థానంబునకుం జనియె. ఇత్తెఱంగున— ౨౬౧

తే. వరము వడసిన యాదైత్యవరులు దమకుఁ
బురము లొనరింప దానవపూజ్యు-మయుని
వేఁడికొనుటయు, నాతఁడు విపు తపము
కలిమి నొప్పారు పురవరమ్ములు ఘటించె. ౨౬౨

వ. అవియుం బ్రాకార గోపుర ప్రాసాద ప్రముఖ వివిధావయవంబులు పసిండియు వెండియు నినుమును నై నాల్గుదిక్కులు నూఱేసియోజనంబులు గలిగి యుండు, నందుఁ బసిండిం జేసినయది దివంబునను, వెండి నొనరించిన యది యంతరిక్షంబునను, నినుమునం గావించినయది భూమిని సంచరింపను: వరుసన వానికిం దారకాక్షుండును గమలాక్షుండును విద్యున్మాలియు రాజు లయి, దివ్యంబు లగు నంబరంబులను నాభరణంబులను మాల్యానులేపనంబులను మఱియు ననేకవిభవంబుల నుజ్జ్వలురై నెగడుదు. రిట్లు పురత్రయవిహారయంబున జగత్త్రయంబును నాక్రమించి, యసురత్రయం బప్రతిహతవిభూతిమై వర్తించు. నమ్మువ్వురుం దన్ను నాశ్రయించుటం జేసి వారలయోగక్షేమంబు లరసికొని యెవ్వరికి నెయ్యది యిష్టం బయ్యెది యెల్లం దన మాయాబలంబున మయుం డొదవించుచుండు. నవ్విధంబునఁ బరమసౌఖ్యంబు లనుభవించు చుండ బహుకోటిసంవత్సరంబులు చనియె. నట్టియెడ: ౨౬౩

—♦ చచ్చినవానిని బ్రతికించి పదిమందిగా జేయు బావినీరు ♦—

సీ. తారకాక్షున కొకతనయుండు హరి యన
జనియించి, వారిజాసను గుఱించి
తపము సేయంగఁ బ్రత్యక్షమై, యద్దేవుఁ
'డడుగుము వర'మన్న, నతఁడు త్రిపుర
ములవార లాయుధంబులు దాఁకి చచ్చినఁ
బీనుఁగుల్ నీరిలోఁ బెట్టి తడుప
నొక్కఁడు పదుగురై యెక్కుడులావును
బీరంబు మెఱయ సంప్రీతి నుల్ల

ఆ. పిల్లునట్టిబావి చిరతరతోయమై
మాషరములఁ జిత్రమహిమ వెలయ
నావహిల్ల వలయు'నఁడన 'పిచ్చితి'నని,
యమ్మహాత్మ్యుఁ దరిగె; నదియుఁ గలిగె. ౨౬౪

వ. ఇట్లు మహాప్రభావంబైన యబ్బావి వడసి, యప్పురంబులవారు వోరికి శంకింపక, నిర్జరభయంకరు లగుచు భువనంబు లన్నియు బాధించుచుం బెఱిగి, లోభ మోహ వశతం బొంది, విచ్చలవిడిం దిరుగం దొడంగిన; దేవ పితృ మునిజన స్థానం బులకు హాని పుట్టినం, బురందరుం డఖిలబృందారకులఁ బరివేష్టింప నప్పురంబు లపై నెత్తి చని, పెనంగి భేదింపం జాలక విషణ్ణుం డయ్యె. నంత నతండు దివి జాలం దాను సంయమిసహితుండై చతురాననుపాలికిం బోయి ప్రణామపూర్వ కంబుగా నద్దానవుల తెఱం గెఱింగించి, తద్వధోపాయం బడిగిన నతండు వారల కి ట్లనియె :— ౨౬౫

ఉ. 'ఏచిన యాపురత్రయము నేకశరంబున రూపు మాపఁగాఁ
జూచినఁ బోవుఁ గాని పెఱచొప్పునఁ బోవదు; నంగరోన్ముఖుం
డై చనుదెంచెనేని మదనాంతకుచే నది సెల్లు. నొండ్లకు
న్గోచర మెట్లగుం? జనుడు గొబ్బున నమ్మహితాత్ముపాలికిన్.' ౨౬౬

ఆ. అనిన నట్ల కాక యని, దివ్యవర్ష స
హస్రకంబు వార లధికనిష్ఠ
నతులతపము సేసి, యత్యంతశుద్ధాత్ము
లై మహేశుకడకు నరుగునపుడు, ౨౬౭

వ. అవ్విరించిం బ్రార్థించి, పురస్సరుం జేసికొని యరిగి. ౨౬౮

## — త్రిపురసంహారము గావింప బ్రహ్మాదులు రుద్రుని ప్రార్థించుట —

క. వరదు శరణ్యు శశాంక
స్ఫురితశిరోభాగు, సర్వభూతేశ్వరు శం
కరు, సాంఖ్యయోగనిష్ఠా
పర సులభు, ననంగదమనుఁ బరమాత్ము శివున్. ౨౬౯

వ. కని, పాలంబులు భూమి సోఁకం బ్రణమిల్లిన, నద్దేవుండు 'లెండు. మీ రాకకుం గారణంబేమి?' యనవుడు, లేచి నిలిచి వారు కరకమలంబులు భక్తి మొగిడ్చి—

క. 'స్తుత్యానుభావ నిర్మల
నిత్యానందస్వరూప నిగమవిరోధి
స్థిత్యపనయనోన్ముఖ, చి
త్ప్రత్యాత్మక భక్తలోక దౌర్గత్యహరా.' ౨౩౧

వ. అని, మఱియు ననేకప్రకారంబులఁ బ్రస్తుతించినఁ బ్రసన్నుం డై, భవుం డాదరించి-'మీకు భయంబు వలవదు; మీ చెప్పినయట్ల చేసెద, వలయుకార్యం బెయ్యది?' యనిన, దేవమునిసంఘంబులు ప్రహర్షంబు నొందె. నరవిందభవుం డప్పరమేశ్వరున కి ట్లనియె:— ౨౩౨

సీ. 'ప్రజలకుఁ బతిగాఁగఁ బనిచితి, నీవు న
న్నట్లు పదస్థుండ నగుటఁ జేసి
విచ్చలవిడి వరం బిచ్చితి నసురత్ర
యమునకు; దుర్గత్రయంబు గలిగి
యమ్మువ్వురును దారుణాక్రమమున భువ
నత్రయ సంబాధనం బొనర్చు
చున్నారు; వారల నొరులకు నడుప శ
క్యము గాదు; నీవు శీఘ్రంబ చెఱుప
ఆ. వలయు. మునులు దేవతలు నేను శరణు చొ
చ్చితిమి నిన్నుఁ, గరుణ జేకొనంగ
వలదె? మమ్ము నొరులు గలరె జగంబులు
గావ భూతనాథ, నీవు దక్క?' ౨౩౩

—♦ దేవవ్రాతము తమతమ శక్తుల సగపాలు శివుని కర్పించుట ♦—

వ. అనవుడు, నద్దేవుం 'డయ్యసురులు సెఱుప వలయువా రగుదురు, వారలు బలవంతులు, లే నొంటిమై నాపనికి నుత్సహింప నేర, మదీయంబులయిన తేజోబలంబులం దర్ధంబు పుచ్చికొని మీ రందఱుం గూడి, యాదుష్టదైత్యుల మర్దించుట కార్యం' బనిన, నద్దివిజులు 'మా కందఱకుం గల తేజోబలంబులకు నద్దనుజుల తేజోబలంబులు రెట్టియయి యుండు, నట్లగుటం జేసి మాచేతం జెడ; రదియునుం గాక, భవదీయ తేజోబలంబులు భరియింప మేము శక్తులము గాము; మాయందఱ తేజోబలంబులలో సగంబు పుచ్చికొని, నీవ యాశత్రుల నమయింపు; మెట్టి భంగిని నీకు రక్షణీయులమగు మమ్ము రక్షింపు' మనుటయు, నజ్జగన్నాథుండు—

క. 'అమరులకు నసురులకు నే
సముఁడ, శివం బఖిలభూతజాలంబులకుఁ
సమత నొనరింప శివనా
మము నాకుం జెల్లి, లోకమాన్యం బగుచున్. ౨౩౩

వ. అయినను; ౨౩౪

చ. 'అనయముఁ గ్రూరకర్ములగు నట్టివిమూఢులఁ బిల్కుమార్పఁ బూ
నన తగు; ధర్మవర్తను లనంజను మీయెడ ద్రోహు లైన య
ద్దనుజులఁ ద్రుంచి, మీకుఁ బ్రమదం బొనరించెదఁ; దేజముఁ బలం
బును సగపాలు పెట్టి నను బొందఁగఁ జేయుఁడు మీర లందఱున్.' ౨౩౫

వ. అని, 'మఱియు నొక్కటి చెప్పెద-లోకంబుల కెల్లను బశుత్వంబును, నాకుం బశుపతిత్వంబునుం గావలయు; నట్లయినఁ బశుహననంబునం బాపంబు లేకుండు.

క. 'ఒనరింపుఁడు దివ్యరథం
బును, దచ్చోదకుని నశ్వముల విల్లును న
మ్మును నాకు, నట్టు లైనను
దనుజుల దుర్గములు నిహతము లగు నాచేన్.' ౨౩౬

ఆ. అనిన విని, పశుత్వమునకు శంకించి విష
ణ్ణులైన సురల చంద మెఱిఁగి,
'భయము గొనఁగవలదు, పశుభావమోక్షణ
విధియుఁ గలదు, దాని వినుఁడు మీరు.' ౨౩౭

—♦ దేవతలు శివుని పశుపతిత్వము అంగీకరించుట ♦—

వ. అని పలికి, హరుండు వారలతోఁ 'బాశుపత వ్రతానుష్ఠానంబునం బశుత్వమోక్షణం బగు, నదియును ద్వాదశాబ్దంబులు నడపవలయు; నిష్ఠానురూపంబుగా సంవత్సరంబున, దదర్ధంబున ఋతువున మాసంబునఁ బంద్రెండుదినంబుల మాత్రను ఫలించు' ననుటయు, 'నట్ల కాక' యని వార లందఱును లోకంబులకు లోకేశ్వరునకుఁ బశుత్వంబుఁ బశుపతిత్వంబు గలుగుటకు నొడంబడి, యమ్మహాత్మునిఁ బశుపతి యని పేర్కొని, నిజతేజోబలార్ధంబులు సమర్పించినం గైకొని, యత్యధికబలుండై తొల్లింటికంటె వెలిగె; నప్పు డద్దేవునకు దేవతలు విభవం బెసఁగఁ బురహననంబునకయి యభిషేకంబు సేసి, త్వష్ట నాలోకించి

మహాదేవునకు దివ్యరథంబును దగియెడుసాధనంబులను గల్పింపు' మనవుడుఁ, దపఃప్రభావ మహనీయుండగు విశ్వకర్మ యవహితుం డై : ౨౮౧

—♦ చరాచరాత్మక మైన రథమును విశ్వకర్మ నిర్మించుట ♦—

సీ. సామర్థ్య మొప్ప, విశ్వంభరాచక్రంబు
రథముగఁ జేసి, చంద్రముని నుష్ణ
కరుసిఁ జక్రంబులుగాఁ బెట్టి, వారిధి
నక్ష[1] మొనర్చి, హిమావనీధ
రంబున వింధ్యనగంబున నస్తాచ
లంబున నుదయశై లమున బాఁపు
టవయవంబులు దీర్చి, యగ్నుల మూఁటఁ ద్రి
వేణుక రచనఁ గావించి, మేరు

ఆ. పర్వతమున నాతపత్రంబుఁ గల్పించి,
హరులు వేదములు, శరాసనంబు
వత్సరంబు, శరము వాసుదేవుండును,
గాఁగ సంఘటించె గౌరవమున. ౨౮౨

వ. ఇట్లు చరాచరాత్మకంబై తేజరిల్లు నత్తేరు వీక్షించి, పాకుండు గ్రహమండిత వ్యోమమండలం బుపాదానకారణంబుగా విశ్వకర్మ గావించిన కవచంబు దొడిగి, శరాసనంబు ధరియించి, విష్ణుసోమాగ్ని సంభవం బై వెలుంగు శరంబు పుచ్చికొని, దానవసంత్రాసనోత్సాహం బగుచు రథారోహణంబు సేసి, వృషభధ్వజంబునం బొలుపొందె; ౨౮౩

ఆ. అప్సరోగణంబు లాడుచుఁ బాడుచు
నంతనమునఁ జెలఁగ, సకలమును
బహువిధముఁ దన్నుఁ బ్రస్తుతి సేయంగ,
నమరవరులఁ జూచి యల్ల నగుచు, ౨౮౪

క. 'సారథి యెవ్వం?' డనుటయు,
వారలు 'నీచిత్తమునకు వచ్చినవానిం
గారుణ్యంబునఁ గై కొని,
తేరు నడపఁ బనుపు' మనిరి ధీరవిచారా. ౨౮౫

1. మందరపర్వతము అక్షముగా చేయబడినదని మూలము.

వ. అప్పుడు నద్దేవుండు :— ౨౦౬

—◆ కమలాసనుఁడు సారథ్యము బూనుట ◆—

తే. 'ఆరయ నెవ్వాఁడు నాకంటె నధికుఁ, డతని
మీర యెఱిఁగి యొనర్పుఁడు సారథిత్వ
మునకు' నని చెప్పుటయు, మహామునులఁ గూర్చి
కొని యమర్త్యులు సంభృతవినయు లగుచు; ౨౦౭

వ. కమలాసను కట్టెదిరికిం జని భక్తిం బ్రణమిల్లి 'దేవా, నీవలన నీలగ్రీవుండు ప్రసన్నుండయ్యె; భవదాజ్ఞ నేమితనికి రథంబుం దగుసాధనంబులు సమకట్టితిమి. సారథి దొరక కున్నవాఁ; డదియెట్లనిన-'సారథ్యం బాచరించు పురుషుండు బలసత్త్వంబుల రథికున కధికుండు గావలసియుండు. రథంబు పృథ్వి. రథ్యంబులు వెదంబులు. రథికుండు రుద్రుండు. రథచోదకుండు సులభుం డగునే? గుణాధికుండవగు నీ విప్పనికిం బూనవలయు; దానవ భయభ్రాంతులమైన మమ్ము రక్షింపుము. మా కేడుగడయు నీవ. భవదీయ ప్రసాదంబున బ్రదికెద'మని, వాఁగిలి మ్రొక్కినం బరమాదరంబున నెత్తి, యప్పరమేష్ఠి వారలఁ గారుణ్యంబునం గనుంగొని; ౨౦౮

ఉ. 'మీరు నిజంబ చెప్పితిరి; మిక్కిలి నేర్పును లావు గల్గినన్
సారథి పోరులన్ రథికసత్తముఁ దా గెలిపించు; బుద్ధి దో
స్సార విలాసభంగులకు శర్వుఁడు మెచ్చఁగ, నాగమాత్మకో
దారహయంబులన్ నడపెదన్ దనుజాల్ వెఱఁగందు నట్లుగన్.' ౨౦౯

వ. అని పలికి, సురగణంబు ముదంబునం బొదలఁ, దనచేతి కమండలు వొక్కెడ నిడి, జడముడి బిగియించి, యజినపరిధానంబు దృఢంబుగా బంధించి, ప్రణవంబునం ద్రష్టయొనర్చిన మునికోల పుచ్చికొని, నొక లెక్కె. నిట్లు లోకపితామహుని సురలు శంకరునకు సారథ్యంబు సేయించిరని చెప్పి; దుర్యోధనుండు వెండియు నిట్లనియె : ౨౧౦

క. 'హరు లమ్మహాత్ము లిలఁ బుర
భరియించుట కోర్వలేక పడుటయు, నెత్తెన్
వెరవున వాజుల వాగెలు
ధరియించుచుఁ బద్మభవుఁడు ధరణీనాథా. ౨౧౧

వ. ‘ఎత్తి. యత్తురగంబులకు వెండియు వీర్యశౌర్యంబులు గలుగ ననుగ్రహించి,
రథంబు గడపం దత్కౌశలంబు గొనియాడి, కామదమనుం ‘డా దనుజాల దుర్గం
బుల దెసకు నరదంబు వఱపుము. నేఁడు జగంబుల యలజడి మాన్పెద. నాచేతి
బలుపు సూడు మని పలికిన, నప్పరమసారథి మనోమారుత జవసత్త్వంబుల
గలుగు నవ్వేదాశ్వంబులం బఱప, నథర్వాంగిరసులు చక్రరక్షకు లయి చనుదేర,
నత్తే రాపురంబుల కడరిన; నయ్యాదిమ రథికుండు— ౨౯౧

— రుద్రుఁడు త్రిపురముల సంహరించి సురల సంతోషపఱచుట —

సీ. కోపసందీప్తుఁడై చాపంబు సజ్యంబు
గావించి మౌర్వి మార్గణముఁ గూర్చి,
పాశుపతాస్త్రసంబద్ధంబుగాఁ జేసి,
పురములు మూఁటిని బుద్ధి నిలిపి,
నవి యొక్కచోటికి నప్పుడ కూడిన,
మునులును సురలును ముదముఁ బొంది
గెలు గెలు మంచు నగ్గింప, నయ్యుగ్రుండు
దెగ వాపి యేసిన దితిజయుతము

ఆ. గాఁ బురత్రయంబు కాలి నీఱై, పశ్చి
మాబ్ధిఁ దొరఁగ, నమ్మహాగ్ని లోక
ములు దహింపఁ జొచ్చెఁ: బురహరుఁ డది మాన్చె.
నంతసిల్లె సకలజంతువులును। ౨౯౨

వ. అప్పు డనిమిష మునిజనంబులు కృతకృత్యు లయి, భూతనాథుం బ్రణుతించి,
యతం డనుమతి సేయ, నంబుజాసనుండు లోనుగా నందఱు నిజస్థానంబులకుం
జని. రివ్విధంబున లోకహితార్థంబుగా నప్పరమేష్ఠి శివునకు సారథ్యం బనుష్ఠించె:
నీవు నట్లపోలెఁ గౌరవరక్షణార్థంబుగా రాధేయురథంబు గడపు: మిక్కర్జునకు
నక్కిరీటికిఁ గృష్ణునకుఁ బలశౌర్యంబుల నెక్కు డయినవాఁడవు. మదీయ జీవి
తంబును రాజ్యంబును భవదధీనంబులు; వాపం గలిగింపను జయంబును సుఖం
బును గావింపను నీవ యొడయుండ. వీకార్యం బాచరించి నన్ను రక్షింపు'మని
ప్రార్థించి, నీ పుత్త్రుండు మద్రపతికి మఱియు ని ట్లనియె :— ౨౯౩

—◆ కౌరవపతి మద్రపతికి, రాధేయుని శస్త్రాస్త్రసంపదను వివరించుట ◆—

సీ. 'ఇదియొక్క-యితిహాస, మే నొద్ద నుండ ధర్మ
ప్రవీణుం డగుబ్రాహ్మణుండు
ధృతరాష్ట్ర వసుమతీపతికిఁ జెప్పినయది
వినుము-భార్గవవంశమునఁ బ్రసిద్ధు
డగు జమదగ్నికి నత్యంతవిక్రమ
మణి రాముఁ డుదయించె; నతవిచేయు
తపమున హరుఁడు ప్రత్యక్షమై నిలిచిన
నతఁడు దివ్యాస్త్రంబు లడుగుటయును

ఆ. నమ్మహాత్ముఁ-డశుచు లై నవారల నవి
నిర్దహించుఁ గాన నీవు పరమ
శుచివి గమ్ము. నీకుఁ జొప్పడు నఖిలమ
హాస్త్రవీర్య-మనియె నారదమున.　　　　౨౫౪

నివి, జామదగ్న్యుండు వినతుండై-నా కెప్పుడు పాత్రత్వంబు గలిగె, నప్పుడ నీవ తలంచి దయసేతువు గాక, నీకు శుశ్రూష సేయు చుండునట్లుగాఁ బ్రసాదింపవలయు-నని విన్నవించిన నివి, కరుణాయత్తచిత్తుండగు భవుం డవ్వరం బిచ్చిన, నమ్మహాత్ముండు నియమనిష్ఠాపరుండై పూజోపహార ప్రముఖవిధానం బుల నద్దేవు నారాధించుచుండ, ననేకసంవత్సరంబులు నన, నొక్క-నాఁడు పరమే శ్వరుండు ప్రసాదలపితాననుండై గౌరిదేవికి నతవిం జూపుచు—　　　　౨౫౬

క. 'రాముఁడు విమలవ్రత చ
ర్యామహితుఁడు మాకు భక్తుఁ-డని పలుమాఱుం
దా ముద్దు సేసి, మృదువచ
నామృతసంసిక్తుఁ జేయు నానమయమునన్.　　　　౨౫౭

వ. 'బలవంతులగు దనుజులచేత బాధితు లయి, బృందారకు లయ్యందుధరు పాలికి భయసంభ్రమంబులతో నరుగుదెంచి, తమ యలజడి యెఱింగించిన—　　　　౨౫౮

ఆ. 'జామదగ్న్యుఁ జూచి-చయ్యనఁ జని దాన
వుల వధించి దేవతలకుఁ బ్రీతి
చరింపు-మనియె హరుఁడు; దానికి మది
ముదముఁబొంది, కేలు మొగిచి యతఁడు—　　　　౨౫౯

క. 'అకృతాస్త్రుఁడ నగు నాకుం
ప్రకటభుజాబలులు శస్త్రపారీణులునై
సకల సుర నికర సంబా
ధకు లగుదానవుల గెలువఁ దరమే?-యనుడున్; ౩౦౦

తే. 'అంబికానాథుఁ డిట్లను నతనితోడఁ-
దలఁపు నీదెస నిలిపెద. దానఁజేసి
పగఱ నిర్జింప నగుఁ. బదంపడి మనోర
థంబు సిద్ధించు, నరుగుము దడయ కనఘ- ౩౦౧

చ. 'అనవుడు నట్ల కాక-యని. యాజమదగ్నిసుతుండు ధీరతం
జని. సముదగ్రులైన సురశత్రులఁ దీవ్రతరాయుధోత్కరం
బున వధియించి. వారి బలుపోటుల నొచ్చిన మేనితోడ వ
చ్చినఁ బురవైరి నిర్వ్రణునిఁ జేసెఁ. గరంబున నంటి యాతనిన్. ౩౦౨

వ. 'ఇవ్విధంబునం బ్రదీప్తశరీరుం గావించి భర్గుం డాభార్గవుపయిం బ్రీతిశీతలంబగు నాలోకం బొలయ. నాతని కిట్లనియె— ౩౦౩

క. 'అవివర్తనమతిఁ గవయఁగ
నని నీదగు తనువు సునిశితాయుధములు దాఁ
కిన నొవ్వదు, శత్రులు వ
చ్చిన నడుపుము గర్వ మడఁచి నిర్మలచరితా. ౩౦౪

వ. 'కావున వరప్రతిగ్రహంబునకు నిదియ సమయంబు. ౩౦౫

క. కొను-మని. దివ్యం బగున
స్త్రనికాయము శస్త్రచయము దద్దయు దయ ని
చ్చిన; నవి యాతఁడు సాష్టాంగ
నమస్కారంబు సేసి కైకొనియె నృపా. ౩౦౬

వ. 'తదనంతరంబ లోకగురుండగు నా హరునిచేత ననుజ్ఞాతుండై. యతండు నిజ స్థానంబునకుం జనియె; నయ్యితిహాసప్రకారం బిట్టిది. యివ్విధంబున వివిధ దుష్కర సత్కర్మానుష్ఠానఫలంబులై వచ్చిన సర్వ[1]దివ్యాస్త్రంబులు నా రాముండు రాధేయునకుఁ బ్రీతచేతస్కుండై యొసంగె. నట్టి మహాత్ములు హీనకులజాతుల

1. విద్యాస్త్రంబులు.

నాదరింతురే? యప్పుణ్యపురుషుండు గయికొనుటఁ గర్ణుం డుత్కృష్టయోనిజాతుం డని తలంచెద. వదన వక్షో బాహు ప్రముఖాంగంబులు సూడ, దేవకుమారుండుం బోలె నున్నవాఁడు. ప్రకృతికాంత కాంచన కుండల వజ్రకవచంబులతోడ నాదిత్య సన్నిభుం డగు కొడుకుం గాంచునే? సింగంబు లేడి కెల్లు పుట్టు? విశదికి సూత సంవర్ధితుండైన కీడు దొడరె. నింతియ కానోపు. రుద్రశిష్యత్వంబున విశ్రుతుం డగు భార్గవరామునకుఁ బ్రియశిష్యుం డగు నంగరాజు, ననంగదమనుం బరిగ్రహించిన విరించిభంగిఁ బరిగ్రహించి నీవు సారథ్యం బావరింపు. సకలగుణంబులను సారథి రథికున కధికుండు గావలయునను నీతి కలదు; నీవు ప్రసన్నుండ వగుటం జేసి నాకోర్కె సిద్ధించె. ననుటయు; ౨౦౭

తే. క్రుచ్చి మద్రవిభుండు నీకొడుకుఁ గౌఁగి
లించి ప్రియ మాననమునఁ దలిర్ప 'నృప కు
మార' నీవు నాకొలఁది యిట్లరయ నెఱుఁగు
దేవి యది లెస్స. నీకోర్కి యేను దీర్తు. ౨౦౮

వ. అవి మఱియును. ౨౦౯

—♦ శల్యుఁడు కర్ణునకు సారథ్యము చేయ నొడంబడుట ♦—

క. వీనులకుం బలుకులు నేఁ
డైనను జెప్పుదు హితంబు లగు వాక్యంబుల్,
దానికి నోర్వఁగ వలయుం
గాని, యలుక వలదు నీకుఁ గర్ణన కధిపా.' ౨౧౦

ఆ. అనినఁ, గర్ణుఁ డిట్టు లను మద్రపతితోడ:—
'హరున కజుఁడు, నరున కచ్యుతుండుఁ
బోలె హితుఁడ వగుము బుద్ధిపరాక్రమ
శాలి, నాకు నీవు సంగరమున.' ౨౧౧

వ. అనవుడు, నట్ల కాక యని, శల్యుండు వెండియు— ౨౧౨

క. 'తగువార లొరుల దెగడుట
పొగడుట యగు పలుకుపొంతఁ బోవరు; హితకా
ర్యగతుల సెప్పఁగఁ దెగ దగుఁ
బొగ డగు, నెదు రోర్వవలయు బుద్ధిగలిగినన్. ౨౧౩

తే. "శక్రుతేరైన నడపంగఁ జాలువాఁడ,
[1]నుఱవు సెప్పుదు రథికు నేమఱఁగనీను,
గృష్ణసారథ్యమునఁ దగు క్రీడి గెలువఁ
దలఁచు నీ కేను గడపుట దగు రథంబు." ౩౧౪

చ. అన విని, భూవిభుండు ప్రియ మారఁగఁ గర్ణునిఁ జూచి: 'దేవకీ
తనయుఁడు మద్రనాథునకుఁ దక్కువ, మాతలియుం దలంప నీ
తని కెన రాఁడు; భాగ్యముకతంబున సారథి యయ్యె నీకు, నీ
యునఁ గొని నీవు పార్థుని యహంకృతి మాన్పుము ధీరమానసా.' ౩౧౫

క. అని యతఁడు శల్యుఁ గనుఁగొని
వినతుం డై:—'నీవు లావు వెఱవును మెఱయం
దనుఁ గావ, నంగపతి య
ర్జునుఁ గలన జయించువాఁడు రూఢిగ' ననుడున్; ౩౧౬

వ. అట్లయ్యెడుం గాక యని పలికి, మద్రేశ్వరుండు సారథ్యంబున కనురూపం బగు సన్నాహంబు ననుత్సాహంబు వాటించినం, బ్రీతుం డగుచు, సూతనందనుండు దనసూతు నాలోకించి, తగురథంబునకుం గల్పన యొనర్పుమని సత్వరంబుగాఁ బనిచిన, వాఁడును రయంబున దృఢసుందరం బగు స్యందనంబు సుకల్పితంబు సేసి తెచ్చి, దీపించియిచ్చిన, నయ్యరదంబుఁ బూజింపఁ బురోహితు నియమించి, తదీయ మంగళవిధానానంతరంబ తాను నర్చించి, కృతప్రదక్షిణుండై ప్రణమిల్లి, భాస్కరోపస్థానం బాచరించి, సవినయంబున శల్యు నారోహణంబు సేయు మనుటయు, నతం డచల తటంబునకు లంఘించు సింగంబుచందంబున నొగ లెక్కిన;

ఆ. మెఱుఁగు తోడి లలితమేఘంబుమీఁదికిఁ
బోయి వెలుఁగుభానుపోలుపు దోఁప,
మద్ర రాజసహిత మహితమై యొప్పు న
త్తేరు కర్ణుఁ డెక్కి తేజరిల్లె. ౩౧౭

వ. అని యిట్లు కర్ణసారథిత్వంబునకు శల్యుండు మెయికొనుట, సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె ననిన విని, యటమీఁది వృత్తాంతం బెఱిఁగింపు మనుటయు.

1. నొఱవు.

చ. అవిరళ దర్శన స్థిత మహాముని మానస వాసఖేలనో
త్సవ రసికా, రసాత్మక, నితాంత కృపాకర దివ్యచిత్త స
త్త్వ విభవ సంభృతైక్య సుఖతామయదేహ, నిరామయా, పున
ర్భవ పరిహార హారి పదపద్మయుగ, స్తవహృద్య సంస్తవా! ౧౨౦

క. కమలవన సదృశ దృగ్రుచి
సముదయ శమితార్తిభక్త సంఘా, లక్ష్మీ
రమణత్వ శివాప్రియతా
సమవాయా[1]లంబ్యమాన సౌందర్యనిధీ! ౧౨౧

మాలిని. అనుభవ శమరమ్యా, హంసభావైక గమ్యా,
ఘన మదఘవిదారీ, విశ్వలోకోపకారీ,
దినకరశశినేత్రా దీపరిస్పందచిత్రా,
దనుజ మథనలీలా, ధర్మ తత్త్వానుకూలా! ౧౨౨

గద్యము

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి ప్రణీతం
బయిన శ్రీ భారతంబున కర్ణపర్వంబు
నందుఁ బ్రథమాశ్వాసము.

1. యాలంబమాన.

హరిహరనాథాయ నమః

# తిక్కన భారతము:

# కర్ణపర్వము

## ద్వితీయాశ్వాసము

శ్రీవిస్ఫురదవిపులకృ
పావిరతిశయార్ద్రభావ, భావాతీతా,
భామసహస్రప్రభ ర
మ్యానంత వపుఃప్రకాశ, హరిహరనాథా! ౧

వ. దేవా, వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె:- అట్లు తనసుతుండు సూతసుతు కోర్కి దీర్పంబూని యతిప్రయత్నంబు సేయుట యాకర్ణించి యాంబికేయుండు. ౨

ఆ. 'ఎట్లు ప్రియ మొనర్చె నట్లు సంప్రార్థితుం
డైన మద్రనాథుఁ డంతఁ గోరి
తేరు గడప నతని తెచ్చికొన్నట్టి య
వ్వీరుఁ డేమి తంగి విక్రమించెఁ?' ౩

వ. అని యడిగిన, సంజయుం డిట్లనియె:- అట్లు రథికసారథులు విలసిల్లి వంది మాగధ ప్రస్తూయమాను లగుచుఁ, దనవలనను గౌరవంబునం గమంగొమరయుఁ గురురా జయ్యంగరాజు నుద్దేశించి, ౪

చ. 'గురుఁడును భీష్ముఁడుం నరునకుం బకవైరికి నగ్గలంబు, వీ
రిరువురు వారి పెద్దఱ నహీనపరాక్రమలీల గీటడం
తురు ధ్రువ మంచు, నాత్మఁ బరితోషముఁ బొందుదు; నట్లు గాక వి
స్ఫురబలశౌర్యముల్ మెఱయ గ్రక్కున నాపని నిర్వహింపుమీ. ౫

తే. 'బాడుదల నొందెఁ, బట్టము పాండుతనయ
ముఖ్య, వీరు వా రన నేల? మును మువట్టి
వైరివర్గంబు నెల్లను బారి సమరి
సైన్యయుతముగ నద్భుత జయము గొనుము; ౬

వ. నడవు' మనుటయు, నమ్మాటఁ గైకొని, కర్ణుండు శల్యునిం దేరు నడవు మనిన, నతం డట్ల చేసె. నప్పుడు శంఖభేరీప్రముఖ తూర్యనాదంబులు రోదసీగహ్వరంబు విహ్వలంబు గావించె. నవ్విధంబునం జని చని, గర్వాగ్రహవిధేయుం డగు రాధేయుం డమ్మద్రపతి కిట్లనియె :- ౭

— ఎత్తుకొనఁగనే శల్యుని అచుపలుకులు —

శా. 'నారాచాది మహోగ్ర బాణపటలీ నానావిధోల్లాసముల్
సైరింపఁగా ధృతి లేక పాండుతనయుల్ సంభ్రాంతి నొందంగ, వి
స్మేరం బై ఖచరవ్రజంబు వొగడఁగా, మెచ్చంగ నీ మామకుల్, దు
ర్వారోదగ్రత నేఁడు సూపెద భుజావష్టంభసంరంభి నై.' ౮

సీ. అన విని, మద్రరాజాతని కిట్లను :-
'సత్యపరాక్రముల్ శౌర్యఘనులు
భుజవీర్యమహితులు భూరితేజోధను
లఖిలాస్త్రవిత్తము లార్య, యమర
పతి కైన రణమున భయము పుట్టింపంగ
నోపుదు రప్పాండుభూపతనయు,
లేల వారల నింత దూలపోఁ బలికెద?
నిప్పుడు వల్కరా దెట్లు నీకు,
తే. గాండివజ్యానినాదమ్ము గ్రమ్మి కర్ణ
విదళనము సేసినను, భీముగద మెఱుంగు
లొలపి చూడ్కులు మిఱుమిట్లు గొలిపినను, భ
యంబు పెల్లున నపుడు వా యడఁగుఁ గాక!' ౯

వ. అని వెండియు : ౧౦

చ. 'నరుని శరంబులన్ రథగణంబులు గూలఁగ, భీము నుల్లన
త్పరిఘమునన్ గజవ్రజము భగ్నము గాఁ, బెఱతమ్ములన్ యుధి

ష్ఠిరుఁడును దాఁకినం జలము డించి దొరల్ గలఁగంగఁ జూచియుం
డిర మయి నీవు నాలుకకుఁ దెచ్చినమాట గదా వినం దగున్.' ౧౧

క. అచుపలుకులు వినియుం దా
వినవిచెవులు సేసి, మద్రవిభుతో రాధా
తనయుఁడు : 'నా చేఁతబరువు
గనుఁగొనియెద విపుడ' యనియె గం డమరంగన్. ౧౨

వ. ఇట్లు సంగరోత్సాహదీప్తుం డై నడతెంచునతని నుపలక్షించి; ౧౩

చ. *కురుబల ముబ్బి యార్చెఁ, బటుఘోటక హేషిత నిస్వనంబులుం,
కరివర బృంహితధ్వనులు గాఢము లై విలసిల్లె; నెత్తురుల్
గురిసె, నభంబు మ్రోయఁ బిడుగుల్ మొరసెం, బొరి నుల్క లెల్లెడం
దొరఁగెఁ, బ్రదీప్తమారుతము ధూళిఁ గడుం బడిఁ జల్లె భూవరా. ౧౪

వ. మఱియు బహువిధోత్పాతంబులు గౌరవులకు నాశంబగుటం దెలుపుచుం దోఁచెఁ; దోఁచిన, నవి యెల్ల నరకుఁగొనక, వారు దైవమోహితులుగావున, శల్యసహితుం డైన కర్ణుం గనుంగొని కుంతీనందను లతనిచే నిర్జింపఁ బడుదు రని తలంచి సంతోషించి; రతండు భీష్మద్రోణుల దోర్వీర్యంబులు పాండుతనయులచేతఁ గోలుపోయె నవి మనంబున వారల మెచ్చక, ముంగలి మై మెఱసి నడచుచుండి, పార్థ పరాక్రమస్మరణంబునం గ్రోధంబు జనియించి యూర్పులు నందడింప, మాన దర్పోన్మాదంబున మద్రపతి కి ట్లనియె:— ౧౫

— రాధేయుని మానదర్పపు మాటలు —

మ. 'అరదం బెక్కి శరాసనంబు గొని తెం పారంగ నే నేఁచి, నం
గరసంక్రీడకుఁ జొచ్చినం దృణసముం గాఁ గొందు నద్దేవతా
వరు నైనన్; గురు నాపగాతనయుఁ జావం జూచుటన్ వైర లే
తురు, చెండాడెద మగ్రతం దలలు, నాదోర్దర్పముం జూడుమీ!'

* ఒకే శ్లోకమున క్రియలను ఎక్కువగా ఉపయోగించు కవిని ఆఖ్యాతకవి అందురు. (రాజశేఖరకవి - కావ్య మీమాంస) ఈ శిల్పమున తిక్కనచేయి ఆరితేరినది. ఈ చంపకమాలలో ఆరు క్రియలనువాడి, పఠించిన కావ్యపరంపరకు బిగువు కలిగించినాఁడు. ఈయన కవనమున ఇట్టి పనితనములు పెక్కులు. భీముఁడు దుశ్శాసనునిపై గవయు పద్యములు (కర్ణ-3; 211, 214) ఇట్టి పక్కిలో కళాఖండములు.

వ. అని పలికి యనంతరంబ, గాంగేయ కుంభసంభవు లంతటిమానసులు విల్లు రిత్త
పాపు నత్తురే యని యగ్గడించి, మఱియు ని ట్లనియె:— ౧౭

ఉ. 'వారల లోకవీరుల నవధ్యుల గీటడఁగించి, పల్వురకా
వారలయట్ల యెందు నవివార్య లనం జను మేదినీశులం
బోర వధించి, రౌద్రమునఁ బొంగి క్రమాగతమృత్యువాక్కో నాఁ
గా రణకేళికిం గడఁగు గాండివి వేవ యెదిర్చి యోర్చెదన్. ౧౮

ఉ. 'పాండునృపాగ్రనందనుఁడు బావవియుం గవలుం జలంబుమై
నొండొరు మూదలించుకొని యొక్కటఁ దాఁకినఁ, దీవ్రవిస్ఫుర
త్కాండ విదారితాంగకులఁగా నొనరించి, యఱంచి లీలమై
గం డడఁగింతుఁ, బోక పెనఁగం గలవంద మెఱింగి చెండుదున్.' ౧౯

క. అని పలికి వెండియును ని
ట్లను-'భీష్ముఁడు దెగిన ద్రోణు నతులిత దివ్యా
స్త్రవిచయము దోర్విలాసం
బును జాలం గలిగియుండె భూనుతమగుచున్. ౨౦

సీ. 'ద్రోణుండు బహుదివ్యబాణదీప్తుఁడు భుజా
బలశాలి శౌర్యసంపన్నహృదయుఁ
డక్షీణవిక్రముఁ డతిరథశ్రేష్ఠుఁ డ
వ్వీరుండు పార్థుచేఁ బోరఁ బడిన,
ధార్తరాష్ట్రులయేపు దఱిఁగెఁ, దదాప్త సై
నికులు గం డడఁగిరి, నీ వెఱుంగ
నైనను రాముకృపాతిశయంబునఁ గనిన
యీ రథమును గార్ముకాది

ఆ. దారుణాస్త్రశస్త్రతతులును గలిమి, నే
నతనిఁ దొడరి దివిజు లడ్డపడినఁ
గూల్తు నెల్లభంగిఁ గురురాజు మన్నన
యప్పు దీర్తుఁ బ్రాణ మాసపడక. ౨౧

—◆ శల్యుఁడు అర్జును పరాక్రమము నుగ్గడించి కర్ణుని దూలనాడుట ◆—

వ. అనిన విని, శల్యుండు గర్ణున కిట్లనియె :- ౨౨

చ. 'వివిధ జనంబు లీతఁ డవివేకి యనన్ వల దింతరజ్జ. అ
ర్జును బల శౌర్యసంపదలు సూచి యెఱుంగమె మున్ను? విన్ను, వా
తనిఁ గలనన్ జగం బెఱుఁగదా? యతఁ డద్భుత విక్రమోజ్జ్వలుం,
డెనయుదె నీవు పౌరుషవిహీనుఁడ? వద్దివిజేంద్ర నందనున్. ౨౩

సీ. 'రాత్రిమైఁ దాఁకి క్రూరతఁ బోరి మగఁటిమి
వాపిన యంగారపర్ణుకంటె,
ఘోషయాత్రావిధిఁ గురురాజుఁ జెఱపట్టి
మాన మేదిన చిత్రసేనుకంటె,
ఖాండవోద్యానంబుఁ గావ నేఱక పిగ్గ
వడి చన్న నిర్జరప్రభునికంటెఁ,
గ్రీడాకిరాతుఁడై క్రోధంబునకుఁ గాఁగఁ
బెనఁగి చిక్కిన త్రిలోచనునికంటె,

ఆ. వెక్కుడైనవీరుఁడే? నర్జునునితోడఁ
బొడుతు నొడుతు ననినఁ బోలుఁగాక,
వినుము సూతతనయ, మనబోఁటు లాతనిఁ
గెలుతు మనుట నోరిచేటు గాదె. ౨౪

చ. ¹'నృపుఁడును భీష్ముఁడుం గృపుఁడు నీవు గురుండును దత్సుతుండు న
గ్రపుబల మేచి తోవఁదవఁగా, బెనుదాఁడిగఁ బోయి, మత్స్యనా
థు పసులఁ బట్టి, యద్దొరలతోఁ జెడి పాఱితి, కర్ణ, యప్డు క
య్యపు బలు పాడె దిప్డు, మన యర్జును నమ్మలు గ్రుప్పు వట్టెనే? ౨౫

---

1. ఈ గోగ్రహణయుద్ధమున కౌరవయోధులనందరిని ఒక్కమూటకట్టుగా, ఒక్క సవ్యసాచియే ఒంటిచేతిగెలుపును సాధించియేయుండినచో, అవల 18 అక్షౌహిణులు, అందరే నాయకులు అట్లు 18 నాళ్లు పోరవలసిన అగత్యమేల? అని, చాలమంది సంశయించిరి. ఒద్దికలు చూచుకొనుటకో (Dress Rehearsal) అన్నట్లు జరిపిన యీ విరాటుని ప్రోల జరిగిన పోరు, ధనంజయుని అధికృతను చూపను అవల దూర్చబడినది-అని, ఆ విమర్శకుల మతము.

ఉ. 'ముందరియట్లు గాదు, జనముల్ దెగడంగ వెఱచి పాఱ; నేఁడు సం
క్రందనసూతి మార్కొని తిరం బయి పోరెద, దాఁపఁ బ్రాణముల్,
చిందరఁ జాల నింక, నను నిక్కపుఁబల్కులు పల్కఁ బొప్పు దా
నం దుదిఁ బచ్చినం బను, మొనఁగ నరుఁ డాఁకుట రిత్త వోవునే?' ౨౬

వ. అనవుడు, నలుక వొడమిన నడంచికొని, రాధేయుండు మద్రపతి కి ట్లనియె:- ౨౭

చ. 'నరునకుఁ బూని పల్కితి వినం బవిమాలిన దొడ్డపల్కు, లే
నరగలి లేక బె ట్టదరినప్పుడు సూడుము నన్ను నాతనిం,
దిర మయి బాహుశక్తియును ధీరతయుం జెరవుం బలంబు నె
వ్వరిదెనఁ గాంచి తెక్కుడుగ వారి మతింపుము, మామ యంతకున్.' ౨౮

వ. అనుటయు 'నట్ల చేసెద' నని పలికి శల్యుం డూర కుండెఁ. 'దేరు వోని' మ్మని రాధేయుండు దఱిమి పలికిన, నమ్మద్రేశ్వరుండును దురంగంబుల సత్వరంబుగా నడపె. నివ్విధంబునం జని, మన మొన సొచ్చి సైనికులు సంతసిల్ల వారలం గలయం గనుంగొని కర్ణుం డి ట్లనియె:— ౨౯

—అర్జునుఁ జూపిన వానికి పసదనం బిత్తునని కర్ణుఁడు సైనికుల ప్రబోధించుట—

సీ. 'వలను గోల్పి నెవ్వఁ డైనఁ-వీఁడె య
ర్జునుఁ-డని, నాకిట్టు సూపెనేనిఁ
బసదనం బే నిచ్చుభంగి యందఱకును
వివరించి చెప్పెద వినుఁడు:- మీఱు
బొగడంగఁ దగురత్నములతోడి సౌవర్ణ
రథములు వలసిన రయము లావు
బొలుపును గలుగు కాంభోజహయంబుల,
వలసిన బేర్చు సత్త్వంబునందుఁ

తే. బరిణతములగు సుందర కరివరముల,
వలసినను జారులావణ్యవతుల, వలసి
నను మహాగ్రామముల, వలసినను గోర్కి
కెక్కుడమ్మోటిమగని కే నిచ్చువాఁడ. ౩౦

క. 'మఱియొక్కటి చెప్పెద, వి
ద్దఱు కృష్ణులఁ జంపి, వారిధనములు నా, కి

త్తఱిఁ దద్రథ మిదియే యని
యెఱిఁగించినయతని కిత్తు నేనుఁ బ్రియమునన్.' ౨౧

వ. అని పలికి శంఖం బొత్తిన, దుర్యోధనుం డనుజసహితంబుగాఁ బ్రమోదంబు నొందె. నప్పుడు నిస్సాణాది తూర్యనిస్వనంబులు దిక్కులం బిక్కటిల్లె. మన యోధవరులును వరూథినియు నుబ్బున బేర్చి యార్చిన, వినదంబులు నింగిముట్టె. నయ్యెడఁ బ్రహసనభాసురముఖుండై మద్రవిభుండు రాధేయున కిట్లనియె:- ౨౨

—◆ కర్ణుని బీరపుమాటలు విని, శల్యుఁడు ఎత్తిపొడుచుట ◆—

ఉ. 'ఎవ్వరు చూప నేల నరు? నిప్పుడ కాంచెదు, రిత్తవారికిం
గ్రొవ్వున నుజ్జ్వలార్థములు గొం డని యీవల, దిట్టలిచ్చిన
న్నవ్వు జనంబు, మిక్కిలి ధనంబులు గల్గినఁ జేయ రాదె నీ
కివ్విధి నైన సద్వ్యయము లెందు, నపాత్రపుటీవి యొప్పునే?' ౨౩

వ. అని యంత పలుకక, ౨౪

క. 'కాలఁది యెఱుంగక [1]కృష్ణులఁ
గలవ గెలుతు ననియె దీవు, గంటిమె సింగం
బుల నెత్తఱి నైనను, నే
పొలమున నేనియును నక్క పోరి గెలువఁగన్? ౨౫

ఉ. 'అగ్గి సొరం దలంచునటు లర్జును [2]నెక్కటి దాఁకఁ గోర్కి!
కెగ్గిది మామ, మీవలుకు లెవ్వరుఁ జెప్పఁగ లేరు; రూపఱ
న్నగ్గిగఁగఁ గాల మయ్యెనొకొ! నావచనంబు లొకింత కర్ణము
ల్దగ్గఱ నిచ్చి, యోధులు బలంబులఁ దోడుగఁ బోవు టొప్పగున్. ౨౬

1. ఒక కృష్ణుడు దేవకీకృష్ణుఁడు; రెండవవాఁడు అర్జునుఁడు. ద్రౌపదికిగూడ కృష్ణ యనియే పేరు. ఇట్లు భారతమున ముగ్గురు కృష్ణులు గలరు. అనఁగా నల్లటి మైచాయవారు వీరు. విరాటపర్వములో పార్థుఁడు ఉత్తరునికి, తన పేర్లు - వాటి అర్థములు చెప్పినప్పుడు, అర్జుననామమునకు తెల్లనివాఁడని అర్థము చెప్పుకొనుట కొంత వ్యత్యాసముగా నున్నను, భారతమున మిగిలినచోట్లన్నిటా - అసితోత్పల వర్ణదేహుఁడు, నీలోత్పలవర్ణుఁడు - అనియే అర్జునుగూర్చి చెప్పఁబడియున్నది.

2. ఎక్కటి = జెట్టి; వీరుఁడు అని సామాన్యార్థము. పూర్వము రాచగాదెలకు కావలాయుండు వాఁడే ఎక్కటి. ఆనాఁడు రాజ శుల్కమును ధాన్యరూపకముగా దండి. ప్రతి ఊరి గాదెలలో నిలువచేసి, ఎక్కటీలను రక్షకులుగాబెట్టి, వారికి బాగా మేపుచుండేవారు. రెండు గ్రామాల

ఆ. ఏను ధార్తరాష్ట్రహిత మాచరించుట
కై పెనంగి, చెవుల కప్రియంబు
లైన నిన్నిమాట లాడితి, నాబుద్ధి
విని దురాగ్రహంబు విడువ వలయు.' ౪౮

వ. అనవుడు నల్గి, సూతసుతుఁ డాతని కి ట్లను:- మద్రబలంబు న
మ్మిన, నను ని త్తెఱంగునకు మేకొన కుండఁగ మాన్ప వజ్రహ
స్తునకు వశంబు గా దనినఁ, జొప్పడునే వినఁబోఁటి? [1]కా స్తిఁ జె
ప్పినక్రియఁ జెప్పి నీవు వెఱపించిన నే వెఱ పెక్కువాఁడనే?' ౪౯

— కర్ణునికి పిరికిమందుపోసి, ఉల్లము కలంచుటకు శల్యుడు ప్రయత్నించుట —

వ. అనుటయు; నతని నగ్గలంబు కోపింపంజేయుటకై శల్యుండు మఱియు నిట్లనియె:-

తే. 'ఇప్పుడే నీకు బుద్ధులు సెప్ప నేల?
నరుఁడు గాండీవ గుణనిక్వణంబు సెలఁగఁ
గదిసి, నీమెయి బలుతూపుగములు నిగుడఁ
జేసి, నిను బుద్ధిమంతునిఁ జేయుఁగాక.' ౫౦

వ. అని, యంతం దనివోక యతండు— ౫౧

సీ. 'రోష మహాలోల భీషణహరితోడ
సమరంబునకు హరిణము గడంగి,
దానధారాభీల దంతావళముతోడ
సంగ్రామమునకు శశంబు గడఁగి,
చండస్వభావోగ్ర పుండరీకముతోడ
నాజికి సారమేయంబు గడఁగి,
దారుణ తుండాతిఘోర గృధ్రముతోడఁ
గలహంబునకు సరఘంబు గడఁగి,

---

మధ్య ఏదైన వివాద మేర్పడినచో, ఇరువాగుల వారందరు దొమ్మిగా కొట్టుకొనక, ఆ పూట ఒక్కటికి యీ ఊరి వెట్టికి పోరుబెట్టి, ఏఊరి ఎక్కటి గెలుచునో ఆఊరి పక్షంగా వివాదం పరిష్కరించేవారు. భారతయుద్ధంలో చివరన, మడుగు ఒడ్డున జరిగిన దుర్యోధన భీముల పోరే ఎక్కటి కయ్యము. ఈ కయ్యము, యూరపులో ఇద్దరి స్పర్థాపరిష్కారమునకుగా కాలుదువ్వి సాగించే Duel వంటిది. ఇది వట్టి ద్వంద్వయుద్ధము కాదు. ఇక్కడ 'ఎక్కటిదాక' అనగా ఎక్కటి కయ్యమున తలపడ, అనుట.

1. కా స్తు చెప్పిన.

ఆ. యదరునట్లు గాదె యస్త్రకళా సము
జ్జ్వలుఁడు పార్థుతోడ సంగరమున
నీవు గడఁగి యదరు టెల్ల ? రాధేయ, నీ
కెట్టిబలము నమ్మ వెందుఁ గలదు ?' ౪౨

— కర్ణుఁడు నిజ దివ్యాస్త్రబలమును, శస్త్రవిద్యాపరిణతిని వెల్లడించుట —

వ. అనియె. ఇవ్విధంబున నధిక్షేపింపంబడి కర్ణుండు గోపించి, కెంపారుకన్నుల నా శల్యు నాలోకించి— ౪౩

క. 'గుణవంతుల గుణములు ని
ర్గుణుఁ డెఱుఁగమి యెల్ల. నీవు గుణహీనుఁడ, వీ
గుణ వితతియందుఁ గల దని
గణుతింపఁగ నైపుణంబు గలదే నీకున్ ? ౪౪

సీ. 'అర్జును నస్త్రవిద్యాప్రమాణంబు నా
యెఱిఁగినయంత నీ వెఱుఁగ, వతని
కొలఁదియు వనమాలి కొలఁదియుఁ గాంచి నా
కొలఁదియు నెఱిఁగి, వారల మదీయ
దివ్యాస్త్రబలమునఁ దెగటార్ప నగు నని
యే నిశ్చయించితి. నెట్టు లనినఁ-
గడుఁబెద్దకాలంబు గంధపుష్పాదుల
నర్చించుచున్నాఁడ ననుదినంబు.

ఆ. దానఁ గరంబు శక్తి నుపచిత మన్నది
యహిమయంబు, దారుణాస్త్ర మింత
యంత యనక యెదిరి నాహుతి గొను, దాన
జిష్ణు నోర్తు, నొండెఁ గృష్ణు నోర్తు. ౪౫

వ. 'భార్గవాస్త్రంబున నొక్కనిం బొరివుత్తు; నట్లుఁ గాక యాదవపాండవ నివహంబు లోనం గృష్ణార్జునులయందు లక్ష్మీవిజయంబులు సుప్రతిష్ఠితంబు లై యుండు, నయ్యిరువురం బొదివి పెనంగం గనుటకంటె మేలునుం గలదే? వారల గరుడ కపిధ్వజంబులుఁ జక్రగాండీవంబులు బెండు మానసులకు భీషణంబులుగాని, నాకుఁ బరితోషణంబులు. వేవురుగోవిందులఁ బదివేవురు పార్థులఁ బన్నినం బోరెద.

నీవు మహాయుద్ధకోవిదుండవు గాముంజేసి పెలుచఱచి. కాఱు లఱచెద; వక్కఁడి పక్షపాతంబునఁ బ్రేలెదవో యెఱుంగ; నింక నిట్టిమాట లాడితేని ప్రాణంబులు గోర యొల్ల'నని పలికి వెండియు— ౯౬

—◆ *కర్ణుఁడు శల్యుని మద్రజాతి దురాచారములను పోరబట్టుట ◆—

సీ. 'విను. పాప[1] దేశసంజనితుండవగు నీకు
దుర్బుద్ధి గాక సద్బుద్ధి గలదె?
క్షత్త్రియాధమ. నీచ. కలదు లోకంబున
నాబాలగోపాల మైన వాక్య-

---

* మద్రదేశీయులను గురించి, సంస్కృతభారతము ననుసరించి అల్ ఇండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులో (1966. గౌహతి) అధ్యక్షుడు ఆచార్య-డాక్టర్ వాసుదేవ, ఎస్. అగ్రవాల (M.A; Ph, D.; D. Litt; వారణాసి హిందూ విశ్వవిద్యాలయము) ఇట్లు వివరించిరి:- ఇది కర్ణపర్వమున మద్రక కుత్సనము అను శీర్షికక్రింద నున్నది.

మద్రకులు యవనులు; అనగా గ్రీసుదేశము నుండి (Indo Greeks) మన దేశమునకు వచ్చినవారు. వీరు మొదట (నేటి పాకిస్తాను) సియాల్‌కోట అనబడే సాకలదేశమున ప్రవేశించి, అచటి మద్రకులతో కలసి ఆ ప్రాంతమును పాలించిరి. వీరికి కురుజనపదము, రాజస్థానములతో సంబంధ మేర్పడినది.

మొదట, మద్రదేశీయులు పవిత్ర పంచనదీప్రాంతమున సదాచార సంపన్నులుగా నుండిరి. కాని యవనుల సంపర్కముచే ఆర్య సంప్రదాయమునకు గర్హ్యములైన పెక్కియో సాంఘికాచారముల అలవరచుకొనిరి.

ఈ దురాచారములను కర్ణపర్వము ఇట్లు వర్ణించుచున్నది. (27. అ. 71.) మద్రదేశము పాపభూయిష్ఠమైనది. అచటి స్త్రీ పురుషులు-ఆ బాలయౌవనులు, విషయలోలురై నీచగాథలనే పరమోత్కృష్ట గ్రంథములుగా గానము చేయుదురు.

మద్రకులను గూర్చి కొన్ని బ్రాహ్మణములు ఇట్లు చెప్పుచున్నవి:- మద్రకుఁడు స్నేహితునిగూడ మోసగించును. మద్రకునితో స్నేహబంధ ముండజాలదు; ఎందులకనిన - అతని మాట నమ్మదగినదికాదు. అతని మనసంతా ద్రోహచింతతో నిండియుండును. దుష్టగుణోన్నతి స్వరూపమే అతఁడు. చుట్టములందరు - ఆడ మగ, చిన్న పెద్ద, పనిపాటలవాండ్రు ఒకటిగా గుంపుగట్టి, ముక్కు మొగము ఎరుగనివారితో గలసి వినోదింతురు. వీరందరు, శ్రీమంతుల ఇండ్లలోచేరి, గోమాంసమును తిని త్రాగి, అరచి అల్లరిచేసి, నీతిని విడనాడి, ధర్మాతిక్రమణమును గావింతురు. ఇట్టి మద్రకుఁడు స్నేహానికిగాని, విరోధానికిగాని అర్హుఁడుగాఁడు. మద్రకునికి శౌచమునందు నమ్మకములేదు. అతఁడు హితునివలె నటించి తేలువలె కుట్టును. మద్రకస్త్రీలు మద్యపానమత్తులై సిగ్గువిడిచి, గుడ్డలు విప్పివేసి నృత్యముచేయుచు, చివరకు కామపరాయణులైన చేష్టలలోనికి దిగిపోదురు. (కర్ణ-అ. 30: 30-33.)

1. జాతి.

మతికుటిలుండు, సంకరుండుగాఁ డేమిటఁ,
 జెలికిఁ గీడొనరించుఁ, జెట్ట పలుకు,
దుష్టాత్మకుఁడు, గడుఁ గష్టుఁడు మద్రకుం
 డనునంతవట్టుఁ బ్రత్యక్ష మయ్యె;

ఆ. వావి లేక యెల్లవనితలుఁ బురుషులుఁ
గలయ మీకు నెగ్గు గాక యుండు;
మున్ను గల్లు పిదపఁ జన్నుఁబాలై పెరు
గుదురు, చెప్ప నేల గుణము లింక? ౪౬

క. *పలువురకుఁ బుట్టి, విప్రులఁ
గలు ద్రావుడుఁ బెఱిఁగి, యెట్లు గఱతురు శీలం
బులు మచితము లగుభాషణ
ములు? నీ విమ్మాట లుడిగి పొదపొద మనికిన్. ౪౭

ఉ. *మఱియొకఁ డేను జెప్పెద–నమానుష విక్రమశీల నల్గశం
బఱపియుఁ జంపియుం గిరినృపాలకసైన్యము రూపడంచి, మై
ధొఱఁగుట యొప్పదే తనువు దూఁటులఁ గాఁ; బెఱవారి గెల్పుకో
లఱదొకొ, వాదుపెం పుడుప నోపుదురే వినఁబోఁటు లెమ్మెయిన్? ౪౮

---

మద్రస్త్రీలు, దశరకదేశంలో ఆడుఒంటెలా విలపించి యుండునట్లు విలపించియుందురు. సిగ్గు వరువు మేరలన్నిటిని వీరు దాటిపోయినారు. కన్నబిడ్డను, కట్టుకొనిన మగని అయినా వదలి లమగాని మధీరకమను (తిక్తపానీయము) వదలజాలమని, వింతవింత హస్తవిన్యాసములతో చెప్పకొందురు.

మద్రకులు ఆపాదమస్తకము పాపములో ఊరిపోయి ఉన్నారు. మ్లేచ్ఛదేశంలో పుట్టిన వీరికి ధర్మంసంగతి ఎట్లు తెలియును? (కర్ణ. 27-91)
బాహ్లీకులు:

భారతమున పేర్కొనబడిన బాహ్లికులుగూడ గ్రీసునుండి వచ్చినవారే: వారు 'వాహికా' నదీతీరము (పంచనదీతీరము)నకు వచ్చి చేరగనే మద్రక యవనులైపోయినారు. దీనివల్ల యీ పవిత్రభూభాగము కుదేశమైపోయినది.

వీరికి మద్రకుల గుణములన్నీ అలవడినవి. బాహ్లీకస్త్రీలకు భర్తలుసేరు. వీరు హింసాప్రియులు. వీరు వివర్ణులు. అన్ని జంతువుల మాంసము తిందురు. వీరు వృద్ధికి మలము తింటివారు. (కర్ణ-30. అ-58.) తెలుగు కర్ణపర్వము 2-109.

వ. 'కనియుంచి, గదం దల వగుల వ్రేటువడక, యూరక తేరు వోవి'మ్మనవుడు మద్ర
పతి యతని నవలోకించి— ౨౦

ఆ. 'హితము సెప్పఁ దగనె యే నీకు? నదియును
గాక నీరథంబు గడపు చుండి
కౌరవాధినాథ కార్యార్థి నగునాకు
మన్నరూపు సెప్పకుండ నగునె? ౨౧

ఉ. 'సారథి దక్షుఁడై, రథికసారము రథ్యబలంబు నాయుధో
దారత మానముం గ రణవిధంబు నిమిత్తశుభాశుభత్వ ని
ర్ధారణముం గ మదిం గని, హితం బెఱిఁగించుట నీతి గాన, నీ
వీరస మెత్తనోఁ బలికి తేనియుఁ, జెప్పుదు సూతనందనా. ౨౨

వ. 'ఏ నేమితప్పు పేసిన గదం దల వగుల వ్రేసెదవు? నీ వి ట్లంటివి గదా యని,
హితోపదేశంబుసేయ మాననేర్తునే? యిది యొకదృష్టాంతంబు వివరించెద
వినుము; విని నీవు నాచెప్పినట్ల చేసితేనియు మేలు, పేయకుండినం గడు మేలని;
యి ట్లనియె:— ౨౩

— ఎంగిళులు దిని క్రొవ్వి, హంసను ఎదిరించి తరువుపోగొట్టుకొనిన కాకికథ —

సీ. 'అంబుధిలో నొక్క యలఘుతరద్వీప
మున దర్మవర్తి నాఁ బను నరేంద్రు
పురమున, నొకవైశ్యవరుఁ డధ్వరాది స
త్కర్మతుఁడును శాంతిదాంతియుతుఁడుఁ
గరుణాపరుఁడు దానవిరతుండు ధనధాన్య
కోటియు, బహుపుత్రలాభ విలసి
తుండునై వర్తించుచుండఁగ నిలు సేరె
నొకకాకి; యతని పుత్త్రకులు దాని

తే. కెంగిళులు పెట్టికొని యాడ, నెలమిఁ బెరిగి
క్రొవ్వి కడు మీఱి, యెట్టిపక్షులను దన్నుఁ
బోల వనియెడు దుర్మానమునఁ దృణీక
రించి, యది పెక్కుళంగులఁ గ్రీడ సలుపు. ౨౪

వ. 'ఇట్లు విహరించుచుండ, నొక్కనాఁడు గొన్నిహంసంబులు పక్షబలంబున సువర్ణుతో సరిసేయం దగునట్టివి, సముద్రంబుచేరువఁ జనం గని, యా కోమటికొడుకు లక్కాకంబునకుం వానిం జూపి యిట్లనిరి :— ౫౫

క. "పులుఁగులలో నీ వెక్కుడు,
విలసద్గతి నంచ లిట్లు వినువీథిఁ గరం
బెలమిం జనియెడు, నీవిం
గలసి పఱచి గెలువవలదె గతుల బహుళతన్ ?" ౫౬

వ. అని తారతమ్యజ్ఞానహీనులగు నయ్యల్పబుద్ధులు సెప్పిన, నుచ్ఛిష్టదర్పితం బగు నదియును మౌర్ఖ్యంబునం దా నంతటివాన యని తలంచి, వానిదెసకుం జని, మనంబున 'వీనిలో నేటి యెయ్యదియో'-యనుచుం జేరి, తనచూడ్కికి వచ్చిన యంచం బురుడించి-"పఱతము ర"మ్మని పిలిచిన, నయ్యంచలన్నియు నిలిచి బెలుచ నవ్వి యవ్వాయసంబున కి ట్లనియె :- ౫౭

క. "మానససరసి వసింతు, మ
హీనబలముఁ జవముఁ బక్షులెల్లను బొగడం
గా నెందుఁ దిరుగుదుము, ద
వ్వైనను ఖేదంబు లేదు హంసల మగుటన్. ౫౮

వ. "ఇట్టి మా యందును; ౫౯

క. "బలశాలి యైనహంసముఁ
గెలిచితి పురుడించి పాఱ బేలతనమునఁగా;
గలవే యింతకు మును హం
సలతోఁ బురుడించు వాయసంబులు జగతిన్ ?'" ౬౦

సీ. అనుటయుఁ, గాక మిట్లను హంసములతోడ
"గతులు మా కొక్కటిగలవు, *వాన
నొక్కొక్కటొక్కట శతయోజనవ్యాప్తి నే
మెఱయుదుఁ, బొడవుగా మీఁది కెగసి

* వాన=వానిలో, లేక వానియందు అనుటకు తిక్కన ప్రయోగము. శాంతిపర్వము, 1 ఆ-71 పద్యమునందు "నలుగాలివాన గోవును" అనుచోట చాలమంది యీ 'గాలివాన'లో చిక్కొని వెతలపడిరి. నాలుగు కాళ్ళవానియందు అవు-అనుట.

ధమట యచ్చటనుండి చక్క నేలకుఁ జోదు
వట్టి డిగ్గుట, దూరపాతభంగి
సంగతి పరువడి చారుళీలాగతి
వక్రియానము వలయక్రమంబు

ఆ. లోను గాఁగ నెట్టు లైనను మీకోరి
నట్ల పఱచి మేటియంచ యైన
దాని నిపుడ గెలుతుఁ, దక్కటియంచలు
భయము వొందఁ, గాకివదువు వొంగ.” ౬౧

— ♦ కాకము హంసముతో జలధి చదల బఱచుట ♦ —

వ. అనుటయు విని మున్నాహూతం బైన హంసం బక్కాకంబు నాలోకించి:- ౬౨

క. “నూఱుగతుల నీవు వాఱు, దే నన్నియు
నెఱుఁగఁ, బఱగు లెల్ల నెల్లు వాఱు
పదరి యాకసమున నిఱు * బాట నట్ల పా
ఱదము రమ్ము జలధిచదల” ననిన ౬౩

వ. అయ్యోడం గూడిన కాకంబు లపహసించి, “శతప్రకారగతి యగుదీనితో నేకయాన పర్యవసాన హీనసముత్సాహ దోహలి వగు నీ వెట్లు మచ్చరించెదవు? పఱచి భంగ పడియెదవు గాక” యనుటయు, నమ్మరాళం బాగమిం బాపి పఱవఁ దొడంగినం, దోన యవ్వాయసంబునుం బఱచె. ఇట్లు రెండును మున్నీటిపై మిన్ను దఱిసి పాఱునట్టియెడ; ౬౪

క. రాయంచ మందగతిఁ జను,
వాయస మతితీవ్రభంగి వడను మెఱపి లీ
లాయితము లొప్ప బహుగమ
నాయాసము నొంది పఱచు నగ్గలికమెయిన్. ౬౫

* బాట = దారి, లేక దోంక-(దండబాట) బాటపదము హిందీలోగూడ గలదని, ఇది హిందీపదమని కొందరు. ఇట్లే చెప్పు (పాదరక్ష)గూడ ఉరుదూ పదమనేవా రున్నారు. కాని తిక్కన శాంతిపర్వంలో ‘చెప్పులిచ్చిన కంటకసస్పృశులైన రిపులద్రొక్క నడచునతడు’ అని చెప్పియున్నాడు. తిక్కన కాలానికి అంతగా తెలుగుకు పారసీకపు తెగులు పట్టలేదు కాబట్టి, ఇవి తెలుగుమాటలే అయి, ఉరుదులో కలసినవనవచ్చును. ఆలు (భార్య) అనేమాటగూడ ఇదే అర్థంలో ఉరుదూలో ఉన్నది. (ఆల్ఔలాద్ = ఆలుబిడ్డలు) ఇవి దక్కన సాంగత్యప్రభావం కావోపు.

ఆ. ఎలమిఁ గడచి పోవుఁ, బిలుచుఁ గ్రమ్మఱ వచ్చి,
ముక్కు ముక్కు మీఁద మోపు, జుట్టు
నేచి తిరుగు, సీఁక లీఁకలతో రాయు,
నొరయుఁ జిత్రగతులఁ, మఱియు నవ్వు; ౧౮

వ. ఇవ్విధంబునం గాకం బనేకప్రకార ప్రసరణచతురంబై సంచరించుటం జూచి, ముదితంబులైన వాయసంబు లధికస్వరంబుల మెఱయుచు, హంసంబుల గేలి గొని నవ్వుచుఁ, దరువులపయిం ద్రుళ్ళి త్రుళ్ళియాడుచు "మరాళంబు పరాభవంబుఁ బొందెడుఁ జూడుం"డని, పెద్ద యెలుంగునం బలుకుచుండఁ, దదీయ కలకలం బాలించి హంసంబు ధరితోత్సాహంబై — ౧౯

క. పొడవునకు నెగసి యెప్పటి
పడమటిదెస నిగిడి పెలుచఁ బఱచినఁ, గూడం
గడు రయమునఁ జని యంచం
గడవం గా కీలకిఱచి కాకము పాఱున్. ౨౦

వ. పాఱి పాఱి డయ్యుటయు, నయ్యంచ యుదంచిత త్వరితగమన కళావైదగ్ధ్యంబు మెఱయం బఱచిన బీఱువడి, కాకం బాకులాంతరంగంబును వికలాంగంబును నై యిట్లని వితర్కించు:— ౨౧

క. "నేరక తొడరితిఁ, గాల్కొన
భూరుహములు లతలు గిరులుఁ బొడలేమియు లే;
వారయ, బహుసత్త్వమయము
వారిధి, డిగి సోఁకినపుడ వలయుం బొలియన్." ౨౨

వ. అనుచు దీనమానసం బయి భయంబునం గలంగి, డప్పి సొగసి, యపకళ నంత కంతకు డిగు చున్న యక్కాకిం గనుంగొని కలహంసం బిట్లనియె:— ౨౩

ఆ. "నీ వనేకగతులు నేర్తు దీ యేగతిఁ
జనుట చెపుమ వాయసంబ? యేను
గడవ నరిగి పిలువఁ గా నేల తడపెద?
వెఱక లేటి కిట్టు లెడల విడువ?" ౨౪

వ. అనియె. నట్టియెడ; ౨౫

క. తలకొని జలములు పక్షం
బులు దుండము దోఁక సోఁక, బోరిఁబోరి నెగయఁగా
బలమఱి మెయి దిగఁబడఁగా
సొలసి, యెగయలేక వాయసుఁడు వెగడొందెన్. ౭౪

వ. ఇట్లు ముప్పిటిపీటిపయిం బడి యగ్గలంబగు దురవస్థకు బెగ్గలంబు నొందు కాకంబు నాలోకించి "పలుక నగుం గాక; పలికినట్ల యెవ్వరికిఁ జేయఁ దీరుఁ? బని తీఱెం గదా!" యనిన రాయంచకు నక్కాకం బి ట్లనియె:- ౭౫

క. "ఎంగి[1]ళులు గుడిచి క్రొవ్వునఁ
బొంగిన మెయితోడ గర్వమునఁ దిరుగుచు, నా
కుం గలదె యెందు నెదురు? వి
హంగమపతి నైన గెలుతు నని, మును దలఁతున్. ౭౬

క. "నాకొలఁది యిప్పు డెఱిఁగితి,
నీ కారుణ్యాలోకనంబు నిగిడించి, శర
ణ్యా! కావు; నన్ను మగుడం
గాకులలోఁ గలుపఁ దగవు గాదే నీకున్?" ౭౭

వ. అని యార్తిఱంగున, ౭౮

క. ఆకులతఁ బొంది పలుకుచుఁ
గా కా! యని చంచుఁ దెఱచి కడు వణఁకుచు, నీ
రాకరమున మునిఁగెడు న
క్కాకిం గని హంస పరమకారుణ్యమునన్. ౭౯

క. వెరవునఁ దత్తనువుం దన
చరణంబుల నిటికి యెత్తి, చా పుడిపి, బల
స్ఫురణంబు మెఱయ వీఁపున
ధరియించుచు వచ్చెఁ బక్షితతులు నుతింపన్. ౮౦

వ. ఇవ్విధంబునం దెచ్చి, యెప్పటినెలవున డించి, రాయంచ యక్కాకి దెప్పిఱిన దానితో నచ్చటికాకులు విన "వింక నిట్టి యవినయంబు లెన్నండును జేయకు" మని

1. ఎంగిళ్ళు.

పలికి, విజనసహచరంబులగు మరాళంబులం దామను వలయుచోటికిం జనియె. నీవు నా కోమటికొడుకుల యెంగిలికూటం బెరిఁగిన యక్కాకంబుచందంబునఁ గురుకుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి, యెక్కుడువారల ధిక్కరించెదవు; నీకొలఁది యెఱుంగవు; దీనం జేటు వాటిల్లుఁ గాన కేటవడ వెఱింగించెద నాకర్ణింపుము :— ౭౧

చ. 'విరటుని గోవులఁ గా నరల గెల్చి, మదంబున నీదు తమ్మునిం
బొరిగొనఁ బార్థుఁ డాఁక కెట వోయితి నాఁ డలఘోషయాత్రలోఁ;
గురుపతి డించి, క్రీడి కృపకుం దగుపాత్రము చేసి యెక్కడఁ
నురిఁగితి చెప్పుమా విజము; సూతతనూభవ, నాకు నేర్పడన్;' ౭౨

వ. అని వెండియు; ౭౩

చ. 'పనిపడి జామదగ్న్యుఁడు సభఁ గా వినిపింపఁడె మీకు నెల్ల న
ద్ధను భుజవైభవంబు, మధుసూదను పెంపును నాఁడ ద్రోణ కాం
తనవులుఁ జెప్పరే బహువిధంబుల వారల గెల్వ రామి; ముం
వినమె; యెఱింగియుం గా మఱియు నీఱఁడిమాటలు చేయ నేటికిన్;' ౭౪

క. 'ఒంటిమెయిఁ దాఁక నా ము
క్కంటికి వశ మగునె కృష్ణగాండీవులఁ; ని
ట్లంట యుడిగి, తగురథికుల
జంటగొని రణమ్ము నడుపు శత్రులు తలఁకన్. ౭౫

సీ. 'గొంతికొడుకును దేవకికొడుకు మనము
గనియెదము దినకరనిశాకరులఁ బోలె
వెలుఁగ; నయ్యెడ ఖద్యోత విలసితంబు
తోడి దగుఁగాక నీపెంపు దోఁపఁ గలదె;' ౭౬

వ. అనిన విని కర్ణుండు:—"కమలనాభుని పెంపును బార్థుబలిమియు నెఱుంగక యేవేం వారిఁ దొడరెద; నీవెల్లు చెప్పినను దొడరుదుఁ; దొడరి నా కొండె, నే నొండె నగుదు; నింతియ; నీవు వెడమాట లాడక యుడుగు' మని పలికి, యచ్చటి మహీపతులు విన నమ్మద్రపతి కి ట్లనియె :— ౭౭

—♦ కర్ణుఁడు జామదగ్ని దత్త అస్త్రబలమును చెప్పి,
తనకుఁ గలిగిన శాపంబులకు వగచుట ♦—

సీ. *తలఁచిన నెదకు సంతాపంబు సేయంగఁ
జాలెడునట్టివి జామదగ్న్యు
కోపంబు, బ్రాహ్మణశాపంబు గాక, యే
నరకు గొందునె మురహరు గిరీటిఁ?
చెప్పెద విను-మస్త్రశిక్షార్థినై మహేం
ద్రనగంబునకు జమదగ్నిసుతునిఁ
గోరి పోయినఁ, గృపాంభోరాశి యగునమ్మ
హాముని కులము నన్నడుగుటయును,

తే. బొంకునకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాగ
బ్రాహ్మణుఁడ నని చెప్పి; తత్పాదభక్తి
గలిగి మెలఁగంగ, శిక్షించె నలఘుబహు వి
ధాస్త్రశస్త్రసంవేదిఁగా నతఁడు నన్ను. ౮౮

వ. *భార్గవాభిధానం బగు మహాస్త్రంబు లోనుగా ననేకదివ్యాస్త్రంబు లిచ్చెఁ. బదం పడి బ్రహ్మంబగు నస్త్రంబు నొసంగె; నొసంగి సమరంబున నాపత్ప్రమయంబున దీనిం బ్రయోగింపు మని యానతిచ్చె. మఱినాఁ డత్తపోధనసత్తముండు నదీయాంకతలంబున నొఱిగి నిద్రించుచుండ, [1]నొక్కజంతువు నా క్రిందితొడఁ దొలిచిన, నమ్మహాత్మునకు నిద్రాభంగం బయ్యెడు నని, కదలకుండితిఁ. దదనంతరంబ మేలుకని, యతండు నెత్తుటివెల్లువఁ గని, తత్ప్రకారం బడిగి, యేను జెప్ప విని, మద్ధైర్యంబున కచ్చెరువడి "నీవు బ్రాహ్మణుండవు గా, వెవ్వఁడ?" వని యొత్తి యడుగుటయు, వెఱచి సూతసుతుండ నని చెప్పితిఁ; జెప్పినప్పు డక్కటకంబు

---

1. ఈ జంతువు 'అళర్క'మను కీటకమని శాంతిపర్వము 1-అ-22 లో చెప్పఁబడియున్నది. భాసమహాకవి తన 'కర్ణభారము' అను నాటకమున 'వజ్రముఖి' అని చెప్పినాఁడు. ఈయన రెండుతొడలనుగూడ పురుగు తొలచినట్లు వర్ణించినాఁడు.

ఁడు భారత రచనాకాలమునకు దగ్గరివాఁడు. ఈయన అశ్వఘోషుఁడు కాళిదాసుల మధ్య క్రీ. శ. 150-200 సందున వెలసినట్లు చెప్పుచున్నారు. ఈయన చూచిన భారతపాఠము ఇట్లే చెప్పియుండవలయునుగదా!

నాలోకించిన, నది యదృష్టపూర్వవికృతాకారంబై యుండె;[1] నర్జునహితంబు
గోరి యింద్రుం డమ్మునీంద్రునకు నన్నుఁ దేటపఱచి, యతనిం గోపింపం జేయు
వాఁడై కీటతనువుదాల్చి యట్లు సేసెం గానోపు; నాసంయమి గోపించి "కపటం
బున బ్రహ్మాస్త్రంబుఁ బరిగ్రహించి; తది నీకు వలయుకాలంబున దోఁపమియు
మృత్యువాసన్నం బైనం దోఁచుటయు, నాపద ముట్టినయెడ భార్గవాస్త్రంబు
దోఁపకుండుటయుం గలిగెడు" మని శపించె; నివి జామదగ్న్యు[2] కోపంబుతెఱంగు.
బ్రాహ్మణ శాపంబు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము— ౭౯

సీ. 'శ్రమమునకై యేను సకలాంబకములు నె
క్కుడువెన నేయ, నయ్యెడకు నొక్క
యాఁబెయ్య యఱికి నాయజ్ఞానమున నంప
తాఁకునఁ గూలినదాని కలిగి
బ్రాహ్మణుం డధికకోపంబున "నిది హోమ
ధేనువత్సం, బిట్లు దీని శల్య
నిహతంబుఁ జేసితి; నీవు నాపదన శ
ల్యంబున నిహతుండ వగుము; నీకు

తే. సమర మేకాగ్రనిర్భరోత్సాహవృత్తి
నడప నరదంబుచక్రంబు పుడమిఁ గ్రుంగ
నలయు; నెవ్వీరు మార్కొని గెలువఁగోరి
శ్రమము సేసెద నతనిచేఁ జావు నిజము!" ౮౦

చ. 'అనుటయు, భీతి వేఁడికొని, యావులు వేయును, నెడ్లనాఱునూ
ఱును, రథముల్ శతంబును, మెఱుంగుల మొత్తముఁ బోని యంగనా
జనశతకంబు, దంతిశతసప్తకముం గొని శాంతిఁ బొందవే
యనినను, మానదయ్యె వసుధామరుకోపము తీవ్రరూపమై. ౮౧

వ. 'మానకయున్న, మఱియును; ౮౨

---

1. శాంతిపర్వము. 1 అ. 20-24 లో:-ఈ కీటకము, తాను గ్రస్తుండను పేరుగల రక్కసుడనియు, భృగుపత్నిని అపహరించి శప్తుఁడై యీ రూపుపొందినట్లును, కర్ణుని విలోకనామృత సేచనంబున సుఖి అయినట్లునుచెప్పి, పూర్వాకృతితో నిజేచ్ఛం జనుచున్నాఁడు. ఇచటవలె, శాంతిపర్వమున ఇంద్రుని వన్నాగమనునది లేదు.

2. శాపప్రకారంబు.

క. "నాకుఁ గలసొమ్ము లెల్లను
నీ కిచ్చెద నను బ్రసాద నిరత కటాక్షా
లోకితుఁ జేయు మనఁడు. నతఁ
"డీకాఁకలు మాను"మనుచు వేఁగెం బెలుచన్. ౫౩

వ. 'ఇట్లరుగుచు, నలుకపెంపునం గన్నుల నిప్పులు రాల, మరలి కనుంగొని "పాపలుకులకు లొంకునం గలదే? నీ కీ దుష్కర్మంబు పరలోకంబునకు బాధకంబుగాకుండ నిదియ ప్రాయశ్చిత్తం బయ్యెడుంగాక పొమ్ము; సూతనందనా, యే నెట్లంటి నట్లగుటదప్ప, దరుగు"మనియెం. గావున నా జామదగ్న్య బ్రాహ్మణుల శాపంబులకు వెఱతు. సత్యంబ పలికితి. నీ యున్నరాజుజును నాతోడి సుఖదుఃఖంబులకుం గలవా రగుటంజేసి కృష్ణాదులకు నే వెఱవ. నింద్ర యమ వరుణ కుబేరులు వజ్ర దండ పాశ గదాహస్తులై యిట్టు ముట్టినను బెదర. నని యుండుదుఁ; దక్కినవారిం జెప్పనేల? యిప్పుడు బ్రహ్మాస్త్రంబునుం దోఁచు చున్నది; యన్నరుని యున్నెడకు మనరథంబు నడపుము. పుడమిజనంబులు మదీయ కోదండపాండిత్యం బొండొరులకుం జెప్పికొని యచ్చెరు వందుచుండ నట్లు సేసెద; నమ్మేటిమగని మృత్యునివాసంబు నొందించెద. ౫౪

— కర్ణుఁడు నిజప్రతాపోన్నతిని ఎత్తిచెప్పి శల్యుని దూఱుట —

సీ. 'శాంత మహోత్తరంగముల వైరుల ముంచు
విజయాంబురాశికి వేల నగుదు;
దారుణశక్తులఁ బరిపంథులఁ బొదివెడు
నర్జునాదిత్యున కభ్ర మగుదు;
నిశితోగ్రశరముల విద్విషుల నేర్చు కిరీటి
ఘోరదావాగ్ని కాసార మగుదుఁ;
బ్రదరవేగమున నరాతులఁ గూల్చు పా
ర్థాతివాయువునకు నచల మగుదు;
తే. విల్లు వట్టెడువారికి నెల్ల నెక్కు
డనఁగ నెగడిన గాండీవి నాహవమునఁ
దొడరఁ బ్రాణంబులకు నాసపడు లఘుప్ర
కారులకు నచ్చునే నాకుఁ గాక శల్య?' ౫౫

వ. అని పలికిన విని, యమ్మద్రపతి : 'వీనియంతరంగంబు గలంగెఁ; దా నర్జునుచేత నొచ్చుటయు జచ్చుట నిర్ణయించె, నెట్లనినః- నిట్టియప్పుడు జనులు దనమీఁదం జాలమి పెట్టకుండుటకుం గాదె జామదగ్న్య బ్రాహ్మణశాపంబులు దూపాలుర నన నగ్గడించెఁ; నిక్కలంకయే వీరజ్ఞాలానికి నర్జునుగుణవిశేషంబు లెఱింగించి, మదం బడంచిన కతంబునం గలిగెఁ. గౌంతేయాగ్రజునకు నా యిచ్చిననరంబు సఫలంబయ్యె' నని మనంబునం దలంచి సంతోషించె; మనుజేశ్వర వినుము, మా శల్యుండు చెప్పిన యాఖ్యానంబునం జిత్తం బెరియుచునికిం జేసి, యా సూత నందనుం డతనితో గనలుచు మఱియు నిట్లనియె:- ౯౬

క. 'దృష్టాంతము చెప్పెద నని,
కష్టాత్మా, నీవు నన్నుఁ గాకము, నరు న
త్కృష్టమరాళము గాఁగ ని
కృష్టంపుఁగథఁ జెప్పి; తిది సఖిత్వము శెఱుఁగే? ౯౭

ఆ. 'నీచులకు బలంబు నెట్టన నరునని
శౌఱు లఱచు చున్కి గాన, యిట్లు
పలికి తింతఁజేసి, భయ మయ్యెనే నాకు?
నట్టిమాట లింక నాడ కుడుగు. ౯౮

క. 'అడిగితినే నిను నాక
వ్వడి భుజబల మెట్టి దని? యవారణ నీ వి
ప్పుడు నృపు లెల్లను విన నా
విడిచి పొగడె దిట్లు వందివిధమున నతనిన్. ౯౯

చ. 'అనిమొన శత్రులం బొగడు టారయ, మూర్ఖతగాదె? యిట్టి దు
ర్జనుల సహింతురే? పెలుచఁ జంపక పైరణ పేయుకాలమై
నినుఁ దెగఁజూడ నైతి ధరణీపతి కయ్యముపై భరంబునం
గొనకొని, సూతకృత్యమునకుం దగఁ బంచినవాఁడు గావునన్.' ౧౦౦

వ. అని వెండియు; ౧౦౧

తే. 'అకుటిలుం డగునాకు, నత్యంత కుటిల
వృత్తి నహితంబు సేసెద ని త్తెఱంగు?

మి త్త్రిపంచన మారయ, మైత్త్రి సప్త
పద కృతోద్భూతి యనియెడు పలుకు వినమె? ౧౦౨

క. 'జను లెట్టిది మిత్త్ర విధం
బని చెప్పుదు, రట్టిచంద మఖిలము దుర్యో
ధనునందుఁ గలదు నాయెడ;
మన మూఱడియుండు నా కమందప్రీతిన్. ౧౦౩

క. 'జను లెట్టిది శత్రువిధం
బని చెప్పుదు రట్టిచంద మారయఁగా దు
ర్జనుఁడవగు నీకు నాయెడ
వినుము కలిగె; దీన మనసు విచ్చెం గుటిలా! ౧౦౪

ఉ. 'కావున నీకు నప్రియముఁ, గౌరవరాజునకుం బ్రియంబునుం
గా, విధి మెచ్చ బాహుబలగర్వ మఖర్వము గాఁగ, లక్ష్మికిం
జేవయుఁ, గీర్తి కున్నత విజృంభణముం గలుగంగ, ముకుంద గాం
డీవులఁ దాఁకి గెల్చెదఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగన్.' ౧౦౫

వ. అని పలికి, మఱియును— ౧౦౬

తే. 'ఖండనంబునఁ బార్థుచేఁ బడక నేఁడు
మేలుచే మైతినేనియు, మృత్యువునకు
నెన్నఁడును వగపడ; నాకు నివ్విధంబు
సందియము లేక చిత్తంబునందుఁ దోఁచె! ౧౦౭

చ. 'విమత మహాస్త్రముల్ వఱపి, విక్రమసంపద నాకుఁ జూపు న
ర్జును భుజలీల కోర్చెద వసుంధరఁ జక్రము గ్రుంగి నారథం
బునకు నవార్యమై యెదరు పుట్టక తక్కినఁ: శల్య, చూడుమీ
వను: విశిఖావలీ విలసనంబున నాతనియేపు మాపెదన్. ౧౦౮

—◆ మద్రక, బాహ్లీక దేశ నింద్యోపన్యాసము ◆—

వ. 'నీకు వెఱపింపనయ్యెడు కొలందివారివి వెఱపింపుము. కర్ణుండు విక్రమంబునకుం గీర్తికి నాస్పదం బగుటకు జనియించినవాఁడు గాని, భయంబు గొనుటకుం గాదు. కురుపతి సన్నిధి నీవు సారథ్యంబునకుం బూనుచుండి, పలికికొన్న బావ కథం

బున బ్రదికిపోయితి' వని వినిన, శల్యుం:-'డీయనర్థప్రలాపంబులం బ్రయోజనం బేమి? వినుము: కర్ణ కర్ణులు వేవురైనం గిరీటిని గెలువం జాలుదురే?' యనుటయు. నతండు గినుక నెఱ్ఱనైన కన్నుంగవతోడి నవ్వునవ్వుచు. నిట్లను: 'ధృతరాష్ట్ర మహీపతి సన్నిధి నుత్తమద్విజాలిగోష్ఠి నఖిలదేశాచారవిదుం డైన వృద్ధబ్రాహ్మణుండు చెప్ప వింటి: బాహ్లీకదేశంబు వారు గోమాంసంబు నంజుకొని మద్యపానంబు చేసి, నగ్నులై యసంగత దురాలాపంబు లాడుచుం దిరుగుదు రని. తొడంగి యనేకప్రకారంబుల బాహ్లీకదేశ నిందోపన్యాసంబు చేసె. నట్టి బాహ్లీకుల కొడయుండవు; తత్కృతంబులగు పుణ్యపాపంబుల నాఱవపాలు నిన్నుం జేరు నట్లుం గాక, వారి యనాచారంబులు వారింపమిం జేసి యాకల్మషంబు లెల్లను నిన్నుం బొందు. బాహ్లీకులకంటెను మద్రదేశజాతు లవినీతు లని యార్యులు చెప్పుదురు. ని న్నేమి చెప్పం గల? దింతయట్లు నెఱింగి, నాలుక యడంచి యుండు' మనవుడు నమ్మద్రేశ్వరుండు— ౧౦౯

క. లావులు రథ్యాతిరథవ
ఖ్యావేశం దెలియఁజెప్పం గాదే భీష్ముం
డావచనమ్ములు మనమున భా
వింపుము క్రోధ మేల బలియుఁడ నీకున్? ౧౧౦

—◆ ప్రతివచనముగా శల్యుఁడు అంగదేశజనితుల తూలనాడుట ◆—

తే. 'విడుతు రాప్తుల బంధుల, వెలలు గన్న
నమ్ముదురు కులకాంతల, నంగదేశ
జనితు లగువారు; వినుఁడ వజ్జనుల! కిట్టు
లేలొకో యొర్లచరితంబు లెన్న నీకు? ౧౧౧

క. 'పరదోషము చెప్పఁగ నే
ర్తురు గా కాత్మీయమైన దోషంబు మదిం
బరికింపఁగ నధములు నే
ర్తురె? తలఁపక యంటి పలుకతో నుండకుమీ.' ౧౧౨

వ. అని యుల్లసం బాడి మఱియును; ౧౧౩

ఆ. 'సకలదేశములను సన్మార్గవర్తులఁ
గలరు, దుష్టతతియుఁ గలిగియుండు;
మది యెఱుంగనేర్చు మధ్యస్థు లదియును
నదియు నగ్గడింతు రెదురు మెచ్చ. ౧౧౪

వ. 'ఒకదేశంబు దాఁ గిడ యగుట కలుగునే? యట్లుంగాక, సదాచార దురాచారంబులు దైవం బెఱింగెడు; నీ వనాత్మజ్ఞుండ. పూరకుండు' వనియె. న ట్లయ్యిరువురు వివాదంబు సేయుట యాలించి చేరి, కౌరవపతి సఖిభావం బుపన్యసించి, రాధేయు రాజత్వగౌరవంబు గొనియాడి, మద్రవిభుని వారించిన, నా సూతనందనుండు నగుచు శల్యు నుద్దేశించి: 'వద వద! రథమ్ము వోనిమ్ము వోనిమ్ము' ని పలికె. న ట్లరిగి, శల్యుండు సస్మితుం డగుచు నెండియు నర్జును నగ్గడించి: 'కృష్ణుండు సారథియును గాండీవంబు సాధనంబునునై యప్రతిహతమనోరథుండగు నారథికు తోడం బెనంగ నోపితేని నీవ మా కెల్లను రాజు; నమ్మేటిమగని యరదంబు నను మొగ్గరంబు సొచ్చి చిక్కువఱుచుట గలుగునని, యెఱుంగ నయ్యెదు. మున్న మేమఱక యుండవలయు; నీతోఁచు దుర్నిమిత్తంబు లనుసంధింపుము. ౧౧౫

—◆ రణము ఉగ్రమగుసూచనలు ◆—

క. 'నఱకులు మనచేరువఁ బె
ల్లఱచుట, బెట్టెదురు గాలి యడరుట, గ్రద్దల్
తఱచయి యాడుట, వికృతపు
టఱవులతో శేఁగి కాకు లఱచుట గంటే!' ౧౧౬

వ. అని వెండియు. ౧౧౭

ఆ. 'సిడముకొను మూఁడు వడఁకెడు! మనసేరి
చుట్టు మెఱయఁ గట్టినట్టి చిఱుత
వడగలందుఁ గంటె! పెడలెడు మంట లు
గ్రంబు గాఁగ నోవు రణము నేఁడు.' ౧౧౮

అనియె. నప్పుడు రాధేయుండు ధృష్టద్యుమ్నాభిరక్షితంబయిన ధర్మతనయు వ్యూహంబు గమంగొని, రథికవరులం దగినయెడల నమర్చి, తనమోహరం బాయతంబు సేసికొని యురవడింప, నమ్మద్రపతి యత్తెత్తి యాలోకించి— ౧౧౯

ఉ. *'అల్లదె! యర్జున ధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపిం
ద్రోల్లసనంబునన్ మెఱసి; యుద్భటులైన త్రిగర్త సేన కో
ల్లిఁగ వారె యన్నరుని బెట్టుగఁ దాఁకి; రతండు నంపసె
వ్వెల్లి వినిర్చి మించె నదె వింటి గుణధ్వని మ్రోంగ వారలన్!' ౧౨౦

ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు లనియె: 'సంశప్తక
బలముచేతఁ బొదువఁబడి, కిరీటి
మేఘపిహితుఁడైన మిహిరునిచాడ్పున
వాఁడి లేక యున్నవాఁడు గంటె!' ౧౨౧

వ. అనుటయు శల్యుండు— ౧౨౨

చ. 'వరుణుఁడు నీళ్లచేఁ జెడునె? వాయుసఖుండు మహేంధనోత్కర
స్ఫురణ నడంగునే? నరుఁడు పోరుల నేనలు జేల కల్గు? నె
వ్వరికిని వానిఁ గీడ్పఱుప వచ్చునె? గాలిఁ బరాభవింపఁగా
దొరకొనినం, జలంబు మెయిఁ దోయధి యంతయుఁ ద్రావ వచ్చునన్. ౧౨౩

ఆ. 'దేవతలకు నైన దేవేంద్రపుత్రుని
వాహవమున గెలువ నలవి గాదు;
మనము గెలుతు మిట్టిమాట లాతనిఁ జేరఁ
జనక యాడి, దీన నంతసింపు. ౧౨౪

ఉ. 'మేరువుపోలె నొప్పిన సమీరణపుత్రుని పేర్మియున్, మహో
దారుఁడు ధర్మనందను మదాత్తతయున్, విజయామజన్ము లే
పారఁగ మన్నపొంపును, నహంకృతి యేర్పడ ద్రౌపదీసుతు
ల్వీరల మీఱి పొల్పెసఁగులీలయుఁ జూడుము సూతనందనా! ౧౨౫

వ. 'పాండవులు ధర్మపరు, లెవ్వలన ధర్మంబు గలుగు నవ్వలనికి జయంబు గలుగుట
దప్పదను సమయంబున; సంశప్తకకులంబు గనుంగొని మనసైన్యంబును నవ్య

* చిన్నచిన్నమాటలతో జరిగేయుద్ధమును కన్నులకుగట్టినట్లు వర్ణించు యీ నేర్పు తిక్కన పలుతావుల ప్రదర్శించును. జనసమర్దములో, తుములసంగ్రామమున దూరమునకు కనుపించేది కేతనమే గదా. దానిని ఆనమాలుబట్టి ఆ ధ్వజవిహారమున్నచోటుకుబోయి, ఆ వీరునితో యుద్ధముచేయ నుద్యోగించుటను సహజముగా నొంపుగా యీ రణరంగమున వర్ణించుచుండును. ఇదేపద్యము మరల ఇదే ఆశ్వాసమున 152-వ పద్యముగా నున్నది. ఇది యూనివర్సిటీ సంశోధకులు గమనించినట్లు లేదు. నేనూ అట్లే ఉంచినా.

సాచిం జూచి వారిపేనయును గడంగి యొండొంటితోఁ దాఁకిన, గంగాయమునల సంపాతంబుచందంబు దోఁచె ; నట్టియెడం గురురాజు రాధేయుని మద్రరాజుం దగురాజులను సాదరావలోకనంబున సంభావించి యిట్లనియె :- ౧౨౭

—♦ కురురాజు నిజసైన్యమును కోలంతఁ జపరచుట ♦—

ఆ. 'ఎద్ది ప్రియము సేయ నేపారుశూరుల
చిత్తములకు, నది యుదాత్త భంగి
నొదవె మీకు ; బాహుమదమునఁ గొవియాడుఁ
డుగ్రశౌర్యమహిమ యుల్లసిల్ల. ౧౨౮

క. 'బలుపెసఁగ బాండుపుత్రులఁ
బొలియించిన నతులరాజ్యభోగంబును ; వా
రలచేతం బొలిసిన ను
జ్జ్వల నాకసుఖంబు గలుగు ; బ్రాలుఁడు పోరన్.' ౧౨౯

వ. అనిన వార లందఱు మచ్చి సింహనాదంబులు సేయఁ, దూర్యనినదంబులు సెలంగ, సైన్యంబులు సంతసంబునం బొదలె, నవ్వు డశ్వత్థామ రథికజనంబుల మనంబులం బ్రమదం బెసంగ ని ట్లనియె :- ౧౩౦

క. 'ఆయుధము విడిచి యుండఁగ
సాయకగురు మీరు సూడఁ జంపిన కష్టో
పాయుని ధృష్టద్యుమ్నుని
మాయించియ కాని, తొడిగనము వే నూడ్పఁగ. ౧౩౧

క. 'కడువడి వడముడియును గ
వ్వడియు నతనిఁ గావఁ బూని వచ్చిరయేనిం
జెడుదురు మచ్చాపంబున
వెడలు వివిధవిశిఖశిఖల వేఁడిమిచేతన్.' ౧౩౨

చ. అన విని, యశ్వరిపరథికావలి పెల్లుగఁ బాండుపుత్రయో
ధనులపయిఁ జెనం గవియు దర్పము, వార లుదగ్రవృత్తి మా
ర్కొనిన మహోగ్రభంగియును, ఘోరపులీలల విస్మయం బొన
ర్చె నవిమిషాంతరంగములఁ ; జెల్లె రణంబు సుదీర్ఘరౌద్రమై. ౧౩౩

క. జనసంక్షయంబు పెల్లే
మన వచ్చుం? బ్రళయకాల మయ్యెనొ! కా కెం
దును నిట్టివి గలవే? యని,
మనమునఁ దలపోయ వలసె మముబోఁటులకున్. ౧౩౩

వ. అట్టియెడ : ౧౩౪

ఉ. ప్రీతి యెలర్ప వీరుల వరించుటకుం జనుదెంచి, యప్సరో
వ్రాతము గంధపుష్ప పరివర్షణకేళి యొనర్ప, సౌరభం
బాతతి సంచరించు లలితానిలుఁ డెక్కుడు పేర్చి వీచె, సం
జాత నవీనఘర్మజలజాలక సైనిక లాలనీయుఁ డై. ౧౩౫

ఉ. ఆనమయంబునం గురుకులాగ్రణి భీమునిఁ దాఁకె; వైరిసం
త్రాసన మత్తవారణ కదంబసముద్భటుఁడై యతండునుం
జేసె రణంబు, దత్ప్రబలసేన దలంకెడునట్లుగా సము
ద్భాసిత దుర్నివార్య బహుబాణ విసారణ దారుణోద్ధతిన్. ౧౩౬

—♦ ఉభయబలంబుల సమరసన్నాహము ♦—

క. పదపడి రాధేయుం డు
న్మదవృత్తిం గవిసె, గుణవినాదంబును బె
ట్టిదమగు రథనిస్వనముం
జదల నిగుడఁ బాండవాగ్రజన్ముని దెసకున్. ౧౩౭

వ. ఇట్లు గవిన, మనసైనికు లి ట్లని : 'రివ్విధంబున ధర్మనందనుం గదియ నడరిన, నరుండు వచ్చి యడ్డంబు సొచ్చునపుడు : ౧౩౮

చ. 'నరునకు సూతసూతికి రణం బగు నేఁ డతి ఘోరభంగి; నం
దరయ నితండు గీటడఁచు నాతని నన్నటు లున్నవాఁడు, దు
ర్భరరిపుబాధ దక్కి కురురాజు సుఖిత్వముఁ బొందు నిప్డు; రం
డరదము పేర్చి యీతనిమహాస్త్రవిలాసము సూత మేర్పడన్. ౧౩౯

క. 'గెలు పెల్లభంగి నితనికిఁ
గలుగు నమతలంపు వుట్టఁ గా, నిపుడు మనం
బుల జనియించు మనోరథ
మలవడుటయొ, వీర నెఱుఁగనయ్యెడు నదియున్.' ౧౪౦

వ. అనుచు గూడుకొని, రథ కరి తురగ సమ్మర్ద విర్దళితభూభాగంబుగా మరపడింప రాధేయుం డతిభీషణం బగురణంబున, ౧౪౬

తే. మిగిలి, యప్పాండవాగ్రజు మగఁటిమియును
బలముఁ గోల్పుచ్చి, తూలఁ బోఁ బలికి మెఱసె
నధిప, యతనికి వీఁకమై నడ్డపడఁగఁ
గడఁగు నద్దెస యోధుల గర్వ మడఁచి. ౧౪౭

వ. అనిన విని, సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియెఁ:-'కర్ణుండు దనమొన యెట్లాయితంబు సేసెఁ? గౌంతేయ ముఖ్యసైన్యసన్నాహం బెట్టిది, దళం దళవిం బొదివినయప్పుడు గవ్వడి యెవ్వలన నుండె? నవ్వీరుం డన్నకడమన్న, నా సూతి నందనున కట్లు సేయ నళంబగునే? వాసవుండు సకలసురగణంబులతోఁ బన్ని, యన్నరునిపై వచ్చి ఖాండవంబు గాల్పకుండఁ గావం జాలెనే? బ్రదుకున కాన పడు మగల కతని మార్కొనవచ్చునే రాధేయునకు వచ్చుంగాక' యనుటయు;

తే. ఇట్లు లను సంజయుం డమ్మహీశ్వరునకు-
'నంగిపతిమోహరంబు తెఱంగు ధర్మ
సుతుని యొద్దువిధంబు, నర్జునుఁడు వారి
బోరునెడ లేమియును; మీఁదిపోరు వినుము:- ౧౪౮

వ. కృపాచార్యుండును గృతవర్మయు మాగధులు నలసట, శకునియు నులూకుండును గుఱ్ఱపుదళంబులతో వారికెలనను, సంశప్తకగణం బిరువదినాలుగువేలు రథిక ముఖ్యరథంబు లగ్గలిక నల్లసిల్లి దావటను, నీ కొడుకులందుఁ గొందఱు కాంభోజ శక యవన సైన్యసమేతంబుగా వారి యవులను, బహుబలభాసితుండై దుశ్శాసనుండు వెనుకనుం, గతిపయ సోదరపరివృతుండై కురురాజటి పిఱుందను, నశ్వత్థామప్రముఖ యోధులు గరి విశర కృతసన్నాహులై యన్నరపతి వియోగింప నతనిపజ్జ నిలువ, *నిజపుత్త్రులుఁ దనచుట్టును గడిపి యొసక మెసఁగు, బరవశంబున మెఱయ, సూతసూనుండు సేనాముఖంబునకుం దిలకంబై నిలిచి పొలిచె.

* కర్ణునిపుత్త్రులు - సుషేణ, సత్యసేన, చిత్రసేన, వృషసేనులనువారు. వీరు తండ్రి చక్రరక్షకులుగా ఎప్పుడు దగ్గరనే యుండి యుద్ధము చేయుచుండిరి. ప్రసేనుఁడుగూడ కర్ణుని కొడుకు అని చిత్రశాలా ప్రతియందున్న గలదు. (కర్ణ-ప: 3-183) వికర్ణుఁడు కర్ణునిపుత్త్రుఁడు గాఁడు, ధార్తరాష్ట్రుఁడు. ఈ పర్వములో (1-ఆ. 169-172) పార్థునిచే తుదముట్టింపఁబడిన సత్యసేనుఁడు-త్రిగర్తాధిపతి సోదరుని మఱుఁడు.

వట్లు మోహరించి మదకలమాతంగంబుల తఱచుకతంబున మొయిళ్ళ మొత్తంబుల
కైవడిం గాలుకొను వమ్మొన నరవడి నడిపించు నాకర్ణునిం గనుంగొని కౌంతే
యాగ్రజుండు గాండీవి రావించి యిట్లనియె :— ౧౪౩

ఉ. "సూతతనూజు మోహరము సూచితె! యెంతయు గట్టియై వను
ద్ద్యోతితభంగిఁ దోఁచె! నది యుక్కునఁ బైపడి యబ్బలంబు వి
ర్ధూతము సేయకుండఁగ నెదుర్కొని, యెమ్మెయి విల్వరింత న
న్నీతి విధింపుమా బలుపు నేర్పును దక్షులు విచ్చలింపఁగన్." ౧౪౪

క. అనుటయు సంక్రందన నందనుండు, ౧౪౫

తే. "సారవంతమై కర్ణునిసైన్య మూరవ
ణించుఁ గా నేమి దీనికిఁ నృపవరేణ్య.
పూని చేయంగవలయుఁ బ్రధానకార్య
మతని సమయించుటయ! నాకు నది భరంబె?" ౧౪౬

వ. అనిన విని, యమ్మనుజపతి యతని కిట్లను: నట్లేని నీవు రాధేయుని గెలువుము.
భీమసేనుండు సుయోధనుని, నకులుండు వృషసేనుని, సహదేవుండు సౌబలుని,
శతానీకుండు దుశ్శాసనుని, సాత్యకి కృతవర్మను, ధృష్టద్యుమ్నుండు ద్రోణ
పుత్రుని, ద్రౌపదేయులు శిఖండియుం దారును దక్కటి ధార్తరాష్ట్రులం దలపడువారు
నేను కృపాచార్యునితోడం బెనంగెద ననుటయు, నట్ల కాక యని, యతండు
మున్ను దన విలిచిన నెలవునకుం జనునెడ, నయ్యుధిష్ఠిరు సమపుతెఱంగు వార
లందఱకు నెఱింగించె, నతండు వలనటివలన సైన్యాగ్రవర్తి యయ్యును, వృకో
దరుండు వామపార్శ్వవర్తియయ్యును, శైనేయ ద్రౌపదేయసమేతంబుగా నప్పాం
దవాగ్రజుండు మధ్యభాగస్థుం డయ్యె మున్న. యమ్మోహరం బా సూతనందను
మొనయురవడి నరకుగొనక మార్కొనియె; నవ్వుడు నాంబికేయుండు— ౧౪౭

మ. "నరుఁ డమ్మైమ్మె విని వచ్చె, నన్నరునకు వ్వంకతప్రకర్శ్రేణికి
న్దురమత్యుద్భటభంగిఁ జెల్లటయు మున్నూచించి; తీ నయ్యుధి
ష్ఠిరునిం గర్ణుఁడు దాఁకి యోర్చె ననియుం జెప్పంగ వింటిఁ; రణం
బరయం జిత్రము! చెప్పు మత్తెఱఁగు సువ్యక్తంబుగా సంజయా." ౧౪౮

వ. అని యడిగిన, సంజయుం డమ్మానవపతి కిట్లను:—నట్లు ధర్మజుండు చెప్పె కాని
యయ్యిరువాఁగుం గడిపినప్పు డన్నియమంబు నడపక, కయ్యంపు టౌచిత్యంబున

నొండుఁదెఱంగు పెల్లై; నది యెఱింగించెద నవధరింపు: మవ్విధంబున మొనలు రెండును నొండొంటిం దార్కొనుసమయంబున సవ్యసాచి గర్జు నడచు చక్కటికి నడరం గడఁగిన గ్రాలు కపికేతనంబు గనుంగొని, తెంపుపెంపునఁ బొంపిరి వోవుచుఁ ద్రిగర్తాది సంశప్తకులు సరభసంబుగా నడ్డపడి, పైకొని తఱిమి, పొంగిన పయోనిధింబోలిన నబ్బలియుండు పెలియలికట్టంబోలి నిలువరించి, మాతంగప్రముఖ సేనాంగ సకలాంగ శకలంబుల విలాతలంబు గప్పుచుండ, నొండొండ పేర్చి యాబలం బాబలమర్దన నందను నరదంబు ముంచికొనిన, నవ్వీరుండు విజృంభితవిక్రముండై బడబాగ్ని కీలాకలాపంబు చందంబగు పాయక నికాయంబు విగిడించుచు, నెక్కుడు మదంబున నమ్మూఁకలం ద్రెక్కొనుచుండఁ; దత్ప్రకారం బాలోకించి రాధేయునకు శల్యుం డిట్లనియె:- ౧౫౧

ఉ. *'అల్లదె! యర్జున ధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపిం
ద్రోల్లసనంబునన్ మెఱపి! యుద్ధతు లైనత్రిగర్త లేవు శో
భిల్లఁగ వారె! యన్నరుని బెట్టుగఁ దాఁకి, రతండు నంపపె
న్వెల్లి విగిడ్చి ముంచె నదె! నింగి గుణధ్వని వొంగ వారలన్.' ౧౫౨

వ. అని చెప్పుచూపెఁ. బదంపడి భారద్వాజపుత్రుని బరవసంపుమాటల నాటోపంబు మిగిలి, మనరథికులు గవిసిన దారుణరణం బయ్యె నని, యాకర్ణించి తది యేర్పడ వినుము వివరించెద. ౧౫౩

సీ. కృపుడు సౌబలుఁడును గృతవర్మయును నలిఁ
జెలఁగు మూఁకలతోడ బెలుచఁ గవిసి,
కాశ కైకయ మాత్స్య కౌసల పాండ్యాది
బలములఁ దాఁకి రగ్గలిక మెఱయ,
నారెండువాఁగుల నాయుధంబుల యెఱ
మంటలఁ బొల్లను మింటఁ బుడమిఁ
జూడ నక్కజముగ, శోణిత ధారలు
ప్రచురధూళీతిమిరముల నడఁప,

తే. భగ్నరథములు విపతితేభములు విహత
హయములును మృతభటులును రయమునకు వి

* ఇదేపద్యము, యీ ఆశ్వాసమునే 120-వ పద్యంగా నున్నది.

ఘాత మొనరింప, నున్మద గమనభంగు
లందు వెరవులు మెఱయఁ బోరాడి రధిప. ౧౭౦

వ. ఆలోన. ౧౭౧

—♦ కర్ణుఁడు పాంచాలకుమారుల పైఁబడి అనేకుల తుదముట్టించుట ♦—

ఉ. మేలి మదావళంబులును మేటిహయంబులుఁ దమ్ముఁ బిందు నా
భీలతఁ జుట్టి రాఁగ, రథబృందముతోఁ గురురాజు కర్ణుదో
ర్లీలకుఁ దోడ్పడం గడంగె; రేణు వుదీర్ణముగా నతండు పాం
చాలబలంబుపై నడరె శౌర్యసముద్భట బాహువీర్యుఁడై. ౧౭౨

వ. అబ్బలంబునకు బాసటయై చేదిసైన్యంబును, బెనుఁబ్రాపై పాండవానీకంబునుం దఱిమినఁ, బెఱిగినదర్పంబునం బ్రదీప్తుం డయి యక్కర్ణుం డా గట్టిమూఁకలం దఱిసి, మెఱుంగువాలమ్ములు వఱవ, నవి పీనుంగుపెంట లగుచుండ మఱికయుక్కునం బొదివిన బలుమగలకుం గీర్తియు స్వర్గంబును నొసంగి, తమవారికంటెఁ బ్రమోదభరితులం జేయుచు, సాయకాసారంబులు వరఁగించుచు బహువిధరథప్రచారంబు లుల్లసిల్ల; నాసేనలును గృప కృతవర్మాది యోధబృందంబులతోఁ బెనంగుమొనలును నొక్కటిగాఁ గలంచి, యందు శోణితజలంబులును, మాంస మజ్జా మస్తిష్క కర్దమంబులును, బతితాతపత్ర హంసంబులునుం బొలుచునట్టి నదీప్రవాహంబులు వఱపె. ననుటయు, ధృతరాష్ట్రుండు 'ధర్మనందనుం గర్ణుండు గదియునప్పు డతని కక్కడ నడ్డపడుట కెవ్వరు గడంగి? రక్కడ నితనికిఁ దోడ్పడ నెవ్వారు గలిగి?' రనుటయు సంజయుం డవ్విభున కిట్లనియె:—

తే. ఇవ్విధంబున సేనల గ్రొవ్వడంచి
సూతసూనుండు ధర్మజుకేతనంబు
దెసకు నడర ధృష్టద్యుమ్నుఁ డెసక మెసఁగ
బంధులును దాను నడి నడ్డపడియె నధిప. ౧౭౩

క. వారలఁ గడచి ప్రభద్రకు
లారాధేయునయిఁ గవియ, నాతండు మహో
దారుల వేద్వర భద్రా
కారుల నారాచన ప్తకంబునఁ గూల్చెన్. ౧౭౪

క. కవి పాంచాలురు గోపం
బున దర్పము నెఱయఁ మెఱయఁ బొదివిన, రాధా

తనయుం డిరువదియేవురఁ
దునిమె నిరువదేను వెఱఁదతూపులఁ జెలువన్: ౧౬౦

క. వెండియు నేపునఁ జైకొని
చండశరప్రకరములు పెనం గురియఁగ, ను
ద్దండతఁ బాంచాలురఁ గ
ర్ణుం డేవురఁ జంపె నైదు క్రూరాస్త్రములన్. ౧౬౧

వ. ఇట్లు భానుదేవ చిత్రసేన సేనాబిందు తపన శూరసేనులం గీటడంచి, యాటోప దీపితుం డయి చక్రరక్షకు లగు సుషేణ సత్యసేనులు వెనుక బలసి వచ్చు వృషసేనుండు నిమ్మువ్వురుగొడుకులుఁ గడిమి యాధిక్యం బెక్కం, దనకు రణక్రీడకుం దోడుపడియెడు నుల్లాసంబున నుల్లంబు పల్లవింపం, బాండవబలంబులం గలంచు నయ్యంగపతిమీఁద ధృష్టద్యుమ్న శిఖండి జనమేజయ ప్రముఖపాంచాల కుమారులును, సాత్యకి నకులసహదేవ ద్రౌపదేయులును, కేకయ మాత్స్యయోధవీర వ్రాతంబును భీమసేనపురస్సరంబుగాఁ దోతెంచిన, బహుళజలధరంబులు ధరణిధరంబుపయిం గురియు సెనసోనచందంబు దోఁప, వివిధాస్త్రశస్త్రంబు లతని పయిం బొరఁగింపం గనుంగొని, కౌరవేశ్వరుండు దుశ్శాసన శకుని తదీయ తనయులు దన కెలంకులం దఱుమం, గరిఘటలతోడం గడంగి, యవ్వడముడివి మూర్కొని: ౧౬౨

క. తానును వారును దూపుల
వాన పయిం గురియ, నతఁడు వారించి గళ
ద్దానంబు లోలమధుకర
మైన గజవ్రజముఁ బటుశరార్చులఁ బొదివెన్. ౧౬౩

క. పొదివెడునప్పుడు శౌర్యో
న్మదుఁడగు నయ్యనిలతనయు మార్గణములు బె
ట్టిదముగఁ గవియుడు, నోటమి
యెదురున లేరైరి కురునరేంద్రుఁడు వారున్. ౧౬౪

మ. బలుగాలిం జలుదిక్కులం జెదరు నభ్రశ్రేణి చాడ్పున్ సము
జ్జ్వల సూర్యాంశులచేత విచ్చు నిబిడధ్వాంతంబు చందంబుఁ, జా
ద్దిక్కులకుం దోఁచెఁ బ్రచండ సంగర పటిష్ఠుం డైన యాభీము తూ
పులమొత్తం బడరం, గరిప్రకర ముద్భూతార్తియై తూలినన్. ౧౬౫

— కర్ణనందనుల విజృంభణము, అందు సత్యసేనుని వీరమరణము —

వ. అట్టియెడఁ, గృపప్రముఖ రథికులు రాధానందన నందనులకుం దలకడచి, పవననందను పార్శ్వంబులం దఱుము ధృష్టద్యుమ్నాదియోధులం దలపడిరి. దుశ్శాసన ప్రభృతులును వారిం గూడికొనిరి. కర్ణనందను లక్కిమ్మీరమర్దనుం దాఁకి, రందు సుషేణుండు. ౧౬౬

క. ఖరభల్లంబున నాతని
శరాసనము ద్రుంచి, నారసములు రయమున్మై
నురమున నేడు నొనిపి, వి
స్ఫురదవినదం బెసఁగ నార్చె సురలు నుతింపన్. ౧౬౭

సీ. కనలి, యొండొకవిల్లు గొని కీచకాంతకుఁ
దక్కుమారుని చాపయష్టి విఱుగ
నేసి, మై బల్గాపు లీరేడు నాటించి
తన్నప్పు దొడరు రాధాతనూజా
నుబ్బు వాలమ్ములు డెబ్బదిమూఁట వా
రించి, తత్పుతుఁడు దోర్లీల మెఱయఁ
జేరిన, నా సత్యసేను రథ్యంబుల
సూతుఁ గార్ముకమును గేతనంబు

తే. నేడు తూపులఁ దునుమాడి, యేచి మూఁడు
నారసము లంగమునఁ గ్రుచ్చి, నాళమునకు
వికసితాంభోరుహముఁ బాపు పెరవు దోఁపఁ
దునిమె నెనఁ గత్తివాతియమ్మున శిరంబు. ౧౬౮

— సుషేణ భీమసేనుల పోరిలో కర్ణుఁడు నకులుఁడు చొరబడుట —

వ. తునిమి, దోస్సారంబు దుర్వారంబుగా నుక్కునం దక్కటి రథికజనంబులపయి నడరి, కృప కృతవర్మాది రథికవరుల కోదండంబులు దుండంబులు సేసి, వారిం గ్రూరమార్గణంబుల మర్దించి, దుశ్శాసనుని సాయకత్రయంబునను, సౌబలునిఁ దద్ద్విగుణబాణంబులను బ్రుక్కించి, యులూకుని నతనితమ్ముని నొక్కుమ్మడి విరథులం గావించి, కర్ణుకొడుకుం గనుంగొని: 'యోరి సుషేణా, పొలిసితి పొమ్మ'నుచు బలునారసంబు విగిడించిన, నది నడుమన కర్ణుండు నఱికి, మెఱుంగు

టమ్ములు మూఁడు మేనం బఱవ నుఱక, మఱియు నట్టిమార్గణం బక్కుమారు
నువలక్షించి యేసిన నా సూతనందనుం డదియునుం ద్రుంచి, యవ్వడముడిమీఁదఁ
ద్రిన ప్రతితీవ్రప్రదరంబులు వరఁగించె. నప్పుడు నకులుండు గవిసిన; ౧౩౯

ఆ. చిత్రచాపముక్త శితశరపంచకా
హతశరీరుఁ జేసె నా సుషేణుఁ,
డేచి నకులుఁ డతని విరువదియమ్ముల
నొంచి, కర్ణుమనము నొవ్వ నార్చె. ౧౪౦

చ. అలిగి సుషేణుఁ డెంతయు రయంబునఁ దొమ్మిది దొడ్డవాఁడితూ
పులు మెయిఁ జొన్పి, విల్ దునిమి పొంగిన, నొండొకదీప్తచాప మ
గ్గలిక దలిర్ప నెత్తి, వెసఁ గార్ముకదండము ద్రుంచి నొంచె దో
ర్బలవిభవం బుదాత్తముగఁ బార్థునితమ్ముఁడు సూతు నాతనిన్. ౧౪౧

ఆ. అన్యచాప లసితహస్తుఁడై కడఁగి సు
షేణుఁ డతని షష్టిబాణగాఢ
నిహతదేహుఁ జేసె సహదేవుఁ డదరిన
మేటితూపు లేడు మేనఁ గ్రుచ్చె. ౧౪౨

—♦ వృషసేనుఁడు సాత్యకితోఁ దలపడుట ♦—

క. అయ్యిరువురు నబ్బలుని
కయ్యె మమరదైత్యరణము కరణి మహోగ్రం
బయ్యె; వృషసేనుఁ డత్తఱి
నియ్యని సాత్యకి నెదిర్చె విషచయ మడరన్. ౧౪౩

సీ. సాత్యకి వృషసేను సప్తసప్తతి మార్గ
ణంబులఁ బొదివి, బాణత్రయంబు
సూతుమైఁ బఱపిన, నాతఁ డాతని పెనుఁ
గడఁత వాలికయమ్మ గాఁడ నేయఁ,
గోపించి మూఁడుబల్లూపుల సారథి,
నొకభల్లమున విల్లు, నుజ్జ్వలాస్త్ర
సప్తకనిహతి నశ్వంబుల, నేకకాం
డస్ఫూర్తిఁ గేతుదండంబుఁ దునిమి,

ఆ. శినివరుండు వక్షమున మూఁడుశరములు
నాట, నొగసి కర్ణనందనుండు
దెలిసి కనలి, వాలు బలుకయుఁ గొని తేరు
డిగ్గి కవియ నవియు నుగ్గుసేసె. ౧౩౪

వ. ఇవ్విధంబున విరథుండును విరాయుధుండునునగు నక్కుమారుం గనుంగొని, దుశ్శాసనుండు రయంబున నెయిది చెయిచాఁచి నిజరథంబుమీఁదికిం దిగిచికొని, తొలంగం గొనిపోయిన; నతండు వేఱొక్కయరదం బెక్కి, యెప్పటియట్ల కర్ణు తేరివెనుక వర్తించె. నయ్యంగపతి తొమ్మిదియమ్ము లడరించి శైనేయు సూతాశ్వ చాపంబులు రూపడంచి, యతని ఫాలమ్మున మూఁడు వాలికయమ్ములు నాటించె. నా సత్యకనందనుం డన్యస్యందనారూఢుం డయి కవిసి, కర్ణునకుఁ దోడుపడు బలంబులం గలంచి, యతని తనువున నేడునారసంబులు నిగిడించెఁ; గూడికొని శతానీకుం డన్నియశరంబు లేసె. నప్పు డురవడించి తక్కటి ద్రౌపదేయులు దెబ్బదిమూఁడును, ధృష్టద్యుమ్నుండును శిఖండియుం బదిపదియు, భీమసేనుం డఱువదినాల్గును, సహదేవుం డేడును, నకులుండు ముప్పదియును, యుయుధానుం డేడును, బాండవాగ్రజుండు నూఱును బాణంబు లా సూతపుత్రుపయిం గుప్పించి నొప్పించిన. ౧౩౫

—♦ పాండవవీరులు ఒక్కుమ్మడి కర్ణునిపైఁబడి దైన్యంబునొందుట ♦—

క. ముదమున నతఁ డందఱఁ బది
పదితూపుల నే పడంచి, బహువిధగతులం
దదపీకంబునఁ దేరొ
ప్పిదముగ వడి సంచరింపఁ బెద్దయు మెఱపెన్. ౧౩౬

శా. శైనేయుండును భీమసేనుఁడును ధృష్టద్యుమ్నుఁడుౕ ద్రౌపదీ
సూనుల్ ము న్నడరంగఁ గిట్టి, విశిఖస్తోమంబు లొక్కుమ్మడిౕ
మేనం గ్రువ్వ, శిఖండియుౕ భుజబలోన్మేషంబు సూపౕ, వెసం
దా నయ్యోధుల సూతసూతి విరథత్వస్తబ్ధులం జేసినన్. ౧౩౭

వ. వియచ్చరులు వెఱఁ గందిరి. వెండియు, నవ్వీరుండు వారల నందఱ నస్త్రధారలం బొదువుచు నేత్తెఱం బెఱవారిని బాణాంధకారంబునఁ గప్పినం, ద్రిప్పికొనియును దొలంగియు దెరలియు మరలియు నారథికసంఘంబు దైన్యంబు నొందె. నంత ధర్మనందనుని బాధింపఁ దలం పెద్దిన; ౧౩౮

క. ఆ రాధేయుం డాతనిపై
రయమునఁ గవియ ఘోరభంగిఁ గని, మహో
దారంబుగఁ జేదిబలము
తోరన నెడసొచ్చెఁ దూర్యములు మొరయంగన్. ౧౬౯

ఉ. సూతతనూజుఁ డబ్బలము సొచ్చి, శతత్రయయోధవీరులం
జేతులతీఁట వో నఱుము సేసి, విశృంఖలదర్ప దుర్దముం
డై తఱుమంగఁ, గల్పితరథాక్రమ మొప్పఁగ వచ్చి ధర్మజుం
బ్రీతునిఁ జేయుచుం, గడిమిఁ జేర్చిరి సాత్యకియుఁ శిఖండియున్. ౧౭౦

క. వారికిఁ దోడ్పడి యక్కడి
వీరులు గొందఱు గడంగి, వివిధోగ్రశరా
పారము లంగాధీశ్వరు
పై రయమునఁ గురిసి రుగ్రభంగిఁ జెలఁగుచున్. ౧౭౧

క. కురుపక్షయోధులును స
త్వరులై యారథికవరులఁ దాఁకి, భుజావి
స్ఫురణము సూపిన నద్భుత
కర మయ్యెఁ దదవసరమున కయ్యం బధిపా. ౧౭౨

వ. అనంతుల సమరంబునందు; ౧౭౩

శా. బాణజ్వాలలు బెట్టు పర్వ, గగన ప్రక్షోభణ జ్యాలతా
క్వాణస్ఫూర్తి చటచ్చటారవముగాఁ గర్ణోగ్రదావాగ్ని య
క్షీణోదగ్రత వైరిసైన్యవన భస్మీభావ నిర్వాహపా
రీణం బై వెలుఁగొందె నిర్జరులు వర్ణింపంగ ; నే ముబ్బఁగన్. ౧౭౪

వ. అమ్మహోగ్ర విజృంభణంబున. ౧౭౫

—♦ కర్ణుఁడు ధర్మరాజుతోఁ దలపడి అవలీలగాఁ బోరుట ♦—

క. ఆటోప మడఁగి, యచ్చటి
మేటిమగలు తివ్వవడిరి మెయిగలి గర్ణుం
డేటలవికిఁ గవిసె, ధను
ర్జ్యాటంకృతి పెడఁగఁ బాండవాగ్రజుమీఁదన్. ౧౭౬

వ. ఇ ట్లెలుంగువం గవిసిన, నతనిమీఁద నమ్మేదినీనాయకుండు సాయకజాలంబులు వరఁగించిన, నతం డుఱక యతిరయంబున నవి వారించి, ౧౭౫

సీ. నవ్వుచుఁ జాపంబు నడిమికిఁ ద్రుంచి, మై
మఱువుఁ దొంబది శితమార్గణముల
భేదింప, రత్నప్రభాదీప్త మగునది
సౌదామనీ చారుజలద మంబు
జా ప్తుని తనువున కడ్డ మై యుండి వా
తాహతం బై పాయునట్ల వోలెఁ
బడుటయు, మణిమయాభరణ సుందరమైన
యతనిగాత్రము నతారాంబరంబుఁ

తే. బోలి, యప్పుడ యాసూతపుత్రుచేత
రక్తమయ మయి పల్లవోద్రిక్తకల్ప
తరువుచందంబు నొందెఁ; నతండు రాజ
ధర్మమూఁది చలింప కదల్చె నధిప. ౧౭౬

వ. ఇ ట్లదల్చుచు, ౧౭౭

క. చదల మెఱుంగులు పర్వం
గాదమపిడుగునట్ల విగుడఁ గుంతీసుతుఁ డు
బ్బి దలిర్ప శక్తివైచిన,
నది కర్ణుఁడు సప్తభల్లహతి నేడఁ దునిమెన్. ౧౭౮

—♦ కర్ణుఁడు సాత్యకిని శిఖండిని వెగడుపఱచి, ధర్మజుని అవమానించుట ♦—

సీ. పాండవాగ్రజుఁడు దర్పంబును వేగంబు
నొప్ప, నవ్వీరుని యురమునందుఁ
గరముల పాలభాగంబున నాల్గు తో
మరములు నొవిపి నెత్తురులు వఱపి
యార్చినఁ, బేర్చిన యగ్గలికంబున
నాసూతనందనుఁ డతని సూతుఁ
జంపి, కేతువుఁ ద్రుంచి, శాతశరంబుల
నంగంబు నొప్పించె; నపుడు సాత్య

తే. కియు శిఖండియు నెడ నొచ్చి, రయము బలువు
మెఱయ రాధాతనూజువిమేన నమ్ము
లొక్క_మొగి నింప, నయ్యోధుఁ డుఱక వారి
విరథులుగఁ జేసి, విండులు విఱుగ నేసె. ౧౯౧

క. తమవులఁ బటుబాణంబులు
వివిచి, వెగడుపఱచి, కడచి నిరతిశయ రయం
బునఁ గదిసి, ధర్మనందను
ననేకసాయక పరిక్షతాంగుం జేసెన్. ౧౯౨

వ. ఇవ్విధంబున రాధేయుండు నొప్పించినం, దదీయసంరంభంబు సైరింపం జాల యమ్మహీపతి హతసారథికంబగు నిజరథంబు దొలంగం దోలుకొనిపోయిన, దోడన తవిలి పొదివి నిలువరించి హాసభాషితుం డగుచు నయ్యంగపతి యతనితో ని ట్లనియె:— ౧౯౩

సీ. "క్షత్త్రియకులమున జన్మించి యిది ధర్మ
మిది యధర్మం బని యెల్ల నెఱిఁగి
నట్టి నీ కిట్టి మహాహవమునఁ బ్రాణ
ములు డాఁచికొన శాత్త్రవులకుఁ దొలఁగి
పోవుట దగునె? నీబుద్ధి గానఁగ నయ్యె!
నృపనీతి యెఱుఁగవు. నీవు బ్రాహ్మ
ణాచార వేదివి, యాగాధ్యయనముల
వర్తింపు. కయ్యంబు వలవ దుడుగు
తే. మింత, ననుబోఁటిఁ దొడరిన నింతకంటె
నెడరు వాటిల్లు. వేగ పొ మ్మింటికడకు.
హరియుఁ బార్థుఁడు మన్నెడకైన నరుగు
మేనుదెగ నీదుప్రాణాన కింత నిజము." ౧౯౪

వ. అని పలికి, గొంతివచనంబులు మనంబున నునికింజేసి వధియింప నొల్లనివాఁడై, యప్పాండవాగ్రజు విడిచి, యాపురుషసత్తముండు తదీయ సేనాసముదయంబు

నానాస్త్రనిహతంబు సేసె. *లజ్జాకులమానసుండగు నమ్మానవపతియును దత్ప్రదేశంబున నిలువక తొలంగి పోయెం. బోవుటయు, ౧౯౫

క. విను, మతని యోధజనములు
మొనయుఁ దిరిగె, నట్లు సమరమున విముఖం బై
చను నబ్బలముం గని, వెను
కొనియెం గర్ణుండు సీదుకొడుకులఁ దానున్. ౧౯౬

క. పటుసింహనాద తూర్యో
త్కట రవ గుణవిస్వనములు గలసి యఖిల ది
క్తట దారణకేలి నము
ద్భటము లగుచుఁ గురుబలమునఁ బరఁగె నరేంద్రా. ౧౯౭

ఉ. ఇమ్మెయి సూతనందనుని యే డ్తెఱ కోడిన యాధవరసం
ఘమ్ములఁ బాండవాగ్రజుఁడు గన్గొని పేర్కొని, పేరెలుగునం
'గ్రమ్మఱి పేర్చి కౌరవనికాయము గర్వ మడంపుఁ' డన్న ధై
ర్యమ్మిగురొ త్త, వే తిరిగి రారథికుల్, మరలెఁ బలంబులుఁ. ౧౯౮

వ. ఇవ్విధంబున వృకోదరపురస్సరంబుగాఁ బాండవబలంబులు మార్కొనిన మన మూఁకలుం గూడికొని తిరం బై త్రోచి తలపడుటయు, నయ్యిరువాఁగునందు, ౧౯౯

మ. కరిబృందంబులు ద్రెళ్ళెఁ బెల్లుగఁ, దురంగస్తోమముల్ పెక్కు గూ
లె, రథానీకము లగ్గలంబు గెడసెఁ, లెక్కింప బె క్కైన కా
ల్వుర మొ త్తంబులు రూపడంగె, సిడము ల్నుగ్గయ్యె, నన్నేల నె
త్తురు వెల్లిఁ మునిఁగెఁ, మరుత్థచరపం క్తుల్ పెక్కసం బందఁగన్. ౨౦౦

వ. అట్టి సందడిగయ్యంబున భీమసేనుండును శైనేయుండును బెట్టిదంపు టురవడిం గవిసిన, ధృష్టద్యుమ్నాది రథికప్రకరంబును బరవసంబు సేయం, గురుబలంబు వెఱచఱచి పఱచినఁ, గర్ణుం డదల్చి కరతలం బె త్తి 'నిలు నిలు'మని పలికిన,

* కర్ణుఁడు కుంతికి యిచ్చినమాటమీఁద, చేఁజిక్కిన నలువురు పాండవులను అవమానించి, తాకనాడి వదలివేసి ఉన్నాఁడు. మొట్టమొదట భీముని (ద్రోణపర్వము-4-ఆ; 239,243) రెండవతడవ సహదేవుని (ద్రో-వ; 5 ఆ; 160, 161) మూడవమారు నకులుని (కర్ణ-వ; 1 ఆ-123) చివరన ఇప్పుడు ధర్మరాజును ఎగతాళితో కించపరచి వదలివేసియున్నాఁడు. ధర్మజుని అవమానమే దుష్టఫలితముమ చేకూర్చినది.

సమ్మోహరంబు విఱువఁదయ్యె. నవష్టంభ విజృంభితుం డైన యాసూతసూనుండు వెండియుం గౌరవుల వేయువేలు పురికొల్పి మరల్చిన. నమ్మొనయును మొగకట్టి నిలిచె. నంతం బవమానసూనుం దాను మార్కొన నగ్గలించె; నతం డతని నాలోకించి యంతకుమున్న శ్రుతకీర్తిస్యందనం బెక్కియున్న తమయన్నవలను సాత్యకి ధృష్టద్యుమ్నులకుం జూపి వారలతో ని ట్లనియె:— ౨౦౧

ఉ. 'ఈతఁడు దుర్దశం బొరపె నేను గమంగొనఁ, గర్ణుఁ దేచి దు
ర్నీతిపరున్ సుయోధనునిఁ బ్రీతునిఁ జేయుటకై కడంగె, మీ
చేతికి నిచ్చి యి ట్లరుగు పేపెద నిన్నరనాథు, నాకు నా
సూతతనూభవున్ సమయఁ జూడక పోదు విషాద మెమ్మెయిన్. ౨౦౨

క. 'ఏ నొండె నతనిచే, నా
చే నొండె నతండు దెగుట సిద్ధముగ, మదిం
బూని కడంగెద, మీ రీ
భూనాథునిఁ గాచికొనియ పోరు నడపుఁడీ.' ౨౦౩

— కర్ణుఁడు భీముఁడు పోరున కలియఁబడుట —

చ. అని పటుసింహనాదమున నంబరముం బగిలించి, తేరు క
ర్ణుని దెసఁ బోవ నిచ్చినఁ గమంగొనిఁ శల్యుఁడు కర్ణుతోడ ని
ట్లను: 'మనమీఁద వచ్చు ననిలాత్మజుఁ జూచితె? యంతరంగ మే
ర్పునలుక కామిషం బిడఁగఁ జూచినచందము గాన నయ్యెడున్! ౨౦౪

చ. 'అలిగిన మూఁడులోకముల నైనను జీరికిఁ జేకొనం డితం,
డలఘు పరాక్రమస్ఫురణుఁ డర్జునసూనుఁడు, నాత్మపుత్రుఁడుం
బొలిసిర కావి, కోపమునఁ బొంగెఁడు వాఁడును వాఁడు; నింత దో
ర్బలమును శౌర్యసారముఁ జిరంబయి చూపఁడు మెచ్చఁ జూపుమీ.' ౨౦౫

చ. అనవుడు భీముఁ జూచి యతఁ డాతని కి ట్లను: 'నట్టివాఁడ కా
కనిలజుఁ దల్పఁ దెట్లు? సమరాగ్రమునన్ భవదుక్తియట్ల యిం
తమవగునే కిరీటిఁ దెగటార్చెఁగ, నీతని నొంపఁ జంపఁ దాఁ
గని పెన వచ్చునాతఁ; డధికం బగుమచ్చల మిప్డు మాడుమీ. ౨౦౬

చ. 'తర మిడి చంపెఁ గీచకశతంబు నితం, డది యేల? యెల్లెడన్
విరు దనఁగా బలాఢ్యుఁ డనఁ బెద్దయుఁ బేర్చినవాఁ డగుటన్ *వృకో
దరుఁ డటు లైన, నీతని మదం బడఁగించుట లీల నాకు; నీ
వరదము నమ్ముఖంబుగ రయంబునఁ బోవఁగ నిమ్ము భూవరా.' ౨౦౭

ఉ. నావుడుఁ, దేరు మద్రవరనాథుఁడు భీముని దిక్కు దగ్రతం
బోవఁగ నిచ్చెఁ; దూర్యరవముల్ సెలఁగెన్ దివి పిక్కటిల్ల, న
ప్పావని నవ్వుచున్ బలము పాయ నడం గడుబెట్టు గిట్టినం,
జేవ దలిర్ప నారథికసింహునిఁ గర్ణుఁడు గప్పెఁ దూపులన్. ౨౦౮

వ. కప్పి యాలోన: ౨౦౯

క. వెస నతని యురము బలునా
రసమున నొంచుటయు, నతఁడు రాధేయతను
ప్రసరన్నవనారాచో
ల్లసితుం డై మెఱసెఁ గురుబలంబు దలంకన్. ౨౧౦

ఉ. సూతతనూభవుం డనిలసూనుని చాపము ద్రుంచి యేచి, యు
ద్ద్యోతిత మార్గణంబు మెయి నుచ్చి చనన్ నిగిడింప, నొండువి
ల్లాతఁడు ధైర్యసారము రయంబున జూపఱు మెచ్చ నెత్తి, సం
స్ఫీత శరోత్కరం బతని పేరుర మాడఁగ నేసి యార్చినన్. ౨౧౧

తే. ఈడఁబోక రాధాసుతుఁ డేపె నిరువ
దేను నారాచములు పవమానతనయు
కత్తళము దూఱి, యంగంబు గాడి పాఱి,
నిలువ కట, చని మేదినీతలము సొరఁగ. ౨౧౨

---

* వృకోదరుఁడు-వృకము = తోడేలువంటి పొట్ట (ఆకలి) గలవాఁడనియు, వృకమనఁగా అంగుష్ఠమాత్ర పరిమాణముగల జఠరాగ్ని, దానిని గలవాఁడనియు అర్థము. మానవుని జఠరాగ్ని వడ్లగింజమైన అంతమాత్రమేనట: తోడేలుకు ఎన్నటికీ-ఎంతటా తీరని ఆకలి ఉండుటే గాక క్రౌర్యమున ఏ అడవిజంతువుగూడ దీనికి సరిరావు; గుంపుగట్టి ఇవి హింసాకాండకు దిగును. అట్టే ఇక్కడ భీముఁడు కీచకులను రూపొందిన క్రౌర్యమో అన, తరమిడి (= వరుస బెట్టి; వదలక; ఎచ్చుతక్కువలను గమనించి) చంపినాఁడనుటలో యీ వృకోదర పదప్రయోగము సారస్యమును దెలుపుచున్నది. ఇట్టి ఔచిత్యప్రయోగములు కవిబ్రహ్మ సొమ్ము.

—◆ మూర్ఛితుఁడైన కర్ణుని నాలుకను భీముఁడు కోయఁబూనుట ◆—

మ. అలుకం గెంపు గనుంగవం గదురఁ గా నప్పాండవుం డేసినం,
గులిశంబో యనఁ బ్రజ్వరిల్లి విగిడెన్ ఘోరంపుభల్లం బుర
స్థ్సలి భేదిల్లఁగఁ, దేరిమీఁదఁ బడి మూర్ఛం బొంది కర్ణుండు, వి
శ్చలతం జచ్చినయట్టు లుండె; వెఱఁ దత్సైన్యంబుఁ దూలెం గడున్. ౨౧౩

వ. అప్పు డయ్యనిలతనయుండు దనయరదంబు గదియం దెచ్చి, యా సూతనందనుం గనుంగొని: 'యిప్పుడు నాలుక గోసెద' ననుచుం గట్టినయలుఁగు వెఱికి, యతని యరదంబుమీఁది కరుగ నుత్సహించినఁ జూచి, మద్రవిభుండు వారించి:– 'యిది మూర్ఛగాని మరణంబు గా, దీయవస్థ నాలుక గోసినం జచ్చు. నితనిం జంపుటకుఁ బార్థుండు ప్రతిన వట్టినవాఁడు; నీవు చంపిన నతండు నెవ్వగం బొందు' నవిన విని, యవ్వీరుండు:–'పేఁ డిప్పుడు పాండవాగ్రజుని బాధించినం గ్రోధాంధుండనై యది మఱచితిం గాని, చావు గామియు నిట్టియెడ నాలుక గోయం దడవఁ జచ్చుటయు నెఱుంగుదు. నిత్తెఱంగు నీవు దలంపించి లెస్స చేసి, తిద్దురాత్ముండు సభలోన నసభ్యంబులగు మాటలు ద్రౌపది నుద్దేశించి యాడిన నుద్దీపించినకోపం బజాతశత్రునకుఁ బ్రియంబుగా నడంచికొని యుండితి, నేఁడు తద్వేదన వెలార్పం జూచితి; నట్లు చేసితినేని మానధనుండైన ధనంజయుండు దనచేసిన పూనిక నెఱపంగానక మనంబునం గుంది మఱియుఁ; గృష్ణ యుధిష్ఠిరులు నాతనితోడివార, యింత ప్రమాదంబు నీవు గలిమిం దెలిపితి, మే లయ్యె! మాతులా, నీయాజ్ఞ యుల్లంఘింప'నని పలికి నిలిచె. శల్యుండును సంతసిల్లి తేరు దొలంగించె; ననుటయు నాంబికేయుండు సంజయున కిట్లనియె:–

క. 'పాండవుల నాఁటి నోర్చు ని
తం డని మీరాజు సూతతనయునిఁ బొగడున్,
గం డడఁచె భీముఁ డిట్టిమ
గండుఁ గలఁడె? పిదప నెట్లు గయ్యము సెల్లెన్.' ౨౧౪

—◆ భీముఁడు శ్రుతవర్మాదికురుకుమారుల పెక్కండ్రఁ జంపుట ◆—

వ. అనవుడు సంజయుం డాంబికేయున కిట్లను:–నట్లు బాధితుం డయిన రాధేయుం గనుంగొని కురుపతి తమ్ములతో నిట్లను:–'భీమసేనుచేత సూతసూనుండు గడు నొచ్చెం గావలయు, వేగం బెయిదుఁ' డనుటయు, శ్రుతవర్మాది కుమారులు

గొందఱు పటుగతిం గవిసి, యక్కౌంతేయుం జుట్టుముట్టిన; నతండుం దదను చరుల నేనూట యేఁబండ్రు వీరరథికులం బిలుకుమార్చి, శ్రుతవర్మశిరంబు భల్లం బునం ద్రుంచిన, నది ముఖకాంతి మెఱయం జంద్రమండలంబు మహిఁ కెఱఁగు తెఱంగు దోఁపం బడియెఁ ; బటుబాణద్వయంబున వికటుని సముని బెట్టేసిన బెడి దంపుగాలిం దూలు తరువులకరణి ధరణిం ద్రెళ్ళిరి. తదనంతరంబ తీవ్రనారాచం బునఁ [1]గ్రాథుం గూల్చి, నందోపనందుల నొక్కపెట్ట పెక్కుమ్ముల బొరివుచ్చెం. నిట్లు నీ కొడుకు లార్వురుం దెగినఁ దక్కటివారు వచ్చి దైన్యంబు నొందిన సైన్యంబు గలంగె. నంతకుఁ దెప్పిఱి యెప్పటిబరవసంబు శోభిల్లం గర్ణుండు గడంగి దగ్గఱి; ౨౧౬

—♦ కర్ణభీముల భీషణ రణము ♦—

చ. అనిలజుమీఁద నేయ, నతఁ డాశరముల్ దునుమాడి, సప్తకాం
డనిహతుఁ జేసె నాతని, దృఢప్రదరంబులఁ గప్పె నాతఁడుఁ;
వినుము సముజ్జ్వలప్రదరవిద్ధునిఁ గా నొనరించి యమ్మరు
త్తనయుండు పేర్చి యార్వ, వసుధావర, యారథికుం డుదగ్రుఁ డై. ౨౧౭

మ. పదిబాణంబుల నొంచి విల్లు దునుమం, బ్రస్ఫీత దీప్త్యుజ్జ్వల
ద్గద వై చెం బవనాత్మజుం, డది యెడఁ ఖండించె నవ్వీరుఁ, డు
న్మదుఁ డై పాండవుఁ డొండువిల్లు గొని నానాకంకపత్త్రంబులం
బొదువం, గర్ణుఁడు నొంచెఁ దత్తను పతిస్ఫూర్జద్దశాస్త్రంబులన్. ౨౧౮

వ. దానం గోపించి; ౨౧౯

చ. పటుతరమైన నారసము పాండునృపాత్మజుఁ డుగ్రుఁ డై యురః
స్తటమున బెట్టు గ్రువ్వ, బెడిదం బయి వీఁపున నుచ్చి పోవ, న
క్కట ధరణీప్రకంపచలితంబగు శైలముఁ బోలి తాల్మి మి
క్కుటముగ రోషరంజితముఖుం డయి కర్ణుఁడు ఘూర్ణితాకృతిన్ — ౨౨౦

చ. రయమునఁ బంచవింశతిశరంబులు మేన నిగిడ్చి, భల్లసం
చయహతి విల్లు నక్కడఁచి, సస్మిత వక్త్రసహస్రపత్త్రల
క్ష్మి యతిశయిల్ల, రథ్యములఁ జెండిన; మారుతి యేచి విద్విష
ద్భయద గదా రుచిస్ఫురిత బాహువిలాస విభాసమానుఁ డై ; ౨౨౧

1. క్రోధుం గూల్చి.

వ. అరదంబు డిగ్గ నుఱికి కర్ణునిదెసం గవియం, గురుపతి సేనంగల యేనుంగులం బదియేడింటిం బురికొల్పిన, నవి దివాకరుఁ బొదువు నంబుదంబుల చందంబున నా జెట్టిమగనిం గిట్టిన, నతండు జోదులతోడం గూడ నగ్గజంబులం బదువుటయు; సౌబలుని ఘోటకంబు లాటోపంబున మూఁడువే లొక్కట మరపడించిన, వాని ప్రాపున నరదంబులుం గాలుబలంబులుం గవిసి కూడికొని పొదివిన మదం బొదవి [1]యమ్మహాబలనందనుండు దారుణ రణవిహారంబున నొండొండ పేర్చిన, యప్పులం బుజ్జ్వలానలంబున వైచిన చర్మంబుచాడ్పున ముడింగి యొదిఁగె. నప్పు డాశకుని యోధులు పంచశతరథికులు రభసంబున నదరిన, వారల సూతాశ్వ కేతు స్యందన సమేతంబుగా నఱిముఱి నుఱుమాడి, యగ్గలిక మెఱసినం గని, [2]యగ్గాంధారరాజు వనుపం గడంగిన యవనదేశీయులగు నాశ్వికులం ద్రిసహస్ర సంఖ్యుల నవ్వడముడి పొడిసేయుచప్పుళ్లు గార్చిచ్చు వెదురుటడవి నేర్చు తెఱంగు నం దోఁచె. విల్లు గదపండువుసేసి, యొండురథంబెక్కి యక్కౌంతేయుండు ఖండవంబుసేయ; రాధేయుండు పాండవేయాగ్రజుం దాఁకి తీవ్రప్రకాండంబులం గప్పి సారథి నమయించినఁ, దేరు తురంగంబులు దొలంగ నీడ్చికొని పాఱిన, వెనుకొను నయ్యంగపతిం గనుగొని, ౨౨౨

— ధర్మజుని వెంటఁబడిన కర్ణునికి భీముఁడు అడ్డుతగులుట —

ఉ. భీముఁ డదల్చుచుం గా రథము భీమగతిం గవియింప, నాతఁడు
ద్దామత మాఱుకొన్న, వివిధస్ఫుర దస్త్రపరంపరా ద్వయ
శ్రీ మొన లప్పు డచ్చెరువుఁ జెంది మతించె; మురాంతకానుజుం
డా మరుదాత్మజుం గడచి, యంగపతిం గా వెసఁ దాఁకె; దాఁకినన్, ౨౨౩

క. ఆ యిరువుర నిబిడ కన
త్సాయక పటలములు నిగుడ నరి, మధ్యాహ్న
ప్పాయ త్ప్రిభాధ్యుఁ డయ్యుం
దోయజబాంధవుఁడు మింటఁ దోఁపకయుండెన్. ౨౨౪

వ. వా రొండొరుల శరపరంపర లడఁగించి; రాసమయంబున, ౨౨౫

1. మహాబలనందనుఁడు కాబట్టి దారుణరణ విహారము చేయుట.

2. గాంధారము ఇప్పటి ఆఫ్ఘనిస్థానమునన్న కాంధహార్ ప్రాంతము. అందుచేత ఆశ్కుడికి దగ్గరనున్న యవన (గ్రీకు) దేశీయులగు అశ్వకులను దెచ్చినాఁడు. యవనులసంగతి భారతయుద్ధమునాటికి తెలియదుగాని, యీ భారతము వ్రాసిననాటికి తెలిసియుండవచ్చును. ఇది కాలవ్యతిరిక్తాలంకారము.

చ. తనకరముల్ విగిడ్చి యుచితంపుమెయిం గొనియాడి యంతటం
దనియక, తీలఁ జేరి సముదంబుగఁ బద్మినిఁ బొందె భాస్కరుం
డనుటకుఁ దావలం బయి, జనాధిప, చూడ *శమంతపంచకం
బున విరిదమ్మితేపియలఁ బొల్పెసఁగెం బ్రతిబింబ మెంతయున్ ! ౨౨౬

వ. అప్పుడు, కృప సౌబల కృతవ ర్మాశ్వత్థామల యుద్దామసాహాయ్యంబున సమధికోత్సాహుండగు నా సూతనందనుని సంరంభంబునం గౌరవానీకంబు దర్పోద్రేకంబునం గడఁగినం, బాండవబలంబునుం బొంగె. వివ్విధంబున నిరువాఁగును గలయఁజొరపిన నార్పుల నదల్పులం బొగడుటలం దెగడుటల నెసఁగు నులివు తూర్యరవంబులు గెలువ, నమ్మేదిని నెత్తుటం జొత్తిల్లి, కెంజాయ రంజిల్లు పుట్టంబు ముసుంగు వెట్టిన యంగన చందంబు నొందె. మస్తక ప్రముఖావయవంబులును గోదండాద్యాయుధంబులును మకుటప్రభృతి భూషణంబులును నాతపత్ర ధ్వజ చామరంబులుం దునిసిపడి భీమాభిరామంబులుగాఁ, గరి హయ నర సమూహంబులు రక్తసిక్తంబులైన సకాల[1]బాలాతపలీల యావహిల్లం; దక్కిన సేనాంగంబులు మిగిలిన మాతంగంబులు పెనంగిన కనకలిప్తకాండంబు లూఁదికొనం దాఁకిన నెరగట్టువోవు కొండలకైవడిం బొలుచునవియును, నస్త్రశస్త్రపాతంబులం గ్రమ్ము రుధిరమ్ముల గైరికనిర్ఝరంబులతోడి ధరాధరంబుల ననుకరించునవియును, మెయిమఱువు లఱువుల్లై నానావిశిఖశరంబులు నోనాటినం జేష్టలు దక్కి ఱెక్కలు దెగియున్నశైలంబులం బోలునవియును నగుచుండఁ జెలంగి, చతురంగంబులును బెరయఁ బెనంగునల్లావంబున శోణితం బడంగ మట్టవిసి రేణువు లెగసినం, జూడ్కులు సిగురు కన్నునుం దఱియసుటికి నిజాభిధానంబులను జనపీ

* విశాలమైన కురుక్షేత్రములో (నేటి ఢిల్లీకి ఉత్తరమున 80 మైళ్ళలో, నేటి కర్నాల్ జిల్లా) భారతయుద్ధము జరిగినప్రదేశము - యీ శమంతపంచక గ్రామపరిసరము. ఈ కురుక్షేత్రమునందే మస్లిము అధికారము ప్రప్రథమమున మన పుణ్యభూమిలో కాలూనది. ఈ క్షేత్రమునకు ఉత్తరమున తరెయినుగ్రామమున (కర్నాలుకు పదిమైళ్ళు ఉత్తరము, తానేశ్వరమునకు 14 మైళ్ళు దక్షిణము) 1192 లో ఢిల్లీ అజమీరురాజు - పృథ్వీరాజ చౌహానుడు, మహమ్మదు గోరీకి (షిహాబ్ ఉద్దీన్) ఓడిపోయి భారతదేశపుగవనులను విదేశీయులకు దెరచినాడు. మహారాష్ట్రిలవిజృంభణ పుణ్యదినములుగూడ యీ మాగాణములందే అంతరించిపోయినవి. మహారాష్ట్రినాయకుడు-పీష్వా బాలాజీ బాజీరావు అఫ్ఘనులకు ఓడి, హిందూత్వము తిరిగి తలఎత్తకుండజేసిన దుర్విధినిలయము - పానిపట్టుగూడ కురుక్షేత్రముననే దక్షిణభాగమున నున్నది.

1. పాలాశ పుష్పకాంతి నావహిల్ల.

జనకనామంబుల బిరుదాంకంబులం ద మ్మెఱింగించికొనుచు వీరుల పోరు చక్కటికిం జొచ్చి ప్రాపై పేరువాడు తదీయబంధుమిత్త్రులం బొగడు నమరుల యెలుంగులు నింగి నిండం, బెల్లు దొరఁగు కీలాలం బాధూళి నడంచినకొలఁది నిలువక యేఱు లయి పాఱ నుబ్బి భూతబేతాళక్రవ్యాదంబు లోలలాడుచుం ద్రావుచు మదించి నృత్తంబులు సేయ నంబరంబున నట్ట లాడ వెక్కసపాటొనర్పంజాలు నానమయంబున మనంబు లెప్పటి తమకంబున నవిం దనివి సనమిం గవిసి, కయ్యంబుసేయు సైనికోత్తముల సింహనాదంబులు దిక్కులం బిక్కటిల్ల, నాకలనికెలన నట మున్న తన్నుఁ బొదివిన త్రిగర్త కోసల నారాయణ గోపాల బలంబుల నబ్బలసూదనసూనుండు గాండీవారావం బాకసంబు వగిలింపనొప్పించి.

చ. తఱిమి సుశర్మ దాఁకిన, నతఁడు దదంగమునన్ దశాస్త్రముల్
వఱపి మురాసురాంతకుని బాహువునం బటుమార్గణత్రయం
బఱిముఱిఁ జొన్పి, బల్విడఁద యమ్మున నుజ్జ్వలకేతుదండ మే
డ్తెఱ జలియింప నేసిన, నుదీర్ణతఁ దత్కపి యార్చెఁ బార్చినన్— ౨౨౮

—♦ సంశప్తకు లందఱు ఒక్కపెట్టున అర్జునురథంబుపైఁ బడుట ♦—

సీ. వెగడునఁ బె ట్టేది, వేగంబ తేఱి సం
శప్తకు లర్జును సాయకముల
కోహటింపక సముత్సాహంబు వదల కం
దఱు నొక్కపెట్ట తద్రథము వొదివి,
హరులతో గాడియు, హరికేలు, నొగలును,
బలుగాఁడియును, గండ్లు బట్టి మెలఁగ
మిడుక రాకుండ నమ్మేటివిల్కాని మే
నును విగ్రహించుట గనుఁగొనంగ

తే. నద్భుతం బయ్యె! నపుడు సేయార్చి శౌరి
లీలఁ గొందఱ మత్తకుండాలభంగి
మెఱయఁ దూలించెఁ గాలను గుఱుచతూపు
గములఁ బార్థుండు పలువుర నమయఁ జేసె. ౨౨౯

వ. అంతఁ గొంతయూరుపు వోయానం జిఱునవ్వు నవ్వి, కవ్వడి కమలనాభున కిట్లనియె :— ౨౩౦

ఆ. 'తేరు గదల నీక వైరులు బలువిడిఁ
బొదివి పట్ట, రాచపొల్లు లైన
యేను దక్క నృపతిసూనుఁ డి ట్లొరుఁడు స
హించు నెట్లు విక్రమించుఁగాక?' ౨౩౧

క. అని పలికి:—'చూడుమీ న
న్ననుచు భుజంగాస్త్ర మేయ, నది యరులకు గ్ర
క్కునఁ బాదబంధ మొనరిం
చిన, ముంచె నతండు వారి శిత విశిఖములన్. ౨౩౨

వ. ఇవ్విధంబున; ౨౩౩

ఆ. నాగపాశబంధనంబుల గుదివడి
వారు వివిధబాణ దారితాంగు
లై రథంబు విడిచి; రప్పు డాసంశప్త
క వ్రజంబు గని త్రిగర్తవిభుఁడు; ౨౩౪

క. గరుడాస్త్రం బేసిన న
చ్చెరువుగ గరుడములు గవిసి చీరెం బంచు
స్ఫురణము మెఱయఁగ, వెస న
య్యురగాత్మకబంధ మూడ నుర్వీనాథా! ౨౩౫

—♦ సుశర్మ(వేటునఁ గిరీటి మూర్ఛితుఁడగుట ♦—

క. తనకడిమి బంధమోక్షము
గనిన రథికకోటి గడఁగి, గాండివిపయి నే
పునఁ దూపులు దొరఁగింపఁగ,
ఘనభుజుఁడు సుశర్ముఁ డేసెఁ గనదస్త్రమునన్. ౨౩౬

చ. అదినరు డెంద మాడుటయు, నాతఁడు మూర్ఛ మునింగి తేరిపైఁ
జదికిలఁ బడ్డ నుబ్బి 'యదె చచ్చె! సుశర్మవియేటు దాఁకి బ
ల్లిదుఁ డగుపార్థుఁ!' డంచు మదలీలం నార్చిరి నీదుసైనికుల్,
నదలను దిక్కులం బరఁగె శంఖముఖోద్భట తూర్యనాదముల్! ౨౩౭

సీ. అంతఁ దెప్పిఱి, విలయాంతకు కై వడిఁ
గవ్వడి యేచి మార్గణచయంబు

పెల్లడరించిన భీషణపోయె సుశర్మ;
యాసేనమీఁద నైంద్రాస్త్ర మక్కి-
రీటి నవ్వుచు నేయ, నాలోపమున నది
వివిధబాణాకృతిఁ గవిసి మఱియు
గావింపఁగాఁ, బదివేవురు సంశప్త
కాగ్రేసరులు దెగటాఱి, రప్పు

ఆ. డుక్కు దక్కి తలరి, తక్కటియోధులు
చేష్టితంబు లెడలఁ జిత్రరూపు
లట్టు లైరి; ధూమ మడఁగిన వెలుఁగొందు
ననలుచంద మయ్యె నన్నరుండు । ౨౩౮

వ. హతశేషులైన సంశప్తకులు చతుర్దశసహస్ర యోధముఖ్యు లవ్విజయు విజయంబు సహింపక, యొండొరులం బురికొల్పికొని బలంబులతోడం గడంగిన, నతం డతి దారుణంబగు రణంబు సేయఁ, దక్కటిపాండవులదెసఁ బోరు కౌరవబలంబు దద్బలశౌర్యంబు లోర్వక భీతిఁ గలంగి పఱచినం, గృతవర్మ కృప గురుపుత్ర కర్ణులు మఱియు సౌబల సుయోధనులు దుశ్శాసనాది కుమారులును బరవసంబు సేసి, యాసైన్యంబు దైన్యంబు వాయ విక్రమించి. రట్టియెడఁ గృపుని యపరిమిత శరజాలంబు పాంచాలపుంజంబుం బొదివినం గనలి, శిఖండి యమ్మహీసుర వరుని మార్కొనియె; నయ్యిరువుర సమరంబు రామరావణుల రణంబుకరణి నొప్పె. నట్లు పోరిపోరి; [1] శారద్వతుండు— ౨౩౯

చ. హరులను సూతుఁ జంపిన, మదగ్రత నా ద్రుపదాత్మజుండు వి
స్ఫురిత కృపాణ చర్మపరిశోభితుఁడై యరదంబు డిగ్గి స
త్వరముగ నేఁగుదేర, శరవాహిని పై విగిడించె నాతఁ, డ
య్యరి వెఱఁ గందుచుఁ జిలుచునట్టుగ జోడులు పిచ్చలింపఁగన్. ౨౪౦

వ. అట్లేచిన కృపాచార్యుపై మరవడించిన ధృష్టద్యుమ్నుం గృతవర్మయు, ధర్మ తనయ ద్రౌపదేయుల నశ్వత్థామయుఁ, గవలం గురుపతియును, వృకోదరుం గర్ణుండునుం దలపడి నివారించి; రగ్గౌతముండు శిఖండి పలక పఱియలు సేసిన, నతండు దెరలక కేవల కరవాలంబున విక్రమింపం గడంగిన, నయ్యతిరథుండు—

1. శారద్వతుండు = కృపాచార్యుఁడు.

—♦ శిఖండి కృపునికి ఓడి తొలఁగిపోవుట ♦—

క. వాలికతూపులు మేనం
గీలుకొలిపి నొంపఁ గని, సుకేతుఁడు బాణ
జ్వాలలు నిగుడ నడరి, యా
ఖీలత నాకృపునితోడఁ బెనఁగె నరేంద్రా! ౨౪౨

తే. తనకు నెడ నొచ్చి యిట్టు లతండు పెనఁగ,
ద్రుపదనందనుఁ డల్లన తొలఁగి పోయె;
నాసుకేతుండు గృపుని మై నాఁటి నిరువ
దాఱుశరములు వఱపి, రయంబు మెఱయ; ౨౪౩

—♦ కృపాచార్యుఁడు సుకేతుఁడను పాంచాలకుమారుని చంపుట ♦—

వ. దనువు దునిమి, యొండుకోదండం బెత్తిన నదియును ఖండించి; ౨౪౪

క. తోడన హయసూతుల మెయి
గాఁడఁగ నేయుటయు, నతఁడు గనలుచు బలువిల్
క్రీడయపోలెం గొని మే
న్గాఁడఁగ నిగిడించెఁ ద్రిదశనారాచంబుల్. ౨౪౫

తే. అట్లు నొప్పింపఁ దూఁగాడు నాసుకేతు
కంధరము మెఱుఁగారెడు కత్తివాతి
దొడ్డతూపున నేపునఁ ద్రుంచుటయును,
శిరము ధర ద్రొల్లెఁ గుండలస్ఫురణ మెఱయ! ౨౪౬

వ. ఇట్లు సుకేతుండు నచ్చిన, నతనిమూఁకలు విచ్చెఁ. ధృష్టద్యుమ్నుండు గృత వర్మయుం బోరునెడ, ధృష్టద్యుమ్నుండు గృతవర్మ వక్షస్స్థలంబు విశిఖనవకంబున నొప్పించుటయు, నప్పాంచాలవరు నతండు సూత కేతు హయ స్యందన సమేతంబుగా నిబిడశరజాలంబునం బొదివిన, నవ్వీరుండు బలాహక పిహిత మూర్తియగు మార్తాండు ననుకరించి, తాను సైంధవ వధదినంబునం బారావత వర్ణంబులగు రథ్యంబు లగ్గురు నరుణాశ్వంబులకా బెరయఁ బఱపిన తెఱంగున,

తే. అలిగి నొగ నొగతోఁ దాఁక నతిరయమునఁ
దేరు వఱపి, కృపాణ ప్రదీప్తపాణి

యగుడు, గద పుచ్చికొనియును నఱుము లేక
చలము డిగఁ ద్రావి కృతవర్మ యిలకు దాఁటె. ౨౪౮

— ధృష్టద్యుమ్నునిచే కృపుఁడు పరాభూతుఁడగుట —

వ. అక్కుంభసంభవు చందంబుగాక వంచతుండై యప్పరుసున నబ్బలుమగండు దొలంగిన, నయ్యరదంబుమీఁదికి లంఘించి యాధృష్టద్యుమ్నుండు— ౨౪౯

క. ఆరథికు నచటఁ గానక
సారథితల దునుముటయును, సంతసమునఁ బొం
గారి తనశబ్ద మిచ్చి మ
హారవమున 'నిక్క డిక్క' దనియె నతండున్. ౨౫౦

చ. విని, కృతవర్మఁ గాంచి, పటువిక్రమ కేలి యొనర్ప నాత్మ వా
హనమున కేఁగి యేచి, ద్రుపదాత్మజుఁ డాతఁడు లోను గాఁగ న
మ్మొనఁ గల మేటిజోదుల సముద్ధతి యే త్తెఱ నిల్వరింప వి
ల్గొనెఁ, బటుశౌర్యశోభితబలుం డగు నయ్యదుముఖ్యుఁ డొక్కఁడున్. ౨౫౧

వ. అట్టియెడ నొక్కరథికుండు రయంబున నిజరథంబుమీఁదికిఁ గృతవర్మం దిగిచి కొని యనికిం దొలంగం గొనిపోయెఁ, బాంచాలోత్తముండును దన మునుము బలంబు గలంగం బరాక్రమించుచుండె. ౨౫౨

సీ. ధర్మపుత్రుఁడు గురుతనయుతోఁ బెనఁగుచో
బాసట యై శినిపౌత్రుఁ డడరె,
నాయిద్దఱును ద్రౌపదేయులు వెఱఁగందు
నట్లు వారలను సైన్యంబుఁ బొదివి
బహుళాంధకార మాపాదించి, యమ్మేటి
విలుకాని సాయకవితతి నింగి
ఘనమయంబుగఁ బర్వ, జననాథ, వా రల్గి
యొక్కొక్కరుం డనేకోగ్రబాణ

ఆ. నిహతుఁ జేయ, నతఁడు ప్రహసితవదనుఁడై,
యొకని నొకని బహుసముజ్జ్వలాస్త్ర
విద్ధుఁ జేసి కడఁగి, వివ్వచ్చుకొడుకు చా
పంబు దునిమెఁ గ్రూరభల్లనిహతి. ౨౫౩

క. ధృతి నొండువిల్లు గొని యా
శ్రుతకీర్తి దదీయతనువు సొనిపెం బ్రదర
త్రితయంబు, గనలి యాతం
డతనిం దత్పార్శ్వచరుల నమ్ముల ముంచెన్.　　౨౫౪

క. ముంచు మహోద్ధతి యాలో
కించి తనదుమాడ్కి దట్టకెంపెసఁగం గో
పించి, శరవికరములు గు
ప్పించుచు ధర్మజుఁడు గవిసె భీషణభంగిన్.　　౨౫౫

చ. కదిసిన, నమ్మహాభుజుఁడు గార్ముకముం దునుమాడి, మూఁడు బె
ట్టిదపు మెఱుంగుతూపులఁ బటిష్ఠత సూపిన, నా నృపాలుఁ డు
న్మదుఁడయి మేటివింట బలుమార్గణముల్ వెస నేసె మూఁడు న
ర్వదియును నద్ధరామరునిపై శివివంశవరుండు దోర్పడన్.　　౨౫౬

— ♦ అశ్వత్థామ యుధిష్ఠిరుని అలయించి కలనునుండి తొలఁగఁజేయుట ♦ —

వ. ఇట్లు ప్రాపై కడంగి,　　౨౫౭

ఆ. అర్ధచంద్ర బాణహతి గురుపుత్రుని
ధనువు శివివరుండు దునుముటయును,
శక్తి వైచి యతఁడు సారథిఁ గూల్చి, బల్
వింటఁ గురిసె బహుళవిశిఖవృష్టి.　　౨౫౮

క. సారథి లేమిని సాత్యకి
తే రీడ్చెఁ దురంగమములు, దే రటు వాఱఁగా,
భూరమణ, ధర్మనందను
వారు వొదివి రంపగముల వడి గురుతనయున్.　　౨౫౯

క. భీమాస్త్రశిఖల నశ్వ
త్థామాగ్ని దహించె ధర్మతనయానుచర
స్తోమాటవి నొకవ్రేల్మిడి,
నామెయి జనవిస్మయావహం బయ్యె నృపా!　　౨౬౦

వ. అప్పుడు, కురురాజు పాండవుల నాచార్యనందనుచేతం దెగినవారలంగాఁ దలంచె·
నంతఁ దఱిమి యుధిష్ఠిరుండు ప్రచండకాండంబుల నవ్విప్రవరుం బీడితుంజేసి.

సీ. 'అలవును వెరవును గలవు, కృతాస్త్రుండ
వని విన్న నెఱుఁగుదు; నైన నెల్ల
సొంపు పార్థునకుఁ జూప నోపినఁ దెల్ల
మగు, నది య ట్లుండె; నరయ నీకు
నెయ్యంబు పాటించునేర్పు కృతజ్ఞత
యనునివి లేవు. బ్రాహ్మణుఁడు దపము
దమమును గల్గువర్తనమున నుండుఁ గా,
కని సేయునే యెంత యడిఁచిపడినఁ ?

ఆ. బడితి గాని, యడ్డపడలేవు కౌరవ
కులము నెల్లభంగి గెలుతు మేము
నీవ చూడ' ననుడు, నావీరుఁ డేమియు
ననక, నగుచుఁ బఱపె నంపవెల్లి. ౨౬౨

వ. ఆవెల్లికి నోర్వలేక యాభూవిభుండు దొలంగె. ని ట్లంతటిమానిసిం గెలిచినవాఁడై విలిచి, నిజపార్శ్వంబుల మూఁకలం గనుంగొని గురుపుత్త్రుండు క్రూరవిహారంబునకు నమరి మెఱసె. మారుతితోడం బోరు కర్ణుండు దదనుచరంబులగు కరూశ చేది సృంజయపుంజంబులుం దన్ను బొదివిన, నబ్బలంబునకు బాహుబలంబు నూపుచుండ నతని విడిచి. యాభీమసేనుండు గౌరవసేనపయిం గవిసి కనుపు గొద్దై; నారాధేయ వృకోదరుల మునుములు ధనంజయు మునుముభంగిం బ్రజాక్షయం బగుచుండె; నీ దుర్మంత్రంబున ననేకులకుం బొలియవలసె. నయ్యవసరంబున— ౨౬౩

—◆ దుర్యోధనుఁడు కవలపై విజృంభించి, ధృష్టద్యుమ్నునిచే విరథుఁడగుట ◆—

సీ. కవలతోఁ బెనఁగెడు కౌరవనాథుఁ డ
న్నకులు నంగంబున నవశరములు
పొనిపి, యా సహదేవు కనకపుసిడము ద్రుం
చిన, వార లిరువురు నెనిమిదింటఁ
బదితూపులను నొంపఁ, బతి రెండువిండులుఁ
దునుమాడుటయు, నన్యధనువు లెత్తి
యన్నయుఁ దమ్ముండుఁ దన్నుఁ బెక్కమ్ములఁ
బొదివినఁ గనలి, యా భూవిభుండు

తే. వారి దివ్యాస్త్రములఁ గప్పు ఘోరభంగి
గాంచి, జను లక్కుమారులు గాలవశతఁ
బొందుదుర కాఁ దలంప; నప్పుడు గడంగి
యడ్డపడియె ధృష్టద్యుమ్నుఁ డతిరయమున. ౨౬౪

వ. ఇట్లు పాండవసేనాపతి ఘూనాథుం దాఁకి యేసిన నతండు; ౨౬౫

ఆ. ఇరువదేను నిశితశరముల నొప్పింప
నలిగి, యాతఁ డతని యంగకముల
నఱువదేను తూపుఁ లడరింప, నఱకె న
క్కూరవేశ్వరుండు గార్ముకంబు. ౨౬౬

మ. బలువి ల్లుగ్రత నె_త్తి యొక్క మొగి, నప్పాంచాలవర్యుండు దీ
_ప్తులు గ్రమ్మం బదియేనుమార్గణము లాభూమీశుపై నేసినం,
గలయం బూచిన కింశుకంబు చెలు వంగం బొందఁ, దచ్చాపముం
బెలుచం ద్రుంచి, యతండు ఫాలమున గుప్పించెన్ దశోగ్రాస్త్రముల్. ౨౬౭

క. కాలాయస నారాచము
లోలి నుదుట నాటియున్న నొప్పారెం బాం
చాలవరు ముఖము మధుకర
మాలికచేఁ బొలుచు తమ్మిమాడ్కిం జూడన్. ౨౬౮

సీ. కవలి యవ్వీరుండు, గార్ముకాంతరమునఁ
గ్రూరభల్లంబుల ఘోటకముల
సారథిఁ జాపంబుఁ దేరును గొడుగును
దునుమాడఁగా, భవత్పుత్రుఁ డేపు
గుందక శ_క్తి నిగుడ్పఁగఁ ద్రుంచె నే
_త్తెఱఁ, గృపాణము గొన నుఱుముసేసె,
గద యె_త్తఁ బఱియలు గావించె, నుబ్బి ర
త్నమయాహికేతువు నఱికి వైచె;

తే. నిట్లు హయ సూత కోదండహీను, దళిత
రథుని, విగతాతపత్రు, నిర్భగ్నశ_క్తి

ఖడ్గ ముద్గర కేతు విఖండితాపి
ధాసుఁ జేసె నప్పార్షతుం డానరేంద్రు. ౨౬౯

తే. వికలసాధనుఁడైన యవ్విభుని నతని
తమ్ముఁడగు దండధారుండు దనదు తేరి
మీఁద విడుకొని, శత్రుసమీపభూమి
వాయఁ గొనిపోయెఁ; జూచి రాధేయుఁ డపుడు— ౨౭౦

—♦ రాధేయుని వివిధవిధ సమరవిహారము ♦—

క. శినివంశవరునితోడం
బెనఁగి పెనఁగి యతని విడిచి, పెలుచ ద్రుపదనం
దనుని రథమునకు నెదురుగఁ
దనయరదము సనఁగ విచ్చె ధరణీనాథా! ౨౭౧

వ. సాత్యకియును శరంబులు గురియుచుఁ దోన తవిలె, నుభయసేనాపతు లగు నా సూతనందన ధృష్టద్యుమ్ను లట్లు దార్కొనిన, నయ్యిరువాఁగునందు నొక్కరుం డైన నోల మానగొనక కడంగినం బోరు ఘోరంబయ్యె. నట్టియెడఁ బాంచాల కుమారులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును, జయ రోచమాన సింహసేనులును బలుదేరుల మొత్తంబులతోఁ దన్నుం గవిసినం, గర్ణుం డయ్యేనమండ్రువీరుల నెనిమిదిభల్లంబులం దునిమి, తత్సహచరుల బహుసహస్రరథికుల సమయించినం, జేదిరథికప్రవరులు జిష్ణు జిష్ణుకర్మ దేవాపి భద్రులును దండ చిత్రచిత్రాయుధులును హరి సింహ కేతు రోచమాన శలభులును సబలంబుగాఁ దలపడిన నా పదునొక్కండ్ర నొక్కపెట్ట బెట్టిదంపు టంపఱ పాలు చేసి, మఱియును బిరుదులయి పయింబడిన దొరలను, వారి పరివారంబులను వసుధం గూల్చియు నలంచియుం గలంచియుం గడిమి మెఱయుచు, 'నిట్టిచందంబు భీష్మద్రోణులయందుఁ జూడ'మని జనంబులు వెక్కసపడ, వివిధసమరవిహారంబు సలిపి; వెండియు, ౨౭౨

సీ. సింహంబు బారి జొచ్చిన గజంబులభంగిఁ,
బులి కగ్గమైన జింకలవిధమున,
జ్వలనంబుఁ గిట్టిన శలభంబులట్లు బాం
చాలయోధులుఁ జేదివైనికులును

దనుఁ దాఁకి పొలియ, రాధాతనూభవుఁ
డనిఁ దనివోక ధర్మనందనుని యున్న
చక్కటి కడర, ధృష్టద్యుమ్నుఁడును ద్రౌప
దీపుత్రులును సహదేవుఁడును శి

తే. ఖండియును సాత్యకియు నకులుండుఁ జేయఁ
గల మహీశులుఁ బొదివి రక్కర్ణు; నతఁడు
పెక్కుపాములు వొదివినఁ బెనఁగు గరుఁడు
ననువు దోఁపఁగఁ బోరాడె మనుజనాథ! ౨౬౩

వ. ఆసమయంబున, భీమసేనుబారింబడిన కౌరవసైన్యంబునం బ్రబలచతురంగంబు లొక్కమొగిన్ బడలువడి రణాంగణంబు *మూసికొనియెం. బెఱమూఁకలు వెఱఁగునం జెయ్వోది, కరళ్ళడంగిన మున్నీటియట్లుండె; గాండీవి సంశప్తకుల ననేకుల మేటిమగల గీటడంచి హతశేషంబగు బలంబు విచ్చుటయు, వాసుదేవు నాలోకించి:— ౨౬౪

ఆ. 'అమరులకు నజయ్యులగు నట్టి సంశప్త
కులు మదీయ బాణఘోరభంగి
కోహటించి పాఱుచున్నారు; భీముని
మునము కౌరవులును మొనయలేరు. ౨౬౫

క. 'కర్ణుం డొక్కరుఁడును సము
దీర్ణుం డై పిడము మెఱయఁ దిరిగి, బలువిడిన్
ఘూర్ణితము సేసె మనసై
న్యార్ణవమున మంథనగము నను వమరంగన్. ౨౬౬

చ. 'అరదము వోవ నిమ్ము రయమారఁగ నాతనిదిక్కు' నావుడున్,
దరహసితంబుతో నళిననాభుఁడు: 'భీమునిచేతఁ బోదు నీ
శరములవేఁడిఁ గౌరవుల సంగరవాంఛ యడంపు' మన్న, న
న్నరుఁడును నియ్యకొన్నఁ గురునాథునియోధులు బెగ్గడిల్లఁగన్. ౨౬౭

— ♦ నరుని అత్యద్భుత విక్రమపరిణతి ♦ —

ఆ. అమ్మురారి ధవళహయములు మెఱయ న
ద్దిక్కు సత్వరముగఁ దేరు వోవ

* ముసురుకొనియె.

విప్పుటయును జూచి, విచ్చె నబ్బలము సిం
గంబుఁ గవిన లేడిగమియుఁబోలె. ౨౭౮

వ. అప్పుడు సీకొడుకు సంశప్తకులం బురికొల్పిన, రెండువేలరథంబులును మున్నూ
తేమంగులును జతుర్దశసహస్ర తురంగంబులును లక్షద్వయపదాతులును వఫ్సార్థ
పయిం గవిసిన; నతండు శింజినీటంకారంబునం బటుశరాసారంబున వింగి వించి,
పదివేవు రుద్భటక్షత్త్రియులం బొలియించి, యక్కలనం గాంభోజ బలంబు
దోఁచిన నం దుఱికి తదీయసైనికుల కరంబులు శిరంబులు నఱికిన, నది మహావాత
విహత విటపంబైన యారామంబు చందంబయ్యె. నట్టియెడ; ౨౭౯

క. అదరి సుదక్షిణుతమ్ముఁడు
గడువడి నేయుటయు, నతని కరశాఖలు గ
వ్వడి యర్ధచంద్రశరముల,
వెడందతూపున శిరంబు వ్రేల్మిడిఁ ద్రుంచెన్. ౨౮౦

క. [1]యవన శక సైన్యములు పైఁ
గవిసినఁ ద్రుధిరజలము గాలువలై పా
ఱ, వెసం బఱపెను వివిధా
స్త్రవితానము లక్కిరీటి ధరణీనాథా! ౨౮౧

మ. కవి, సంశప్తకు లేచి యొక్క మొగి నా కౌంతేయునిం జుట్టు ము
ట్టిన, సేనాంగ చతుష్టయాంగములు ఖండీభూతముల్ సేసె; నా
తని బాణోత్కరవేగ ముత్కట మరుత్సంక్రీడ జీమూతపా
టనముం జేసినభంగిఁ జిత్రవిలగాఢస్ఫూర్తి శోభిల్లఁగన్. ౨౮౨

క. హరి వెరవున, ధవళాశ్వ
స్ఫురణమున రథంబు మెఱయఁ బొలుపారెడు న
న్నరు నత్యద్భుతవిక్రమ
పరిణతి సూడఁ గనుదోయి పదివేల్ వలయున్! ౨౮౩

క. ననుబోఁటుల మనములు మె
చ్చునఁ గరఁగె ననంగ నేల? సురతతి గృష్ణా

1. యవన, శకసైన్యములు భారతయుద్ధమునాఁటికి లేవుగాని, భారత కథారచనాకాలమునకు ఉంటిఉండవచ్చును. దీనిని Anachronism-కాలవ్యతిక్రమా లంకారమందురు.

ర్జునులం గని దుందుభిని
స్వనములతోఁ గురిసె విరులవాన వొగడుచున్ : ౨౯౪

వ. అయ్యవసరంబున నశరీరవాణి యయ్యిరువుర నుద్దేశించి యఖిలజనంబులు నా కర్ణింపః—'వీరు చంద్రార్కులం గడచిన కాంతిదీప్తుల నుల్లసిల్లెదరు. తొల్లి యేక రథస్థులైన బ్రహ్మేశానులవిధంబున వెలింగెదరు. గంటిరే; వీరలు పరమ మును లగు నారాయణుండును నరుండును జూండీ!' యనియె. నిట్లు మహనీయాశ్చర్యం బులు గనియును వినియును మాత్సర్యధుర్యుండగు నాచార్యనందనుం డరిగి యమ్మహాత్ముల మార్కొని, మార్గణోజ్జ్వలంబగు దక్షిణకరంబున నా ఫల్గునుఁ బిలిచి హాసభాసితముఖుం డగుచుఁ గుపితుండగు నతని కిట్లనియె:— ౨౯౫

—♦ అశ్వత్థామ అర్జునుని పేరఁబిలిచి నిలిపి, పైచేయిగా పోరుట ♦—

క. 'ననుఁ దగియెడు నతిథిం గా
మనంబునఁ దలంచి నీవు మన్నించెదవే
విని, వచ్చెద నీపాలికి
ననఘా, సంగ్రామ మొసఁగు మాతిథ్యముగన్.' ౨౯౬

ఆ. అనినఁ గృష్ణుఁ జూచి, యర్జునుఁ—'డాచార్య
తనయు గెలువ కునికి దైన్య మిపుడు
సమయఁ జూడవలయు సంశప్తకులను; నీ
మనసువచ్చు పనికిఁ బనుపు'మనుడు; ౨౯౭

ఉ. తేరు మురారి ద్రోణసుతుదిక్కునకుం జన నిచ్చి:—'మేలు మేల్ !
పోరు ఋణంబు దీర్పు; కురుభూపతికిన్ నరుబాహులీలకు
న్నైస్సరణ గల్గి నిల్వు'మనినన్ విని; 'యట్టుల కాక' యంచు, న
వ్వీరుఁడు షష్టిబాణముల వెన్నుని నేసె నుదగ్రుఁ డై వెసన్. ౨౯౮

ఉ. అమ్ములు మూఁడు పార్థు తను వాడఁగ నేసినఁ గ్రుంచి వైచెఁ జా
ప మ్మతఁ, డమ్మహాద్విజుఁడు భారవహమ్మగు నొండువిల్లు శీ
ఘ్రమ్మున నెత్తి, చేతులను గాళ్ళను మోమున వింటికొమ్మునం
గ్రమ్మినభంగిగా శితశరప్రతతుల్ పిగుడించెఁ బైపయిన్. ౨౯౯

క. కడుఁ జెక్కువేలు దూపుల
వడిఁ గృష్ణార్జునుల నరథవాహంబుగ నె

క్కుఁడు మదమునఁ బొదివినఁ, జె
య్వొడలి వెఱఁగుపడిరి వారలిద్దఱు నధిపా! ౨౯౦

వ. ఇవ్విధంబున, వివిధ విశిఖజాలంబులఁ గాలుసే యార్పరా కుండఁ గప్పి యార్చిన. నప్పార్థుం డతనిచేతఁ దనవిక్రమంబు ప్రతిహతంబయ్యె నని తలంపఁ; దత్సైన్యంబున హాహాకారంబు లెసంగం, జారణసిద్ధగణంబు లట్లు విశ్చేష్టితులైన, యా లోకరక్షకుల నాలోకించి: 'లోకంబులకు బ్రదుకు గలుగునో' యని పలుక. నప్పద్మనాభుండు గనలి, యక్కవ్వడి నుద్దేశించి— ౨౯౧

క. 'గురుసుతుఁడు నిన్ను మిగులుట
గర మాశ్చర్యంబు! ముష్టి గాండీవము దాఁ
దిర మయి యుండదొ? బాహుల
వెరవు బలువు గుందెనో? వివేకింపు మెదన్! ౨౯౨

క. 'గురుని కొడుకను తలంపునఁ
బరుసఁదనంబునకుఁ జొరక భంగపడితో? యు
ద్ధరతఁ గడుఁ జెడియె?' ననవుడు
సరోషసంరంభుఁడై విజయుఁ డాతనితోన్— ౨౯౩

క. 'వెసఁ బెక్కమ్ములు మనపై
ముసుఁగువడం బఱపి యతఁడు, మురభంజన. సం
తస మందెడు వింతన! యేఁ
గపి మనఁగెదఁ జూడు నన్ను గాండీవంబున్.' ౨౯౪

మ. అని, భల్లప్రకరంబులన్ గురుతనూజాస్త్రప్రతానంబుఁ ద
ద్ధనువుం గేతువు నాతపత్రమును జిత్రస్ఫూర్తిఁ దున్మాడి, గ్ర
క్కున నవ్విప్రుఁడు శక్తియున్ గదయు నుక్కుం దాల్మియుం దోఁప నె
త్తినఁ, దోర్దత్తో నవి ద్రుంచివైచె సమరస్థేమాభిరామాకృతిన్! ౨౯౫

ఆ. ఇట్లు ద్రోణసుతుని యేపు పార్థుఁడు దుహి
నంబుఁ జెఱుచు నినువిధంబు మెఱయఁ
జెఱచె! నంతఁ బొదివె నుఱక యారథికు సం
శప్తకవ్రజంబు సరభసముగ. ౨౯౬

క. ఎందఱు వొదివిరి వారల
కందఱకును, దమక తమక యర్జున చటుల
స్యందన మెదురై నట్లు మ
దిం దోఁచెఁ దదీయ బాణతీవ్ర బహుళతన్. ౨౯౭

క. అప్పుడు గురుతనయాద్రిం
గప్పఁగ వజ్రోపమానకాండములు వెసం
గుప్పనఁగూర వఱప నరుఁ
డప్పరుసఁదనమున కోర్చి యతఁడుఁ బెనంగెన్. ౨౯౮

వ. అ ట్లశ్వత్థామ పెనంగుచుండ, సంశప్తక ప్రజంబునందు; ౨౯౯

క, చేతులు దలలును బహువిధ
హేతులఁ దునియలుగఁ జేసి యిలఁ దొరఁగించెం,
జేతుల కపి వోవంగ న
రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి ప్రకటస్ఫురణన్. ౩౦౦

క. తురగ ద్విప రథ తూర్యా
భరణ ధ్వజ చామరాతపత్ర శకలముల్
బొరిఁ బొరి ధరఁ గప్పఁగ, నె
త్తురుటేఱులు వానిఁ దొలఁగఁద్రోచుచు వచ్చెన్. ౩౦౧

వ. అట్టియెడ; ౩౦౨

తే. అంగ వంగ నిషాద కళింగ బలము
లర్జునునిమీఁదఁ బెల్లుగ నడరుటయును,
గురుతనూభవుఁ డతనిని మురవిరోధి,
నంపపెనువెల్లి ముంచి, బెట్టార్చి పేర్చి. ౩౦౩

వ. అవ్విక్రమ విశేషంబునకు రోషంబు నొంది, ౩౦౪

క. అవ్వీరుం డవ్విప్రుని
క్రొవ్వును, నా సైన్యసమితి క్రూరోద్ధతియుఁ
నివ్వటిల నీక, ఖచరులు
నివ్వెఱపడ సమరకేళి నిపుణత మెఱసెన్. ౩౦౫

వ. మెఱసిన, నెఱసిన రోషంబున మఱియును; ౩౦౬

మ. గురుపుత్రుం డసురాంతకుఁ విజయునిం గ్రూరాస్త్రసంతాన వి
స్ఫురపాతంబున నొంప, నా హరి దదాటోపంబు సైరింప క
న్నరుతో:-'నౌషధ మూఁదిచేసి తెవులు న్మర్దింప కున్నం, దుది
న్పరమై యుండదె? యే పడంపుము రిపు న్వంరభివై' నావుడున్; ౨౦౭

వ. అతండు విజృంభించి గుణంబు సారించి; ౨౦౮

చ. శిరమునఁ గంఠదేశమునఁ జేతులయందు నురస్స్థలంబునం
జరణములం శరంబులు వెసం వివిధంబుగఁ గీలుకొల్పుచుఁ
వెరవునఁ ఖడ్గముల్ దునుమ, వేగమ యాద్వైఁ దురంగమంబు ల
గురుసుతుతేరు గయ్యమునకుం గడుదవ్వ దొలంగ భూవరా! ౨౦౯

వ. ఆ భూదేవుండును భగ్నోత్సాహుండై, యల్లన సూతనందను సమీపంబునకుం జనియె. నప్పుడు శౌరి సంశప్తకసైన్యంబు దెసకుం దేరు నడపుచుం, దమసేన దిక్కు కోలాహలం బాకర్ణించి, చూడ్కి యట నిగిడించి, యర్జును నుద్దేశించి:- 'వేదండారూఢుండైన దండధారుండు మనబలంబులం గలంచుచున్నవాఁ డమ్మగధోత్తముండు-భగదత్తునంతవాఁడ: యతని మడియించి మఱి చేయంగలపని సూచికొంద'మని పలికిన, నక్కవ్వడి యొడంబడ, నక్కడ కరదంబువోవ నిచ్చె. నట్టియెడ; ౨౧౦

### —♦ మగధపతి-దండధారుడు అర్జునుచేఁ జచ్చుట ♦—

క. పాండవసైన్యంబుల వే
దండంబుల ఘోటముల రథంబుల భటులం
జండగతి మగధపతి నిజ
శుండాలముఁ బఱపి యేపుఁ జూపి తెరల్చెన్. ౨౧౧

వ. అవ్విక్రమవిహారంబు వీక్షించి; ౨౧౨

తే. మాగధుని కోల్తలకుఁ వాక మనబలంబు
వితిగెఁ [1]బొద బొద మని తాను దఱిమెఁ దేరు,
హరియుఁ బఱపంగ నర్జునుం డడ్డపడియెఁ
జండచేష్టితోద్దండ వేదండమునకు. ౨౧౩

1. పదపదమని.

క. అగ్గలిక దండధారుఁడు
దిగ్గజనిభ నిజగజంబుఁ దీవ్రత మెఱయన్
డగ్గఱఁగఁ బఱపి హయముల
నగ్గరుడధ్వజుని నరుని నమ్ములఁ గప్పెన్. ౩౧౪

చ. అలిగి కిరీటి మాగధ ధరాధిపుబాహువు ద్రెంచి, గ్రక్కునం
దలయును ద్రుంచి, యేనుఁగు నుదగ్రతఁ బీనుఁగుఁ జేసె; నప్డు గొం
దల మొకయింత లే కతనితమ్ముఁడు-దండుఁడు దాఁకి, తోమరం
బులు వరఁగింపఁ గేలు శిరముం గరటిం దునుమాడె నుగ్రతన్. ౩౧౫

క. తదనీకంబు గజంబులు
వొదివిన, బలుగాలి మేఘములఁ దీవ్రగతిం
జెదరించుపగిది నరుఁ డు
న్మదుఁ డై నలుదెసలఁ దోలె మనుజాధీశా! ౩౧౬

వ. ఇవ్విధంబున మగధసైన్యంబు మర్దించి, సంశప్తకసైన్యంబుపైఁ గవిసి, కపికేతనంబు మెఱుంగులు మెఱయ మధుమథను వెరవున వెలిమావులగతు లక్కజంబుగా, నుక్కునఁ బార్థుండు భల్ల నారాచ ప్రముఖ ప్రదర పరంపరల సొంపును బాహావీర్యధైర్యంబుల పెంపును, నిలింప నికరంబు వర్ణింప; నందు మహార్ణవంబునం దిరుగు మందరనగంబు చందంబున నిజస్యందనం బొప్ప, నప్పటప్పటి కెక్కుడౌదవు మదంబునం ద్రిగర్తాదులగు నమ్మాత్తురు పైపయిం గ్రమ్మి కురియు నస్త్రశస్త్రంబులు విదళిత చ్ఛిన్న చూర్ణితంబులు సేయుచుఁ, దదీయగాత్రంబులుం గరటి ఘోటక తనువులుం దునియ లయ్యును నుగ్గులయ్యును బఱియ లయ్యును గుదులయ్యును ధరం దొరఁగఁ; *దామరబావిం గేలిసల్పు సామజంబువాడ్పున విహరించి, యవిహత ధృతివ్రత మహితులగు నహితుల నత్యుత్తమలోకంబులకుం బుచ్చినం, గొంచెపుమూఁక విచ్చినం, బెద్ద వెనుకొనక యరదంబు మరల్చి, వచ్చునెడ నచ్యుతుం డర్జును నుద్దేశించి:-భవద్విక్రమ విహారస్థలంబు సూచితే?' యని పలికి; వివిధాయుధ ఖండంబులను, వేదం డాశ్వ రథ పదాతి శకలంబులను, భూష ణాతపత్ర కేతు చామ రాంశంబులను, జక్షుశ్చమత్కారణ పరిణతంబగు రణస్థలంబు సూపె. నప్పుడు గొఱప్రాణంబులతో నొఱలు నర తురగ ద్విరదంబు

* పొలికలనును తామరబావి అనుటలో, అర్జునునికి ఆ పోరు అంత చిన్నదిగా నున్నదనుట.

లను, గొందఱు దమవారిం గానక కన్నీళ్ళు నించుచు నాలింగన రోదనప్రముఖం బులైన కరుణాభాషణంబులగు నవస్థావిశేషంబులం బొందువారలం గృపాళులై యాలోకించుచు, నయ్యిరువురుఁ దమ మోహరంబున నెసంగు కలకలంబు విని, యుదీర్ణగమనంబు జనుదెంచుచుండి. రట మున్న కౌరవ్యుల మొనయును గర్ణుని మొగ్గరంబును రెండుముఖంబుల బెనంగుచుండి, కయ్యంపు టుచితత్వంబువం గలసె. నట్టియెడ రారాజు పురికొల్పి రాధేయునకుఁ బ్రాపయి పుళింద బాహ్లీక చేంక జాంధ్ర భోజానీకంబు గవిసినం, గౌంతేయబలంబునకు భరం బగుటయు.

—♦ పాండ్యమహీపతి–మలయకేతుని అశ్వత్థామ వధించుట ♦—

సీ. *పాండ్యుఁ డాసేనలపై బెట్టిదంబుగ
నడరి, బాహాబల మక్కజముగఁ
బేరిచి పీనుంగు పెంటగాఁ జతురంగ
ముల రూపుమాపె, నయ్యలఘుభుజుఁడు
ద్రోణభీష్ములు దనతోఁబాటి యన్పలు
కున కోర్వఁ, దచ్యుతార్జునులు దనకు
నెక్కుడు నా విన్నసేవగించుచునుండు,
నవ్వీరుఁ దమ్మెయి నాక్రమింపఁ

ఆ. గని, కడంగి యెదురు చని, గురుతనయుండు
నగుచుఁ:–'బగలి నీవు మృగకులంబు
గలఁచు హరియుఁబోలెఁ గలఁచెదు; నాదిక్కు
మొగము సేసి యనికి మొనయు' మనియె. ౨౧౮

చ. అన విని, మేను వొంగ మలయధ్వజుఁ డుగ్రపు నారసంబుఁ ద
త్తనువునఁ గ్రుచ్చి, మౌర్వీవినదంబు నభంబునఁ బర్వ, నంపవె
ల్లి నిగుడఁ జేయఁ, దొమ్మదిశిలీముఖముల్ వెస నమ్మహీశుపై
నవిమిష వర్ణపీయగతి నగ్గురునందనుఁ డేసె, నేసినన్; ౨౧౯

వ. అత్తొమ్మిదింటిలోన, ౨౨౦

---

* పాండ్యులు దక్షిణాదివారు. ఆంధ్రులు పుళిందులుగూడ (పై 317 వ.) దక్షిణాపథము వారే; వీరు క్రీస్తుశకారంభమునకు, అటు ఇటు దగ్గరివారై, భారతము వ్రాసినవారికిమాత్రమే దెలిసినవారు. ఇట్లు భారతాదులను తిరిగి వ్రాయించినవని, గుప్తసామ్రాజ్యమువారిదని. క్రీ. శ. 4–5 శతాబ్దములు.

క. ప్రతిశరములు పాండ్యమహీ
పతియును బఱఁగింప నైదు భగ్నము లయ్యెన్;
గతి సెడక నిగిడి రథ్య
ప్రతతి ధరం గూల్చె నాల్గుబాణము లధిపా! ౩౨౧

తే. మఱియు గురుపుత్త్రుఁ డేయ, నమ్మలయకేతుఁ
డాశరంబులఁ దద్ధనుర్జ్యాలతయును
దునిమెఁ; దునిమిన నతిరయంబున నతండు
నారి సంధించి యమ్ముల నథముఁ గప్పె. ౩౨౨

వ. అప్పాండ్యమహీపతి పరివారసామర్థ్యంబున రథ్యవంతుండయి వాయవ్యాస్త్రంబున నయ్యంపవరంపరఁ బ్రతిహతంబు సేసి, తదీయ చక్రరక్షకులం దెగటార్చి యార్చినం గెరలి, యగ్గురునందనుం దత్సహచరులం నుఱుమాడి, రత్నమయాగురు చందనసుందరంబైన మలయగిరి ప్రకారంబునం బొలుచు కేతనంబు గూల్చి, గుఱ్ఱంబుల గీటడంగించి, సూతుప్రాణంబులు గొని, చాపంబు ద్రుంచి, తేరు దుమురుసేసి, యతండు వాలివోని పౌరుషంబునం బ్రయోగించు నస్త్రశస్త్రంబుల నుఱక నఱికి యగ్గమైయున్నను, గయ్యంబువలని వేడుక నతని నమయింపనొల్లక యరవాయిగొనిన, యాలోనఁ బతితయోధంబైన సుకల్పిత మాతంగంబు నెక్కి, గిరిశిఖరంబు నలంకరించు కేసరి యట్లొప్పి, యాద్రవిడేశ్వరుండు సామజంబు నుద్దామగతిం దఱిమి, భీమాభిరామం బైనతోమరంబు వైచిన మణిగణోజ్జ్వలంబైన యా ద్రౌణి శిరోభూషణంబు ధరణింబడినఁ, ద్రొక్కంబడిన భుజంగంబు పోలికం గనలి, యబ్బలు మగండు తత్పార్శ్వవర్తుల నార్వుర రథికవరులఁ దద్వేదండంబు తుండంబును జరణచతుష్టయంబును నమ్మేదినీపతి పాదంబులుఁ గరంబులు శిరంబును నతితీవ్రభల్లంబులం దునుమాడిన నద్దిక్కుమూఁకలు విచ్చెం; గురుభూవరుం డమ్మహీసురవరుం జేరంజని యగ్గించె. నప్పుడు; ౩౨౩

క. 'విలు విలు'మని తమమూఁకల
విలిపి, వృకోదరుండు గవిసె నీబలములపైఁ;
దలకొని ధృష్టద్యుమ్నా
దులు సంరంభోద్భటముగఁ దోడ్పడి రధిపా! ౩౨౪

క. వారలవడి కోర్వక య
క్కౌరవసైన్యంబు దెరలఁ, గర్ణుఁడు దర్ప

స్ఫారత నదల్చి విలిపి, యు
దారగతిఁ వైరిరథికతతి మార్కొనియెన్. ౩౨౫

## — ♦ ఆశ్వత్థామ ధృష్టద్యుమ్నుల సమరము ♦ —

వ. అతనికిఁ బాసటయై యడరిన యశ్వత్థామచేతం బలువురు పాంచాలురు వ్రాలిరి. కృష్ణుండు గ్రీడికిం బాండ్యమహీపతి సమయుట సూపి, సమీరనందన కర్ణాదులగు నిరువాఁగు రథికుల పరాక్రమంబును వేఱువేఱ నిరూపించి చూపిన, నతండును రథంబు మనసేనలోనికిం బోవ నిమ్మనిన, నచ్యుతుం డట్ల చేయ నుబ్బిన పాండవానీకంబునకును రాధేయ గురుపుత్త్రుల రథసంబునం జేర్చిన మనమొనకును సంకుల సమరం బయ్యె. నం దాకర్ణునకు ధృష్టద్యుమ్నునకుం బరస్పర శరకర్తనంబును వితరేతర చ్ఛత్త్ర కేతుఖండనంబును నన్యోన్య వర విదారణంబును మిథశ్శరీర పాతనంబును నగు సంగ్రామంబు సెల్లె. నట్టియెడ నాసూతనందనునకుం దలకడచి గురునందనుండు, ద్రుపదనందనుం గవిసి:- 'బ్రహ్మఘ్న, నిలు నిలు, మేను గలుగ నెట్లు బ్రదికెద?' వని పలికి. వెండియు— ౩౨౬

క. 'మాతండ్రియెడం జేసిన
పాతకము కతంబు గాఁగ బాంచాలనికృ
ష్టా, తునిమెద నిను, నరుఁ డిట
కేతేరక యున్నఁ బాఱ కీవు నిలిచినన్.' ౩౨౭

వ. అన విని, ధృష్టద్యుమ్నుం డతని కిట్లనియె :- ౩౨౮

క. 'మీతండ్రి కుఱికి నఱికిన
హేతియ నీకొఱకు నునిచి, తిప్పుడ నఱకుదుఁ జా
నీతులవ పలుకులకు నీ
వై తోఁచిన యుత్తరంబు నదియ దురాత్మా!' ౩౨౯

వ. అని యంత నిలువక;

తే. 'వినుము! బ్రహ్మఘ్నుఁడన నీకుఁ జనునె? బ్రాహ్మ
ణబ్రువఘ్నుఁడ నై సమున్నతి వహించు
నన్నుఁ గిల్బిషపరుఁ డను విన్న జనకు
కడకుఁ బుచ్చెద వేగిరపడక నిలుము. ౩౩౦

వ. అనియె. నట్లయ్యిరువురు నొండొరులం బరుషంబులు పలికి తలపడి, వియత్తలంబు విశిఖ శిఖాకలాపంబులం గప్పిరి. రాధేయుండు యుధామన్యు నుత్తమౌజ ద్రౌపదేయ శైనేయులను మఱియుం జేయంగల పాండవపాంచాలయోధులను బొడివి భండనంబు సేయుచుండె. నాధృష్టద్యుమ్నుండు గురుపుత్రు కోదండంబు దుండంబులు సేసినం, గుపితుండై యొండువిల్లు గొని యవ్వీరుండు— 332

క. సూత తురంగ స్యందన
కేతన చాపములు నఱకి, కేలిమెయిఁ ను
గ్గై తూరఁగ నేసెఁ దోర్ద్యో
నాతత శక్తియును గదయు నతఁ డెత్తంగన్. 333

—♦ అర్జునుఁడు ధృష్టద్యుమ్నుని రక్షించుట ♦—

వ. అప్పాంచాలోత్తముండు వాలునుం బలకయుం గొని కవియం గడంగిన, నవియును దుమురు సేసి పెల్లేసి పడ కున్న, నశ్వత్థామ వేగిరపడి వెఱఁ గందుచు చేతిబాణాసనంబు విడిచి కృపాణంబు గొని, భుజంగంబుదెస కదరు విహంగపతి విధంబునఁ జనుట సూచి, సవ్యసాచితో శౌరి: 'ధృష్టద్యుమ్నుండు గురుపుత్రు బారిం బడియెం, గావ వలయు' ననుచు నద్దిక్కు సూపిన, నతండు సత్వరుండై యవ్వీరుం ద్రుపదపుత్రుం గవిసిన కొలందిఁ గ్రూరంబు లగునారాచంబులు గుప్పించుచు నొప్పించిన, నమ్మహీసురవరుం డయ్యుత్సాహంబు వదలి మరలి యరదంబున కరుగ, సహదేవుండు దనతేరిపైకి నప్పార్షతుం దిగిచికొని తొలంగం గొనిపోయె. నక్కుంభసంభవ నంభవుం డగ్గాండీవి మార్కొని పెనంగి, బెట్టి దంబుగాఁ గనుకనిం దాఁకి, యతండు నాటిన సునిశితశరంబున సోలె; సారథి రథం బొండు వలనికిం దోలె. నర్జునుం డట్లు నిజసేనానాథు రక్షించి, ద్రౌణిమదం బడంగించుట గనుంగొని కౌంతేయసైనికులు సింహనాదంబులు సేయ, నక్కడ నిస్సాణాదుల నాదం బెసంగి నింగి నిండిన; 334

తే. సూతసుతుఁడు ధనంజయుఁ జూచి రోష
కలుషితాత్ముఁడై తలపడఁ దలఁచె, నపుడు
తత్క్షణమున సంశప్తకతతియుఁ దోఁచె,
రెండుఁ గని యిట్టు లనియె నాక్రీడి హరికి :— 335

వ. 'కర్ణుండు మనల మార్కొనం గడంగెడు; సంశప్తకులు గ్రమ్మఱం బొదివిరి. కర్ణుచేతం దగులువడితిమేని సంశప్తకుల కోహటించిన వారమగుదుము; వారల దిక్కు వేరు నోవ నిమ్ము.' ౩౩౬

చ. అన విని యట్లు చేసె నతఁ, డర్జునుఁ డారిపుకోటి ముట్టి యే
పున మఱుమాడు చుండెఁ, గురుభూవర, యప్పుడు ధర్మసూతవం
దనులు పముద్ధతిం గడఁగ దండడి క్రొత్తగ వారిసేనయున్
మనమొనయుం బెనంగె నుపమారహితం బగువిక్రమంబునన్. ౩౩౭

ఉ. సంగర మేను పెక్కు దివసంబులు సూచితిఁ గాని, యెద్దు నా
భంగి మునుంగ దచ్చెరువుపాటునఁ జిత్తము, వోరు చుక్కయో
త్రుంగుచు నుక్కియో యెఱుఁగఁ, దూలక పైపయిఁ గ్రమ్మఁ గూలు సే
నాంగము లందు నిందుఁ, గలహంబు మహోగ్రత యేమి సెప్పుదున్. ౩౩౮

— ♦ కర్ణుఁడు పాంచాలసైన్యమును దైన్యంబు నొందించి విజృంభించుట ♦ —

తే. అందుఁ బాంచాలవీరుల నశ్వ సూత
రథసమేతంబుగా, నంగరాజు దర్ప
మెసఁగ నేవురఁ బదువుర నేడ్వురను మ
హాస్యమార్గణములఁ దునుమాడె నధిప! ౩౩౯

క. పదపడి పాండవయోధు
ల్వొదివినఁ బెనుఁదుంగ మడువులో గజపతి యు
న్మదవృత్తిఁ గేలి సలుపు ప
గిది, నాతఁడు బోరె సురలు గీర్తన సేయన్! ౩౪౦

వ. అట్టియెడ; ౩౪౧

చ. ద్రుపదతనూజులుం గవలు ద్రౌపదిపుత్రులు శౌరితమ్ముఁడుం
గుపితమనస్కులై బలువుఁగోలలఁ దాఁకి, రథం దదల్చి యు
గ్రపు రథసంబున౯ శరపరంపరలం బరఁగించె, గౌరవా
ధిపుహృదయంబు మోదమునఁ దేలఁగ-నందఱయంగకంబులన్. ౩౪౨

వ. వారలపై నక్కురుభూనాథుం దేసుఁగు కయ్యంబునకు వెరవుగల కళింగ వంగాంగ మగధ సుహ్మ పౌండ్రాదిదేశంబుల బలంబులం గవియించిన, నవి తదీయచతురంగ

బలంబుల మట్టి మల్లాడి చిత్రవధవిహారంబు సలుప, నగ్గజప్రధానసేన లగ్గలికం
జించి చెండాడుచు, నాదండిమగలును జేకితాన ప్రభద్రకులును రౌద్రరసంబున
బెనఁచినం గనుంగొని, మదంబునం బొదలి యొత్తరించి యురవడించిన. ३४३

శా. వంగాధీశుఁ గరీంద్రుతో నడఁగ గర్వస్ఫూర్తి శైనేయుఁ డే
యం, గేలిగతి [1]మాద్రిలేఁగొడుకు పౌండ్రాధీశ్వరుం గిట్టి యా
ఖంగిం గూల్చఁ, దదగ్రజుం డటుల దర్పం బొప్ప సుహ్మాధినా
థుం గోపంబునఁ ద్రుంప, నేచెఁ గరటిస్తోమంబు లంతంతకున్. ३४४

క. విను: మ్లేచ్ఛ నకులుఁ బొడి
చె, నదగ్రధ్వని ననేకవేదండము, లం
దెనిమిదిటిఁ గూల్చెఁ, బ్రాణము
లెనిమిది యెనిమిదులఁ దమ్ముఁ దేర్త్రెఱ నధిపా! ३४५

క. ఆ ధృష్టద్యుమ్నాదులు
క్రోధాంధత నడరి, యేనుఁగుల నప్రహతిఁ
వ్యాధూతములుగఁ జేయుచు
రాధేయుం గదియ, సంగరము వేర్చె నృపా! ३४६

—♦ రాధేయుఁడు పాండవేయ పాంచాలాదియోధుల కలంచుట ♦—

వ. ఆసమయంబున శోణితంబు పెల్లున మున్నెగసిన రేణు వడంగిన, నిరువాఁగు
సైనికులును దమతమ యడియాలంబులతోడి గొడుగులును సిడంబులును బెద్దయు
మెఱయఁ బెనంగుచుండ, సంశప్తకసంచయంబు గించిదవశిష్టంబుగా నష్టంబు
సేసిన, సవ్యసాచికి శౌరి యక్కౌరవపాండవ బలంబులపోరు సూపి; యప్పుడు
దుర్యోధనుండు దనయందుఁ జేయంగలవారును దాను ను ధర్మనందనుం బట్టు
తలంపున బెట్టు పొదువుటయు, నమృతంబున కాసపడి యడరు నసురుల మరల్చు
శక్రాగ్నులచందంబున, భీమసేనుండును సాత్యకియుం వారలం బ్రతిహతులం
జేయుటయు; నంత విలువక యక్కురువిభుండును గర్ణ కృపాశ్వత్థామలును
నుద్దామగతి నయ్యిరువుర శరజాలంబుల నమ్ముల జడియుచుం గదిసి, యక్కౌం
తేయాగ్రజు కంకటంబు ద్రుంచివైచుటయుఁ; గర్ణుసుత్సాహంబునం గడంగు
ధార్తరాష్ట్రుల సింహనాదంబులకుం దెరలక, మరుత్సుతుండు మండలప్రచారుం

1. ఈ మాద్రి లేఁగొడుకును యీనాఁటికి 69 ఏండ్లప్రాయము. వారిలో చిన్నవాఁడనుట
కాబోలు.

దగుటయు; నా సూతనందనుండు మొదలగు నమ్మేటిమగల మార్గణమ్ము లమ్మమఱ పతిపైఁ బరఁగుటయు; నకుల సహదేవ సాత్యకి ధృష్టద్యుమ్న ద్రౌపదేయ ప్రభృతులైన పాండవేయ పాంచాలాది యోధులం గలంచి, యక్కర్ణుండు కమలాకరంబునం గేలినలుపు శుండాలంబు లీల నటించుటయు; నవ్వీరుం దగ్గలిక నక్కవ్వడిరాక గోరి కపికేతనం బాలోకించుటయుం గలిగిన యప్పరిపాటి యంతయు నేర్పడం[1]జెప్పి; యూరాధేయు రభసం బుగ్గడించి మఱియు నిట్లనియె:- ౩౪౮

క. 'నినుఁ దలపడఁ జూచిన యీ
తని యేడ్తెఱ, మంట నొరఁగఁ దలఁచు మిడుతయు
బ్బున కెనయై నాకుం దో
చినయది; ద్రుంపింపు మితని శితవిశిఖములన్.' ౩౪౯

వ. అని పలికి, యతని కప్పుడు దోర్పడ నుత్సహించు భవత్సుతు నుపలక్షించి బీభత్సునకుం జూపి—— ౩౪౯

ఉ. 'ఇత్తఱిఁ ద్రుళ్ళు సూపి నిను నేపున మార్కొని గెల్తు నన్న తలం
పెత్తి, సుయోధనుం డదె యహీనబలంబులఁ గూర్చెఁ; గర్ణుతో
మత్తగజంబులీల నెలమామిడిఁ గూల్చినభంగిఁ బాండుపు
త్రోత్తమ, వీనిఁ గూల్చు మతఁ డొంటిగ రాజ్యము నీకుఁ జేకుఱున్.' ౩౫౦

వ. అనునవసరంబున, ౩౫౧

మ. సమదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్న శైనేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో నడర, దోర్గర్వంబు శోభిల్ల, శౌ
ర్యము సొంపార, విలింపకోటి వొగడన్ రారాజుసైన్యంబు లొ
క్కమొగిం బెల్లగిలంగ, బెట్టడరె సక్రోధాంతరంగంబుతోన్. ౩౫౨

క. అదరి, పటుబాణజాలం
బడరింపఁగ వారిబలము లధిక రయము నె
క్కుడు మదము నొలయఁ బైకొని,
బడలువడఁగఁ జేసె నీదుబలముల నధిపా! ౩౫౩

క. వడిఁ బొదివి భీముఁ డార్చినఁ,
జెడ విఱిగినసేన, నేమి సెప్పుదు? దనదాం

1. ఇది శౌరి సవ్యసాచితో చెప్పినది.

దడిఁ దాన చదిపె; వెనుకొను
కడిఁదిమగలచేత గాపి గాదె నరేంద్రా? ౩౫౪

—♦ కౌరవబలము పవనసుతు నెదుట నిలువలేక పాఱిపోవుట ♦—

ఉ. మ్రొగ్గెడు వాహనంబులును, మోములు వాడఁగ వాహనంబుల
వ్రిగ్గి తలంగుసైనికులు, నేలకుఁ గష్టపుఁ జొప్పు సొప్పడం
ద్రగ్గు పిడంబులుం, గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై
మ్రగ్గెడువారునై కురుధరావరు సైన్యము రూపు మాయఁగన్. ౩౫౫

ఆ. పావనికి నిషాదపతినందనుండు మాఱు
కొనిన, నాతఁ డతవి కుంజరంబు
కరముతోఁ దదీయకరములు శిరమును
నఱకె శితశరములు నాలుగింట. ౩౫౬

క. మూఁడక్షౌహిణు లిమ్మెయిఁ
బోఁడిమి సెడి పాఱెఁ, బవనపుత్రుని యెదుర న్నా
వేఁడిమి సూపఁగ నొకఁడు
న్వాఁడిమగఁడు లేఁడ, యే మనంగల దధిపా? ౩౫౭

వ. ఇవ్విధంబున విక్రమించిన భీమసేను బరవసంబును దదీయసైనికుల సంరంభం
బునుం బద్మనాభుండు ఫల్గునునకుం జూపి చెప్పె. వనిన విని, సంజయునకు
ధృతరాష్ట్రుం డి ట్లనియె:- ౩౫౮

క. 'నీచెప్పెడుమెయి సూడఁగ
నీచత వాటిల్లె మన యనీకమునకుఁ; దా
రేచేటు సెడిరొ కౌరవు,
లాచరిత మువన్యసింపు మంతయుఁ దెలియన్.' ౩౫౯

క. అనవుడు, నతఁ డిట్లను: న
మ్మనుజపతికి హితులు సెప్ప మానక, నీచే
సిన దుర్ణయమునఁ జేటొం
దెను, వగవక రణము వినుము ధీరవిచారా! ౩౬౦

వ. ఇట్లు భీముకడంక గని, కవ్వడి దనమునుము కొంచెమునూఁకలం దోలి, మగిడి
మనసేనల మర్దించుటకుం దమవారిఁ జేరం జనఁ, గౌరవపతి యమ్మారుతి
మార్కొని, ౩౬౧

—♦ రారాజు, రాధేయుఁడు పాండవబలముతో పెనగుట ♦—

తే. 'ఎందు వచ్చెదు? నిలునిలు; మేము గలుగఁ
గడిమి సెల్లునె నీకు? నీక్షణమ విన్ను
నంతకునిప్రోలి కనిచెద' ననుచు రోష
రక్తలోచనరుచుల శరములు వఱపె. ౩౬౨

క. రాధేయుండును దీప్త
క్రోధుండై గర్జతోడి గుణరవము నభో
బాధం బొనర్పఁగా, విజ
యోధులఁ బురికొల్పికొని సముద్ధతిఁ గడఁగెన్. ౩౬౩

వ. అట్లయ్యిరువురు నుత్సాహంబు వాటించి నిజానీకంబు నిలువరించిన, నది పురి కొని వీరికి నమరుటయుఁ, బాండవబలంబును దిరంబయి పెనంగం దొడంగె. నట్టియెడ నక్కడ నిక్కడఁ జేయంగల దొరలు దలపడి యుక్కున నక్కజం బగు సమరక్రీడ సలిపి. రందు; ౩౬౪

సీ. కర్ణుఁ దేపారి శిఖండి రథ్యముల సా
రథిఁ గేతువును గూల్చి, రయము మెఱయ
విగతాయుధుఁడు బాణవిహతాంగుఁడునుగా న
దగ్రుఁడై తఱుమ, నతండు దొలఁగఁ
బాఱె; దుశ్శాసన పార్షతు లొండొరు
తనువులు నొంచుచు నవిమిషులకు
నచ్చెరువగునట్టి యని సేయ, వారల
యనుచరు లెడసొచ్చి పెనఁగి; రంగ

తే. రాజు సూడఁ దత్పుత్రుసారథిశిరంబు
నకులుఁ డొకభల్లమునఁ ద్రుంపఁ, జకితమై క
లంగు నచ్చటిమూఁకఁ జలంబు మెఱయ
నిలిపె నా సూతసూనుండు నృపవరేణ్య! ౩౬౫

వ. అట్లు సారథిరహితుండైన వృషసేనుండు వేఱొక్కసూతు నమర్చికొని తండ్రికిం జక్రరక్షకుండై నిలిచె. నకులుండు నొండుదెస కడరె. సహదేవుం డులూకుని విరథుం జేసి పఱపె. సాత్యకి సౌబలు లన్యోన్యకేతుపాతనంబును బరస్పర

కంఠటకర్తవంబునుం జేసి; రా నమయంబున శైనేయుండు దురంగంబులం జదిసిన నరదంబు డిగ్గనుఱికి యోనరించు నగ్గాంధారవిభుం గని యులూకుండు—

క. మును సహదేవుం డెగువం
జనినప్పుడ యొండుదేరు, నవరించుకొనం
గనుట నది సేర్చి యతనిం
గొనిపోయెను సంగరమునకుం దొలఁగంగన్. ౩౬౭

ఉ. అప్పటిమూఁక నల్గడల నాతురతం జెడి పాఱె భీముచేఁ
జచ్చెఁ, గురుక్షితీశ్వరుని సారథి కూలె, హయాళి నుగ్గు గాఁ
జొచ్చె, రథం బతండు వెఱ నొచ్చి ధరిత్రికి దాఁటి పోయి. వె
న్నిచ్చిన నీదుయోధవరు లేత్తెఱ మార్కొని రమ్మరుత్సుతున్. ౩౬౮

వ. యుధామన్యుండు గృపాచార్యు ధనువు ద్రుంచిమిన, నమ్మహాత్ముండు వేఱొక్క విల్లెత్తి: ౩౬౯

ఆ. కేతనంబు గూల్చి, యాతపత్రము ద్రుంచి
మాడి, సూతుఁ జంప, నధికభయము
గదిరి తేరు దాన కయ్యంబునకుఁ దొలఁ
గంగఁదోలె నతఁడు, కౌరవేంద్ర! ౩౭౦

క. శితశరము లుత్తమౌజుఁడు
గృతవర్మనిమేన నింపఁ గినుక గదిరి; మూ
ర్ఛితుఁడుగఁ జేసె నతఁడు వెస
నతనిం దత్సూతుఁ డెగచె నరదముఁ దొలఁగన్. ౩౭౧

—♦ అశ్వత్థామ అర్జునుని ఎదిరించి మహాహవము చేయుట ♦—

చ. గురుతనయుం డనేకరథికుల్ దనపార్శ్వములం దుదగ్రులై
దురము కడంకమైఁ దఱుమ, దోర్బల శౌర్యము లుల్లసిల్ల, వి
స్ఫురశరవృష్టి ముంచె మధుసూదను, [1]మధ్యమపాండవుం బియ
చ్చరులు ప్రశంస సేయఁగ నిజధ్వజినీ నయనోత్సవంబుగన్! ౩౭౨

1. మధ్యమ పాండవుఁడు = పాండవులలో మూడవవాఁడు - అర్జునుఁడు. ఈ 'మధ్యమ' పదము కొంత తలతీకనకాయగా నున్నది. నన్నియ యీ పదమును భీమునికే ఉపయోగించును; భానుఁడుగూడ (మధ్యమ వ్యాయోగము) కాని, తిక్కన ఎక్కువగా, పలుమారు అర్జు

క. అలిగి, నరుఁ డైంద్ర మాదిగఁ
గల దివ్యాస్త్రంబు లేయఁగా, నయ్యేయు
జ్జ్వలమార్గణంబులను న
క్కలశభవసుతుండు మాన్చెఁ గౌరవముఖ్యా. ౩౭౩

వ. ఇవ్విధంబున వివిధాస్త్రజాలంబులం బోరిపోరి, ౩౭౪

సీ. ఉఱక యశ్వత్థామ యుగ్రబాణంబులు
విజయుని దక్షిణభుజము దూఱ
మూఁడేయ నొచ్చియుఁ, బోడిమి పెడక య
బ్బలియుం డదల్చెఁ దత్పార్శ్వవర్తు
లగు పెనుమూఁకల నమ్ములవెల్లిఁ, బే
రల్క నక్కుంభజానాత్మజుండు
రథ్యచయంబు నారాయణు వానర
ధ్వజము నవ్వీరుగాత్రమును బొదివె

---

పరముగానే వాడినాఁడు. నడిమివాఁడు అను అర్థమును చెప్పిన - 'మధ్యమ పాండవుఁడు' అన్నచోట సరిపోవునుగాని, 'కుంతీసుతమధ్యముఁడు' అనినచోట, నడిమి అంటే భీమునే చెప్పవలసియుండును. కాని ఇది గోగ్రహణఘట్టమున, అర్జునుని విజృంభణమునుగూర్చి చెప్పిన పద్యము.

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి
మాతంగస్ఫూర్జితయూథ దర్శన సముద్యత్క్రోధమై వచ్చు నో
జం, గాంతారనివాస ఖిన్నమతి, నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం; గుంతీసుతమధ్యముండు సమర స్థేమాభిరామాకృతిన్.

(విరా : 4-85)

అందువల్ల మధ్యమ అనఁగా అర్జుననే చెప్పవలసియుండును; ఇక దీని అర్థము 'మూడవ' అనియే ;

ఛందములు 26. అవి : 1. ఉక్త - 2. అత్యుక్త - 3. మధ్య - 4. ప్రతిష్ఠ - 5. సుప్రతిష్ఠ - 6. గాయత్రి - 7. ఉష్ణిక్కు - 8. అనుష్టుప్పు - 9. బృహతి - 10. పఙ్క్తి....

మొదలగువాటిలో - మూడవ మధ్య, పదియవ పఙ్క్తిని సాహిత్యములోనికి Figuretive గా తీసుకొనినారు. కాబట్టే పఙ్క్తిరథుఁడు అనఁగా దశరథుఁడని, పఙ్క్తికంధరుఁడు అనఁగా దశకంఠుఁడని అర్థము చెప్పుచున్నారు. పఙ్క్తిపరువ అనిన కంధరములకు సరిపోయినా రథములకు సరిపోదుగదా. అందుచే మధ్యమ అంటే మూడనియే అన్వయించవలెనని చెప్పుచున్నారు.

తే. మెఱుఁగువాలంపగముల, నమ్మెయి నరుండు
ద్రౌణితోడ భరంపడి రణమొనర్చు
చుండ; నట మున్న ధర్మజుఁ డురవడించి
చిత్రసేనుని నమ్ములఁ జిక్కు వఱిచి, ౩౬౫

క. తఱిమి తనమునుము సైన్యము
నుఱుమాడఁగఁ గని, సుయోధనుఁడు మున్నుగ నే
డ్తెఱ వీరయోధులు మార్కొని,
యఱిముఱి నొప్పించి పట్టి నమరి పొదివినన్. ౩౬౬

—♦ కర్ణుఁడు ధర్మజు నలయించుట ♦—

ఉ. పావనిఁ మున్నుగాఁ గవలుఁ బార్షతుఁడుఁ వెన వారిఁ దాఁకినం;
జేత దలిర్ప నచ్చటికిఁ జెచ్చెరఁ గర్ణుఁడు వచ్చి తీవ్రబా
ణావృతమూర్తిఁ జేసె, మనుజాధిప, యారథికావలిఁ ధను
ర్జ్యా వితతస్వనంబున వియద్వివరంబు ప్రపూరితంబుగన్. ౩౬౭

క. అట్టియెడ, మాద్రిపిదపటి
పట్టి కురునృపాలు రెండు పదు లమ్ములు దా
బెట్టుగ నేసిన, వేదన
ముట్టుడుఁ జేడ్పడియె నతఁడు, మొనయును దలఁకెన్. ౩౬౮

మ. కని, రాధేయుఁడు దివ్యబాణవిహతిం గౌంతేయసైన్యంబు నె
ల్లను నొప్పించిన బీఱువోయె నది, యుల్లాసోగ్రుఁడై ధర్మనం
ను నమ్మేటిమగండు గిట్టుటయు, నాతం డల్గి పెల్లేసినన్,
విను; మందస్మితసుందరుండగుచు నవ్వీరుండు ధీరోద్ధతిన్. ౩౬౯

వ. అనేక చండకాండంబు లంగంబునం గీలించి; ౩౭౦

ఆ. వలఁద నారసంబు వక్షంబుఁ దూఱంగ
నేయుటయును, బాండవేయుఁ డార్తిఁ
గూరి నిలువ లేక కూర్చుండఁబడి, సూతు
నరద మెగవు తోలఁగ ననియె నధిప! ౩౭౧

వ. అనుటయు వాఁ డట్ల చేయం, గౌరవులు గడంగి 'పో నీక పొదువుం' డను
నెలుంగులతో నక్కౌంతేయాగ్రజు నెన్నాడి కవిసినం, గేకయ పాంచాలబలంబు

అడ్డపడి పెనంగె. భీమసేనుండు సుయోధను 'నిలు నిలు' మని యదల్చి యమ్ములం గప్పె. నప్పుడు రాధేయుండు రభసంబున; ౩౮౨

క. పాంచాలురఁ గేకయుల ను
దంచితగర్వమున వాలుఁరమ్ములవెల్లిఁ
ముంచిన, నోటఱి యరికరి
పంచాననమూర్తి భీముపజ్జ కొదిఁగినన్. ౩౮౩

వ. అక్కర్ణుండు నిజ రథంబుమెఱయ ధర్మనందను వెనుకొనియె. నతండు విశిఖ వేదనం జేర్పడినచిత్తంబుతోడ నిజశిబిరంబున కల్ల నల్లన బోవుచుండియుఁ, దన్ను నాసూతనందనుండు మూడుతూపుల నేసిన, మరలి యమ్మేటిమగని మేనం బలుమార్గణంబులు సొనిపి, తత్సారథి సాయకత్రయంబునను హయంబుల శర చతుష్టయంబునను గ్రుక్కించె. నట్టియెడ; ౩౮౪

క. ఇరుదెసల నున్నకవ ల
న్నరపతి దురవస్థ నూచి, నారాచపరం
పరలు పరఁగించుచును జె
చ్చెరఁ గర్ణునిఁ దాఁకి; రతఁడు చిఱున వ్వొలయన్. ౩౮౫

తే. వార లిరువుర మగ్రంపునారసములఁ
గప్పి దంతవర్ణములను గాలవాల
సుందరంబులునగు ధర్మనందనుని తు
రంగమంబులఁ బడ నేసి రయము మెఱయ. ౩౮౬

క. అతని శిరస్త్రాణంబును
శితవిశిఖ నిపాతితంబు సేసి, యుదారో
ద్ధతి నకులుకార్ముకము హయ
తతియుం దునుమాడుటయు నతండును నతఁడున్, ౩౮౭

క. సహదేవుని తే రెక్కిన
నహితాంతకుఁడైన కర్ణుఁ డమ్ముప్వుర నం
పిహితశరీరులఁ జేసెను
బహువిధబాణములఁ జలము బలమును మెఱయన్. ౩౮౮

—♦ ధర్మనందనునిపై ఆగ్రహింపవలదని శల్యుఁడు రాధేయునితోఁ జెప్పుట ♦—

చ. కనుఁగొని, శల్యుఁ డిట్లనియెఁ గర్ణునితో:- 'ఏది యేల ధర్మనం
దనుపయి నాగ్రహించెదు ? హితం బగుకార్యమె ? యిమ్మహీశు నీ
వవిఁ దెగటార్చి నట్లయిన నర్జునుఁ డుత్కట శోకరోషముల్
పెనఁగొన, నిన్నుఁ గౌరవులఁ బీనుఁగు పెంటలు సేయకుండునే. ३८९

తే. 'ఇతఁడు దెగటాఱెనేనియు నేమిఫలముఁ
గలదు ? నరుఁ బొలియించుట యలఘుశౌర్య
మది; కురుక్షితిపాలున కఖిలరాజ్య
సిద్ధియును జేయు, నింక నాబుద్ధి వినుము. ३९०

వ. 'అదియునుం గాక; ३९१

క. 'వాఁడె కురుక్షితిపాలుఁడు!
పోఁడిమి చెడి భీముచేతఁ బొదువఁబడియె, న
వ్వాఁడిమగని కడ్డము నీ
వేఁడిమి దక్కంగఁ గలదె వే యొకఁ డరయన్. ३९२

క. 'పవనసుతుచేత నాథు
ధవుఁ డీల్గినయేని, నీవు ధర్మతనయునిం
గవలన్ సమయించుట దలఁ
ప వృథాస్ఫురణంబు గాదె పరబలభేదీ ?' ३९३

క. అన విని యట్టి త్తి, భవ
త్తనయునిదెసఁ జూచి, వాయుతనయునిచే నా
తని పొదువఁబడుట యేర్పడఁ
గని, రాధాతనయుఁ డతనిఁ గావఁగఁ జనియెన్. ३९४

—♦ పాండవాగ్రజుని పలాయనము ♦—

క. చనుటయు, నజాతశత్రుఁడు
దన శిబిరంబునకుఁ బిన్న తమ్ములు యరదం
బున, నతని నతనియన్నను
గొనిచనియెను సత్వరముగఁ గురుకులముఖ్యా ! ३९५

వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు ధర్మనందను పలాయనం బెఱింగించె.
నవుటయు, ౩౯౬

ఆ. మొదలిరాజు సభయముగ నిట్లు సమరంబు
దొఱఁగి చనియె నట్టి పెఱబలంబు
దొరలు నిలిచి పోరు టరిది; యనంతర
వర్తనంబు *విప్రవర్య చెపుమ. ౩౯౭

వ. అని యడుగుటయు. ౩౯౮

చ. అనిమిష వంద్యమాన, ఘనసాదరశీల సుధాయమాన, స
త్త్వనలిన గంధరూప, విబుధద్విషదంతకర ప్రతాప, సం
జనిత విరక్తకామ, మునిసంఘ మహార్ణవ పూర్ణసోమ, వే
ద నికర సంవిధేయ విజితత్త్వపరిష్క్రియ నిత్యనిష్క్రియా! ౩౯౯

క. ప్రమితివిదూరా, సుమన
స్ప్రమితి సమారాధన ప్రసన్నాకారా
గమనాగమన నిరసనా,
శమన దమనసాధ్యపరమ సారోల్లసనా! ౪౦౦

మాలిని. ద్విజపతి వృషభాంకోదీర్ణ కారుణ్యపూర్ణా,
భజన నిరత రక్షాప్రౌఢ నిర్భేదరూఢా,
గజదురిత సముత్పేకఘ్న హృత్పద్మనిఘ్నా,
యజనవిధి ఫలత్వవ్యాప్త నిత్యప్రదీప్తా! ౪౦౧

---

* ఇచట సంజయుని ధృతరాష్ట్రుఁడు 'విప్రవర్య' అని సంబోధించుచున్నాఁడు. సంజయుఁడు సూతుఁడని భారతమున అన్నిచోట్ల చెప్పఁబడియున్నది. విప్రవర్య అనుటకు కారణము ఊహించవలసియున్నది. భగవద్గీతలో 1 అ-7 శ్లోకములో ''ద్విజోత్తమ'' అని పిలువబడియున్నాఁడు. గీతారహస్యములో లోకమాన్యతిలకు సంజయుని సూతుఁడనియే చెప్పిరి.

సూతులు-బ్రాహ్మణస్త్రీకిని క్షత్రియునికి బుట్టినవారు. కథకారకవృత్తిలోనుండి, కథలు పురాణములు చెప్పి శౌనకాది మహామునులే ఇంపునం కరగునట్లు ధర్మోపదేశము చేసినవారు.

ఓం

హరిహరనాథాయనమః

# తిక్కన భారతము:

# కర్ణపర్వము

## తృతీయాశ్వాసము

శ్రీమచ్చరణాంబుజ యుగ
శ్రీ మధుమూర్తి ప్రభావిలీన విమల చే
తోమత్తభృంగ, భక్తజ
నామృత సరసీస్వరూప, హరిహరనాథా! 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె:-నట్లు కర్ణుండు గౌంతేయాగ్రజు విడిచి, దుర్యోధన సంరక్షణంబునకుం జనుట విని, ధృతరాష్ట్రుండు దన మనంబున— 2

—♦ కర్ణుఁడు చేసిన పరాభవమునకు ధర్మరాజు లోలోన కుములుట ♦—

క. 'అనిలజునకుఁ జాలఁడె నా
తనయుఁడు? మోసంబుగాక ధర్మజుఁ డట్ల
బ్బినఁ బో నిచ్చుట రాధా
తనయునకుం బుద్ధియగునె? తప్పెం దప్పెన్!' 3

వ. అని వగచి, యుధిష్ఠిరుండు చనినపిదప నెత్తెఱంగున సంగరంబు సెల్లె'నని యడిగిన, సంజయుం డతని కి ట్లనియె:-నట్లు సని యా ధర్మతనయుండు రథావతరణంబు సేసి శిబిరంబు ప్రవేశించి, సెజ్జ నొడలు పేర్చి, నాటియున్నయమ్ములు పెఱికించుకొని, హృదయంబున నమ్మె యున్న పరిభవంబు పీడయొనర్ప, విషాద

వివర్ణవదనుండగుచుఁ గవలం గనుంగొని-'మీరు సమీరనందనుకడకుం జనుం' డని చెప్పె. నట మున్న నకులుం డొక్కయరదం బాయితంబు సేసికొనియుండుట, నయ్యిరువురుఁ ద్వరితగతిం జని, యంబుదంబుచందంబున గర్జిల్లుచుఁ గౌరవుల తోడం గయ్యంబు సేయుచున్న భీమసేనుఁ జేరం జని, యవష్టంభవిజృంభణం బునం బొలిచి. రంత నప్పాండవాగ్రజు తెఱంగేమియు నెఱుంగక నరుండు ద్రౌణి తోడ భరంపడి రణం బొనర్చుచుండి; ౪

క. నెఱి దగఁ దేజితమై, గమి
మెఱుఁగులడరు నారసమున మిక్కిలిపడి నే
ర్తెఱ మెఱయ నురము నొంచిన,
నుఱ కవ్విప్రుండు వైచె నుగ్రంపుగదన్. ౫

—♦ గురుపుత్రుఁడు అద్భుతవిక్రమంబున అర్జున కృష్ణుల నొంచుట ♦—

వ. వైచిన నవ్వీరుండు; ౬

చ. అది దునుమాడి, మేనఁ బదియమ్ములు గ్రమ్మఱఁ గ్రుచ్చి సూతు వె
ట్టిదమగు కోలఁ గూల్చినఁ, గడిందిమగంటిమి దాన రథ్యసం
పదయును నూలుకొల్పుకొని పార్థునిఁ గృష్ణుని నొంచె విస్మయం
బొదవఁగ దేవకోటికి ! నృపోత్తమ, యగ్గురుపుత్త్రుఁ డుగ్రుఁ డై ! ౭

వ. అట్లద్భుతవిక్రమంబున నశ్వత్థామ విజృంభించిన సహింపక; ౮

చ. హయములు పగ్గముల్ వెడఁదయమ్మున నుగ్గుగఁ గ్రిడి యేయుడున్,
రయమున వీడ్చెఁ దే రటు దురంబునకుం దొలఁగంగ; నెంతయున్
భరమున నీమొనల్ గలఁగి పాఱె, నరేశ్వర, వారిసైన్యసం
చయ మెగవన్ మహీతలము సంభృతకంపము గాఁగ నల్గడన్ ! ౯

ఉ. పాఱినఁ జూచి, కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ:-'నీ
కాఱియ మద్బలంబునకుఁ గాఁ దగునే వివిధాస్త్రసంపదన్
మీఱిన నీవె చూడఁగ ? నమేయపరాక్రమ, నీకుఁ బాండవు
ల్మాఱె తలఁప, నీదగుబలంబును జేవయుఁ జూపు మిత్తఱిన్ !' ౧౦

—♦ కర్ణుఁడు భార్గవాస్త్రము ప్రయోగించి సంక్షోభము గావించుట ♦—

వ. అనిన విని, యబ్బలుమగండు మదోద్రేకంబున మద్రపతి నాలోకించి యిట్లనియె:-

చ. 'కనుఁగొను! మిప్పు డేను మురమున్మరుఁ బార్థుని భీమసేనువిం
దుని మెద, నస్త్రసంపదయు దోర్విభవంబును శౌర్యసారము
న్జనులకు నెల్లఁ దెల్లముగ నా దగుపూనిక పార మెయ్దు, మే
దినిఁ గురునాథుఁ డొక్కఁడె యతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్. ౧౨

వ. 'రథరథ్యగతులు నెఱయ మెఱయ వలయుం జూమ్మి!' యని పలికి, *విజయంబు వీక్షించి గుణంబు సారించి 'గాండీవంబు నీ కెదురే?' యని యగ్గించి, యప్పుడు పై వయి మరవడించు పరసైనికులం జే యెత్తి యదల్చి, భార్గవాస్త్రంబు ప్రయోగించిన నమ్మహనీయసాధనంబు; ౧౩

శా. ఘోరానేకశరాకృతిం బరఁగి సంక్షోభంబు గావించుచుం,
దేరుల్ ద్రుంగఁగ, వారణంబులు ధరం ద్రెళ్ళంగ, నశ్వాలి ను

---

* కర్ణుని విల్లు 'విజయము', నరుని విల్లు గాండీవముతో సమాన మనుచున్నాఁడు, కాదు కర్ణుఁడు తన చాపమే ఎక్కుడనుచున్నాఁడు.

కారణము :- రెండును విశ్వకర్మ నిర్మితములు - తనకు పరశురాముడే దీనిని ఇచ్చినది. (కర్ణ-1-233) ఇప్పుడే భార్గవాస్త్రము ప్రయోగించుచున్నాఁడు; అనఁగా వీటికి గురుశాపము తగులలేదని తెలియుచున్నది; మగుడ బడసితిననిగదా కర్ణవాక్యము? అది ఘోరానేక శరాకృతితో సంక్షోభ మొనర్చుచున్నది. ధర్మజుఁడుగూడ, ముందు 29-వ పద్యములో అదే చెప్పుచున్నాఁడు.

అమరకోశము కర్ణుని విల్లుపేరు కాలపృష్ఠ మనుచున్నది. భారతమున ఈ పేరు ఉన్నట్లు లేదు. వేణీసంహారమున (4 - అంకమున ఒక వచనమున) ఈ పేరు చెప్పబడి యున్నది. భాసుడు పేర్కొనడు.

ఈ 13. వచనములో "విజయంబు వీక్షించి గుణంబు సారించి - గాండీవంబు నీకెదురే? యని యగ్గించి, యప్పుడు పైపయి నురవడించి" అని విజయమును అగ్గించుట సంస్కృత భారతమున (వావిళ్ల - ప్రతాపచంద్రరాయ) లేదు. ఈ రసవత్తర మహాప్రశంస తిక్కన స్వయంగా చేర్చినట్లున్నది. ప్రాణము లేనిదానిని ప్రాణమున్నదానిగా ఊహించువలుకు అలంకారమును ఇంగ్లీషులో Pathetic Fallacy అందురు.

సంస్కృతమున ఉన్న పాఠమిదియ :—

శ్లో. ఏవముక్త్వా మహారాజ సూతపుత్రః, ప్రతాపవాన్
ప్రగృహ్య 'విజయం' వీరో ధనుశ్శ్రేష్ఠం పురాతనమ్. (కర్ణ-66 అ-45 శ్లో)

చూడు. కర్ణ-2 అ. 232-235.

ఇచట కొన్నిప్రతులలో - తనకు [విజయంబొనర్చు కోదండంబు వీక్షించి - అని మూల విరుద్ధమును పేలవమును అయిన పాఠము గలదు.

గ్గై రక్తంబునఁ దేలఁగా, భటచయం బత్యంత చూర్ణీకృతా
కారత్వంబు భజింపఁ, గేళి నలిపెం గౌంతేయసైన్యంబునన్‌। ౧౪

వ. ఇవ్విధంబున భార్గవాస్త్రబాధితంబై యప్పాండవబలంబు వెఱచఱచి మరల పఱచిన, మనమూఁకలు వెన్నడిం దఱుమ, నా సూతనందనుం డగ్లోచి యార్చి యంటం దాఁకి విశిఖంబులు విగిడించుచుఁ, బొగ లేనిమంట పగిదిఁ బ్రదీప్తుండయినఁ; దదుత్సాహంబున కోటువడి యా సైన్యంబున జనంబులు హాహాకారంబు లెసఁగ దీనదశం బొంది, ముకుంద పురందరనందనులం బేర్కొని యాక్రందించి. రట్టి యెడ; ౧౫

—♦ ఉగ్రమూర్తియై తేరి చూడరాని కర్ణునికి అర్జునుఁడు జంకి వైదొలఁగుట ♦—

ఉ. గాండివి శౌరి కిట్టు లనుఁ:–'గర్ణునిఁ జూచితె। యేకవిక్రమో
ద్దండతఁ దెంపు సేసి పటుదర్పము సూపుచుఁ, దేఱి చూడ రా
కుండెడునట్లుగా నలుక నుగ్రత మండెడు। నిప్డు నేర్పుమై
నుండక యీనునం దొడరి, యోటమి దెచ్చికొనంగ నేటికిన్‌? ౧౬

క. 'వచ్చిన మఱి గెల్వ గొనఁగ
వచ్చునె? తనయొడలు గలుగ వైరుల గెలువఁగ
వచ్చుం దఱి వచ్చిన; నది
మెచ్చు జయార్థులకు మరుదమిత్ర ధ్వంసీ. ౧౭

తే. 'పట్టపగలింటి సూర్యునిపగిదిఁ గర్ణుఁ,
డుగ్రమూర్తియై వెలుఁగుచు నున్నవాఁడు।
మనరథం బిప్డు మాధవ, మరలనిమ్ము,
బ్రదికియుండిన శుభములు వడయవచ్చు.'* ౧౮

---

* ఈ పద్యమున, అర్జునుఁడు కర్ణునికి వెఱచి పలాయితుఁడైనట్లు అన్వయమగుచుండఁగా, సి. పి. బ్రౌనుగారు అర్జునునికి న్యూనత కలుగకుండునట్లుగా ఇట్లు అన్వయించుచున్నారు:— ఈ సందర్భమున వేర్వేరు ప్రతులందు వేర్వేరువిధములుగ నున్నది. చిత్రశాలాప్రతిలో అర్జునుని బెట్టు చెడకుండునట్లు ఇట్లున్నది. (కర్ణ ప-64-అధ్యాయము)-

అర్జునుఁడు కృష్ణునితో నిట్లనెను – ఓ వాసుదేవా, కర్ణుఁడు దుస్సహ పరాక్రమోపేతుఁడై విజృంభించుచున్నాఁడు. బ్రతికియున్నచో పురుషుఁడు జయాపజయములను పొందఁగలఁడు. మరణించినవానికి ఇక జయ మేముండును?' ఈ మాటలను విని, ప్రాప్తకాలజ్ఞుఁడైన శ్రీకృష్ణుఁ డిట్లు

వ. అనిన విని, వాసుదేవుండు వడముడిదిక్కు విలోకించునెడ, నతండు కర్ణునకు మార్కొని పరాక్రమించి పాండవసైన్యంబు నిలువరించి, ధృష్టద్యుమ్న శిఖండి సాత్యకి ద్రౌపదేయాదిరథికు లారథికునిం దలపడఁ, దానును గౌరవులపయిం గడంగె. నట్లమ్మేటిమగని యాటోపం బప్పటికి వైరినివారణంబునకుఁ జాలి యునికి యనుసంధించి, రాధేయుం డొరుఁ డయ్యం బోరుటయుఁ, బార్థుండు 'దప్పి దీర్చుకొనుటయు మేల కాక' యని యూహించి, యమ్మురారి దే రక్కురు సేనాధిపతి సంగ్రామంబు సేయుచక్కటి కెడ గలుగం గొని చని, యన్నరు నితో:- 'మన మశ్వత్థామతోడి పెనంకువం జిక్కినసమయంబున ధర్మనందనుండు సూతనందనున కగ్గమై యుండె; నాతం డతనియమ్ముల నొచ్చెనో యని తలం చెద. నయ్యవనీశు నవస్థ యెఱింగి, మఱి నీ వయ్యంగరాజు నమయింప గల వాఁడ' వనుటయు. ౧౯

ఆ. అన్న నొచ్చె నన్న యమ్మాట చిత్తంబు
గలఁప, విజబలంబుఁ గలయఁ జూచి,
యన్నరేంద్రుఁ గాన కనిలనందను కడ
కేఁగి యడిగె, నతఁడు నిట్లు లనియె :- ౨౦

ఉ. 'కౌరవకోటి నేఁ బొదివి క్రందుగఁ గయ్యము సేయఁ, గర్ణుఁ డా
ఘోరరణంబునం గదిసి ఘోరశరంబులు మేన నింప, నొ
వ్వారుటయుం దొలంగె నతఁ, డాహవరంగమునందు లేఁడు; ని
వారయ మింత కెట్లగునొ ? యచ్యుతుఁ డుండఁగ నట్టులే లగున్ ?' ౨౧

వ. అనిన నివ్వచ్చుండు వృకోదరున కిట్లనియె :- ౨౨

క. 'క్రూరములగు సూతసుతుని
నారాచము లొడలఁ బెక్కునాటినఁ, జేత
స్స్వారము సెడి శిబిరమునకు
నారా జేఁగెనొకొ; యకట ! యటుగా నోపున్. ౨౩

---

...లికెను.—'ధర్మరాజు కర్ణునిచేత తీవ్రప్రహారములకు గురియైనాడు; మనము చూచి రావలెను' ని. అర్జునుడు దీనికి అంగీకరించెను. ఇట్లు అర్జునుఁడు భయపడుట పూచిపెట్టబడినది.

దీనికి భిన్నమైన కథనరీతి కుంభకోణప్రతియందు గాన్పించుచున్నది. ఇందు అర్జునుడే స్వయముగా కృష్ణునితో యుద్ధాపనయనమును ఉపన్యసించుచున్నాడు. తిక్కన ఈ పాఠమునే గ్రహించినాడు.

క. 'ద్రోణాచార్యుని యుగ్రపు
బాణంబుల కోర్చి యతఁడు పడునంతకు న
క్షీణధృతి నసమ సమర
క్షోణిన్నిలిచి, కర్ణుచేతఁ గోల్పోయెఁ గదే!' ౨౪

వ. అని పలికి, యనిలనందను నాలోకించి యన్నరుం:- 'డా నృపాలుతెఱం గెఱుంగుటకు నీ వరుగు; మేము సేనమొగంబున నిలిచెద' మనిన విని, యవ్వీరుం డవ్విధంపు నడవడి నీకుఁ జనుం గాని, జనంబులు న న్నయ్యనిం బోరి కోహటించిపోయె నని యాడుదు' రని చెప్పిన, నప్పార్థుండు— ౨౫

ఆ. 'సరభసముగ నన్ను సంశప్తకులు వీరె!
తొడరుచున్నవారు, దొలఁగి నాకు
నరుగ నెట్లు వచ్చు?' నని చూపె నతనికి,
నపుడు గడఁగి వచ్చు నబ్బలముల. ౨౬

క. చూపుటయు, నగ్గలం బగు
నేపునఁ గిమ్మీరవైరి-'యేన కలఁచెదఁ జా
రూపు సెడఁగ నిమ్మొనలను,
భూపతి నరయంగ నీవ పొమ్మ'నియె నృపా! ౨౭

— రాధేయుని చంపివచ్చిరనుకొని ధర్మజుఁడు కృష్ణార్జునులను కొనియాడుట —

వ. అనిన, నట్ల కాక యని, యర్జునుం డచ్యుతు నాలోకించి:- 'యా మహీపాలుం గనునంతకు నామనంబు గలంగెడు; రథంబు రయంబునం బోవ నిమ్మని పలుకుటయు, నతండు భీముం జూచి:- 'యేము మీయన్న సేమం బరయుట వలయుపని గావునం జనియెదము; నీవు కురుసైన్యంబుల జయించుట యరుదె? గెలుపు గొమ్మ' మని యగ్గించుతెఱంగున దీవన లిచ్చి, తురంగమంబులం ద్వరితగతి నడపె. నివ్విధంబున మాధవ ధనంజయులు సమరంబునకు సమీరనందనుం జాలించి, శిబిరంబున కరిగి ధర్మనందను మందిరంబు ప్రవేశించి, యేకతంబ శయ్యాతలంబున నున్న యన్నరపతిం గని, యాతండు గుశలి యయి యునికికి ముదంబు నొందుచుం, దదీయచరణంబులకుఁ బ్రణతులయి. రాధరణీనాథుండు వారలు రాధేయు వధించి వచ్చిరకాఁ దలంచి డెందం బలర, మందస్మితంబుతో నభినందించి, వారలవదనంబులు వీక్షించి యట్లనియె:— ౨౮

మ. *'సుర లైనం జలమెత్తి కర్ణుని రణక్షోణిన్ జయింపంగ నే
ర్తురె? యవ్వీరుఁడు జామదగ్న్యకలితాస్త్రుం; డిద్ధతేజంబునన్
దొర సప్తార్చికి, లావునం బవనుతోఁ దుల్యుండు; కల్యుండు సం
గర సంక్రీడలయందుఁ బేర్కొనఁ దగున్ గాంభీర్యధైర్యంబులన్;

తే. 'అట్టిబల్లిదు నని( దెగటార్చి, మీర
లేమియును గాక వచ్చితి' రింతసంత
సంబు దొరకొనునే నామనంబు చింత
వంత యెల్లను జెడ; నరవర్యులార! ౩౦

వ. 'అతనికి నాకునుం గలిగె నాహవ మింతకు ముందు, రందుఁ బా
ర్షతుఁడును సత్యకాత్మజుఁడు శాంతనవాంతకతుండు ద్రౌపదీ
సుతులును జూడఁగా, నతఁడు సూత హయ ధ్వజపాతనంబు సే
సి, తనువు దీవ్ర కాండములఁ జెండఁగ, నే వెగడందితిం గడున్. ౩౧

వ. 'అప్పుడు దుర్యోధన ప్రభృతి ధార్తరాష్ట్రులకు భీమసేనుప్రభావంబున బ్రదుకరాని
యంత పుట్టిన, నన్నువిడిచి యాతం డట వోవ; నే నిట వచ్చితి'నని చెప్పి
వెండియు గాండీవి నుద్దేశించి:- ౩౨

సీ. 'పదుమూఁడువర్షముల్ పగలును రేలును
గర్ణుదర్పం బెట్లు గడతు నొక్కొ
యను చింతఁ జేసి, యాహారనిద్రలు లేక
పరితాప మందితిఁ; బఱవుఁజేయ
విప్రులు పట్టరా వెఱ నొచ్చి యొదిఁగెడు
గవయంబుచాడ్పునఁ, గర్ణభీతి
నల్లల నుడుకుచు నుండుదుఁ; గర్ణుండు
విడువక మోమున వ్రేలు నాకు;

తే. సుతనదీసుతు చేతను గురునిచేతఁ
బడని పరిభవమున వాఁడు పఱిచె నన్ను;
నంతయును నీఁగఁ గాంచి నీయట్టియనుజు
వలనఁ దేజంబు వడసితి నలఘుచరిత! ౩౩

* ధర్మజుఁడు కర్ణుని ఎత్తిపెట్టి, అంతటివానిని జయించిన అర్జునుని పొగడుట ఒక సొంపైన కవిత్వపుతీరు; సంగతితెలిసికొని కోపముతో పొంగుట రసమును ఒలికించుచున్నది.

చ. 'వెరవును లావు దివ్యశరవీర్యము శౌర్యముఁగల్గు కర్ణు నె
ప్పురుసునఁ జంపి? తీ వతని బంధులు మిత్త్రులు బుత్త్రులు౯ సము
ద్ధురబలు లాజికేలి నిరతుల్ ధృతరాష్ట్రునిపుత్త్రు లెల్ల ద
త్పరిజను లెట్టు లట్టు లనిఁ బ్రాణము లిత్తురు వాని కడ్డమై. ౩౪

చ. 'అరు దిది! నీవు నొవ్వక మహాబలుఁ గర్ణు వధించి, తాతఁ ద
క్కురుపతి సంతసింప- నరుఁ గూల్చెద సంగరభూమి నేన యొ
క్కరుఁడను వీఁకఁ దాఁకి- యను గర్వపుమాట సనంగ నీక, నేఁ
టి రణములోన నిట్లు ప్రకటింతె భవద్భుజవీర్యశౌర్యముల్! ౩౫

చ. 'పలికిన నేమి? బీరములు పల్కుట సేవకనీతి! యాసభం
బలుకునె యట్లు జూదపునెపంబున ద్రౌపది? నింతకాల మ
ప్పలుకు లలంచు చుండె. మదిఁ బాయవు గీఱినయమ్ము లట్ల, దో
ర్బలదృఢలీల నిప్పు డవి వాపితి, తీర్చి తలంత యంతయును! ౩౬

క. 'అతిగర్వ సమున్నత మగు
నతనిశిరము వానివార లందఱు బాష్పో
ద్గతితోఁ జూడఁగ సమర
క్షితి డొల్లెనె! విజయ, నీదు శితభల్లమునన్. ౩౭

క. 'ఈరసమునఁ గదిసి శరా
సారము పైఁగురియ నీవు సక్రోధుఁడవై,
పేరురమున వెస నాటిన
తోరంబగు నారసమునఁ ద్రుళ్ళి కెడసెనే?' ౩౮

వ. అనిన ధర్మనందనునకుఁ బురందరనందనుం డిట్లనుః-'నేను సంశప్తకులతోఁ బెనంగుచుండ, ననేకరథసమూహ సమేతుండయి యశ్వత్థామ వచ్చి, నన్నుం బొదివిన. ౩౯

క. 'ఏనూఱురథంబులు వెసఁ
బీనుఁగుపెంటలుగఁ జేసి పేర్చినఁ, గుపితుం
డై నిప్పులురులు కన్నుల
తో నక్కోదండగురుసుతుఁడు నామీఁదన్. ౪౦

క. 'ఉఱక యడరి మెఱసిన యే
త్తెఱ నెఱయఁగ గుడుసువడి, యతిస్ఫురితరుచిన్
మెఱపి, ధను వనల వలయము
తెఱఁగునఁ బక్షర్గతి ప్రతిహతిం జేసెన్. ౪౧

క. *'స్వాతిగతుండగు శుక్రుం
డేతెఱఁగునఁ బరఁగఁ జేయు నెనకపు వర్షం,
బాతెఱఁగున సాయక
వర్షాతిశయం బావహించె నతఁడు నరేంద్రా! ౪౨

క. 'తన యరదం బెద్దెసఁ జూ
చిన మొగమునఁ ద్రేల, దీప్తశిత విశిఖములన్
ననుఁ గృష్ణుం గప్పిన, నే
ననఘా, కెల వరయఁజాల నైతి వెగడునన్. ౪౩

—♦ సూతసూను తలఁ ద్రుంతునని ఇంద్రసూనుఁడు బాసచేయుట ♦—

క. 'పదపడి, యొకభంగి నతని
మద మడఁచినఁ దొలఁగఁ బాఱె మానము దూలం;
దదనంతరంబ నిన్ను
న్వెదకితి నరనాథ, మన యనీకములోనన్. ౪౪

క. 'ఆలోఁ గర్ణునిచేతం
దూలని చతురంగములను దొరలను ధరణీ
పాల, మనమొనల గానను
ద్రాలినదర్పమున మెఱయు వడముడిఁ దక్కన్. ౪౫

క. 'ఆతనిచే నీ విక్కడ
కేతెంచుట వింటి, సేమ మెఱుఁగు తలఁపుమై
నేతెంచితి; నవ్వీరుని
చేతులలా వస్మదీయ సేన నిలుపుటన్. ౪౬

* స్వాతినక్షత్రములో శుక్రుఁడు ప్రవేశించినప్పుడు స్వస్థానమగు తులారాశిని పొందుచున్నాడు. స్వక్షేత్రస్థితి బలము. స్వాతికార్తిలో వాన ఎక్కువ.

క. 'మనుజేంద్ర, కుశలివగు వినుఁ
గని, నామన మూఱడిల్లెఁ ; గావున మగుడం
జనియెదఁ, గొనియెద రాధా
తనయుని తల, చలము నెఱయ దర్పము మెఱయన్. ౪౭

క. 'నను, జూడుము వేడుకకుం
జనుదెంచి ; భవద్బలంబు సంతస మందం
దునిమెదఁ గర్ణుని; దుర్యో
ధను కోర్కియు నీమనంబు తాపముఁ దీఱన్. ౪౮

మ. 'ధనురాచార్యుని చావు సూచి, తగ రాధానందనుం డాసుయో
ధనునిం దమ్ముల వారిసైన్యములనుం దాఁ గాచువాఁడై రణం
బునకుం బూనుట, నింత సేయ వలదే ? భూపాల, యేపారి మం
డునె యాఱుం గల దీప ; మల్లతఁడు మండుం గాక, యే నార్చెదన్. ౪౯

చ. 'నరవర, పంపు ; మేను బ్రథనంబున కేఁగిన సూతసూనుఁ డు
ద్ధురత నెదిర్చినేనిఁ దల ద్రుంపక తక్కిన, విప్రులోఁద వి
ప్పురుసున నిచ్చువాఁడ'నని పల్కి, పదంపడి:-'యాక తక్కు దు
ష్పురుషునిఁ జూచుమాడ్కి నను జూడుఁడు నీవును వాసుదేవుఁడున్. ౫౦

వ. 'భీమసేనునకు సేనాముఖంబునఁ దాన నిలుచుట భరం బయి యుండు. నేనునుం దడయుట గర్జంబు గాదు. పోయెద'ననిన విని, యమ్మనుజపతి గర్ణుండు గుశలియై యుండుట యెఱింగి, యతనిబాణంబుల నొచ్చినవాఁ డగుట నలుక గదిరి యక్కిరీటితో ని ట్లనియె:- ౫౧

—♦ ధర్మరాజు కర్ణుఁడు బ్రదికియున్నాఁడని ఎఱిఁగి
అర్జునునిని సి గాండీవమును దూఱుట ♦—

క. 'అనిలోఁ దెరలుట దొలఁగుట
యనునివి నను గాక, నొచ్చియైనను గల నె
ల్లను వెడలఁ జనునె ? యే వ
ట్లును గా కిట వచ్చుటం జాలుకనైతిఁ గడున్. ౫౨

క. 'విను ; కర్ణున కే నోడితి
నన నేటికి ? నీవు నోడి తనిలజ మాద్రీ

తనయులు మున్నె యోడిరి,
మనతోఁ గూడంగఁ గంసమర్దనుఁ డోడెన్; ౨౩

క. 'కావున మన మిఁక నవికిం
బోవం బని లేదు; విపినభూమికిఁ జని య
చ్చో వెఱపు దక్కి తపసుల
మై, విచ్చలవిడిఁ జరింత మందఱముఁ దగన్: ౨౪

క. 'కాదేని, బిరుదు లాడక
సాదులమై వినయమొప్పఁ జని, కురునాథుం
డేది పనిచినను జేసి, ద
యాదృష్టి నతండు సూచున ట్లుండఁ దగున్.' ౨౫

వ. అని కెంజాయ రంజిల్లుకన్నుల నన్నరు నాలోకించి:- ౨౬

ఉ. 'నీతెఱఁ గిట్టిదేని? రణనిష్ఠకుఁ బూనక కార్యవాది వై
ద్వైతవనంబునంద- సముదగ్ర భుజాబలదుర్జయుండు రా
ధాతనయుండు, వాని నని దాఁక నశక్యము నాకు-నన్న, నే
నీతెరు వేల వత్తు? మహి యేల నశక్తుఁడు వాంఛ సేయునే? ౨౭

తే. 'అని వధించెదఁ గర్ణు నే నని ప్రతిజ్ఞ
సేసి, యిటు దెచ్చి నన్నిట్లు సేసి, యింత
కెట్లు నేర్చితి? పొడవుగా నెత్తి నేల
వైవ నోర్చితి నను బగవారి నడుమ. ౨౮

ఉ. 'పంకజనాభుఁడున్ వినఁగఁ బల్కిన యప్పలు కిమ్మెయిం దుదిన్
బొంకుగఁజేసి తట్టి నినుఁ బుట్టినయప్పు నుతించె -బోరికిన్
శంక గొనండు, గెల్చుఁ గురుసంఘము నీతఁడు పుణ్యుఁ డన్నయా
బొంకరి దివ్యవాణియుఁ దపోధనులున్ మము ని ట్లలంతు రే! ౨౯

క. 'విను: మప్పలుకులు సాటిగఁ
గొని దుర్యోధనునితోడఁ గొంటిని బగ ము
న్ను; నిజంబుగ నెఱుఁగను నీఁ
డని రాధేయునకు వెఱచునని యే నిన్నున్. ౩౦

సీ. 'దేవత లిచ్చిన తేరు నశ్వంబులుఁ
గపికేతనంబును గలవు, దైవి
కంబు చేనున్నది, గాండీవ మనఁ దాటి
యంతవిల్లది గాక, హరి రథంబు
గడపెడు నటె! పరికర మిట్టిదై యుండ
నెట్లు కర్ణున కోడి యట్టు వలియఁ
బాఱితెంచితి నీవు? ఖండనంబునఁ గర్ణుఁ
గని పాఱు దని సుయోధనుఁడు సెప్పె!

తే. నది నిజంబుగఁ గొనక బేలైతి; నాదు
బేలతనమునఁ గాదె పాంచాల మాత్స్య
పాండ్యులాదిగఁ గలిగిన బంధుమిత్త్ర
జనులు దెగటాఱి రప్రయోజనము గాఁగ.' ౨౧

వ. అని పలికి, కృష్ణునాననం బాలోకించి:-'కర్ణు విగ్రహించుట యశక్యం బయ్యె. సుయోధనాది కౌరవులు గనుంగొన వానిచేతం బరిభవింపఁబడి యేను జీవంబుతో నునికిం గడచినకష్టంబునుం గలదే? యది యట్లుండె. నేను జావు దప్పివచ్చుట వడముడి కతంబునం గలిగె; నతం డొక్కరుండును బ్రాణంబులు దాఁపక పర బలంబులు బడలుపడం బోరుచున్నవాఁడు.' ౨౨

క. అని, పార్థుఁ జూచి యతఁ డి
ట్లను:-'నేఁ డభిమన్యుఁ డొండె హైడింబుం డొం
డెను గలిగిన ని ట్లగునే?
విను! మును చేసినది యనుభవింపఁగ వలదే? ౨౩

ఆ. 'నిన్నుఁ దృణముఁ జేసి, నన్నాదురాత్ముండు
బంధుహీనుఁబోలెఁ బఱుప, నెడరు
దోఁచి నప్పు డొదవి తొలగించువాఁ డిఁ గా
కన్యు నేల బంధుఁ డంద్రుజనులు? ౨౪

చ. 'హరి గలుగంగ నేటికి? భయంబున వచ్చితి; నీదు గాండివం
బెరవుగ నిచ్చి, నీవు నొగ లెక్కి, హరిన్ రథిఁ జేయఁ గన్న ని
ష్ఠురభుజవిక్రమోగ్రుఁ డగు సూతతనూభవుఁ దత్ప్రహారములం
బొరిగొనఁడే సుయోధనునిపోఁడిమి దూలఁగ నొక్కమాత్రలోన్. ౨౫

ఆ. గొంతి కడుపునందుఁ గొడుకుమూలై నీవు
దోఁపకుండ వైతి, శోభినట్టి
పిండ మెడలి యైనఁ బిదప దిగంబడ
దయ్యె; నింత పుట్టు దట్టు లైన.' ౩౬

—♦ గాండీవమును దూఱిన అన్న తలనఱుక కిరీటి వాలుదూయుట ♦—

సీ. అనినఁ, గృపాణంబు గొని సవ్యసాచి య
వ్విభు వ్రేయఁదలఁచిన; విష్ణుఁ డెఱిఁగి :-
'వాలు గేల నమర్ప వలసినపనియేమి?
కౌరవు లిచ్చోట లేరు; మనము
ధరణీశ్వరునిపేమ మరయంగ వచ్చితి,
మీతని కుశల మి ట్లేర్పడంగఁ
గంటిమి; సంతోషకాలంబు గా కిది
క్రోధకాలమె? వధ్యకోటి యిచట
ఆ. నేది గాఁగ నలిగి తీ'వని పలికిన,
రూక్షభంగియగు కటాక్షదృష్టి
యానరేంద్రుమీఁద నడరంగ నర్జునుఁ
డమ్మురారి కిట్టు లనియె నధిప:- ౩౭

క. 'విను; మొరులకు గాండీవ మి
మ్మని, న న్నెవ్వండు వలికె నతనిశిరము గ్ర
క్కున బగుల వ్రేయుటకుఁ జే
సినవాఁడఁ బ్రతిజ్ఞ నాదుచిత్తములోనన్. ౩౮

తే. 'ఇట్టికష్టపుఁగేలికై యిట్లు సేయఁ
బ్రతిన వట్టుట దగదె? యిప్పలుకు నీవు
వినఁగ నితఁ డాడ, నిమ్మహీవిభుఁడు ధర్మ
వంతుఁ డగుఁగాక చంపనవలయుఁ గృష్ణ. ౩౯

వ. 'చంపి పాలితప్రతిజ్ఞుండనైన నాకు నసత్యంబు రాకుండఁ బరిహరించెద. దీనికి నీ వేమి చెప్పెదవు, చెప్పుము? నీవు జగత్కృత్యసాకల్యవేదివి నీ చెప్పినట్లు చేయంగలవాఁడ' ననుటయు, నచ్యుతుండు 'పో పొమ్మెక్కడివాఁడ'వని యదల్చి వెండియు నిట్లనియె:- ౪౦

— కృష్ణుఁడు అర్జునుని వృథాప్రజ్ఞనుండి విరమింపఁ జేయుట —

ఆ. 'నీకు వృద్ధసేవ లేకున్కి యెఱుఁగంగ
నయ్యె రిత్త యిట్టు లడిచిపడుటఁ
బట్టి; ధర్మవిధి విభాగజ్ఞులైన వా
రేల చేయఁ జొత్తు రిట్టిదాని? ౭౧

క. 'చేయంగ వలయువానిం
జేయుట, యిట్టివియె కొన్ని చేయకునికి, ధ
ర్మాయత్తచిత్తుఁడై నా
నాయోగ్యస్థలము లెఱిఁగి నడవఁగ వలదే! ౭౨

క. 'సత్యంబు నహింసయు నను
నత్యుత్తమధర్మయుగళ మందు, నహింసకా
సత్యము గాచుట ధర్మ, మ
సత్యమున నహింసఁ గావఁ జను నండ్రు బుధుల్. ౭౩

ఆ. 'కర్మసూక్ష్మభంగి గానక యిమ్మెయి
సత్యరక్షణంబు సలుపఁబోంటె,
భ్రాతధర్మపరుఁడు, రా జిమ్మహాత్ముఁ జం
పఁగఁ దలఁచుట ధర్మపథము గాదు. ౭౪

క. 'విను; పిన్ననాఁడు నీ వీ
యనుచిత మగువ్రతము వట్టి; తది గాకయు, బె
ట్టనృతము సూనృతమును నీ
కనియెడు చందంబు బుధులు గయికొనరెందున్. ౭౫

వ. 'అది యె ట్లంటేని— ౭౬

ఆ. 'ప్రాణహాని వచ్చువట్టువ, సర్వధ
నాపహారవేళయందు నడపు
సత్య మనృత మం, డ్రసత్యంబు సూనృత
మని పరిగ్రహింతు రార్యజనులు. ౭౭

—♦ సత్యవిభాగ విధిజ్ఞుఁడుగాని విప్రుఁడు ♦—

వ. 'విను: పెద్దయు వినికి లేనివాఁడు కౌశికుండను నొక్కవిప్రుం, డొక్క విశిష్ట గ్రామంబున కనతిదూరంబున సరిత్సంగమ పుణ్యక్షేత్రంబున వసియించి, సత్యంబ పలుకువాఁడ నని వ్రతంబు వట్టి, సత్యవాది యనం బ్రసిద్ధుండయి తపంబు సేయుచుండ; నొక్కనాఁడు, ముచ్చులంగని వెఱచఱచి పఱతెంచిన జనులు గొందఱయ్యాశ్రమంబుచేరువం బొదలఁదూఱి; రంత వెనుతగిలివచ్చు ముచ్చు లత్తపోధనునికడ కేతెంచి-యిప్పు డిట వచ్చినవార లెట వోయి-రని యడిగిన, నతండు సత్యవిభాగ విధిజ్ఞుండు గామింజేసి, తన కసత్యంబు వాటిల్లు ననుశంకనీ గుల్మలతా గహనంబు సొచ్చి-రని చూపి చెప్పిన, న త్తెక్కలికాఱు వారలం జంపి ధనమ్ము గొని; రమ్ముని తద్వచనదోషంబున నరకప్రాప్తుం డయ్యెనను నితిహాసంబు విందుము. హింసాకరంబగు సత్యంబు ధర్మంబుగాదు; తొలుత వినిన దానినిపట్టి మూఢుండు పెద్దల నడిగి తెలిసికొన వర్తించి దుర్గతిం బొందు. వింత వట్టు విచారించి యజాతశత్రుండు వధ్యుం డవుం, గాఁడని నిశ్చయింపు' మనుటయు, నర్జునుం డి ట్లనియె:- ౭౮

తే. 'తల్లిదండ్రులమాడ్కి హితంబుసెప్పి
నన్ను ననుచితకృత్యంబునకుఁ దొలంగ
ద్రోచితివి; లోకమున నీకు గోచరంబు
గాని ధర్మ విబోధంబు గలదె కృష్ణ? ౭౯

క. 'జనములు వృథాప్రతిజ్ఞుం
డని నను నిందింప కుండ, నగ్రజుఁడు సుఖం
బునికియుఁ గలిగెడునట్లుగ
ననుగ్రహముఁ జేసి, చేయునది పనుపు దగన్. ౮౦

వ. అనిన నతం డతని కి ట్లనియె:- ౮౧

—♦ అర్జునుఁడు అన్ననుదూఱి సమాహితుఁడగుట ♦—

చ. 'అతిశిత కర్ణ బాణహతి నంగము నొచ్చినదాన నల్గి, యి
ప్పతి విను నొవ్వఁ బల్కు టిది ప్రాభవ; మింతియె కాక, నీయెడన్
మతిఁ బటుకోపముం గలదె? మారుతసూనుఁడు నీవుఁ దమ్ములుం
జతురవినీతి నీతవివశంబునఁ గాదె చరింతు రెప్పుడున్? ౮౨

క. 'కావున బ్రభుత్వసంపద
నీవిభుఁ డాడినది యెల్ల నెగ్గుగొనక, నా
చే వినుము: నీదు ప్రతినకు
నేవిధి సేయ నగు దాని నేర్పడ ననఘా? ౨౩

క. 'నీ విట్టివాఁడ వని ధర
జీవిభునిం బలుకు మదియ నీచంపుట సం
భావించి, పిదపఁ బ్రణతుఁడ
వై వినయము సేయ చిత్తమలర నతనికిన్. ౨౪

'అట్లయిన ననత్యదోషంబునకు గురువధపాతకంబునకుం దొలగి, సమాహితుండ వగుదు; తదనంతరంబ కర్ణుని సమయింపఁ జనుటకు నమ్మనుజపతి యనుమతి వడయుద'మనుటయు, నప్పలుకుల కభినందించి, పురందరనందనుండు ధర్మనందను నుద్దేశించి:— ౨౫

చ. 'కనదస్త్రంబుల నుజ్జ్వలోద్భట గదాఘాతంబులం గాలఁ గే
లను విద్విట్చతురంగ సంఘములు గూలం, గేలి సల్పంగఁ జా
లిన యాభీముఁడు వల్కఁగాక నను; దోర్లీలాసమగ్రుండవై
యవిలో నిల్వఁగ లేని నీ విటుల కీ డాడంగ నర్హుండవే? ౨౬

క. 'న న్నెఱిఁగి యెఱిఁగి యిట్లనఁ
జన్నె? నీజిహ్వ పెక్కుశకలము లై పో
కున్నది యేలొకొ? రణమున
నెన్నఁడు నీ వేమి సేసి తింత యనుటకున్? ౨౭

క. 'నకులుఁడు సహదేవుండును
బ్రకట భుజాస్ఫురణమున నరాతిబలము నే
లకుఁ గోలకుఁ దెత్తురు; నో
రికి వచ్చినయట్టు లాడిరే యిబ్భంగిన్? ౨౮

సీ. 'నీవు జూదం బాడఁగా వైరబంధంబు
కౌరవకోటితోఁ గలిగె; మనకు
రాజ్యనాశంబు నరణ్యవాసంబును
దాస్యదైన్యంబు నత్యంతదుఃఖ

ములుఁ దెచ్చికొంటి; సిగ్గొలయదు నీమనం
బున నించుకేనియు; నవికిఁ జాల
కున్న వానికిఁ దాల్మి యొప్పుగుఁ గాక ప్ర
ల్లదములు వలికిన లాఘవంబు

తే. చెందు; ము న్నేమి సేసినఁ జేసి, యింక
నైన దుర్బుద్ధితనములు మాని, తగిన
పౌరుషము లేమి సేయఁగ నూరకుండు;
మిడుమ వడువారు సైఁతురే యివ్విధంబు?' ౭౯

— అగ్రజుని తెగడినదానికి ప్రాయశ్చిత్తముగా అర్జునుఁడు తన్ను దా పొగడుకొనుట —

వ. అని యగ్రజా నప్రియంబులు వలికి, యంతరంగంబు సంతాపంబు నొంద నిట్టూర్పు విగిడించి, యంతకుము న్నొఱఁబెట్టిన వాలు వెలికినం గనుంగొని, పద్మనాభుండు-'గ్రమ్మఱ నిది యేమి?' యని యడిగిన, నతం-'డే విన్నరనాథు నొవ్వనాడిన వలుకులకుఁ బ్రాయశ్చిత్తంబు దలద్రెంచుకొనుటయకా నిశ్చయించితి' ననుటయు, నమ్మహాత్ముఁ:-'డాత్మప్రశంస సేయు, మది మరణంబని పెద్దలు సెప్పుదు' రనుటయు, 'నీ చెప్పినట్ల చేయ కునికికిం గడచిన యధర్మంబును గలదె? యిట్లు సేయువాఁడన కాక' యని, యా ధనంజయుండు ధనుర్ధరుండై ధర్మనందనున కిట్లనియె: ౮౦

ఆ. 'హరుఁడు దక్కఁ జాపధరుఁ డొరుఁ డెన నాకు
ద్రిభువనముల లేఁడు; దిశలు గెలిచి
తెచ్చి నీకుఁ బ్రీతి నిచ్చితిఁ, బెనుపారు
ధనము రాజసూయదక్షిణలకు; ౮౧

వ. 'దీప్తప్రతాపంబగు సంశప్తకసంచయంబు నడఁగించి, కించిదవశిష్టంబుగా, నష్టంబు సేసితి; గురుసేన నాచేతం గూలి యెట్లున్నదియో యటు సూడు;' మని పలికి, మొగంబు బిగువుడిపికొని, సవినయంగా దండప్రణామంబు సేసి నిలిచి, చేతులు మొగిడ్చి యజాతశత్రున కప్పురుషహూతపుత్త్రుం డిట్లనియె:- ౮౨

క. 'నను నుగ్రపాదదృష్టిం
గనుఁగొను; మే నిపుడు కొన్ని కాఱు లఱచితిఁ

మనుజేంద్ర, వానిఁ బెడచెవు
లను బెట్టుము వేఱుగాఁ దలంపక దయతోన్. ౯౩

తే. 'వినుము సత్యంబ పలికెదఁ: దనువుఁ బ్రాణ
ములును నీసొమ్ముగా మదిఁ దలఁతు నేను;
నాదువృత్తంబు భవ దధీనం బనంగ
నేల పనుపవు నను భీముపాలి కధిప: ౯౪

క. 'ఓపి యతని రణభారము
వాపెదఁ, గౌరవ్యసేన బడలువఱచి సా
టోపతఁ గర్ణునిఁ దునిమెద,
మాపెదఁ గురురాజు దురభిమానము బలమున్. ౯౫

వ. 'ఎల్లభంగుల నేఁడు రాధం బుత్త్రరహితం జేసెదఁ; గావేని గౌంతియైన నట్టిద యగుం గాక:' ౯౬

—♦ వనవాస గమనోన్ముఖుఁడైన ధర్మజాని కమలనాభుఁడు వారించుట ♦—

వ. అన విని, యమ్మహీరమణుఁ డాతని కిట్లను:—'మీకు నాకతం
బున బహుదుఃఖముల్ గలిగె; భూరికులంబున క్రప్రియం బొన
ర్చిన యవినీతుఁ బాపవరు ద్రేయఁ దగుం దల ద్రెవ్వ; నీమనం
బునఁ గృప పుట్టి కాచినను, బోయెద విప్పుడ యేను గానకున్.

క. 'ననుఁ దొఱఁగి నీవు సౌఖ్యం
బున నుండుము: సమరభీతు భుజబలహీనుఁ
జనపతిఁ గాఁ జేయుట యొ
ప్పునె? కట్టుము పట్ట మనిలపుత్త్రునిఁ బ్రీతిన్.' ౯౭

వ. అని పలికి, సెజ్జ డిగ్గి వనవాస గమనోన్ముఖుం డయినం, గనుగొని కమలనాభుం డా భూపతి చరణంబులకుం బ్రణతుండై యిట్లనియె:- ౯౮

సీ. 'నరునిప్రతిజ్ఞ భూవర, మున్నెఱుంగని
యంతియ కా, దేను నితఁడు విప్పు
డాడినమాటలు నంతరంగంబునఁ
బట్టవు; పేర్చుకోపమున నీకుఁ

దను నెవ్వఁ డుఱక యన్యునకు గాండీవ మి
 మ్మని ధిక్కరించె, నాతని వధింప
బ్రతిన వట్టినవాఁడు; భావ్యంబు గానియ
 ప్పలు కీవు వలికితి; పరమధర్మ
ఆ. మైన సతవిష్ఠ హానిఁ బొందుట కోర్వ
కునికిఁ జూచి, యేన యుల్లమునఁ ద
లంచి యట్లు వలుకఁ బంచితి; గురువిఁ గి
డాడుటయు వధించు టగుటఁజేసి. 100

క. 'శరణము వేఁడెదను భవ
చ్చరణంబులు పట్టికొని, నిసర్గదయా ని
ర్భరబుద్ధివి గావుము మ
మ్మిరువుర, నీతప్పు పైపు మెల్లవిధములన్. 101

క. 'సూతసుతుని మెడనెత్తురు
భూతలమున నివురు నేఁడు; భూనాయక, నీ
వాతనికి నలిగినప్పుడ
చూ తెగియెం; బూని యేన చుమ్ము పలికెదన్. 102

క. 'విను సత్యం బాడెదఁ; బా
ర్థునిచే నేఁ డెల్లభంగిఁ దునుమంబడు క
ర్ణునిదెసఁ జింతయు వంతయు
మనుజేశ్వర, విడువు; పంపు మమ్ముఁ దెలివితోన్.' 103

—♦ ధర్మరాజు కృష్ణునివాక్యంబులకు కలంకదేఱి,
 కర్ణునిజంపి ముదము గూర్చుమనుట ♦—

వ. అనుటయు ధర్మసూనుండు ససంభ్రమంబుగాఁ గృష్ణు నెత్తి, యతండు ప్రాంజలియైయుండ నతని కిట్లనియె:- 104

క. 'యిది యట్టిద; మోసంబునఁ
బదిలుఁడఁ గా కేను మున్ను పదరినకతనన్
హృదయము గలఁగిన, నా కె
య్యదియును దోఁపమి, వికారి నైతి మహాత్మా! 105

ఆ. 'ఇట్టి నన్ను ననువయించి బోధించితి
కరుణ పేర్మిఁ జేసి; గారవమున
నజ్ఞులైన మమ్ము నాపత్పయోనిధి
మునుఁగ కుండఁ గాచి తనఘమూర్తి!' ౧౦౬

వ. అనియె. నప్పుడు వివర్ణంబగు వదనంబు వాంచియున్న వాసవిం జూచి, వాసుదేవుండు:– 'నీ విట్లు విషణ్ణుండ వగుట గర్జంబు గా; దిమ్మేదినీపతి ముఖప్రసాదం బభినందించి యనుమతి వడసి చని, రాధేయవధ విహారంబున నితనికిం బ్రియం బాపాదింతుగాక! యింకఁ దడయనేల?' యని పల్కి, వెండియు— ౧౦౭

ఉ. 'ఈతని నొవ్వఁ బల్కుటన, యీ దురవస్థకు వచ్చి తక్కుటా!
ఘాతమహాపి నీనృపతిఁ జంపిన నెట్లగుదో? విపత్తికిం
బాతకఘోరవృత్తికిని బాసితి దైవ మనుగ్రహించుటన్!
పీతెలి వాప్తబంధుజన-నిర్మితపుణ్యవిపాక మర్జునా!' ౧౦౮

వ. అనిన, నతండు గన్నీ రొలుక, నన్న పాదంబులపైఁ బడిన; నప్పాండవాగ్రజుండును బాష్పప్లావితముఖుండగుచు నతనిమీఁద నొఱగె. ని ట్లయ్యిరువురు నొండొరులం బట్టికొని యేడ్చి; రచ్యుతుం డుడుప నుడిగి, తత్కాలోవగత సముచిత పరిజనానీత జలంబుల ముఖప్రక్షాళనంబు సేసికొనిరి. తదనంతరంబ ధర్మనందనుండు దమ్మునిం గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి, చిఱునవ్వుతో 'మనల నింత వఱచునే కర్ణుం?' డని పలికి, మఱియును— ౧౦౯

ఆ. 'ఎల్లఁ జూడ, పిడము విల్లు నశ్వంబుల
సూతుఁ దునిమి, నన్ను నాతఁ డలవు
నెఱయ గెలిచె; నతని నీ విష్ణు సంపక
యున్న నాకు బ్రదికి యుండఁ దగునె?' ౧౧౦

చ. అనవుడు, నమ్మహీపతికి నర్జునుఁ డి ట్లను:– 'నేఁడు కర్ణు నే
నని బడవైతు నీయడుగు లాన; తదీయ సుహృద్గణంబుతో
విను; మటు సేయ కే మగిడి వెల్వెలఁబాఱెడు మోముతోడ వ
త్తునె? యిట కృష్ణసారథియుఁ దూలునె మానవిహీనవృత్తియై?' ౧౧౧

వ. అని, గోపాలదేవు నాలోకించి:– 'నీమనంబునం గర్ణుండు దెగటాఱు వలయునని యాంచుక దలంపుము; దాన నే నతని వధియింతు' ననిన, నమ్మహాత్ముం:– 'డట్టి

పవికిం జాలుదు !'వని యుత్సాహదీప్తుండై పలుకుటయుఁ; బార్థుండు నిజరథంబు సవిశేషకల్పితంబు సేయించి, రథ్యంబుల జలపాన ఖాద్యఖాదనంబులం బ్రబలం బులఁ గావించి పూన్పించి, యగ్రజు వీడ్కొని గమనోన్ముఖుం డగుటయు; నచ్యుతుం డవ్విభు నీక్షించి-'నీ తమ్ముని గారుణ్యార్ద్రకటాక్షంబుల వీక్షిం పుము ! దీవనయిచ్చి పనుపు ! మని చెప్పిన, నన్నరవరుండు గిరీటిం దిగిచి బిగి యార కౌఁగిటం జేర్చి; 'నీవు కృష్ణువనుపునం దగుమాటలాడి తత్తెఱంగు నేనునుం దెలిపితి; నా యెఱుంగమి నిన్నుం బలికినపలుకులకు నుమ్మలింపకుమీ' యనుటయు, నతండు వికసితవదనుండగుచుఁ దత్పాదద్వయంబు ఫాలంబు సోఁకం బ్రణతుండయిన; నమ్మానవపతి యెత్తి పునఃపునరాలింగనంబు సేసి, 'కర్ణుని గెలువు విజయ ! నీకు విజయంబు శాశ్వతం బయ్యెడు !' మని దీవించిన నమ్మేటి మగండు నాటోపంబుగా: 'దేవ, నిన్ను నొప్పించిన యప్పాపకర్ము మత్కార్ముకముక్త శిలీముఖంబులం బొలివుచ్చి, యాదె వచ్చెద !' ననుచు నంజలి పుటంబు నిటలంబునఁ గదియించి వీడ్కొనియెఁ. దదనంతరంబ దామోదరుం డును నన్నరుండును నరదం బెక్కి, యలరుమల్లంబులతో యరిగి శుభప్రదంబు లగు నిమిత్తంబులకుం బ్రమోదంబు నొందిరి. పదంపడి రాధేయవధప్రకార చింతాక్రాంతుండైన గాండీవి తనువునం బ్రస్వేదకణమ్ములు గ్రమ్మినం గనుం గొని, కమలనాభుం డతని కిట్లనియె :— ౧౧౨

—♦ రాధేయవధ ప్రకారచింతతోఁ బ్రస్వేదదేహుఁడైన గాండీవిని కృష్ణుఁడు పోరికి పొంగించుట ♦—

ఆ. 'అమరులకు నజయ్యు లగువారిఁ బెక్కండ్ర
గెలిచి తీవు ! నీకుఁగల యుదాత్త
దివ్యబాణములు సుదీర్ఘధనుర్వేద
కౌశలంబు బలముఁ గలదె యెందు ! ౧౧౩

చ. 'అమరనదీ తనూభవుఁడు, నప్పగురుండు భవన్మహోగ్ర ది
వ్యమహిమలో నడంగిరి; జయద్రథు చావధికాద్భుతంబు ! మ
ర్త్యమునన కాదు లోకముల నన్నిట నీ కెదు రెవ్వ ! రేల చి
త్తమునఁ గలంక ? యూఱడుము ! దర్పము నెక్కొడు నంతకంతకున్. ౧౧౪

క. 'బలమును శౌర్యముఁ దేజముఁ
గలఁ డని కౌరవులు నమ్మి కర్ణుని నీతోఁ

దలపెట్టిరి; నీ బాణం
బులఁ గూలెడు నతఁడు; కీర్తిఁబొందెడు నిన్నున్. ౧౧౫

క. 'కురుపతి యాశలు మాలఁగ
దురమున రాధాతనూజుఁ దుమమాడి, జయ
స్ఫురణంబునఁ గృతకృత్యతఁ
బొరయుము, నీవారు మోదమునఁ దేలంగన్!' ౧౧౬

వ. అని వెండియు,— ౧౧౭

ఉ. 'కౌరవసైన్య మగ్గలము గాదె కడుం! భవదీయసేన క
వ్వారణకోటు లాతురగవర్గము లారథసంచయంబు లా
వీరభటావళుల్ బహుళవిక్రమ కౌతుకివైన నీ శరా
సారములం బడల్పడఁ గృశం బగు టిప్పుడు నీకుఁ దోఁచదే! ౧౧౮

క. 'కురుసేనలకుం బతియై
సరిత్సుతుఁడు పదిదినములు సమరము సేసెం;
శరమహిమ నతఁడు నీచేఁ
బరిరక్షితుఁడైన సైన్యపాలు మిగిలెనే? ౧౧౯

చ. 'అతని శిఖండిబాణముల కప్పైర సేసితి; ద్రోణునిం బమూ
పతియుఁగ జేసెఁ గౌరవనృపాలకుఁ; డగ్గురుఁడుం భవచ్చమూ
పతి నడఁగించె నేదివసపంచక, మమ్మెయిఁ బోరి తావకా
ప్రతిహతబాహురక్ష యిరువాఁగున జూడదె పాండవోత్తమా! ౧౨౦

క. 'భీముని రణవిహరణ ము
ద్దామం బగు పెల్ల నీదుదర్పంబునఁ గా
దే? మాఱు లేని భవద
ప్రామేయబలంబు లెలియ నంతయు నాకున్! ౧౨౧

వ. 'కృపాశ్వత్థామ కృతవర్మ కర్ణశల్యులు నీచేతం బోయెడువారు! కృపాశ్వత్థామల దెసం గృప సేసితేనియుం జంపక గెలిచి విడుము; చుట్టం బని యరవాయి గొనుట కర్జంబు గాదు. కృతవర్మను సమయింపుము. శల్యుండు మేనమామ యైనను బగవారిం గూడి పరాక్రమించు చున్నవాఁడు గావున, వతని వధింపట

పాపం బని తలంపవలదు. కర్ణుండు * జతుగృహదాహంబును గపటద్యూతోత్సా
హంబును లోనుగాఁగల దుర్యోధను దుర్నయంబులకు మూలం; బట్లుగాక
జూదంబునప్పు డాసభలోన ద్రౌపది నుద్దేశించి యప్పాపాత్ముండు; ౧౨౨

* పాండవ పక్షపాతముతో పౌరాణికులు నిజమును మరుగుజేసి వదేవదే చాటు ఉదంతము
ములలో ఈ జతుగృహదాహము ఒకటి:—

జరిగినకథ ఇది—(ఆదిపర్వం 6-అ : 139 మొదలు)

ధృతరాష్ట్రపుత్రుఁడు పురోచనుని పిలిచి, వారణావతమునకు ముందుగాపోయి, పాండ
వుల మనసు ఆకర్షించేటట్లుగా లాక్షాసర్జక రసమిశ్రము. ఘృతతైలార్ద్రము అయిన ఒక
ఇంటిని నిర్మింపుమని పంపును.

పాండవులు హస్తిపురమునుండి బయలుదేరునప్పుడు విదురుఁడు ఏదో ధర్మరాజు
చెవిలో చెప్పును 16-వ ఏట శతశృంగమునుండి వచ్చిన ధర్మజుఁడు 13 ఏండ్లు హస్తినగర
మున ఉండి, వారణావతమును చేరినాఁడు (29-వ ఏట). వచ్చి మొదట సర్వాలంకార సుందరం
బైన ఒక మందిరమున, కొన్ని దినములుందురు. ఆ తర్వాత పురోచనుని మందిరముచూచి,
వంతసిల్లి, అతనిని పూజించి అందు చేరుదురు. (బలవంతములేదు. విదురుడు చెవిలో చెప్పిన
మాట కారణమై ఉండవచ్చునేమో-150.)

విదురుఁడు కడు విశ్వాసిఅయిన ఒక ఖనను పాండవులదగ్గరకు ఆనవాలుతో పంపును.
వాఁడు రహస్యంగా ఆ ఇంటినుండి ఒక బిలమును బయటకు త్రవ్వి భీమునికిమాత్రము చూపి
యుంచును. (158)

ఒక నిషాదవనిత సపుత్రయై కుంతికి పనిబాటలుచేయుచు అందుండినది. కుంతి దానధర్మ
ములతో విశిష్టసద్వ్రతుల దనుపుచు ఆరునెలలు గడపినది. దహనమైన నాఁటిరేయి, ఉత్సవ
మున పాల్గొని కొడుకు లందరితోఁగలసి త్రాగి, అధిక మధుపానమదంబున మై ఎరుంగక
ఆ లక్క-ఇంట నిద్రబోయినది.

నడిరేయి భీముఁడు (పురోచనునికంటె ముందఱఁదాన) ఉత్సహించి, ఆ ఇంటికి ఘోరా
నలమును దరికొల్పెను. వెంటనే అన్నదమ్ములను తల్లిని అందరిని తానొక్కఁడే మోసికొని
సొరంగముగుండా బయటబడి, ఉప్పరవానితో సంగతి చెప్పిపంపినాఁడు -(160) ఖనకుఁడు
ఉదయం బిలమును పూడ్చివేసి బూడిద త్రోయువానివలె, ఎవరికిని దెలియకుండఁజేసి, గజపుర
మునకు బోయి, సంగతి అంతా చెప్పును. ఆ లక్క-యింటి మంటలో అన్నెము పున్నెమెఱు
గని విషాదవనిత, తన బదుగురు బిడ్డలతో సిత్తైపోయినది. (ఆది-6 : 168)

ఇది తెనుఁగుభారతము ననుసరించి లాక్షాగృహదహనకథ। ఇది దుర్యోధనునికి ఎంతో
దూరము। ఒకరుకాల్చి, ఇంకొకరిపై బెట్టుట యూరపు రాజకీయ (హిట్లరు రీఛ్‌ను - పార్ల
మెంటును - తానే తగులబెట్టించినాఁడు) తంత్రముగా నున్నది.

—♦ కృష్ణుఁడు; అర్జునునికి కర్ణునిపైఁగల పగను రాఁజబెట్టుట ♦—

క. 'లే రిచట మగలు నీకును ;
వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన, పైపైఁ,
గూరిమి గలమగని వెదకి కొను మొరు, ననఁడే ; ౧౩౩

తే. 'ఏను సంధికిఁ బోయినఁ, దాను ధార్త
రాష్ట్రమానసములఁ బగ రాఁజఁ బెట్టి,
నన్నుఁ బట్టింపఁ జూడఁడె ? యెన్నఁడైన
నాదికారణ మతఁడు మీయాపదలకు. ౧౩౪

చ. 'విషము ; సుభద్రపట్టి బలువిల్ మును వంచన వాఁడు డాపి త్రుం
చిన, మఱి కాదె యందఱును జేరి వధించుట ? యాపరాభవం
బనలము పోలె నున్నది యహర్నిశముం బరితాపకారియై
మనమున ; నస్త్రవృష్టి నది మాన్పుము, బంధులు మోద మందఁగన్.' ౧౩౫

క. 'ఆసభ నాదుష్టాత్ముఁడు
సేసిన దుర్నయము సూచి, చిత్తమునఁ గడున్
[1]నోసినబంధులు వానివి
గాసిగ గ్రద్దగమి దొలువఁ గనుఁగొన వలదే ? ౧౩౬

వ. 'వాఁడు వడినం, దక్కటిరాజులుం గౌరవులు నీకు మొనకట్ట రని' చెప్పె. నిట్లు చెప్పుచు, సమరస్థలంబున కనతిదూరంబుఁగాఁ జని యక్షత్త్రి చూచి, కర్ణుండు సంగరంబు సేయు సంరంభం బగ్గడించి, [2]యగ్గాండీవికిం జూపి పుండరీకాక్షుండు వెండియు :- ౧౩౭

క. 'కేతనము రథముఁ దురగ
వ్రాతముఁ బొడిచేసి, నీశరంబులఁ గర్ణున్
వే తునిమినఁ గని, శల్యుఁడు
వాతెఱ యొండంగఁ బాఱవలదె కిరీటి.' ౧౩౮

వ. 'పూనిక నెఱపి, శోకం బుజ్జగించి, లోకంబు సంస్తుతింప సుఖివి గమ్ము' వి'నం బ్రముదితహృదయుండై ; ౧౩౯

1. రోసిన; క్రోసిన.
2. ఆకాశము బాణములతో నిండియున్నగుర్తును చూపుట ఇందలిసొంపు.

శా. 'పీతోద్భూతున నేఁ ద్రివిష్టపముల నెల్లంగ మాఁకింతు; నా
చేతం గర్ణుఁడు రూపు మాలి చను, మెచ్చింతుఁగా, నమ్ము జూడుమీ
దైతేయాంతక!' యంచు, శేషవిభహస్తం బుద్ధతిం జాఁచి, వి
ధ్యాతారాతిబలుండు పుచ్చికొనియెన్ దుర్దాంతకోదండమున్! ౧౬౦

—♦ అర్జునుఁడు కర్ణవధ కుత్సహించుట ♦—

వ. ఇట్లు గాండీవం బెత్తి యెక్కు పెట్టి, యన్నరుండు:- 'నేఁడు నా బాణంబులు బాణాసనంబును నరదంబునుం జూచి సుయోధనుండు శకునిచేతి యద్దసాళ్లను పలకయు నమ్మండపంబును దలంపవలయుఁ; దనవమ్మిన బలశాలియైనకర్ణుండు నేనేయు తూపుల తాఁకున దూ పడంగినం గని, యవ్వెంగలి దాను విదురుబుద్ధి వినమిక వగం బొందవలయు; ధృతరాష్ట్రుండు దనకుం గార్యదర్శనంబు లేమి యుగ్గడించి తన్నుందాన నిందించుకొనవలయు; నతండు గొడుకుల దెసను వారు రాజ్యంబు దెసను విగతాశులు గావలయు'నని పలికి, మఱియును- ౧౬౧

ఆ. 'రాజరాజుఁ బాపి రాజ్యసంపద ధర్మ
తనయుఁ జేరుపెంపు దారు దెలియఁ
గాంచి, సాత్యకియును గవలును భీముండు
గారవించువారు గాక నన్ను! ౧౬౨

క. 'సుర గరుడోరగ విద్యా
ధరాది భూతములు సూతతనయుని నేఁడేఁ
బోరి పుచ్చిన నమ్ముఁ బొగడుచు
నరుగుం గా కువికిపట్ల కంబుజనాభా!' ౧౬౩

వ. అని యిట్లు సల్లాపంబు సేయుచుం, గృష్ణార్జునులు నిజసేనఁ జేరి. రంతకు మున్న యిరువాఁగునం జేయంగలదొరలు దలపడినం బోరు ఘోరంబయ్యె. నందు. ౧౬౪

సీ. కర్ణసూనులలో నొక దుత్తమౌజునిచేతఁ
జచ్చుటయు, శోకాతురుండుఁ
గ్రోధదీప్తుండు నగుచుఁ గర్ణుఁ డాతని
తురగ కేతనములఁ దునుమ; నాతఁ
డడిదంబు సేకొని యరదంబు డిగి కృపా
చార్యరథ్యంబులఁ జంపి భీష్మ

వైరి తే రెక్క; నాశారద్వతుం డట్లు
విరథుఁ డయ్యును బలువిడిఁ గడంగ,

ఆ. నతఁడు పాదచారి యని యాశఖిండి య
వ్విప్రు నేయఁ దయ్యె; వేగ మెద్ది
ద్రౌణి యతనిఁ దనరథంబుపై నిడికొని
యనికిఁ దొలఁగి చనియె మనుజనాథ! ౧౩౫

వ. అట్టియెడ; ౧౩౬

—♦ అర్జునుఁడు కనిపించనిదానికి
భీముఁడు నిజసారథి విశోకునితో యోచించుట ♦—

చ. అనిలసుతుండు తీవ్రవిశిఖాంశులు పర్వఁగ నేచి, యంబరం
బునడుమఁ దేజరిల్లు రవిఁ బోలెడువేఁడిమి కోహటించి నీ
మొన దెరలంగ, నారథికముఖ్యుఁడు పార్థుఁ దలంచి సారథిం
గనుఁగొని, మానసంబు దలఁకం బ్రథనోగ్రత దక్కి యిట్లనున్:- ౧౩౭

క. 'నరుఁ డన్న వర్తనముతెఱఁ
గరయుటకై మది గలంగ నట చనినాఁ; డ
న్నరపతి దుర్దశ గని దు
స్తరశోకం బడరి, తానుఁ దదవస్థుఁ డగున్. ౧౩౮

తే. 'అయ్యిరువురకు నొకటి యైనట్టిదైన
మనము, కౌరవసంఘంబు ప్రగ్గఁ జేసి
గెలుపుగొంటిమ యేనియు, ఫలముదాన
నేమి గలదనువగఁ జిత్తమెరియఁజొచ్చె. ౧౩౯

క. 'ఐనను నిప్పటిదుఃఖము
మానింపఁగ మనకు నొండు మందెయ్యది, యీ
సేనల దొరలను గౌరవ
భూనాథుని సమయఁ జూచి పోవుట దక్కన్?' ౧౪౦

వ. అని పలికి, యవ్విశోకునకు మనదిక్కుసిడంబులు సూపి, 'యవి యెవ్వ రెవ్వరి
చిహ్నంబు లేర్పడం జూచికొనుము; మన శరంబులకొలంది యెట్లున్న దరయు'
మనవుడు, నతండు: 'నీ రెవ్వరైననేమి? నీ వలిగినఁ బడక పాఱక నిలువం జాలు

వాఁ డిం దెవ్వం? డస్త్రశస్త్రంబులనంపద యడుగ వలదు; నేఁడు దెచ్చినవానిలోన నా *తెడ్లు వ్రేఁగుపడి పూవివచ్చు బండియొక్కటి యించుకయు వెలితిగాకయున్న యది; గాకున్న నేమి? భవద్బాహుదండంబునకు మూలధనంబైన గదాదండం బెల్లపనులకుం జాలు'నని చెప్పిన బవమానసూతి యాసూతు చేసేత నప్పళించి;

ఉ. 'వేడుకఁ జూడు; మేను బటువిక్రమకౌతుకలీలఁ బేర్చి చెం
డాడెద వైరులన్. విదురుఁ డప్పుడు చెప్పఁడె? జూద మిట్లు గా
నాడెనె రాజరా జకట; యాప్రతినల్ గడతేర్చుఁ గాక. బొం
కాడునె ధర్మజావరజుఁ డంచుఁ దదాప్తులు వంత బొందఁగన్.' ౧౪౨

వ. అవి వెండియు; ౧౪౩

ఉ. 'ఉత్తమకర్మ మిట్టి దని యొక్కరుఁడుం దగఁ జెప్పలేఁడ నా
కిత్తఱి: నేన పోలుతెఱఁ గెల్లను జేసెద; నట్లుఁ గాక. నా
చిత్తము మార్గవర్తియుఁగ శిక్షక మయ్యెడు దైవ'మంచు. న
త్యుత్తి భవద్బలంబునయి నెల్లను జూ పడరించె నేపునన్. ౧౪౪

వ. ఇట్లు గలయం గనుంగొని, యద్దిక్కు గలగుండు గొనుట యెఱింగి, విశోకునితో:- 'గౌరవసైన్యంబు మనము దఱుమకయ తాన కలంగెఁ; గెలనం గవ్వడి గదిసెనో కాక!' యనుటయు; వాఁడు నిపుణంబుగా నిరూపించి ముదంబునం బొదలుచు— ౧౪౫

క. 'నరుఁ డదె కంటే; కౌరవ
కరిసేనం గవిసెఁ; గేతుకపి రుచు లంభో
ధరబృందముపైఁ గలయం
బరఁగు తటిల్లతలఁ దలఁపఁ బట్టయి నిగుడన్; ౧౪౬

క. 'హరిమేనికాంతియును నరు
కిరీటరత్నాంశువులును గిఱిగొన, రథ ర
థ్యరుచులు బెరపి విచిత్ర
స్ఫురణంబునఁ దేజరిల్లెఁ జూడు కుమారా!' ౧౪౭

* ఆతెడ్లు, మూడుజతలుగా తలేరుగాగట్టి (ఒకజత కాడిని ఇంకొకజత కాడితోకలిపి కట్టి) లాగించిన బండిదృశ్యము కన్నులకు గట్టుచున్నది. దండువీడులో ఆయుధములను చేయుటను, వాటిని బండ్లతో అనిమొనకు తోలుటను తిక్కన బాగా చెప్పియున్నాఁడు.

వ. అనిన విని, యంతరంగంబు సంతోషమయంబు గా నంగంబు వొంగ, వేర్పడ నాలోకించి, విశోకునకు వృకోదరుం డి ట్లనియె:- ౧౪౮

తే. 'వరవృషభుల నూర్వురను, మేలివాజు లిరువ
దింటి, నూళులు పదునాల్గు వి త్తు నీకుఁ
బవదనము ; నీవు నాకు బీభత్సురాక
సూపి, ముద మొనరించితి సూతవర్య !' ౧౪౯

వ. అనియె. నప్పుడు వారణ ఘటావిదారణంబు సేసి. వాసవి వాసుదేవుతో:-'మన తేరు భీమసేనుఁ జేరం బోవ నిమ్మ'నుటయు; ౧౫౦

క. అతఁడు హరులఁ దఱుమఁగ ను
ద్ధతిఁ జమనెడ, మనబలంబు దర్పమహోగ్రా
కృతిఁ బొదివినఁ జతురంగ
వ్రతతుల నన్నరుఁడు నేలపాలుగఁ జేసెన్. ౧౫౧

ఆ. మందరంబుచేత మథితమై తిరుగు సా
గరము సులివు గెలిచె ; ధరణినాథ,
పార్థుఁ డురవణింపఁ బలువిడిఁ గలఁగెడు
కౌరవేంద్రుసేన కలకలంబు. ౧౫౨

వ. కేతు చామ రాతపత్ర భూషణశకలంబుల నా శౌర్యభూషణుండు రణక్షోణికి విభూషణం బాచరించె. నట్లు కర్ణువధంబునకు వేగిరపడి తఱుమ నుఱుక, మన మొన వెండియు నొండొండ పయిం గ్రమ్మిన, నమ్మేటిమగండు; ౧౫౩

క. పేరుగల రథికముఖ్యుల
సారథి రథ రథ్య కేతుసహితంబుగ దు
ర్వార విశిఖస్ఫురణ వి
హారంబున శతచతుష్టయము పొడి చేసెన్. ౧౫౪

వ. అవ్వేఁడిమికి వెఱచఱచి యచ్చటిమూఁక విచ్చుటయుఁ, గర్ణుముందటి మోహరం బుత్సాహాతిప్రం బయి యురవణించినం గని, యన్నరుం డురగ విసరంబునకుఁ గవియు గరుడునికై వడి నద్దెస కడరె: నట్లడరుట యాలోకించి తనకప్పెదుటి మొన బెట్టు వాఁకి; ౧౫౫

తే. వాయుసత్త్వంబు వాయుజవ ప్రదీప్త
తముఁడు వాయుతమాజుఁ డుదగ్రవృత్తి
నేచి, బాహాసముల్లాస మెసక మెసఁగఁ
గనపు గొట్టె వాలమ్ములఁ గౌరవేంద్రు. ౧౫౬

వ. అవ్వీరు నాటోపంబు సూచి, కురుభూపతి ప్రధానసైనికులకుం జూపి:-'యితండు సమసిన నక్కడ సకలంబు సమయు. మీ రొక్కుమ్మడిం బొదివి పొరివుచ్చుం' డనిన, వారును వారణాదిచతురంగంబుల యగ్గలిక మెఱయ నతనిం జుట్టుముట్టి, యస్త్రశస్త్రంబులం బొదువుటయు; నతండు, ౧౫౭

ఆ. వానినెల్లఁ ద్రుంచి, వల ద్రచ్చికొని లీల
నిగుడు[1] చోఱవోలె వెగడువడక
తఱిమి, రక్తనదులు వఱపె మస్తక కూర్మ
హస్తభుజగ తతుల నతిశయిల్ల. ౧౫౮

— శకుని పవనజుని మార్కొని మూర్ఛితుఁ డగుట —

క. కురువిభుఁడు సూచి శకునిం
బురికొల్పిన, నాతఁ డుగ్రముగ మార్కొని, పే
రురమున నారాచంబులు
గురిసినఁ, బవనజుఁడు సరకుగొన, కారథికున్; ౧౫౯

క. బలునారసమున నేసిన,
సలఘులఘుత మెఱయ నాతఁ డది యిరుమూఁడ
మ్ములఁ దునియలు సేయుడు, నతఁ
డలిగి యతనిధనువు దునిమె నల్లన నగుచున్. ౧౬౦

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని, యుజ్జ్వల షోడశభల్లముల్ సము
ద్దండత నేసె సీమఱఁది తత్తను వాఁడఁగఁ, జాపకేతువుల్
ఖండములై పడంగఁ, దురగంబులు నొవ్వఁగ, సూతుమేనఁ బెక్క
గండలు నెత్తురుల్ దొరఁగఁ, గౌరవపుంగవుఁ డిచ్చ మెచ్చఁగన్. ౧౬౧

తే. అలిగి జమునాలుకయుఁబోని యతులశక్తి
వాయుపుత్రుఁ డారథికుపై వైచె, నతఁడు

1. మకరివోలె, అని పాఠాంతరము. చోఱ (చోఱ) చేపకు ముక్కున రంపమువంటి కోర యుండును, దీనితో వలను ద్రెంచుననుటలో సారస్యము. మకరికి యీపని చేతగానిది.

వెరవుమైఁ బట్టి, దాన నవ్వీరుబాహు
వుచ్చిపోవఁ వైవ, మనమొన యుబ్బియార్చె. ౧౬౨

చ. అవిలఁ, దట్లు పెల్లెనఁగు నార్పులు పైఁపక మేటివిల్లు వే
కొవి, కనుదోయి గెంపుగ నకుంఠితవిక్రమ మొప్పఁ ద్రుంచె నా
తవి ఘనకార్ముకంబు, నిశితప్రదరంబులు మేన నించె; నిం
చిన నతఁ డుర్విఁ గూలెఁ గురుసేనకు బెగ్గల మగ్గలంబుగన్. ౧౬౩

తే. కూలి మూర్ఛ మునింగినఁ, గురువిభుండు
దనరథంబుపై నిడికొని యనికిఁ దొలఁగఁ
బోవుటయుఁ జూచి, తమతమపోరు మాని
దొరలు దెరలిన, మూఁకలు మరలి పఱచె. ౧౬౪

వ. ఇట్లు వెఱచఱచి, యవిసిన కలంబు జనంబులు దీవి సేరిన యట్లు కర్ణుం జేరి
కాలుదన్ని నిలిచె. నన విని, ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె:- ౧౬౫

తే. 'అట్టియెడఁ గృతవర్మ ద్రోణాత్మజుండుఁ
గృపుఁడు నృపతియుఁ గర్ణుండుఁ గివియఁ జాల
రయారె? కిమ్మీరవైరి కయ్యంబు కడకఁ
యిట్టు లుండునె? పదపడి యెట్టు లయ్యె?' ౧౬౬

వ. అవిన, సంజయుం డమ్మహీపతి కిట్లనియె:-నప్పుడు కరూశ పాంచాల చేదిసైన్యం
బులఁ దఱుముటయుం గని, కర్ణుండు గడంగిన మనమూఁకలుం బురికొవి పవన
తనయుతోడం బోరె. నప్పాండవ సేనాసముదయంబు రభసంబున నారాధేయుం
బొదివిన. ౧౬౭

— ♦ అందఱు కన్నిరూపులై కర్ణుఁడు పెకహింద్రపై పేర్చుట ♦ —

క. అతఁడు వివిధోగ్ర విశిఖ
ప్రతతులు నిగిడించి ఘోరభంగి నుదారో
ద్ధతి సూపినఁ, జేడ్పడి త
చ్చతురంగంబులును గలఁగె జగతీనాథా! ౧౬౮

చ. కనుఁగొని, భీమసేనుఁడు శిఖండియు సైన్యవిభుండు ద్రౌపదీ
తనయులుఁ గేశవానుజుఁడు దాఁకిన, నందఱు కన్నిరూపులై

తమవులు పించుచుఁ హయవితానము నొంచుచుఁ గేతుదండఖం
డన మొనరించుచుం బెనఁగె, దయ్యిక క్రుయ్య కతందు గండునన్॥ ౧౬౮

క. నకుల సహదేవులును వా
రికిఁ దోడ్పడి నిశితశర పరీతునిఁ జేయం,
బ్రకటిత బలశౌర్యుఁడు సూ
త కులోద్వహుఁ డేచి, వారిఁ దలకం జేసెన్॥ ౧౬౯

క. పెక్కండ్రతోడఁ గర్ణుం
డొక్కఁడ పోరాడి, యెక్కు డుక్కున వారిం
జిక్కువడం జేయుట గడు
నక్కజ మై యుండెఁ; గౌరవాధిప, చూడన్॥ ౧౭౦

వ. ఇవ్విధంబున నద్దెసఁ జేయంగల మేటిమగల వెగ డందించినం, బోక పొదువు పాంచాల చేది మాత్స్యాదివర్గంబులపై నతం డనర్గళప్రసారంబులగు శరాసారంబులు నిగిడించినం, గరి రథ ఘోటక భటావయ ఖండంబులును వివిధాస్త్రశస్త్రశకలంబులును జామర చ్ఛత్త్ర కేతు భూషణభాగంబులును భూభాగంబునం దొరఁగం బెరిఁగి, నెత్తురుటేఱులు వాఱు; మఱియుం బాండవ యోధవరులు వరుసం బోరి పోరి యంత కంతకు నివ్వటిల్లు నాకర్ణుక్రొవ్వున నివ్వెఱపడిన, నవ్వీరుండు గోపులందోలు క్రోల్పులికై వడిఁ గౌంతేయబలంబులం బఱపఁ, బాంచాలుర వెండియు దండితనంబున నతనిం దలపడిన; నాతండు పంచవింశతి రథికులం దునిమి పైవస్త్వతుచందంబునం బేర్చినం, దూర్యరవంబులు సెలంగం దత్పుత్రులును దుర్యోధన కృప దుశ్శాసనులు నశ్వత్థామ శకుని కృతవర్మలుం బైకొని, యాధర్మనందను సైన్యంబు నమయింప; నది విచ్చిన, నెలుం గిచ్చి పో సీక నిలిపి, భీమ నకుల సహదేవ ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవ సైనికులం గనుపుగొట్టం దొడంగినం, బోరు ఘోరం బయ్యె. నిత్తెఱంగున రెండు దెఱంగుల మూఁకలు దెగటాఱు చుండ, గాండీవి దమమోహరంబున కుత్సాహం బెసంగ నొక్కవలన మనమొనల నెత్తుటం జొత్తిల్లంజేయుచుం గదిసి, దలయెత్తి చూచి శౌరి నుద్దేశించి— ౧౭౧

సీ. 'కర్ణునికేతువు గ్రాలెడుఁ జూచితే;
భీమాదులైన యుద్దామ రథిక

జనులు పెక్కండ్రతో ననిసేయుచున్నవాఁ
డితనిప్రాపున గురుసుతుఁడు గృపుఁడుఁ
గృతవర్మయును గురుపతి సురక్షితుఁ జేసి
కొని, వీఁకఁ బాంచాలకోటి బడలు
పఱిచెద రరవడి దఱిమి; యారాధేయు
గిటడఁగింతము, ఘోటకములఁ

తే. బటురయమునఁ బోని'మ్మని పలుకుటయును
శౌరి యట్టులుసేయంగ; శల్యుఁ డమ్మ
హోగ్రరథవేగమును, నరునుజ్జ్వలంపు
చేపుఁ గని, సూతపుత్రుతో నిట్టు లనియె:- ౧౬౩

క. 'కేతనకపి భయదంబై
తోఁతేరఁగఁ, జక్రధర చతుర సారథ్య
ద్యోతితవల్గన చారు
శ్వేతహరులు మెఱయ వచ్చు వీరునిఁ గంటే!' ౧౬౪

వ. అని మఱియును; ౧౬౫

సీ. 'నవ్వెడుతలలను, గ్రొవ్వారుచేతుల
బిరుదులు వెట్టిన చరణములను,
వాతులు దెఱచిన వాజిమస్తకముల,
గిరిశృంగములఁ బోని కరిశిరముల,
నవయవభేదంబు లడఁగెడునట్లుగఁ దుము
రైన బహుగాత్రసముదయముల,
భయదంబులై మహిఁబడు విమానములట్ల
యలవఱ లైనట్టి యరదములను

తే. నేలఁ గప్పుచుఁ; దనబాణజాల మడర,
నెవ్వ రడ్డము సొచ్చిన నించకయును
దవులఁబడక, సముద్ధతిఁ దివిరి మనలఁ
దేఱి చూచుచుఁ బార్థుఁ డీదిక్కు గవిసె. ౧౬౬

క. 'తోడై డాపట వలపటఁ
గూడి తఱుమువారు లేరు, కోపంబున నీ

తోడి బవరమున కడరెదుఁ
గ్రీడి మనతలంపు గూడె, గెలువుము గడఁకన్‌ ! ౧౬౪

ఆ. 'పాయ వడియె పేన: బరవస మలరంగ
మార్కొనంగ మేటిమగఁ డొకండుఁ
గలుగ నోపఁ, దేపు దలకొన మనమ యి
బ్బలియుఁ దలపడంగ వలయుఁ గర్ణ!' ౧౬౫

—♦ రాధేయ రథసోత్సాహితమగు కురుబలముపై ఫల్గునుఁడు గవయుట ♦—

వ. అవిన విని, కర్ణుండు – గవ్వడి బాహాబలంబును శౌర్యసారంబును దపఃప్రభావంబును ముక్కంటితోడ నెక్కటి పోరుటయును బాశుపతాది దివ్యాస్త్రంబులు వడయుటయును, బురందర ప్రముఖబృందారకులకు నజయ్యులగు కాలకేయుల విర్జించుటయు విరాటుపసులం మరల్చుటయు లోనుఁగాఁ గలవిశేషంబు లగ్గడించి, కృష్ణుమాహాత్మ్యంబు వొగడి:-'యిట్టివారల నే నొక్కరుండన మార్కొని మదం బడఁగించెద: మద్రనాయక, మనతేరు వారియరదంబు నమ్ముఖంబుగాఁ జవనిమ్మ' నిన, నతం డట్లచేయఁ గనుంగొని, కురుపతి పురికొలుపఁ గృప కృతవర్మ గురుపుత్ర గాంధారవిభులును గొందఱు కుమారులును విక్రమాటోపంబు దీపింప నయ్యంగరాజుం గడచి యదరి యాఫల్గునుం బొదివిన, నమ్మహాభుజుండు హరిణకులంబు గనిన సింగంబువిధమున విజృంభించి, యారథికులపైఁ గలయ వివిధవిశిఖంబులు విగిడించి, ధనువులు దునిమియు ఘోటకంబులఁ గూల్చియు సారథుల నమయించియుఁ దత్సేనాచతురంగంబుల బడలువఱిచియు నబ్బలు మగలం దెరల్చి యొత్తరించి, కెలనన దురంబు పేయు నమ్మరుత్తనయుం జేరంజని, బహువిరోధిజన పయోధిమగ్నుండగుచున్న యతని నుద్ధరించి, సంప్రీతుండగు నతనికి నగ్రజుకుశలం బెఱింగించి సంతోషసాగరంబునం దేల్చి:-'నీ వింక దప్పి యార్చికొ' మ్మని పలికి, రాధేయ రథసోత్సాహసహితంబగు నీ బలంబు మీఁదం గవిసిన; ౧౬౬

—♦ కురుకుమారులు పదుగుర జంపిన కవ్వడికి బడమువడి తొడగుట ♦—

చ. తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై
వడిఁ దనుఁ జుట్టు ముట్టుటయు, వారల సూత హయధ్వజంబులం
బొడి పొడి సేసి, యాతఁడు రిపుల్‌ వెగడంద వెడందతూపులఁ
మెడలు దెగంగ నేపి రణమేదినికిఁ బలిసేసె నత్తలల్‌. ౧౬౭

వ. అట్టియెడ; ౧౮౧

తే. సవతి కౌరవరథికులు గవిసి కడిమిఁ
బొదువుటయు, సన్నిశరముల భూరిరయము
మెఱయ నందఱఁ దెగటార్చి తఱుము నతనిఁ
దాఁకె వేయుమున్నూఱు దంతావళములు: ౧౮౨

వ. ఇట్లు దాఁకిన, యాభీరాది మ్లేచ్ఛనికరంబుల నతం డనేకవిధవిశిఖంబుల విరియింపం, బై పైఁ గరి తురగ సుభట రథసమూహమ్ములు గ్రమ్మినం, గని కడంగిన వడ ముడి తోడ్పాటునం జేడ్పడియు, నవి వోక పొదివి పెనంగిన, గద గొని యరదంబు డిగ్గి యగ్గలిక నప్పవనతనయుండు దారుణ రణవిహారంబున నెఱయ మెఱయం; దఱుచుగా మెఱుంగువాలంపగములు గాండీవి గుప్పింప నప్పు డమ్ముఖంబు చతురంగంబులయం దొక్కఁడేనియు రక్తంబునం దోఁగనియట్టిది లేక యుండె, నట్లు గార్చిచ్చు వొదివిన కాననంబు చందంబయి యా సైన్యంబు రూపఱ విఱిగి 'కర్ణ కర్ణ కావు కావు' మను నెలుంగులతో నతనివెనుక కొదిఁగిన నీకొడుకు లబ్బలుమగని బలపి నిలువ, నా వీరుండు దీవికై వడి సమరార్ణవంబున మునుంగ నీక యమ్మోహరంబు నుద్ధరించి, మౌర్వీఁ దాటించి కిరీటి దెసకు నడచె; నంతకు మున్న యరదం బెక్కి యనిలతనయుం డా ధనంజయునిం గూడుకొనిన నయ్యిరువురకుం దలకడచి పాంచాలు రా సూతనందనుం దల పడుటయు. ౧౮౩

—♦ తన చుట్టుముట్టిన రథికులపై రాధేయుఁడు విజృంభించుట ♦—

తే. ద్రౌపదీనందనులును సాత్యకియు లోను
గాఁగఁ బాండవసైనికోత్కరము గవిసి
కూడికొనియెఁ బాంచాలురఁ; గురువరేణ్య,
యందఱకు నన్నిరూపు లై యతఁడు పెనఁగె. ౧౮౪

వ. అప్పుడు; ౧౮౫

సీ. జనమేజయునిసూతుఁ దునిమి రథ్యంబుల
నో నేసి, భీమతనూజ నకుల
సుతుల చాపములు ఖండితములు సేసి, ధృ
ష్టద్యుమ్ను మావుల సమయఁ జూచి,

మెయి వెంచి సాత్యకిహయములఁ గూల్చి, కే
కయకుమారుని జముకడకు ననుపఁ;
దజ్జనకుం దగ్గి తమ్ము నొప్పించి ప్ర
సేనునిఁ దాఁ జూడఁ జెలఁగి చంపు

తే. టయును, బుత్రశోకంబు గిన్కయు మనంబు
నందుఁ బిరిగొన రాధేయుఁ డతని నఱకె;
శినివరుం డొండువాజులఁ దనరథమునఁ
బూన్చికొని వచ్చి, తత్పుతుఁ బొదివె నధిప. ౧౨౬

క. ఇట్లు సూతపౌత్రుఁ డగుసుషేణుం బొదివి శినిపౌత్రుండు; ౧౨౭

వ. హయములఁ జంపి, ముప్పదిశితాస్త్రములం దెగటార్పఁ జూచి, తం
డ్రి యమునిచందమై 'తెగితిరే శినివీరుఁడ!' యంచు నేయుడు,
న్పయద మహోగ్రతఁ దిగుడునారసముఁ దడుమఁ శిలీముఖ
త్రయమునఁ ద్రుంచి, మేనఁ బదరత్రితయంబు శిఖండి గ్రుచ్చినన్. ౧౨౮

తే. కనలి యాసూతపుత్రుఁ డాతని పిడంబు
ధనువుఁ దునుమాడి, పార్షతతనయుఁడగు సు
దేవుఁ దంద్రులు గనుఁగొనంగా వధించి,
యేసె సుతసోముఁ డడరిన నేపు దఱఁగ. ౧౨౯

—♦ తుముల సంగ్రామము ♦—

వ. వెండియుఁ బాంచాల రథికసంఘంబులు రాధేయుమీఁద నురవడింప, సమీరణ
సుత సహాయుండగు సవ్యసాచి వానిం గడచి యక్కర్ణు నరదంబున కడరె; నట్టి
యెడ నుత్తమౌజుండును జనమేజయుండును యుధామన్యుండును శిఖండియు
ధృష్టద్యుమ్నుండును నతనిం దలమిగిలి, యబ్బలుమగనిం బొదివి, యాంద్రియం
బులు దృఢాత్మునిం గలంపం జాలనిచందంబున నా సూతనందనుఁ దెరల్పఁ
జాలరైరి. వారల కేతు ఛత్త్ర సూత తురగ ధను స్తూణీరంబులు రేణువులు సేసి
బహుబాణంబులఁ దనువులు నొనేసి సింహనాదంబు సేసిన, యయ్యంగపతిపై
సుసంగతులై ద్రౌపదికొడుకులు గవిసిరి; వారిం గూడికొని శినివరుం డా సేనాపతి
వారి నేయుసాయకంబులు ద్రుంచి యాతనికిం దోడ్పడుటకుం గడంగిన, కౌరవ
పతి యంగంబున నెనిమిది సునిశిత విశిఖంబులు గ్రుచ్చి పేర్చిన. ౧౩౦

క. అలిగిన యన్నరనాథుని
కెలఁకుల వెనఁ దఱిమి, కర్ణ కృప కృతవర్మల్
బలుతూపుల నేయఁగ న
న్నలువుర స్రుక్కించె నతఁడు నారాచములన్. ౧౯౧

తే. దొరలఁ గడఁచి బలంబు లుద్ధురత విగుడ
వారిమొనలు నెదిర్చిన, ఘోర తుముల
సంగరం బయ్యె; నయ్యవసరమునందుఁ
దాఁకె దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ. ౧౯౨

—♦ భీముఁడు దుశ్శాసనుఁడు తలపడి పోరుట ♦—

తే. సారథుల యుబ్బు వాజుల చటులతయును
మెఱయ నొప్పారుతేరులమీఁదఁ బొలిచి
రవుడు గయ్యంపువేడుక. నాతఁడును న
తండుఁ జూపఱ కన్నులపండు వగుచు; ౧౯౩

క. ఒండొరులమీఁద నుజ్జ్వల
కాండము లదరించు చట్లు గదిపినయెడ, భీ
ముండు ప్రమోదభరిత చి
త్తుం డయి, తగనిట్టు లనియె దుశ్శాసనుతోన్:— ౧౯౪

ఉ. 'ఆ సభలోనఁ గొన్నఋణ మంతయు వీఁగఁగఁ గంటి వడ్డితోఁ;
గాన కొకింతయుం దొలఁగఁ జాఱక తీర్చెద విష్ణ నేఁడు; నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు; వి న్నిటు పేరఁ దెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృప సేయుట గానఁగ వచ్చెఁ దమ్ముఁడా! ౧౯౫

వ. అనిన విని, యతఁ డతని కి ట్లనియె:— ౧౯౬

సీ. 'ఎఱుఁగుదు; మఱచితినే లక్కయింటఁ జి
చ్చిడి మిమ్ముఁ బఱచినయిడుమ? లవియుఁ
గాకయు, నమ్మెయి గాంధారరాజు మీ
యన్నతో నెడజూద మాడి రాజ్య
లక్ష్మిఁ జేకొని కానలకుఁ బోవ నడిచితి;
మందుఁ బెక్కాపద లనుభవించి.

యజ్ఞాతవాసార్థ మవ్విరాటుని ప్రోలి
కరిగి యత్యంతదైన్యంబు నొంది.

ఆ. యట్ల మీకు లవికి యప్రసిద్ధమె? యివి
యేల రిత్తమాట లేటిపోటు
తలకు వచ్చె?' యనుడు; *దరహాసమునఁ గెంపు
గదురఁ బవనసుతుఁడు గడఁగి డాపి. ౧౯౭

క. భల్లములు మూఁట సిడమును
విల్లు నఱికి, సూతకంఠ విదళనమున కో
ల్లి, విటలమునఁ బటు ద
ర్పోల్లసితుం డగుచు నాటె నొక నారసమున్. ౧౯౮

వ. వావ భీము వోవక దుశ్శాసనుండు; ౧౯౯

క. తురగములఁ దాన నడపుచు
వెరవు రయము మెఱయ నొండువిలు గొని, గాఢ
స్ఫురణమున భీముతనువునఁ
బరఁగించె మెఱుంగు లడరఁ బంద్రెం డమ్ముల్. ౨౦౦

క. తోడన కోదండము దున
మాడెను. సూతుమెయిఁ గ్రుచ్చె నాఱమ్ములు. సం
క్రీడయపోలెను మువ్వది
యాడించెను మఱియుఁ దూపు లనిలజు మేనన్. ౨౦౧

మ. ధను వొం డుగ్రత నెత్తి. యేఁబది శితాస్త్రంబుల్ మరుత్సూనుఁ డా
తనిగాత్రంబునఁ గ్రుచ్చినం, గినుకమై ధైర్యంబు శౌర్యంబు నొ
ప్ప నతం డుజ్జ్వలభల్లయుగ్మ యుగళస్ఫారాహతిన్ వాజులం
దునిమెం, జాపము పిచ్చలింప విలసద్దోర్గర్వదుర్వారుఁడై. ౨౦౨

వ. ఇట్లు విరథుండై వృకోదరుండు మెయి వెంచి; ౨౦౩

మ. గద లీలం గొని తేరు డిగ్గి, మెఱుఁగుల్ గ్రమ్మంగ సారించి యు
స్మదయానంబునఁ గిట్టి, ఘోటకములన్ మ్రందించి, బాహాబలం

* ఇచట భీముఁడు పలికినమాటలు భండార్కర్ ప్రతియందు లేవు; కుంభకోణపు ప్రతియందు గలవు. ఇట్టి చాలభాగములను తిక్కన ఈ దక్షిణప్రతినుండియే తీసికొనినాడు.

బు దలిర్పఁగా భవదీయసూను వరదంబుం ద్రెళ్ళఁ ద్రోవంగ, బె
ట్టిదపుం దోమర మెత్తికొం చతఁడు దాఁటెఁగా నేలకుఁ గ్రక్కునన్. ౨౦౪

వ. అట్లు దాఁటి, పెట్టు వైచిన యత్తోమరంబువం గాఁడ నేసి, యక్కీచకారాతి పదిమూఁడువత్సరంబులు దమపడినపాట్లును బ్రతివచంబంబును డెందమున నావహిల్లి, మద్దండ గదాదండంబున దుశ్శాసను వైవ నతండు తద్గదాఘాతంబున నెత్తురు దొరఁగ ధరణిం బడిన, బెబ్బులి లేడికొదమం బొదువుపోలికం బొదివి మెడ పిక్కం ద్రొక్కి యెక్కుడుమదంబున నక్కుమారునితో నిట్లనియె:— ౨౦౫

క. 'మును సభఁ బలికినదానం
దవి నోవక యిచ్చటికి వచ్చితి? యే
మనియె దనుము! నీమాటలు
వినుటకు నాకిమక సాల వేడ్కవడియెడున్.' ౨౦౬

వ. అని, యమ్మహాబలవంతుడుమ మహోగ్రలోచనప్రభలు విగుడ మన బలంబులఁ జూచిన, ౨౦౭

క. విగుడు దవాగ్ని జ్వాలల
వెగడందిన మృగకులంబు విధమున, నతిభీ
తి గదిరి నలుగడ విచ్చిన.
జగతీశ్వర, యతఁడు మెఱసెఁ జక్కని బయలన్! ౨౦౮

వ. అప్పుడు నీయందుఁ జేయంగల పైపికుఁ జూచి. తత్తేజోవిశేషంబునం జూడ్కులు మిఱుమిట్లు గొన వెఱచఱచి, యంతంత తివ్వవడియుండ; ౨౦౯

— భీమసేనుఁడు దుస్ససేనుని ఎదచీల్చి పచ్చినెత్తురుఁ ద్రావి
వికటనృత్తిని కలిగించుట —

శా.* లీలం గేల నమర్చి, మత్తగజ కేళీ సుందరోద్భాస మా
భీలత్వం బలరింపఁ ద్రిప్పు, జలదం బృథ్వీస్థలిన్ వైచు, ముం
గాలం ద్రోచు, మొగంబు వ్రేయు, దెన లుగ్రస్ఫూర్తి వీక్షించు, మోఁ
కా లూఁదుం బయిఁ గ్రమ్మఱంగ మెడ చిక్కం ద్రొక్కి విల్చున్, నగున్!

వ. ఇవ్విధంబున ఘోరవిహారంబు సలిపి, భీమవిక్రముండగు నాభీమసేనుం డయ్యువరాజానననం బాలోకించి:— ౨౧౧

* ఆఖ్యాతకవి-2. అ-14-పద్యమునకుగల పాఠాంతరము, క్రింది 214; 217 పద్యములు చూడవగు.

క. 'ఏ నరము ద్రచ్చి నెత్తురు
తేనియ యది ద్రావెదం; గదిసి నను గడిమిన్
మానవ దిక్కు గలిగిన ప్రాణి
మ్మేలుఁగింపు మీమొనం గలవారిన్.' ౨౧౨

వ. అని పెలుచం బలికి, కుఠారంబు వెఱికి యతని మొగంబుమీఁద జళిపించి. ౨౧౩

మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చుకరణి, న్రౌద్రం బుదగ్రంబు గా
నురవత్యుగ్రతఁ జీరి, క్రమ్మ రుధిర మ్ముల్లాసియై దోయిట
న్వైర వారం గొని త్రావు. మెచ్చుఁ జపికి, న్మేనుం మొగంబుం భయం
కరరేఖం బొరయంగఁ జల్లికొను, నక్కౌరవ్యుఁ జూచుం బొరిన్. ౨౧౪

వ. ఇట్లు దారుణభంగిం బ్రతిజ్ఞాకరణపూరణం బాచరించి: ౨౧౫

తే. 'తల్లి చన్నుంబా లేను ద్రావ నెట్టు
లావనే పలు తెఱఁగుల తేనియలును;
ఖండశర్కరతోడి దుగ్ధంబు లమృత
వింపఁబడవే; యవియు నింతయింపు గావు.' ౨౧౬

చ. అని యెలుఁ గెత్తి పల్కి, పలి నాడు, మహోద్ధతిఁ ద్రుళ్ళు, నార్చుఁ, బె
ల్చన భుజ మప్పళించుఁ, దమసైనికులం మనవారు రక్కసుం
డని వెఱఁ గందువారు, గళితాయుధు లయ్యెడువారు, భీతి మూ
ర్ఛను బడువారునై రణవిరామముఁ బొంద మదోత్కటాకృతిన్. ౨౧౭

వ. వదంపడి. ౨౧౮

మ. *గద పేతం గొని, యంత్యకాల యమరేఖం బేర్చి, రక్తంబుచా
య దలిర్పం దను వుగ్రసుందరముగా నవ్వీరుఁ దేతెంచి, యు

---

* చచ్చినను దుశ్శాసనునిపై భీమునికి కసితీరక, వికటస్ఫూర్తి స్ఫురమ్మూర్తియై, తాను వాడి, తపించి బీభత్సమును కలిగించుచున్నాఁడు. ఇది భీముని వ్యక్తిత్వము. కీచకుని చంపిన ఘట్టము దీనికి ఎంతో కీత అనిపించుచున్నది. ఆయన ఎదలోని వగ వగగా రాజిరాజి గనగన మండి ఇట్లు కార్చిచ్చు అయినది. తిక్కన, చిన్న తెనుగు పొడిమాటలతో సహజముగా మాట్లాడికొనినట్లే చెప్పి, భీతిని కల్పించుచునే రమ్యతనుగూర్చి పాఠకునికి వెగటు బుట్టించుట లేదు. కాబట్టే కవితాశిల్పమున మొనగాఁడైనాఁడు.

కవిబ్రహ్మ, ద్రౌపదిని గడుపరిగా, భీముని విశ్వాతనవిధానమున క్రమమెరిగిన ధీరుఁడుగా వైశిష్ట్యము పొంగారునట్లు సృష్టించినాఁడు.

న్మద మాతంగములీల దోఁప; మనసేనం బొల్పఱం దోలి వే
పొదివెం గ్రమ్మఱ దుస్ససేను వికటస్ఫూర్తిస్ఫురన్మూర్తియై. ౨౧౯

వ. చలంబు నెఱయ నతని కాలు గేల నమర్చి మొగంబు గనుంగొనుచు, నక్కీ
చకవైరి యి ట్లనియె:— ౨౨౦

క. 'ఏమిర పసు లని యార్చవు? నీ
మాటలు వినఁబడియెనే! పసరమ, మి
మ్మేము మగుడ నిదె యార్చెద
మీమాటకు మాఱు పల్క రెవ్వరుఁ గంటే? ౨౨౧

ఉ. 'నెట్టన యల్గినం దగునె? నీకును ద్రోచుటయున్ విషాన్నముం
బెట్టుటయున్ మహాభుజగ భీషణదంష్ట్రలపాలు సేఁతయుం
జుట్టలుఁ బెద్దలుం జెఱలుఁ జూడ సభన్ నెఱిమాలి యిమ్మెయిం
దిట్టిన కోర్చు టెందుఁ గలదే? విను గెల్వరె జూద మెవ్వరున్?' ౨౨౨

క. అని పలికి, క్రమ్మఱఁగ మన
మొనమీఁదన్ బ్రమరివాఱి, ముద్గర లలితం
బునఁ గేలు మెఱయఁ జవి, తన
కన లడఁగక దుస్ససేనుఁ గనుగొని పలుకున్:— ౨౨౩

ఉ. [1]'ద్రౌపది వోయెఁ గాన ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి? యానఱం
దా వల దన్నఁ గీడుడుగదా! పతి లేఁదనఁ బడ్డ కాంత నేఁ
డీవు గనుంగొనంగఁ బతి యేత్తెఱ నొప్పెఁ! బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లుకామినులు సేడ్పడి రిట్లపతిత్వదీనతన్. ౨౨౪

క. 'విను! మేను జేయఁ బూనిన
పనులం దొకటి గడతేఱెఁ! బాపాత్మ సుయో
ధనుఁ బొరిగొని తల దన్నుదు
నను రెండవపనియుఁ దీర్ప నరిగెద నెలమిన్!' ౨౨౫

చ. అని యొఱఁ గత్తి చెప్పి, యతఁ డాతని గిటడగించి యార్చెఁ; గ
ర్ణునకును లోనుగా మన వరూథినియోధులకున్ మహాభయం

1. ద్రోపది.

బున మనముల్ గలంగఁబడి పోవికి మూర్ఛ గనీని జిచ్చపా
టున సకలాంగకంబులు గడుఁజ శిథిలంబులుగా మహోగ్రుఁడై. ౨౨౬

క. జనపతియుఁ గృప ప్రముఖులుఁ
గనుఁగొన, విట్లవిలసుతుఁడు గ్రౌర్య మొదల్ గై
కొవినట్లు పేర్చి దుశ్శా
సనుఁ జంపుటఁ జూచి, రోషసంరంభమునన్. ౨౨౭

వ. నీకొడుకులు-కవచియు నిషంగియుఁ బాశియు దండధారుండును ధనుర్గ్రాహుండును నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుండును గూడి కవిసి, వివిధవిశిఖంబుల నతనిం బొదివిన; నంతకుమున్న దుశ్శాసన రక్తపాన కౌతుకాధీన మానసుండైన యా భీమసేనుపై నెవ్వరు గడంగుదురో యని కన్నిడి యుండి, యతం డప్రతిహతంబుగాఁ బ్రతిన దీర్చుటకుఁ బ్రీత చిత్తుండగు ఫల్గునుండు భల్లదశకంబున నక్కుమారదశకంబు శిరంబులు దునుమాడె; నట్టి భీమార్జునుల యాటోపంబున కోటఱి నీ సైన్యంబు సమరవిముఖంబయ్యె. నా సూతనందనుండును భీతుండై వదనంబు వెలవెలఁ బాఱ నూరకుండె. నప్పుడు శల్యుం డతని నాలోకించి యిట్లనియె:— ౨౨౮

తే. 'ఉగ్రుఁడై దుస్ససేను నురము వ్రచ్చి
రుధిర ముగ్రతఁ ద్రావు మరుత్తనూజుఁ
జూచి చేడ్పడి చెయ్వేదఁ జూచితే సు
యోధనుని? నీవు నట్టైన నొప్పు నెట్లు? ౨౨౯

క. 'బలియురగు రాజులును గాల్
విలువక తెరలంగ, నీరె నీ ప్రాపున శ
త్రులఁ దాఁక దలంచి కృపా
దులు నిలిచిరి; కూర్చికొను మతులధైర్యమునన్. ౨౩౦

—♦ కర్ణసూనుఁడు-వృషసేనుఁడు విజృంభించి అర్జునిచే హతుఁడగుట ♦—

ఉ. 'కడు వెగ డందియున్న నినుఁ గన్గొని నీఁడె; యుదారధైర్య మే
ర్పడ వృషసేనుఁ డొక్కరుఁడుఁ బాండుతనూజుల మార్కొనంగఁ బో
యెడు; నరు నీవు దాఁక వలదే? రణభారము నీభుజంబునం
దిడియె సమస్తముం గురునరేంద్రుఁడు; దానిఁ దలంపు మిత్తఱిన్; ౨౩౧

వ. అనిన విని, యతండు సమరోన్ముఖుం డయ్యె. వృషసేనుండు భీమసేనుపై నురవడింప నకులుం దడ్డపడి, యక్కుమారుని సిడంబును గొడుగును గోదండం బును ఖండించిన: ౨౩౨

చ. అలిగి యతండు వేఱొకశరాసన మెత్తి, రథమ్ము ఘోటక
మ్ముల నిలఁ గూల నేయఁ, దొలివోవని ధైర్యము పేర్మి వాలునం
బలకయుఁ గొంచు, మాద్రితొలుపట్టి ధరిత్రికి దాఁటిబెట్టు గొ
త్తిలఁ జని తత్సహాయభట దారుణకేళి యొనర్చి పేర్చినన్. ౨౩౩

ఆ. కర్ణసుతుఁడు పలక ఖండించి, కృష్ణస
ర్పంబుఁ బోని పటు కృపాణ ముఱిక
నఱికి, నారసములు నాటించె నయ్యర్జు
నానుజన్ము మేన నల్ల నగుచు. ౨౩౪

వ. అప్పుడు ధృష్టద్యుమ్నుండు యుధామన్యుండును నుత్తమౌజుండును శిఖండియు జనమేజయుండును సాత్యకియు ద్రౌపదేయులును రౌద్రంబు శోభిల్ల రుద్రుల కైవడి వృషసేనుపయిం గవిసినఁ, గృతవర్మ కృప ద్రౌణి దుర్యోధనులును శకు నియుఁ దత్సోదరులు గొండఱును గ్రందం దఱిమి, దుర్వార విశిఖవర్షంబుల వారలం గప్పనం గని, గజసాధనులగు కుళిందు లురవడించి. ౨౩౫

క. కృతవర్మ సిక్కువడ, శూ
నతి నేర్పడ, శకుని వెగడునడఁ, దదవరజ
ద్వితయము ధరఁ బడఁ, దీవ్రో
ద్ధతిఁ బోరిరి చాపటంకృతంబులు సెలఁగన్. ౨౩౬

వ. ఇత్తెఱంగునం బోరినం గనలి కదంగి, కర్ణుండు: ౨౩౭

క. ఆ ముప్పురుఁ జలమున మ
ద్దామద్విప సహితచిత్రదళనంబున సం
గ్రామతలము [1]రక్తార్కం
బై మెఱయ బలాధిపత్రయముఁ బొరిగొనినన్. ౨౩౮

క. తక్కటి రథికజనులు పే
రుక్కున నయ్యుభయంబు నొదిఁగించియునుం

1. రక్తార్కంబై: రక్తార్ణవమై మెఱయ.

దిక్కువఱచియుం దునిమియు
నెక్కుడు మద మొప్ప మెఱసి రిథపురవాథా! ౨౩౯

వ. మెఱసినం జూచి;

ఆ. అరదమెక్కి తఱిమె నవిలతమాజుఁ, డ
ప్పీరుతోన పాండవేయసేనఁ
జేయఁగలుగు దొరలు శితశరాసారంబు
లడర వానిమీఁద నదరుటయును; ౨౪౦

వ. రణంబు దారుణం బయ్యె. నంత,

సీ. కర్ణుని యగ్రభాగంబునఁ గరిపుటల్
దునుమాడు నకులనందనునిఁ గిటి,
వృషసేనుఁ దమ్ములవెల్లి పైఁ బఱఁగించి
శితభల్లమున సూతుశిరము ద్రుంపఁ,
గనఁగొని యక్కర్ణతనయుని మీఁదఁ బా
ర్థాదులు గవిసిన; నతఁడు పార్థు
నవిలజు మూఁడుమూఁ దమ్ముల నొప్పించి,
యాశతానీకుని నట్ల చేసి,

తే. నకులు తనువున బాణసప్తకము నొనిపి,
శార్ఙ్గధరుమేనఁ బంద్రెండు సాయకములు
నఱపి పేర్చినఁ, గౌరవప్రతతి మెచ్చి,
పార్థుఁడేమి యూహించి భయముఁబొందె. ౨౪౨

చ. కెలఁకులయోధులం గడచి, క్రీడి నడిఁగా వృషసేనుమీఁద న
మ్ములు విగిడింప; నారథికముఖ్యుని మూఁపున నక్కుమారుఁ డే
వలరఁగ వాఁడితూపులు రయంబుమెయిం బది నెట్టు గ్రుచ్చి, య
గ్గలిక ముకుందు నేసె ననకాండములాఁ దివి మ్రుట్ట నార్చుచున్। ౨౪౩

వ. ఇట్లు విజృంభించిన; ౨౪౪

మ. భ్రుకుటిస్ఫూర్జ ఫాలభాగుఁడగుచుం బొంగారి, యాసూతసం
త్రతు కోదండము బాహుదండములఁ జిత్రస్ఫూర్తిఁ దున్మాడి, మ
స్తక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్ల నిలన ధారాహతిం ద్రుంచె, బా
లకబాదుర్దముఁ దన్నరుండు పతియు ప్రాదేయుఁడుం జూడఁగన్। ౨౪౫

—♦ కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము ♦—

వ. ఇవ్విధంబున వృషసేను సమయించుటం జూచి, కర్ణుండు శోకవ్యాకులచిత్తుండై కన్నీ రొలుకం, గోపాటోపంబున నుద్భటుం డగుచు, నమ్మహారథుని తేరికి నమ్ముఖంబుగాఁ దనయరదంబు వఱపించి, 'యర్జున యర్జున' యని యాహ్వానంబు సేసిన; నతండును సవిశేషోత్సాహంబున బొదలి యడరె; నట్టియెడ దురంబు దక్కి యిరువాఁగునుం బరమకౌతుకంబునం గనుంగొనుచుండ నయ్యిరువురు లామసన్నిభంబులు నాదిత్యసంకాశంబులుఁ ద్రినయనప్రతిమంబులు నగు నాకారంబుల నల్లసిల్లిరి. వారల యెక్కటికయ్యం బాలోకించు కుతూహలంబున సుర పితృ విద్యాధర సంయమిసంఘంబులును శచీపతి ప్రజాపతి పశుపతులును లోనుగా ననేకదివ్యు లేతెంచి నభోభాగంబున నిలిచి. రప్పుడు బ్రహ్మ రుద్రున కి ట్లనియె:- ౨౪౭

—♦ కర్ణార్జునులఁగూర్చిన బ్రహ్మరుద్రేంద్రుల సంవాదము ♦—

క. 'ఇరువురు నతిరథులు సమ
స్ఫురణులు విక్రాంతిపరులు శూరులు వీ రొం
డొరువులతోఁ బెనఁగఁగ న
శ్వర మగు జగ; ముడుపరాదె సమరం బనఘా!' ౨౪౮

క. అన విని యాదేవుం డ
వ్వనజభవున కిట్లు లను:- 'నవారోద్ధతు లీ
ఘనభుజులు వీరిరణ మె
ట్లును జెల్లుం, దప్ప దప్పుడు విజయ మింకన్.' ౨౪౯

వ. అని యిట్లమ్మహాత్ములు సల్లాపంబులు సేయ, నాకర్ణించి పాకశాసనుండు సప్రణయంబుగా బ్రహ్మ కి ట్లనియె:- ౨౫౦

చ. 'తపము సుదాత్తశౌర్యము మదగ్రబలంబునుగల్గ క్రీడి క
య్యపువెర వెక్కుడై. గెలుచునట్లుగ నీవు దలంపవే?. పురా
ణపురుషులైన కృష్ణుల రణంబున శాత్రవు లాక్రమించుటం
గుపితమనస్కులైన నిలకుఁ బ్రదు కెమ్మెయిఁ గల్గనేర్చువే?' ౨౫౧

వ. 'నరనారాయణులకు నెందును జయంబు ధ్రువం బని తొల్లియుం జెప్పితి; రిమ్మహాత్ములు జయించుట లోకహితంబు. గర్ణుండు ద్రోణ భీష్మ ప్రాప్తంబైన పుణ్యలోకంబు వడయుఁ, గిరీటి చిరకాలం బిడుమలం బడినవాఁడు గావున రాజ్యసుఖంబు లనుభవించుం గాక' యనిన, నప్పరమేష్ఠి: 'వీరల జయాపజయంబులు నిశ్చయించి పలుకనేల?' యనుటయు, నీశానుం డతని నాలోకించి:— 'నిశ్చయించుట మేలకాక యొగ్గేమి? నిశ్చయింత'మని, కలిపికొని యతండునుం దానును వానవులను విలోకించి కృష్ణార్జునుల నుద్దేశించి— ౨౫౨

తే. 'మహితమునులగు వీ రెందు మాఱు లేక
మెఱఁగువారయి కాదె జన్మించినారు?
వినుము! నీ చెప్పినట్టుల వీరి నోరుల
ధిక్కరించుట లోకహితంబు గాదు. ౨౫౩

వ. 'వీరికి జయంబు ధ్రువం'బని పలికి, యంత విలువక: 'వీరి జయంబు ధ్రువంబయ్యెడు' మనవుడు, నయ్యమరవిభుండు సురమునిప్రభృతులు గలయం గనుంగొని, 'దేవదేవు లిరువురు నేకమతంబుగా నిశ్చయించిన లోకహితంబగు నానతి యాకర్ణించితిరే! మీచిత్తంబు లిత్తెఱంగున కనుకూలంబులు గావలయు'ననిన, నందఱు: 'నది యిట్టిద కాక యొం డగునే?'యని; రనిమిషులు గుసుమవర్షంబులు గురియించుచు దివ్యదుందుభిధ్వానంబులు సెలంగించి. రయ్యవసరంబున నఖిలభూతంబులును విస్మయోత్ఫుల్ల నయనంబులగుచు నమ్మహాద్వంద్వయుద్ధంబు వీక్షించువేడుక నొండుదలంపులు దక్కి యుండి. రట్లు దార్కొనిన మహనీయరథంబులు రెంటియందును సన్నాహసముజ్జ్వలులై యొప్పు వాసుదేవార్జునులును గర్ణశల్యులును దమతమ శంఖంబు లొత్తి. రప్పుడు, ౨౫౪

తే. రెండుసేనల శంఖభేరీముఖంబు
లైన బహుతూర్యముల పటుధ్వాన మడరి
వింగి మ్రోంగారె; నత్యంతవిశ్చలంబు,
లయ్యె సైనికనికరంబు లద్భుతముగ! ౨౫౫

సీ. *కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహా
బలు లిద్దఱును దపోబలమువలనఁ

* అర్జుని కర్ణుని కేతనములు రెండును, తపోబల లబ్ధములైనందున కాబోలు, తమంతటామే పైబడి పెనగుచున్నవి.

గన్నవియై, బుద్ధి గల్గి శోభిల్లు మ
  ర్త్యేశ! యప్పుడు కపి యెఱఁగి హస్తి
కక్ష్యపై నదరినఁ గయ్యు మారెంటికిఁ
  గలిగె; నం దాహస్తికక్ష్య దెరలె.
నంబుజాక్షుండు మద్రాధినాథుండును
  దృక్కలహంబునఁ దేజరిల్లి
తే. రర్జునుండును గర్ణుండుఁ దర్శనంబు
లైనచూడ్కు లొండొరుల యాననములఁ
బఱపి; రాకృష్ణపార్థుల బలుపు, శల్య
కర్ణచిత్తదౌర్బల్యముల్ గానవచ్చె. [illegible]

వ. అట్టియెడ నాసూతనందనుండు మద్రపతి నాలోకించి:- [illegible]

తే. 'అర్జునుఁడు నన్ను నోర్చిన యట్టులైన
నెట్లు సెప్పుమ?' యనుడు మద్రేశుఁ 'డేను
గృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి, తీవ్ర
బహుళ శరజాలముల పాలుపఱుతు' ననియె. [illegible]

ఆ. అట్ల సవ్యసాచి యడిగిన మురవైరి
నగుచు: 'వినుఁడు గూలినను ధరిత్రి
పఱియలైన మేరు వాలినఁ గర్ణుచే
నీవు గోలుపోవు టెల్ల కలుగు?' [illegible]

వ. అని వెండియు; [illegible]

— సవ్యసాచి సమరోత్సాహము —

ఉ. అట్టిద లోకపర్యవన? మాదురవస్థకు బ్రుక్కనేర్తునే?
కిట్టుదుఁ గర్ణశల్యులను కీటములం [1]గరతాడనంబులం,
బెట్టుదు వేలఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు గాఁగ, ధర్మజుం
గట్టుదుఁ బట్ట' మన్న నగి, గాండివి యద్దనుజారి కిట్లనున్:- [illegible]

ఉ. 'నవ్వుల కంటెఁ గాక, యది నాకు నశక్యమె కర్ణశల్యులం
ద్రొవ్వఁగఁ? గింత? ద్రుపదుకూఁతురు గొల్వునఁ బడ్డపాటునన్

1. కరతాడనము.

నెవ్వగఁ బొందుచుఁ దమయనిష్ట వదంగిరిఁ గాని, యింక నా
మువ్వురఁ బూని వచ్చినను ముట్టెదఁ, గర్ణుని వేలఁ బెట్టెదన్।

మ. 'అరదంబుం బిడముం హయవ్రజము కల్యాంగంబులుం జాపముం
గరకాండంబులఁ జెక్కుఁ భల్లముల నుగ్రస్ఫూర్తిఁ దున్మాడి, వి
స్ఫురభల్లం బొకటం సుయోధనుని చూడ్కుల్ పేఱుగా నిప్డ యు
ద్ధుర గర్వోన్నతమైన కర్ణుతలఁ ద్రుంతుం జూడుమీ వేడుకన్।

ఆ. 'కర్ణ మద్రపతుల కాంతల విధవలఁ
జేయువాఁడ, నీవు పెన్ను మిగిలి
నగుచు, నేఁడు ద్రుపదనందన నీనుల
ధర్మసుతుని చెవులఁ దనుపు వినుపు.

క. 'సంతసపువార్త పుచ్చుము
కుంతికి నే దంతి దరువుఁ గూల్చినక్రియ దు
ర్దాంతగతిఁ గర్ణుఁ గూల్చుట
యంతయుఁ గన్నారఁ జూచి యచ్యుత యెలమిన్।'

వ. అని పలికె. నాసమయంబున నుభయసైన్యంబుల జనంబులకు నంబరంబునమన్న దివ్యసమూహంబులు నంను గీకనృత్తంబుల నుల్లసిల్లు నప్సరోగణంబులుం గాన నైన నద్భుతంబున వారు ననిమిషులై యుండి. రప్పు దేకనిశ్చయులగు కర్ణుండును దుర్యోధనుండును నచ్చెరువాటునం బొరయక, దురంబుమీఁది భరంబునం బొలిచి. రిరువాఁగు సైనికులు గిరీటికిఁ గర్ణునకు నభిముఖంబుగాఁ దల మిగులఁ దగదను బుద్ధిని భయంబునను దద్రథంబులు రెంటిని బలసి నిలిచి, రమ్మహావీరులు ధనుర్ద్యుతులను బాణప్రభలను దీప్రతేజంబులను బ్రదీప్తులై కల్పాంత సూర్యుల చందంబగుచు నొండొరుల నోర్చు కడంకలఁ బేర్చి. రయ్యవసరంబున నశ్వత్థామ గురుపతిఁ జేరం జని, కరంబు పేతం దెమల్చి సాంత్వన స్వరంబున ని ట్లనియె:—

—♦ అశ్వత్థామ దుర్యోధనునితో సంధిసేసికొనమనుట ♦—

చ. కలన గురుండు భీష్ముఁడును గాండివిచేఁ బడి, రంగరాజు వా
రల కధికుండె? యాతని దురంబున నోర్వఁ గలండె? పూని యే
వల దని బుద్ధి చెప్పిన నవశ్యము వాతఁడు విల్చు; నీతనిఁ
విలుపుము; నీవు ధర్మసుతునిం దగుమాటలఁ దేర్పఁ జొప్పడున్;

వ. 'తెలిపిన దామోదరుండునుం దెలివి నొందు. ౨౬౮

క. 'భీముఁడుఁ గవలును ధర్మజు
చే మరలెడువార, లేను జెప్పెడిపలుకుల్
భూమీశ, కురుకులమునకు
నీ మొనరాజులకుఁ బ్రజకు హిత మూహింపన్. ౨౬౯

చ. 'వలవదు నన్నునుం గృపు నవధ్యులఁగాఁ గొని క్రీడి గెల్వ శ
క్తు లని తలంప; భీష్ముఁడును ద్రోణుఁడు లోక మెఱుంగఁగా నవ
ధ్యుల। హరికల్మి నారథికు దోర్బలలీల నడంగి పోరె, య
చ్చలమొ ఫలంబొ, యింకయిన సంధి యొనర్చుట మేలు వారితోన్.

చ. 'హరి సనుదెంచినప్డు మన మమ్మెయిఁ బల్కితి; మింక సంధికి
న్వెర వగు వేళ గల్గు నని నీవు దలంపకు; మాంబికేయు భూ
వరుఁడుఁగ జేయు ధర్మజుఁ డవశ్యముఁ, బాండునృపాలుపాల యే
వురకు నమర్చుఁ గాని చనవుణ వెలిమెచ్చును నొల్లఁ డేమియున్. ౨౭౧

తే. 'పాండవులయట్ల రాధాసుతుండు నాదు
పలుకులకు నియ్యకొను, నీవు బ్రదుకు తెరువు
పట్టు, బ్రదికిన నెల్లశుభములఁ గలుగు;
పీసు మానుము, చచ్చిన నేమి గలదు? ౨౭౨

క. 'వెరతలఁపు డిగి, సంధికి
నొడఁబడు మిది లెన్స! దీని కొడఁబడమి గడుం
జెడుతెరు; విప్పటి [1]పదనుణ
గడవఁబడుట బ్రాటఁ దప్పుకరణియ చుమ్మీ!' ౨౭౩

—♦ కర్ణవిజయముపై రారాజు విశ్వాసము ♦—

చ. అన విని, యమ్మహీరమణుఁ డాతని కిట్లను: 'విప్డు దున్నసే
మని పని దీర్చి, మారుత తనూభవుఁ డాడినమాట యేర్పడ
న్విపియును సంధి సేయుటకు నీ వభిలాషము సేఁత యొప్పునే?
పెనఁకువ కర్ణుఁ డే లుడుగు? బేలవె? మానుము ద్రోణనందనా! ౨౭౪

1. పదనణ గడవబడిన దాటుతప్పు కరణియచుమ్మీ.

ఉ. 'శ్రాంతిం బొందినవాఁడు పార్థుఁ, డపరిశ్రాంతుండు గర్ణుండు; దు
ర్దాంతోదగ్రత నేఁడు గిటడఁచు నీతం డాతివిజా, వహ్ని య
త్యంతంబుగా ఙిరత్వ మొందినను గోత్రాభిల్ వడం కాడినం,
గుంతీసూనునిచేతఁ గర్ణున కవిం గోల్పాటు వాటిల్లునే?' ౨౩౫

వ. అని పలికి, యజ్ఞసపతి తన సైనికుల నాలోకించి సమరసముత్సాహ ఘోషణంబు లగు భాషణంబుల ముఖరుం డగుటయు; నఖిలతూర్యంబు లొండొండ మ్రోసె. బాండవబలంబునను భేరీ పణవాదుల రణనంబులు నిగిడె. నప్పుడు కర్ణుండును నర్జునుండును— ౨౩౬

—♦ కర్ణుఁడు అర్జునుఁడు ఒండొరులు తలపడుట ♦—

క. కరి కరి, గిరి గిరి, నంభో
ధర మంభోధరముఁ బెలుచఁ దాఁకిన క్రియఁ దాఁ
కిరి; కదఁగి గగనతటియును
ధరణియు మ్రోయుచు వడంక ధరణీనాథా! ౨౩౭

క. మెఱయు వెలిమావులును, గడు
మెఱుఁగారెడు నరదములును, మింటను మంటల్
వఱపెడు వాలమ్ములుఁ జూ
పఱ నత్తొలుతాఁకు వెఱఁగుపడఁ జేసె నృపా! ౨౩౮

వ. ఇవ్విధంబున నవ్వీరోత్తము లుదాత్తభంగిం దలపడి పెనంగం దొడంగిన, నుభయ సేనలవారలు నార్పులు నింగి ముట్టఁ జెలంగి; రట్టియెడ. ౨౩౯

మ. 'భరితోత్సాహతఁ బేర్చి, దీప్త లదరగా భల్లమ్ములొక్కుమ్మడిం
బరఁగం జేయుము కర్ణగాత్రములలోఁ; బార్థుండ, వే త్రుంపు మి
క్కురుభూపాలకు రాజ్యకాంక్ష, దొరయే కోదండపాండిత్య వి
స్ఫురణం గర్ణుఁడు నీకు? నీబలువు నేపుం జూపు మత్యుగ్రతన్.' ౨౪౦

వ. అని, పాంచాలురు పార్థజయార్థసంభాషణంబులు సేసిరి; కౌరవులు గర్ణు డగ్గఱి—

చ. 'కడఁగుము నీదుబాణములఁ గవ్వడి గూలినఁ జాలు; నంతతోఁ
జెడుదురు పాండవుల్ రణము సేయు నుదగ్రత యెల్లఁ దక్కి, పే
రడవుల కేఁగి సాధుమునులై చరియింతురు; కౌరవేంద్రుఁ డీ
పుడమి సమస్తముం బొగడు పొంపిరి వోవఁగ నేలు లీలతోన్;' ౨౪౧

వ. అని తలఁచి యవలికి నిరిఁ బ్రొద్దునం జాలఁ బ్రాలెఁ; గాలాంతకప్రతిములగు నప్పార్థకర్ణు లన్యోన్యజయార్థులై పెనంగునప్పుడు. ౨౨౩

—♦ కర్ణార్జును లిరువురు దివ్యాస్త్రములను ఎత్తుకు పైఎత్తుగా ప్రయోగించుట ♦—

సీ. కర్ణుండు పది చండకాండంబు లర్జును
తనువునఁ జొనుప, నర్జునుఁడు దీప్త
ఘనబాణములు పదునెనిమిది కర్ణు పైఁ
బరఁగింప; నయ్యంగపతి దశోగ్ర
చక్రమార్గణముల నరభనంబున నొంచె
నన్నరు, నాతండు నట్టి వహ్ని
శరములు రాధేయు నురమున నాటించె;
నతఁడు దొమ్మిదివాలుటమ్ము లతని

తే. వక్షమునఁ గ్రుచ్చి సాయకద్వయము శౌరి
మేన విగిడింప, బీభత్సుఁ డేను మెఱుఁగు
తూపు లా సూతపుత్రు నెత్తుట మునుంగ
నేసె బాహాసముల్లాన మెసకమెసఁగ। ౨౨౪

చ. అలిగి కడంగి సూతసుతుఁ డచ్యుతపార్థులఁ దీవ్రబాణపం
క్తులఁ బొదువం, బరాక్రమ కుతూహలి యవ్విజయుండు పిన్నన
వ్వొలపి ముఖాంబుజంబునకు నొప్పుగఁ దద్రథ రథ్య కేతు సూ
తులను దదీయగాత్రమును దూపులవెల్లి మునుంగఁ జేసినన్. ౨౨౫

క. అతఁడును దురగ సారథి
కేతుయుతము గాఁగ ముంచెఁ గ్రీడయపోలెన్
శాతశరవృష్టి నన్నరు;
పీఱెఱుఁగున మఱియుఁ బెనఁగి రిద్దఱుఁ గడఁకన్. ౨౨౬

మ. ఆయుగ్రాహవకేలి నిట్లు నిపుణుండై యొప్పు నప్పార్థుఁ డా
గ్నేయాస్త్రం బరివోసి దారుణమహాగ్ని జ్వాలికల్ భీషణ
ప్రాయవృంగి నభస్థ్సలిన్ విగుడ, దర్పస్ఫూర్తి శోభిల్ల రా
ధేయాంగో ద్దహనాభిలాష మెసఁదన్ గీలించ బెట్టేసినన్; ౨౨౭

ఉ. అంతక కోపవహ్ని విపులాకృతి నై కొని వచ్చినట్లు, మి
న్నంతయుఁ దాన యై కవియు నవ్విశిఖంబు మనంబులోన నా

వంతయు శంక లేక, సముదగ్రత వారుణమార్గణాహతిన్
శాంతముఁ జేసె విక్రమవిశాలుఁడు గర్ణుఁడు మాతు మెచ్చఁగన్. ౨౫౮

ఆ. ఫల్గునుండు మేఘబాణ మేసిన, భువ
నాంతరంబు సంభృతాంధకార
మయ్యె; సూతసూనుఁ డనిలాస్త్ర మేయుడు
నాతమంబు విరిసె నాక్షణంబ. ౨౫౯

ఉ. అర్జునుఁ డైంద్రబాణము సమంచిత[1]శక్తి ధరించి మంత్రవి
స్ఫూర్జితగాండివుండయి రిపుప్రకరంబులు నంచలింప న
త్యూర్జితశక్తి నేయుడు, మహోగ్రబహుప్రదరప్రకారతా
దుర్జయలీల నిర్మథనదోహలియై యది కర్ణుఁ గిట్టినన్. ౨౬౦

క. అతఁ డభిమంత్రితబాణ
ప్రతతిఁ దదుద్రేక మడఁచి; పార్థుని మేనన్
శితశరములు నివిచిన; మా
రుతపుత్రుఁడు గనలి, యన్నరున కిట్లనియె:- ౨౬౧

—◆ మారుతపుత్రుఁడు పుండరీకాక్షుఁడు కిరీటిని ఎగఁగొల్పుట ◆—

ఉ. 'సూతసుతుండు నీయెదుర స్రుక్కక నిల్చుట కాక, నీశర
వ్రాతము నిల్వరించి యనివారణ నొంపఁ దొడంగె; ఖాండవం
బేతెలివొంది కాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁ గంది యుండఁగా,
వాతెలి వాత్మ నూల్కొలిపి యగ్గలికం దెగటార్చు మీతనిన్. ౨౬౨

చ. 'తెగి మన కగ్గమై యరుగుదెంచిన వాఁ డితఁ డల్క యింక నొం
దుగడకుఁ బోవ కుండఁగఁ గడున్ వెస దగ్గఱి, యేఁ గపాలముం
బగులఁగ నొత్తునో గదానిహతిఁ; బార్థ, భవత్ప్రకట ప్రతిజ్ఞకై
తగ దని మాన్చె దేవి, నిశితప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్.' ౨౬౩

వ. అని పలికె; నప్పుడు, ౨౬౪

సీ. పుండరీకాక్షుండు గాండివితో:-'నీదు
దివ్యబాణములు రాధేయుచేతఁ
దూలిపోవుటయు, బలీ దూపుల నాతండు
నిను నొంచి యిట్లు పేర్చినవిధంబు,

1. శక్తి.

సుత్సాహ మెడలి నీ వునికియుఁ గని, కురు
సంతతి యార్వఁ బాంచాలకోటి
పెఱుసని పోవంగ నెఱుఁగవో? యెఱిఁగియుఁ
దగఁజేయునదిలేక వెగడుపడితొ?

తే. చక్ర మిచ్చెద నతని మస్తకము దునుము'
మనిన నగుచుఁ గిరీటి, బ్రహ్మాస్త్ర మధిక
దీప్తమై నేయ, నది బహువిస్ఫురత్ప్ర
దీప్తశరమూర్తిఁ గర్ణుని దెసకు నడరె. ౨౯౫

క. ఆ రథికుఁడు దలఁకక నియ
మారూఢప్రౌఢభావుఁ డగుచుఁ, దదస్త్రో
దారతర బలమునన త
ద్దారుణసంరంభ ముడిపె ధరణీనాథా! ౨౯౬

తే. ఉడిపి, తోడన కవ్వడి యొడల, గృష్ణు
మేన మూఁడుమూఁ డడరించె మెఱుఁగుఁదూపు;
లన్నరుఁడు గర్ణుతనువు శల్యాంగకముఁ
జించెఁ దొమ్మిది తొమ్మిది శితశరముల; ౨౯౭

ఆ. మొనసి క్రీడి మఱియు మూఁడు నెనిమిదియు
రెండునాల్గు పదియుఁ జండమార్గ
ణములు గ్రుచ్చె సూతనందనుమై; నతఁ
డుఱక యతని మౌర్వి యూడనేసె; ౨౯౮

వ. ఏసి, మఱియు శితశరంబులం బొదువం బోలి వోవక, పార్థుం డాగుణంబు సమాహితంబు సేసి పెల్లేసిన; రయంబున రాధేయుం డతని శింజిని శిథిలంబు గాద కాక యని తలంచె. నాధనంజయుం డతని వింటినారి వికలంబుఁ గాఁ జేసి; ౨౯౯

క. చిఱునగవుతోడ మైమఱుఁ
వఱువుల్లగఁ జేసి, యతనియంగము దోఁగం
బఱపె రుధిరంబు, బెడిదపు
మెఱుఁగు వెడఁద యంపగమి సమిత్రులు దలఁకన్. ౩౦౦

వ. తెరలక కర్ణుఁ డవ్విజయుఁ దీవ్రశరత్రయవిద్ధుఁ జేసి, మం
దరధరు నస్త్రపంచక విశాంతహతిం గడు నొంచె; * నా శరో
త్కరము వరప్రభావకలితం బగుటఁగా మగుడంగ వచ్చె వి
స్ఫురరభసం బెలర్ప; మధుసూదనుఁ గ్రమ్మఱ నేసె నాతఁడున్. ౧౦౧

క. అలఘు పటుభల్ల పంచక
ముల రెంటం గ్రీడి చిత్రముగ నయ్యస్త్ర
మ్ములు మూఁడు మూఁడు శకల
మ్ములుగాఁ దునుమాడె, జనులు పొగడ నరేంద్రా! ౧౦౨

క. కర్ణునిమెయి నాలోనన
కర్ణాంతాకృష్ట చండకాండము లధికో
దీర్ణ క్రోధంబున న
భ్యర్ణగతుం డగుచుఁ గ్రుచ్చె నతఁ డే పలరన్. ౧౦౩

చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన.
న్మెఱుఁగులు గ్రమ్మనమ్ముల విశిఖలధైర్యము పేర్మి నాతఁ డు
క్కఱక పెనంగె; దానఁ గన లగ్గలమై వెస నమ్మహోభుజాం
దఱిముఱిఁ జీఁకటుల్ గవియు నట్లుగ రోదసి నించెఁ దూపులన్. ౧౦౪

తే. వెగడుపడి చక్రరక్షకుల్, వెనుక దిక్కు
గాచు రథికులుఁ బార్శ్వసంగతులుఁ దమ్ము
విడువఁ జాలక లజ్జ వో విడిచి రపుడు;
గర్ణువారలు వాఱుట గని, విభుండు; ౧౦౫

* కర్ణుఁడు ప్రయోగించిన యీ శరోత్కరము ఇంద్రుఁడిచ్చిన శక్తి; వరప్రభావ కలితము; ఇది కృష్ణుని చక్రమువలెనే లక్ష్యమును తాకి, కొట్టి మరల కర్ణునిచేతికి వచ్చి చేరుచుండును. ఇట్టి ఆయుధము నేఁడు, ఆస్ట్రేలియా ఆదిమజాతులవారి చేతిక్కి యున్నది. కొడవలివలె వంపుతిరిగిన దీనిని Boomerang అని అందురు. ఈ ప్రకరణ యుద్ధమంతా కర్ణుని శస్త్రాస్త్రసంపద శాపగ్రస్తము కాలేదని, మొక్కవోలేదని, స్ఫురణ మాయలేదని వర్ణించుచున్నది. ఇఁక జయాపజయములు కాలాధీనములు ["మంత్ర శిక్షౌషధంబులు మేలునేఁత కాలకీలితంబు" అని; శాంతి-1 : 185.]

ఈ పర్వయుద్ధమున ఇతరసారథులనువలెనే శ్రీ కృష్ణునిగూడ శరాహతికి పాల్పడఁజేయుచున్నారు. ఇంద్రుఁడు శక్తినిచ్చుట-ఆది-7; 370.

— దుర్యోధనుఁడు తనయోధులను అర్జునుపైకి పురికొలుపుట —

క. ఆ డిక్కవారు భీష్ముం
డాదిగ నని సేయకుండు నన్నియతి యెడం
దా దైన్యమొంది తప్పం
గా దని యూహింపనీని కలఁక కతమునన్. ౩౦౬

వ. ఇరుగెలంకుల మూఁకలం గలయం గనుంగొని యెలుం గెత్తి:— ౩౦౭

క. 'తొడరుఁడు పొదువం డేయుఁడు
పొడువుఁడు బీభత్సుఁ బ్రిదిలి పోనీక వెసం
బడవైవుం డొక్కుమ్మడిఁ
గడఁగి!' యనుచుఁ జేయి వీఁచెఁ గౌరవనాథుఁ. ౩౦౮

క. విను, మతఁ డిమ్మెయిఁ బురికొలి
పిన, రథ కరి తురగ సుభటబృందములు రయం
బున నురవడించె నయ్య
ర్జునుపైఁ; దగువారు నిలిచి చూచుచు నుండన్. ౩౦౯

వ. ఎదిరి సైన్యంబు సమరంబు దొడంగి యుండుట యెఱింగి, కడఁగుట పాడి గా దని దొరలు దురంబునకుం జొరకుండిరి. గాండీవి కోదండగుణ రణన భరిత భువనభాంతరుం డగుచు, వివిధ విశిఖ జ్వాలాకలాపంబుల వేఁడిమి సూపిన, సేన లతి వెఱచి యమ్మూఁకలు వఱచినం గనుఁగొని యక్కురునాథుం దద్దొరల నుద్దేశించి.

క. 'భీష్మును లావుఁ గల్గిన
మీ రందఱుఁ గర్జు నొకనిమీఁదన యిమ్మెఁ
బోరెల్లఁ ద్రోచి ఫల్గునుఁ
జేర కునికి యాయుధోపజీవుల తెఱఁగే?' ౩౧౧

వ. అనిన విని, యుల్లంబుల లేనియుత్సాహంబు దెచ్చికొని వా రొక్కుమ్మడి నురవడించిన: ౩౧౨

ఉ. భరితక్రోధ మహోగ్రవృత్తి పిడముల్ భంజించుచుం, సూతుల
న్ధరణిం గూల్చుచుఁ, జాపముల్ నఱకుచుం, బ్రత్యంబులం జంపుచుం,
బరుఁ డాభీలపరాక్రముం డగుడు దైన్యం బంది వెన్నిచ్చి వి
చ్చిరి వా రందఱుఁ దివ్యసంఘము నుతింపం జూచి యవ్వీరునిన్. ౩౧౩

ఉ. కురుపతి వెండియుం దఱుమఁ గొత్తల సేయక క్రమ్మఱంగ నె
వ్వరు నటకీఁటి; విల్లు మనవా రెసగఁ జని చూచుచుండి ర
వ్వరుసన, నాసమిద్ధరణి భాగము శూన్యతఁ బొందఁ, గర్ణుఁ డ
న్నరుఁ దలపడ్డ నప్పటిరణంబు మహాద్భుత మయ్యె భూవరా! ౨౧౪

ఉ. క్రమమున నోలి మండియుఁ బరాక్రమసంపద నొంపు మీఱ, దు
ర్దమ వివిధాస్త్రజాల తిమిరంబుల నొండొరుఁ గప్పి కప్పి, శౌ
ర్యమునను బాహువీర్యమును రాజుల నచ్చెరు వందఁ జేయ, ను
గ్రముగఁ బెనంగి రయ్యమరరాజ తనూజుఁడు సూతసూనుఁడున్। ౨౧౫

—◆ కర్ణుని సర్పముఖశరము గుఱితప్పునట్లు జేయ శల్యుఁడు ప్రయత్నించుట ◆—

వ. అట్టియెడఁ, దక్షకునపత్యంబై తత్సోదరుండగు నైరావతుండు పెనిచి యుప లాలింప నుల్లసిల్లిన యశ్వసేనాభిధానుం డగు నాగకుమారుండు, సర్పముఖశరాకారంబుగైకొని తనయొద్ద నుండఁ; దాను బసిండిపొదిం బెట్టి యనుదినంబును గంధపుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించు వాఁడై యున్న, యట్టి యమ్మహనీయాస్త్రంబు రోషావేశవివశుం డగుచుఁ బుచ్చికొని, తల దెగవ్రేయుటకై యక్కర్ణుండు సముద్దీప్తజ్వాలాజాలంబు లంబరంబునం బర్వఁ, జూపఱు హాహాకారంబులు సేయం గార్ముకగుణంబున సంధించి తెగ వాపినం గని, యారథికు[1]చూపు కంఠంబుపక్కటికిం గాక తప్పి యపాంగ ప్రదేశంబుకొలంది యగుటంజేసి, యది నెపంబుగా శల్యుం డతనికిఁ జిత్తవైకల్యం బాపాదింపం దలంచి: 'యీసంధానంబు మెడ దునుముట కనుగుణంబు గాదు; నిపుణంబుగా నిరూపించి యొండుభంగి సంధింపు' మనినఁ, గర్ణుండు గనలునఁ గనుఁగవఁ గెంపు గదలుకొన, నమ్మద్రపతిం జాలముఖం జూచి- ౨౧౬

క. "ననుబోఁటి జోదునుం గా
దని పలుకఁగ నేర్పు నీకు నంత గలదె? య
ట్లును గాక వినుము! *కర్ణుం
డిను మాఱొకశరము దొడుగునే పరులు నగన్?' ౨౧౭

వ. అని పలికి, కలుషం బగుచిత్తంబుతో నెలుంగెత్తి 'ఫల్గున, ఫల్గున పొలిసి! తంచు నేసిన; ౨౧౮

---

1. తూపు.

* "నసంధత్తే ద్విశ్శరమ్ శల్య కర్ణో" అని మూలము.

క. ¹పలుదెస మంటలు ప్రబ్బఁగ,
నలఘుస్ఫురణమున నిగుడు నయ్యస్త్రంబున్
జలజాక్షుఁడు గని పంచాం
గుళమాత్రము రథము ధరణిఁ గ్రుంగ నదుముడున్. ౩౧౯

క. సుర గరుడ ఖచర విద్యా
ధర ఖేచరు లంబరం బుదాత్తధ్వనినం
భరితముగఁ బొగడి రమ్మర
హరు దివ్య ప్రసవ విరచితార్చనకోడన్. ౩౨౦

— సప్తముఖశరము, కిరీటి పురందరదత్తమగు
కిరీటమును భూమిపై పడద్రోయుట —

మ. కురువంశోత్తమ, వారిదిక్కు ప్రజ సంక్షోభింప నప్పాఁప తూ
పు రయం బుగ్రము గాఁగ బిట్టడరి, దంభోళిప్రభగ్న క్షమా
ధర శృంగాకృతిగా హరించె; బహురత్నస్ఫీత రశ్మిచ్ఛటా
స్ఫురితంబైన కిరీటమున్ విజయునొప్పుం దేజముం గుందఁగన్. ౩౨౧

తే. జనులు విహ్వలు లగునట్టి ఘనరవంబు
దిశలయందు నాకసమున దీటుకొనఁగఁ,
గర్ణుఁ డిట్లు భేదించె: దిక్పతులచేత
నైనఁ జెదని కిరీట మయ్యహిశరమున. ౩౨౨

క. సురపతి తపంబు సేసినఁ
బరమేష్ఠి ప్రియంబుఁ బొంది, బహుమానపుర
స్సరముగ నిచ్చినయది య
క్కిరీట; మరిభీషణత్వ కీర్తివము నృపా! ౩౨౩

ఆ. వనధివాసులగు నివాతకవచు లను
దనుజు లాపురందరున కజయ్యు
లైన, నతఁడు వనుప నర్జునుఁ డోర్చిన,
మెచ్చి యక్కిరీట మిచ్చె నధిప!

1. పలుదెసల మంట లుమియుచు.

చ. వినుము! నరేంద్ర, చూడ విన విస్మయ మిట్టిది [1]పాఁపరమ్ము వా
త నెగయు ఘోరరూపభయద ప్రథమాన విషాగ్నిజిహ్వికల్
దవిలిన, నెల్ల మండుచు నిలాస్థలి డొల్లె! నినుండు పశ్చిమాం
బునిధి వితాంతదృశ్యరుచి పొల్పెసఁగం బడుభఁగి దోఁపఁగన్! ౩౨౩

వ. అప్పుడు; ౩౨౪

ఉ. శృంగములేని నీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁ డ
య్యుం గనుపట్టె, *వెల్లతల యొల్లియ మౌళి దృఢంబుగా నమ
ర్చెం! గురునాథ, పూర్ణశశిచెన్నునఁ బూర్వమహీధరంబు కాం
తిం గడచన్నయందము ప్రతీతము గాఁగ నటించు చాడ్పునన్! ౩౨౫

వ. అట్లు రాధేయకర ప్రముక్తంబై కిరీటంబు నిర్దహించి నేలం గలపిన యమ్మహో రగంబు గ్రమ్మఱం గవిసినం గని, కమలనాభుండు గవ్వడితో:- 'మనమీఁద మగుడ నిమ్మహాసర్పంబు సనుదెంచు చున్నయది!' యనిన; నతం:- 'డిది యెక్కడిపాము? మిట్లు వచ్చుటకుఁ గతం బేమి?' యని యడిగిన; 'దీని నెఱుంగవే? ఖాండవం బేర్చునప్పుడు, దనతల్లిని రక్షించికొని యనలంబునకుఁ దప్పిపోవం, బోవ నీక, నీ వేసిన నన్నాగాంగన మృతిం బొందె; నప్పగ వాటించికొని కర్ణుకడ నమ్మెయి నున్న యశ్వసేనాభిధాన భుజంగంబు. ౩౨౬

---

1. పాముటమ్ము.

* కిరీటము క్రిందబడిన కిరీటిదృశ్యమును శృంగములేని నీలగిరికి పోల్చుచు, ఆయన తెల్లనితల, తలగుడ్డచుట్టిన శిగ, అస్తగిరిచెందిన పూర్ణశశి అందమును వెదజల్లుచున్నవని, ఆయనను సజీవంతో మన కండ్ల ఎదుట నిలబెట్టుచున్నది - తిక్కన వర్ణనము. అది అటుండ- అర్జునునివిషయమై రెండుసంగతులను వెల్లడించుచున్నది యీ పద్యము:-

1. అర్జునుఁడు నల్లనివాఁడు (అర్జునుఁడు విరాటపర్వవివరణముప్రకారం తెల్లనివాఁడు కాఁడు.)

2. ఈనాఁటికి నరునివయస్సు 70 సంవత్సరాలు కాబట్టే వెల్లతల! ఈ గ్రంథమున అచటచట, సందర్భోచితముగ ఇచ్చిన ప్రాయములనుకూడిన యీ లెక్క సరిపోవును.

దుర్యోధనుఁడు, భీమునితో సమవయస్కుఁడు, అర్జునునికంటె ఒక ఏడాది పెద్ద. తొడలు విరుగఁగొట్టబడి, నడుమువిరిగిన నాగుబాము వలె, మన్నులో బడియున్న '....అమ్మహీకాంతుఁడు ధూళిపొదవిన వదనంబుపై నెఱసినవెండ్రుకలు వాయంద్రోచికొని' (శల్య-2 ఆ: 381-వ వచనము)....అని, రాజరాజు ముసలితనమును చెప్పుచున్నది-తిక్కన భారతము.

తే. 'ఆతఁడేయఁ గిరీటంబు నపహరించి,
దానఁ గోపంబు వోవక తాన కడఁగి
నిన్నుఁ బరిమార్పఁ గడఁగెడు' నన్న నెఱిఁగి,
యాఱు పటుభల్లములఁ దునుమాడె నతఁడు. ౩౨౯

వ. అత్తెఱంగున; ౩౩౦

—♦ కర్ణార్జునుల మొండిపోరు ♦—

సీ. ఉరగంబుఁ దునిమి, వే మరలి కర్ణునిమీఁదం
బదియుఁ బండ్రెండును బటుశరములు
నిగిడించి, యుజ్జ్వలంబగు బొద్దనారసం
బేసిన, నది రుధిరాసవంబు
పానంబు సేయుచు మే నుచ్చి చనిన, దం
డాహతంబైన మహాహివోలె
నాసూతనందనుఁ డత్యుదగ్రుం డయ్యె,
నంతకుమును పాఁపఱమ్ముచేత

తే. నర్జునుఁడు సావమికి వెఱఁగంది, యాతఁ
డలుఁగెరలి పండ్రెండువాలమ్ము లేసి
పద్మనాభుని నొప్పించి, పార్థు నొకటి
కొఱఁతగా నూఱుశరముల నుఱకనొంచె. ౩౩౧

క. వెండియు బలువిడి నయ్యా
ఖండలసుతు నురము గ్రూరకాండంబుల నొం
దొండ కడు నొవ్వ నేసి, య
తం డుబ్బున నార్చె గగనతల మ్మదరంగన్। ౩౩౨

గీ. ఆర్చి పెలుచ నట్టహాసంబు సేసిన,
నలిగి యతఁడు భల్లములఁ దదీయ
భూరికంకటంబు పొలుపఱ నఱికి, యు
ల్లసిత మకుటకుండలములు దునిచె. ౩౩౩

వ. దునిచిన నబ్బలుమగండు; ౩౩౪

క. శిరమునఁ గర్ణంబుల నె
త్తు రొలుక బరిమేనితోడఁ దూలక బాహా
స్ఫూర్జణంబు మెఱయ, సాయక
పరంపరలు నరునిమీఁదఁ బఱపెం బెలుచన్ । ౨౩౫

తే. వానిఁ దునుమాడి యాపాండుసూనుఁ డలఘు
శరచతుశ్శతిఁ బొదివి నెత్తురులు మేనఁ
బఱప, గైరిక నిర్ఝరప్రకర శోభి
తాచలము వోలి పొలిచె నయ్యంగరాజు । ౨౩౬

ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియు నర్జునుఁ డుజ్జ్వలవ త్ప్రదంతకాం
డమ్ములు పెక్కు సత్వర దృఢస్ఫురణం బలరంగ నేసి, ర
థ్యమ్ముల సూతుఁ గేతనము నాతవితేరును గూడఁ గప్పె, మే
ఘమ్ములు గ్రమ్మి భూధరము గప్పినభంగిఁ దలంపఁ బట్టుగన్ । ౨౩౭

వ. ఇవ్విధంబున విక్రమకుతూహలియై విజృంభించె. నప్పుడు; ౨౩౮

ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమనీయరుచిం గొమరార, బాణసం
పత్తి యుదగ్రతఁ మెఱయ, భాస్వరుఁడై యరదంబుమీఁద భూ
మీోత్తమ, కర్ణుఁ డొప్పె । నరుణోజ్జ్వలమండల కాంతిపూరము
న్మొత్తపు దీప్తులం దగ నినుం డపరాద్రి వెలుఁగుచాడ్పునన్ । ౨౩౯

వ. ఇట్లు సూతనందనుండు నొచ్చియుఁ బొలివోనిబంటుతనంబున జంట మెఱుంగులు
చదలం బరఁగ శరంబు లడరించుచు, బహుబాణంబులు రేణువులుగాఁ జేయు
చుండ, సవ్యసాచి ఓవ్యాప్తవిలాసంబు భాసమానం బయ్యె । నయ్యవసరంబునఁ
గాలం దదృశ్యాకారంబున— ౨౪౦

— కర్ణుని తేరి దాపటికల్లు నేలఁ గ్రుంగుట —

క. 'భూసురశాపంబున నిదె।
యీ సూతజురథము చక్ర మిలఁ గ్రుంగెడు. పి
తాసుఁడగు నీతఁ' డని పే
నాసముదయ యుగ్మకము వినంబలికె నృపా । ౨౪౧

వ. పరశురాము దత్తంబయిన భార్గవాస్త్రంబను పేరిటి మహనీయసాధనం బప్పుడు
రాధేయునకుం బ్రతిభాసింప కుండె. దాపటికల్లు గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె.

నట్లు జామదగ్న్య మహీసురుల శాపంబు లస్త్రబలంబునకు రథంబునకు వైకల్యం బాపాదించి చిక్కువఱచుటయును; సర్పముఖశరం బాఖంగి విఫలప్రయత్నుం డగుటయును, దనమనంబున నొవ్వదరి; యక్కర్ణుండు గరంబులు విదుర్చుచు-

తే. 'ధర్మవాదులు, ధర్మతత్త్వప్రధాన
చిత్తులగువారిఁ బూవి రక్షించు ధర్మ
మందు; రది బొంకు గావించెః నతులధర్మ
శీలుఁడగు నాకు ధర్మువు [1]సెలవు లేదః' ౩౪౩

క. అని ధర్మంబును దూఱఁగఁ
దను నర్జును బాణవితతి తద్దయు వడిఁ దాఁ
కినఁ, గర్ణుండు విషాదం
బున వెండియుఁ బెద్దదూఱు భూవరముఖ్యాః ౩౪౪

క. కన లధికమైన లావె
క్కిన యయ్యంగపతి నొంచెఁ గృష్ణార్జునులన్
సువిశిత శరములు మఱియుం
జొనిపెను దనధైర్యమహిమ సుర లగ్గింపన్. ౩౪౫

— కర్ణుఁడు బ్రహ్మాస్త్రమును బ్రయోగించుట —

వ. అలిగి, యర్జునుం డాశీవిషంబులంబోని విశిఖంబు లాఱు కర్ణుమే నుచ్చి చన నేసినం, గ్రోధబాపితుండై, యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు నప్పార్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన; ౩౪౬

క. అమితబలంబగు బ్రహ్మా
స్త్రముచే నయ్యస్త్ర మపహృతం బగుటయుఁ, జి
త్తమున విషాదము దనుకఁగఁ
గమలాక్షుఁడు గారవమున గాండివితోడన్:— ౩౪౭

వ. 'పీయస్త్రం బిప్పుడు కర్ణాస్త్రంబుచే విధ్వస్తం బయ్యెః విల్లు గా నేలః' యన వుడుఁ, గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున నమ్మహనీయ సాధనంబు బాధితంబు వేసి రాధేయాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన, నమ్మేటిమగండు

1. చెలిమిలేదు.

గాండీవంబు మౌర్వీకోటిఁ బాసిపోఁ జేసిన, నా సవ్యసాచి మగుడ నమర్చి, మార్గణంబులు విగిడించిన; రయంబున నా సూతపుత్రుమీఁదికి కమ్మార్గి యాడుట దోఁపకుండె। నవ్వీరుండు దివ్యచ్ఛవిశిఖంబులు వారించి యతని తనువు నొంచిన; వెండియుఁ బుండరీకాక్షుండు సహస్రాక్షనందను నుద్దేశించి :— ౩౪౮

క. 'నిను నొంచువాఁడె కర్ణుం
డనితర సులభప్రకారమగు భుజవీర్యం
బున ననమానోజ్జ్వల ఖే
లనమునఁ దెగటార్చు శరవిలాస విహారా ౩౪౯

—♦ కర్ణుఁడాడిన రణధర్మసూక్తులు ♦—

వ. అనునప్పుడు, విష విస్ఫార ద్భుజంగ భంగికంబైన బాణంబు రౌద్రమంత్ర సహితంబుసేసి, కర్ణుండు పార్థప్రాణంబులు గొన నప్పళించి సంధింప, మున్ను కొండొక క్రుంగినచక్రంబు కుంద మునుంగం దిగఁబడిన, నొద్దగెనవై యరదంబేమినను ననువీక తక్కిన, నక్కటి యక్కర్ణుం డప్రతీకారంబులగు రోష విషాదంబులఁ గన్నీరొలుక, రథంబుదిగ్గి కవ్వడిదెసఁ గనుంగొనుచు నిట్లనియె:— ౩౫౦

సీ. 'అరదంబు చక్రంబు ధరఁ జాలఁ గ్రుంగిన
నెత్తెద, నంతకు నేయ కుండు;
మేను భూమిస్థుఁడ, నీవు రథస్థుండ,
వియ్యెడఁ దగ వగు నేయ కునికి।
విఱిదలవానిని విరథుని నాయుధం
బిడినవానిని శూరు లేయ రెందు;
మహిత శూరుఁడ వనుమాత్రగా దుత్తమ
కులుఁడవు, రణధర్మకోవిదుండ;

ఆ. విట్టి నీవు దగినయట్టి భంగిన యవి
వేయవలయు; నిట్లు సెప్పు టెల్ల
బాఁడి యేర్పడంగఁ బలుకుట గాని, గో
వింద నకును, నీకు వెఱచి కాదు।' ౩౫౧

వ. అనిన విని, యచ్యుతుం డతని కిట్లనియె :— ౩౫౨

క. 'ఏమీ తగవును ధర్మము
నీమనమున నేఁడ పుట్టెనే? గర్వము ను
ద్దామ దురభిమానము నే
లా మఱచితి కర్ణ! యాచలం బెటఁబోయెన్? ౩౨౩

ఆ. 'పరమధర్మపరులు పాండుభూవల్లభ
సుతులు, వారి నతులశుభము లొందు;
ధర్మహీనులైన ధార్తరాష్ట్రులకుఁ బా
టిల్లు వివిధమున నెల్లచేటు. ౩౨౪

వ. 'దీనికి నీవు కటకటంబడినం బోవునే?' యని పలికి వెండియు; ౩౨౫

సీ. 'గొంతియు నందఱు గొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండఁ జేసి;
కపటంపుజూదంబు ఘటియించి ధర్మాత్ముఁ
డగు ధర్మసుతు సిరి యపహరించి;
యంతఁ బోవక ద్రుపదాత్మజఁ దెచ్చి స
భాస్థలి నమ్మెయి భంగపఱచి;
యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోషయా
త్రావిధి నెపమున దాడి వెట్టి;

తే. బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీసుయోధనుఁడు దలఁపఁ;
గాన, యప్పాపముల కాదికర్త వీవ;
యన్నియెడలను నీపాడి యెందుఁ బోయె? ౩౨౬

వ. అని యిట్లు, కృష్ణుండు గర్ణుతో నాడుమాటలఁ దోదోత్తదం బెరిఁగిన యద్ధనంజయు మనంబు రోషానలంబు రోమకూపంబులఁ బటుజ్వాలారూపంబుల వెడలుట, యతి విస్మయప్రదంబై యుండె; నయ్యుగ్రమూర్తి సముదగ్ర పరాక్రమంబునం గురియు పటుబాణాసారంబు వారించి, యవ్వీరు నంగంబున నయ్యంగపతి విశితాస్త్రంబులు విగిడించుట మహాద్భుతంబయ్యె; నత్తెఱంగున నీడంబోక పెనంగు నతం డతిరయంబున నన్నరునిం బది దొడ్డనారసంబుల నొప్పించిన, నత్తేజోదనుం డాజ్యధారాచ్యుతాసేకంబున నుద్రేకంబు నొందిన హుతవహుండునుం బోలె

మండి, శత్రుసంత్రాసనంబును మిత్రోల్లాసనంబును బ్రగుణమణి జాంబూనదమయంబును జనప్రస్తుతిపాత్రంబును హస్తికక్ష్యాత్మకంబు ననగు నతని కేతనంబును గనకపుంఖ ప్రభాభాసితంబైన భల్లంబునఁ బడనేసినం; గౌరవులు విజయశ్రీ బలదర్ప ప్రియంబుల మొత్తంబులు వడుబగాఁ దలంచుచు, హాహాకారంబులతో నా రాధేయునిదెస నిరాశులై. రట్లు ప్రస్ఫుటకేతుపాతనం బాచరించిన, దానం గనలి కర్ణుం డతి నిశిత క్రూరనారాచజాలంబులు గృష్ణార్జునులమీఁదం గురిపి వెగడుపఱచి, *యరదంబు పిఱిందికొమ్ముక్రిందికి మూఁపు సొనిపి లావున నెత్తిన, రథచక్రంబు విడువక, భూమి గులపర్వత కానన సముద్రసహితం బాఱంగుళంబు లెగసె. నట్లు కర్ణుండు రథంబు నిలిపి, మీఁదికిం జని, యెప్పటిబాణంబు సంధింపం, వెండియుఁ జక్రంబు దిగంబడిన, గ్రమ్మఱ రథంబు డిగ్గి యెత్త నమరె నయ్యవసరంబునఁ గృష్ణపనుపునం గ్రీడి దోడన— ౩౫౬

—♦ విరథుఁడు, భూమిస్థుఁడు నిరాయుధుఁడు అయిన కర్ణుని అర్జునుఁడు చంపుట ♦—

మ. కులిశ ప్రస్ఫురణాపహాస నవిభాగుచ్ఛంబులం గల్గి యాఁ
కలిమైవచ్చు కృతాంతవక్త్ర మన, నుగ్రంబై మురారాతి రు
ద్రుల చక్రంబును శూలముం దెగడుచుం, గ్రూరంపు టొప్పారు నం
జలికంబైన మహాస్త్రముం దొడివి కర్ణం బుబ్బనం జేయుమన్— ౩౫౭

క. *ఏను దపశ్చరణంబున,
దానంబున, గురుజనాభితర్పణమున, ని

---

* ఈ అపమసమరము కర్ణుని పొంపిరివోవని బీరమునే ప్రదర్శించుచున్నది : చక్రరక్షకులైన సుతులెల్ల మడసిరి; సారథి చక్రము ఎత్తుటకు చేయివ్వఁడు: కల్లు ఇంకను కూరుకొనిపోవుచున్నది. ఒంటరిగా, భుజముకు తేరు పిఱిఁదికొమ్మకు మోపి ఎత్తినను అది పైకి లేవదు. ఈస్థితిలో కృష్ణునిపంపున ఫల్గుణుఁడు కర్ణుని తెగటార్చుచున్నాఁడు. కర్ణుఁడు తేరు దిగుట, గాలెత్తుట, మఱల తేరెక్కి అమ్ములేయుట, మఱల దిగుట సజీవదృశ్యముగా నున్నది.

క. పడినం బాఱినఁ గైదువు
వడినను వాహనము వడినఁ బార్థివముఖ్యా,
పొడువఁ దగదు శత్రుని, నె
య్యెడల నహింసనముఁ బోల వేసుకృతముల్.
—శాంతి-5 : 614.

త్యానూన వ్రతశీలుఁడ
నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశర' మనియెన్. ౪౯౯

క. అవి, తెగ నిండఁ దిగిచి యే
సిన, నయ్యస్త్రంబు రోదసీకుహరంబుం
దనమెఱుఁగుల నించుచు నిరు
మొనలజనుల గాఢమూర్ఛ ముంచుచు నిగిడెన్। ౫౦౦

చ. వినద సముచ్ఛటస్ఫురణ వింగి వగుల్పఁగ, సర్వభూతకం
పనమగు చమ్మెయిఙ్ా నిగిడి, పార్థివసత్తమ, యేమి సెప్పుదుం?
దునిమె, శిరంబు రక్తమునఁ దోఁగుమఁ గర్ణుని యట్ల వజ్రఘో
రవిహతిఁగూలు గైరిక ధరాధరముం దలఁపింపఁ బట్టుగన్. ౫౦౧

—♦ కర్ణుని సముద్దీప్తతేజము వారిజాప్తబింబము సొచ్చుట ♦—

క. చరమగిరినుండి పడియెడు
తరణికరణి సూతపుత్రుతల పడఁ, గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతిసుం
దరమునగు కాయ మట్లు ధరణిం బడియెన్। ౫౦౨

తే. అధిప, యంతన గను విచ్చి యఖిలజనులు
గనుఁగొనంగ, నయ్యుజ్జ్వలతనువు విడిచి
చని సముద్దీప్తమైన తేజంబు వారి
జాప్తబింబంబు సొచ్చె నత్యద్భుతముగ। ౫౦౩

వ. అట్టియెడ; ౫౦౪

క. వినుము। మహీసురుశాపము
మనుజేంద్రా, సూతపుత్రు మరణాంతంబై
యునికినొ, రథచక్రము మే
దినిఁ గ్రుంగుట లేక తొంటితెఱఁగున నుండెన్। ౫౦౫

తే. దారుణాస్త్రజాలాంశుల వైరిసైన్య
తాప మొనరించి, యా సూతతనయ తరణి
పార్థదుస్తరకాలవైభవము గడవ
ననువు లేమి, నవ్విధమున నస్తమించె। ౫౦౬

క. సూతతనూజుఁడు పడినం
బ్రీతిం బాంచాలు రార్వఁ, బెల్లుగఁ దూర్య
వ్రాతంబు సెలఁగ, సమ్మో
దాతిశయము వొందెఁ బాండవానీకంబుల్. ౨౯౭

క. విడుఁగేలుఁ బలుతొడలు
న్నెడఁదయురమునై రణావనిం గర్ణునొడల్
పడియున్నఁ గని విషాదం
బడరి తొలఁగుమాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్. ౨౯౮

తే. నిర్గతప్రాణు రాధేయు నిజకరములఁ
గరుణ పెంపున నంటుట కారణముగఁ
బావనస్నాన మొనరింపఁ బోవునట్టు
లపరజలనిధిలోనికి నరిగె నినుఁడు. ౨౯౯

వ. అప్పుడు; ౩౦౦

తే. కామఁ బాసిన కమలంబుకరణిఁ బొలుచు
కర్ణుతల యిలఁ బడియు, సుదీర్ణ కాంతి
నొప్పు నట్టియుఁ జూచి, శల్యుండు పిదప
ద్రెస్సి మోడైన యరదంబు ద్రిప్పె నధిప. ౩౦౧

క. బలితపువెస నాబోఁతుం
బులిగొనినం, బసులు పాఱుపోలికిఁ గ్రోధో
జ్జ్వలుఁడగు పార్థుఁడు గర్ణునిఁ
బొలియించిన నీసుసైన్యములు వెఱఁ బఱచెన్. ౩౦౨

తే. దీనవృత్తి శల్యుండు నీ సేనజనులు,
నట్లు పాంచాలు రుబ్బున నార్వ, సిగ్గు
వడక పాండవమధ్యము పిదము మరలి
మఱలి చూచుచుఁ బాఱిరి మనుజనాథ. ౩౦౩

ఉ. గాండివ ముక్తబాణమునఁ గర్ణుఁడు గూలుటయుం గడంగి, శ
ల్యుం డరదంబు దోలుటయు, నొక్కమొగిఁ భవదీయసేన లొం
దొంద కలంగి పాఱుటయు నుల్లసితుం డయి చూచి, వాయుపు
త్రుండు మహావిరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్. ౩౦౪

క. ఆవిధంబునఁ బాండవ
సైనికహృదయములు సౌఖ్యసంపద నొందెన్ ।
మానవనాథ, భవత్సుత
మానసములు శోకఘూర్ణమానము లయ్యెన్ । ౨౬౩

— ◆ శల్యుఁడు దుర్యోధనునితో ఈ వైఫల్యము విధికృతమనుట ◆ —

వ. ఇవ్విధంబున చేతనరహితంబై మోహపడియున్న యరదంబు ద్రోలికొని యరిగి, యమ్మద్రపతి బాష్పాకులలోచనుండును దీనాననుండును సుదీర్ఘతర నిశ్వాసుండును నై యున్న కౌరవేశ్వరుం జేరంజని యతనితో ని ట్లనియె:- ౨౬౪

చ. 'నరవర యెందుఁ జూడమె రణంబులు । కర్ణుఁడు నర్జునుండు సం
గర మొనరింతురే యిటులు । క్రౌర్యనిరూఢికి దివ్యు లొంపి ర
చ్చెరు । వని యట్టులుండె; విను చెప్పెద నెంతయు భీతిఁ బొంది రా
హానియు నరుండుఁ గన్నవడి, కంత విధాతృఁడు దప్పె వానికిన్.' ౨౬౫

వ. అని వెండియు; ౨౬౬

మ. 'ధరణీచక్రము నీవ యేలుటకు నుత్సాహంబు వాటించి వీ
రిరి, ప్రాణంబులు దాఁపమిం బడిరి వీరిం జూడు ।' మంచుం, దురం
గ రథేభంబులు చుట్టుఁ గూలి వికటాకారంబులై యుండ నొ
ప్పు, రణోర్విం బడియున్న భూపతులఁ జూపెం; జూపి యారాజుతోన్, ౨౬౭

వ. మఱియు నమ్మద్రపతి: 'యింద్ర యమ వరుణ కుబేరులఁ బోల్పందగిన యంతలింతలు మేటిమగలు మనకార్యంబునకై శౌర్యంబును బాహువీర్యంబును మెఱయించి ధైర్యంబు వొగడొందం బెనంగుట విఫలంబగుట విధికృతంబు ; దీనికి వగవం బనిలే'దని చెప్పి, ధనుఃఖండంబుల నాయుధశకలంబులఁ గేతనాతపత్ర చామర గజఘంటా తురంగ కింకిణుల తునియలం, గంకణ కేయూర హార మకుటంబుల తుమురులఁ నభిరామభీషణంబగు రణాంగణంబు సూపి; నీకయి పెనంగి పడిన సైన్యంబు నాలోకింపు । మనునప్పు డసురాంతక పార్థులు పాంచజన్య దేవదత్తంబులు పూరించిన నింగి వగుల్చు నమ్మహారవంబున గుండియ లవిసి కురుబలంబు లత్యంత వికలంబు లయి, విభీషాతిత రావణనందనుఁడగు సుమిత్రానందను సింహనాదంబున భయం బంది పరచు దానవసేనలచందంబున, నీ కొడుకున్న నెలవు విడిచి వలియంబాఱిన వెలవెలంబాఱు నక్కురుపతితో నాశల్యుండు;_

'సంధ్యాసమయం బయ్యె నేఁటికిఁ గయ్యంబు సాలింపుము; వేగుటయుఁ జేయ వలయు కర్జంబు సూచికొందమని'యె నట్టియెడఁ, గృపాశ్వత్థామ కృతవర్మ శకుని సుశర్మ ప్రభృతు లగుదొరలు పాండవజయంబునకు దైన్యంబునొందిన యాననం బులతో నిశ్వాసంబులు నిగుడ, నక్కురుపతిఁ జేరం జనుదెంచిన; నతండు మూఁకల మరల్చు రామియు దొరల యుత్సాహవైకల్యంబును శల్యుమాటల తెఱంగు నూహించి; మరలి కర్ణుం దేర్కొని విలాపంబు సేయుచు 'హా కర్ణ! హా కర్ణ!' యను నెలుంగులకో బలంబులఁ దివియ నియమించిన, దివిసి కౌరవులు దోడం జనుదేర నిజశిబిరంబునకుం బోయె. నప్పోవుట పాపజూవంబున నోడి పాండునృపకుమారుల హస్తినాపురంబు వెడలి యడవికిం బోవునప్పటిభంగిస్తై యుండె; నయ్యవసరంబున; ౩౮౦

చ. తనువులఁ గర్ణబాణము లుదాత్తగతిం జెలువొందఁ గౌరవుల్
కనుకనిఁ బాఱ, శౌరియును గవ్వడియుఁజా వెలుఁగొంది రొక్కెడ;
ధ్వనుత మహీమలై పొడిచి విర్భర సంతమసంబు నగ్గనం
జన నఖిరామమూర్తులగు చంద్రుని సూర్యునిఁ బోల్పఁ బట్టుగన్; ౩౮౧

వ. ఇ ట్లొప్పి, యమ్మొఱుంగుటమ్ములు పెటికివై చి, యొందొరుల యాననంబు లాలో కించి; 'రాత్రిముఖంబయ్యె; విరోధుల వెనుకొనుటకు సమయంబుగా'దని సంభా షణంబులు సేసి, తమసేనలం దివియ నియమించి; ౩౮౨

తే. బలునిఁ దెగటార్చి మరలు గోపతియు హరియుఁ
బోలెఁ గర్ణుని సమయించి లీల మెఱయ
మరలి రత్యంతమోదసంభరితు లగుచుఁ
గవ్వడియుఁ గృష్ణుఁడును బంధుగణము లలర; ౩౮౩

వ. అప్పుడు దివ్యు లన్నరనారాయణుల ననేకప్రకారంబులం బ్రశంసించుచు, నిజనివా సంబులకుం జనిరి. పాండవ సేనాజనంబులు సంతసంబునం దేలుచు ధనంజయుం దెలంగి పొగడుచుం బోయి, దివ్విధంబున జయంబునం బొంపిరివోవుచుఁ బాండ వులు విడిదల కరిగి, ధర్మనందను నగరిమొగసాలఁ జొచ్చి, రట్టియెడ; ౩౮౪

క. చెన్నునఁ బాంచాలురు మును
ము న్నానృపుకడకు నేఁగి, ముదితాత్ముండై

యున్న యతనిఁ గని, దీవన
లన్నతులను సమ్మదానులాపములఁ దగన్. ౩౮౩

వ. గారవించిరి. వివ్వచ్ఛుండు వేగంబ యరదంబు డిగ్గి చని, యజ్ఞసపతి చరణంబు లకుఁ బ్రణతుండైన, నతం డెత్తి యాలింగనంబును మూర్ధఘ్రాణంబును జేసె. భీమ నకుల సహదేవు లన్నరదేవోత్తమునకుఁ బ్రణమిల్లి. పార్థుం గౌఁగిలించిరి. కృష్ణసాత్యకు లప్పాండవాగ్రజునకు సవినయప్రణామంబు లాచరించిన, నమ్మహీ పరుఁ డత్యాదరంబున నభినందించె. నప్పుడు కృష్ణుం డతని కిట్లనియె:- ౩౮౪

—♦ శ్రీ కృష్ణుఁడు ధర్మజుఁడు మధుర సల్లాపసౌఖ్యము ననుభవించుట ♦ —

క. 'భువనము లన్నియు నొక్కటఁ
గవిసియుఁ గర్ణుఁ బరిమార్పంగా నోపునె భూ
ధవ ! భవదీయ క్రోధా
గ్నివిహతుఁడై క్రాఁగెఁ గాక ! విక్రమం బరయన్ ! ౩౮౫

ఆ. 'రథికవర్యుఁడైన రాధేయు వొలిపిన
యపుడ, యెల్లఁ బొలిసె నని తలంపు.
కౌరవుల కడంగె వైరంబు. నీ కింక
నెదురులేదు, ప్రీతిఁ బొదలు మధిప !' ౩౮౬

చ. అన విని, యమ్మురాంతకున కానృపుఁ డిట్లను:-'నీవు చక్కఁ జూ
చిన సులభంబు శోభనము ! శ్రీధర, నీదగు కూర్మికేను భా
జన మటె ! నాకు దుష్కరమె శత్రుజయంబు ? భవత్ప్రసాద జీ
వనులము, మాకు సంపదలు వచ్చు నవశ్యము ! వింత నమ్ముదున్. ౩౮౭

ఆ 'అఖిల రక్షకుండవగు నీకు భక్తుల
మైన మమ్ముఁ గాచు టరుదె తలఁప ?
భయము నెవ్వగయును బాపి నాకంటికి
నిదుర వచ్చె నేఁడు నీరజాక్ష !' ౩౮౮

వ అనవుడు, నచ్యుతుండు; ౩౮౯

చ. 'మనమునఁ గూర్తు గాన, తగుమాటల నాకుఁ బ్రియం బొనర్చె దొ
ప్పునను; విను ! మీజయంబునకు భూవర, యేను నిమిత్తమాత్ర ! మీ

యనుజులు నీమఱందులు మహోద్ధృత విక్రమశీలు రిట్టి ని
న్నొకఁడు వీర మార్గానఁగ నూల్కొని రూపఱ కుండ నేర్చునే?' ౩౯౨

వ. అవి యిట్లు, మధుర సల్లాప సౌఖ్యంబు నొంది, ధర్మనందనుండు వీలికలను సూమవేడుక దనకుం బుట్టినఁ, గృష్ణునితోడం జెప్పి యతం డనుమతిసేయం, *గాలవాలంబులు దంతవర్ణంబులునగు రథ్యంబులఁ దనరథంబునఁ బూన్పించి, యారోహణంబు సేసి, కరదీపికా సహస్రంబులు వెలుంగ, సమస్తబంధు మిత్ర సోదర పరివృతుండై యరుగునప్పుడు, కృష్ణు నాలోకించి— ౩౯౩

ఆ. 'సకలధరణివలయ సామ్రాజ్యమునకు నేఁ
డేను భర్త నైతి; నెల్ల పెంపు
గలిగి నీదుకరుణఁ గడిఁదిమగండగు
పగతుఁ డక్రమమునఁ దెగుటఁ జేసి;' ౩౯౪

క. అని కీర్తించుచు, నరుఁ గనుఁ
గొని యగ్గించుచు, ముదంబుగూరిన మదితోఁ
జని, కర్ణునిశిరమును ద
త్తనయులగాత్రములఁ జూచె ధరణీనాథా! ౩౯౫

వ చూచి తన్నప్పుడు గ్రమ్మఱ జన్మించినవానిఁగాఁ దలంచి, యాపదలకుం బాపి సంపదలకు భాజనంబ నైతి నని యూఱడిల్లి, యుల్లాసంబున మరలె. నిట్లు కర్ణ సాగరంబు గడవ నీఁది పాండునందనులు పరమానందంబు నొంది. రని, సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పెనని - జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె:- ౩౯౬

—♦ ఫలశ్రుతి ♦—

చ. అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము! నరేంద్ర, యీక్రతువు విష్ణుమయం; బిది నిర్వహించి ర
ర్జునుఁడును గర్ణుఁడున్ సమరరూపమునం దగ; నీప్రబంధ మిం
పొనరఁ బఠించినన్ వినిన నొందు నరుం జిరసౌఖ్యసంపదల్! ౩౯౭

వ. అనుటయు. ౩౯౮

* తెల్లగుఱ్ఱమునకు నల్లటితోఁక ఒక అందము!

చ. ప్రకట మహార్థసౌరభ పరాశర నందన వాక్యమంజరీ
ప్రకర సమర్చితా, పరమపావననామ, జగత్త్రయీ విధా
యక పరిరక్షక ప్రతిసమాహృతికారక చిత్తవృత్తిభా
వక, భవబంధమోచన, దివాకరచంద్రకృశానులోచనా। ౩౯౯

క. వినత దురిత నిరసన శుభ
జనక కలాకల్య చరణసంభావన పా
వనతటినీమాల్య సమ
స్తనిగమ నంసేద్య పరమసంయమిహృద్యా। ౪౦౦

మాలిని—

కరణఫల పరిత్యాగ వ్రతోదాత్తచేతః,
పరిణత సుఖపీఠభ్రాజమానా, నతాంహో
నిరసన చరణాబ్జో న్నిద్రతా రాజమానా,
నిరవధిపరిణాహా, నిర్భరానంద దేహా। ౪౦౧

ఇది ఉభయకవిమిత్ర, కొమ్మనామాత్యపుత్ర బుధారాధన విరాజి -
తిక్కన సోమయాజి ప్రణీతంబైన భారతంబున
కర్ణపర్వ - తృతీయాశ్వాసము

—సర్వము సమాప్తము—



చ. పరమపదాప్తి హేతువగు భారతసంహిత శౌనకాది భూ
సురవరు లింపునం గరఁగు చొప్పునఁ జెప్పిన, వారు మోదసం
భరితతఁ బొంది, యక్కథకు బ్రాఁతిగ నర్చితుఁజేసి రర్మిలిన్;
హరహరనాథ, సర్వభువనార్చిత, నన్ దయఁజూడు మెప్పుడున్.
—స్వరా-వ; 94-వ పద్యము.

